శ్రీ

# విజయవిలాసము

## చేమకూర వేంకటరాజ ప్రణీతము

వ్యాఖ్యాతృచక్రవర్తి

వేదము వేంకటరాయశాస్త్రి విరచితాంధ్రవ్యాఖ్యతో

ముద్రితము.

ద్వితీయ ముద్రణము.

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,

4, మల్లికేశ్వరగుడి సందు, లింగిసెట్టివీథి,

జి. టి. మదరాస్.

1948

Rs 3/—

# ప్రకాశక విజ్ఞప్తి

మా పితామహులు ప్రకటించిన ఈవ్యాఖ్యానమునకు దాదాపు ముప్పదియేడువత్సరముల ప్రాయమైనను ధనాభావాది పెక్కు కారణములచే నింతకాలము పునర్ముద్రణ మొనరింపలేకయుంటిమి. మధ్య కాలమున కొందఱు పండితులు తమకు పెక్కు నూతనాంశములు గోచరించినట్లు ప్రకటించుచువచ్చిరిగాని ఈగ్రంథమునకు రెండవవ్యాఖ్య నేటిదనుక నాంధ్రదేశమున వెలువడకుండుటంగాంచి శ్రీ తాతగారి వ్యాఖ్యను ఉన్నది యున్నట్లుగా మరల ముద్రింపవలసినదని మమ్ము పలువురు కోరుచుండిరి. పైగా శ్రీవారు నాఁడువ్రాసినరీతిని 'ఈ చేమకూర వేంకటరాజు కవీంద్రుని కులమేదో చరిత్రశోధకులు ఇప్పటికిని నిర్ణయింపనేరకున్నారు.' కారణము సాధనసామగ్రి లేకపోవుటయే. భాషావిషయమై చెప్పవలసినదంతయు వారే చెప్పియున్నారు. 'చేమకూర పాకరుచులకు' ఈపాటివ్యాఖ్యయే చాలుననియు, ఇందలి శ్లేష చమత్కారాదికము అనుభవైకవేద్య మనియు దలంచి సంజీవనీ సర్వంకషాదుల వ్రాసినవారు అనవసరపు విపులీకరణమునకుం జొరక ఈ మాత్రముతో దీనిని వదలియుందురని తలంపనైయున్నది. శాస్త్రిగారి శిష్యులును, మిత్రులును, పోషకమహాశయులును కోరినరీతిని దీనిని పునర్ముద్రణ మొనరించినారము.

# విన్నపము.

విజయవిలాస ప్రబంధము నెఱుంగనివారు అక్షరాస్యులయిన యాంధ్రులలో అరుదు. ఏతత్ప్రణేత చేమకూర వేంకటరాజు దీని కన్న మున్నుగా రచించిన ట్లెన్నఁదగియున్న సారంగధర చరిత్రము మద్విరచిత విపుల వ్యాఖ్యతో పూర్వతర మాసంబున ప్రకటించి నంతట దానిని రసికులు హర్షపూర్వకముగా పరికించినవారై,—అద్దములోని లిబ్బివలె అబ్బియు నబ్బని యర్థములచే నబ్బుర మొసంగుచు, కాకలీగీతముంబోలె మధురంబయ్యు నస్ఫుటంబై రసిక గోష్ఠులయందు సందేహాంతచర్యలకుం గారణంబైన కాకిమెలఁకువలతో నిండి సంపూర్ణానుభవమునకు రాకయున్నట్టి యీరసోత్తర ప్రబంధమును సయితము ఎల్లవారికిని సుబోధంబగునట్లు మద్విరచిత విపులవ్యాఖ్యానముతో ప్రకటింపుదును గాక యని తమ యీప్సితమును దెలియఁజేయుడు,—యథామతి పాఠనిర్ణయ వ్యాఖ్యారచనాది పరిక్లేశము వహించి సకల సౌకర్య సంపన్నంబుగా ఈ ముద్రణమును సమకూర్చినాఁడ.

---

# కృతినాయక ప్రశంస.

ఏతత్కృతినాయకుఁడు క్రీ. శ. 1614–1630 సంవత్సరములలో తంజాపురీ సామ్రాజ్యము నేలిన రఘునాథరాయఁడు. ఇతని తాత చెవ్వప్పనాయఁడు. విజయనగరాధీశ్వరుండయిన కృష్ణదేవరాయల తమ్మునికి అచ్యుతదేవరాయనికి తోడల్లుఁడు. రఘునాథరాయఁడు గొప్ప విద్వాంసుఁడు, కళానిపుణుఁడు, స్వయము కవి, గ్రంథకర్త, మహాదాత, జేతయును. పెక్కులు సంస్కృత గ్రంథములును ఆంధ్ర ప్రబంధములును ఈతని యాదరంబున విరచింపఁబడినవి.

# కవికవన ప్రశంస.

---

ఈ చేమకూర వేంకటరాజకవీంద్రుని కుల మేదో చరిత్ర శోధకులు ఇప్పటికిని నిర్ణయింప నేరకున్నారు: శూద్రుఁడని యూహలు సేయుదురు.

ఈతని కవనమందు కవిత్రయ మతమునకు వెలి యయిన ప్రయోగములు కలవు. వానిని ప్రాయికముగా ఆయాయి తావుల వ్యాఖ్యలలో సూచించి యున్నాఁడను. అయి నను ఇంచుక దిక్ప్రదర్శనము చేసెద.—

ఆత్త్వసంధి — రేకెలంత-ఈబిడారు (I-195).

ఇత్త్వసంధి — బంతమునా (I-132), బంతిది (II-107), తండ్రే (III-163), మఱఁదింత (III-170), విరివింటివాఁడవు (III-43).

క్త్వార్థకారసంధి.— అడిగిచ్చునో (I 59), అనవలసంటి (I-161), చూపిటు (II-202).

ఉదంతమునకు షష్ఠియందు నగాగమము రామి.— వాదుకు (I-134), సిగ్గుకు (II 30), మంతుకు (II-37).

స్వరలోపము.— ఎత్తి (II-187), చాల్నిలుఁడు (III-61).

షష్ఠీసమాసమున ఉదంతమునకు అజాదిపదము పరమయినప్పుడు నుగాగమంబు రామి.— వెన్నుని యన్నన్న (I-148).

దుష్ట సమాసము.— దినచల్వ (II-144).

ఆత్మనేపదమున ననుప్రయుక్తం బగు 'కొని' కి 'క' అను ప్రయోగము.— తెచ్చుక (I-45), తోఁదుక (I-184), తప్పించుక (II-195), కట్టుక (III-154).

ఱ్వలఘు రేఫలకు మైత్రి.—
ఉ. శ్రీరస ... I తీఱుచె ... (I-39).
క. కురువీర ... I కుఱువీర ... (I-145).
ఉ. రూపము తారతమ్యము నెఱుంగు ... (I-88).

ఇట్లు అటనట లక్షణోల్లంఘనము కావించినను ఇతఁడు కవనమందు కడుం గడుసువాఁడు.

వే. వేంకటరాయశాస్త్రి.

# విజయవిలాసము

## విషయసూచిక.

శ్రీ

# విజయవిలాసము.

## ప్రథమాశ్వాసము.

### కృతిపతికాశీర్వచనము.

శా. శ్రీ లెల్లప్పుడొసంగ, నీసకలధాత్రీచక్రముల్ బాహుపీ
ఠీలగ్నంబుగఁ జేయ, దిగ్విజయముల్ మీఁ, దీకొన్నచందాన నే
వేళన్ సీతయు లక్ష్మణుండుఁ దను సేవింపంగ విల్ పూని చె
ల్వాలీలం దగు రామమూర్తి రఘునాథాధీశ్వరున్ బ్రోవుతన్. 1

1. ఒసంగన్ = ఇచ్చుటకు. ధాత్రీచక్రమున్ = భూమండలమును. బా...గన్ - బాహు = భుజమనెడు - పీఠీ = ఆసనమందు - లగ్నంబుగన్ = తగులుకొన్నదానినిగా. చేయన్ = చేయుటకును. ఈన్ = ఇచ్చుటకును. దీకొన్నచందానన్ = పూనుకొన్నాఁడో యనురీతిని. (ఇది నాలుగుపాదమందున్న 'తగు' అనువిశేషణమునకు విశేషణము). విల్ పూని = ధనుస్సును ధరించి. చెలువు ఔ లీలన్ = అందమయిన విలాసముతో. ప్రోవుతన్ = రక్షించునుగాక.

తా.—రామమూర్తి, కోదండంబుం దాల్చియుండుటచే రఘునాథరాజునకు దిగ్విజయ మిచ్చుటకై కడంగినాఁడో యనునట్లుగాను, శ్రీ యొక్క యవతారమయిన సీతాదేవితోఁ దాను గూడుకొనియుండుటచే ఆ రాజునకు సిరు లిచ్చుటకు తాఁ గడంగినాఁడో యనునట్లుగాను, సకల భూమండలమును మోచుచున్న శేషుని యవతారమయిన లక్ష్మణునితోఁ దాను గూడుకొనియుండుటచే ఆ రాజునకు సర్వభూమండలపరిపాలనాధికారము నొసంగుటకై కడంగినాఁడో యనునట్లుగాను, ఒప్పారుచున్నాఁడు. సీతాలక్ష్మణకోదండసమేతుఁడై యున్న యట్టి యా రామమూర్తి రఘునాథరాజునకు పూర్వోక్తములయిన యామూఁడు ఫలములను ఇచ్చి రక్షించునుగాక.

ఉ. శ్రీకలకంఠకంఠియును శ్రీధరిత్రియు దక్షిణవామభాగముల్
గైకొని కొల్వఁ, వారిఁ గడఁకం గనుకన్నుల కాంతిఁ దెల్పఁ, తా
నా కమలాప్తతం గువలయాప్తతఁ దెల్పెడు రంగభర్త లో
కైకవిభుత్వ మిచ్చు నయ మచ్యుతు శ్రీరఘునాథశౌరికిన్. 2

ఉ. 'శ్రీరుచిరాంగి నీభవనసీమ ధ్రువంబుగ నిల్చు నేలు దీ
ధారుణి నీవ' యన్నక్రియ దక్షిణపాణి నెఱుంగఁ జేయు శృం
గారరసాబ్ధి వేంకటనగస్థిరవాసుఁడు పూర్ణదృష్టి నెం
తే రఘునాథభూరమణదేవు గుణంబులఁ బ్రోవుతన్. 3

2. కలకంఠ మనఁగా కోకిల - కలకంఠకంఠి యనఁగా కోకిలస్వరము వంటి స్వరముగల స్త్రీ - శ్రీ కలకంఠకంఠి=లక్ష్మి యనెడు స్త్రీ. ధరిత్రి = భూమి. దక్షిణ వామ భాగముల్ = కుడి యెడమ ప్రక్కలను. కడఁకన్ = పూనికతో, ఆ కమలా ఆప్తతన్ = ఆ లక్ష్మీదేవిమీఁది యాసక్తిని - ఆ కమల ఆప్తతన్ = ప్రసిద్ధమయిన సూర్యత్వమును (తనకుడికన్ను సూర్యుఁ డగుటను). కువలయ ఆప్తతన్=భూమండలమునకు (భూదేవికి) ఆప్తుఁ డగుటను - కలువకు చెలికాఁ డగుటను (తనయెడమకన్ను చంద్రుఁ డగుటను). రంగభర్త = శ్రీరంగస్వామి. ఏక = ముఖ్యమయిన. అచ్యుతు = అచ్యుతరాజు కుమారుఁడయిన. రఘునాథశౌరికిన్ = (శౌరి యనఁగా విష్ణువు) విష్ణువువంటివాఁడయిన రఘునాథరాజునకు.

భా.—సూర్యుఁడు కమలములకు ఆప్తుఁడు, చంద్రుఁడు కలువలకు ఆప్తుఁడు, సూర్యచంద్రులు విష్ణుమూర్తికి కుడి యెడమ కన్నులు, శ్రీరంగస్వామి విష్ణుమూర్తి, శ్రీ భూదేవులు తద్భార్యలు. ఈ విషయముల నిట్లు సమన్వయము చేసికొనవలయును.

3 రుచిర అంగి - కాంతిమంత మయినదేహముగల స్త్రీ. భవనసీమన్ = ఇంటి ప్రదేశమందు. ధ్రువంబుగన్ = స్థిరముగా. ధారుణిన్ = భూమిని. దక్షిణపాణిన్ = కుడిచేతిచే (అభయముద్ర చేత). శృంగారరసాబ్ధి = శృంగార = శృంగారమనెడు - రస=రసమనెడు జలమునకు - అబ్ధి=సముద్ర మగువాఁడు (అపరిమిత మయిన శృంగారము కలవాఁ డనుట). వేంకట నగస్థిర వాసుఁడు=వేంకట మనుపర్వతమందు స్థిరమయిన నివాసము కలవాఁడు. ఎంతేన్ = ఎంతేనియున్=మిక్కిలి, భూరమణదేవున్=రాజాధిరాజును. ప్రోవుతన్ = రాశిని.

భా.—శృంగారరసమును చెప్పుటచేత శ్రీయుక్తుఁ డనియు, నగస్థిరవాసమును చెప్పుటచేత భూయుక్తుఁ డనియు తెలియుచున్నది. శ్రీభూయుక్తుఁడై యభయముద్రం

గీ. ధీయుతుఁ డటంచు నలువ దీర్ఘాయు వొసఁగి
కాయు రఘునాథవిభు వజ్రకాయుఁ గాఁగ;
వీరవరుఁ డని హరుఁ డత్యుదారకరుణఁ
జేయు నెప్పుడు విజయు నజేయుఁ గాఁగ. 4

మ. మొగుడుందమ్ముల విచ్చునప్పుడు రజంబున్, జక్రవాళంపుఁ గొం
డగడిం దేలుగ డైనపట్లఁ దమమున్, మందేహులం దోలి వా
సి గడల్కొన్తఱియందు సత్త్వమునఁ, బ్రకాశింపన్ ద్రిమూర్త్యాత్మకుం
డగు తేజోనిధి వేడ్కఁ జేయు రఘునాథాధీశుఁ దేజోనిధిన్. 5

జాపుటచేత (వరుసగా) శ్రీ నీయింట స్థిరముగా నుండును, భూమిని నీ వేలుదువు, అని సూచిత మయిన దని కవిహృదయము.

4. ధీయుతుఁడు = బుద్ధితోఁ గూడినవాఁడు - బుద్ధిమంతుఁడు. కాయున్ = (కాచున్ అనుటకు) రక్షించును గాక. వజ్రకాయున్ = వజ్రదేహుని. అత్యుదార= మిక్కిలి గొప్పదయిన. విజయున్ = జయించువానినిగా. అజేయున్ = (అజయ్యున్ అనుటకు) గెలువరానివానిని. పూర్వము శివుఁడు విజయుని అనఁగా అర్జునుని వీరమునకు మెచ్చి పాశుపతాస్త్ర మిచ్చి అజయ్యుఁ జేసినట్లు అని కవిహృదయము.

5. మొగుడుందమ్ములన్ = ముకుళించుకొనియుండు తామరలను (తామర మొగ్గలను అనుట) - విచ్చునప్పుడు = వికసిల్లంజేయు సమయమున - (ప్రాతఃకాలమున ననుట), రజంబున్ = రజోగుణంబును (పుప్పొడియు అని యర్థాంతరము). చక్ర... గడిన్ = ప్రపంచమును చుట్టుకొని యుండునదైన చక్రవాళపర్వతముయొక్క సీమయందు - తేలుగడ అయిన పట్లన్ = మఱుఁగుపడుట అగు సమయమందు - (అస్తమయకాలమునం దనుట), తమమున్ = తమోగుణమును (చీఁకటియు అనియర్థాంతరము). మందేహులన్ = మందేహు లనెడి యసురులను, తోలి = పాఱఁదోలి, వాసి = బాగు, కడల్కొను తఱియందున్ = అతిశయించు సమయమున. సత్త్వము = సత్త్వగుణము (బల మనియు). త్రిమూర్త్యాత్మకుండు = బ్రహ్మ విష్ణు మహేశ్వర స్వరూపుఁడు. తేజోనిధి = కాంతి పాతఱ. తేజోనిధిన్ = ప్రతాపమునకు చోటునుగా.

ఇచట-సూర్యుఁడు బ్రహ్మరుద్ర విష్ణుస్వరూపుఁ డనియు, బ్రహ్మరుద్ర విష్ణువులు రజస్తమస్సత్త్వ గుణప్రధాను లనియు, సూర్యుని ఉదయాస్తమయ కాలములందు మందేహాసురు లెదుర్కొందు రనియు, వారిని ద్విజదత్తము లగు నర్ఘ్యోదకములు సంహరించు ననియు - ననుసంధించుకొనునది.

శా. మాద్యద్దంతిముఖార్చనానియమముం బాటించు నెల్లప్పుడున్,
సద్యఃపూర్ణఫలాప్తిచే మనుచు నంతర్వాణులన్, మామనో
హృద్యుం డౌ రఘునాథశౌరి, యని కూర్మిన్ సాటికిన్ బోటికిన్
విద్యాబుద్ధులొసంగిప్రోతు రతనిన్ విఘ్నేశుడున్ వాణియున్. 6

శా. ప్రాగల్భ్యంబున విష్ణుశంభుమతముల్ పాటించి, సర్వంసహా
భాగంబందు సమప్రధానగతి యొప్పన్, రాజలోకంబులోఁ
దా గణ్యుం డని యచ్యుతేంద్ర రఘునాథక్షోణిభృన్మౌళికిన్
శ్రీగౌరుల్ సమకూర్తు రాహవజయశ్రీ గౌరులన్ నిత్యమున్. 7

మ. ప్రకటశ్రీహరియంఘ్రిఁ బుట్టి, హరుమూర్ధం బెక్కి, యాపాదమ
స్తకమున్ వర్ణన కెక్కుదేవి సహజోదంచత్కులోత్పన్న నా

6. మాద్యత్ దంతి ముఖ అర్చనా నియమమునన్ = మదించుచున్న యేనుఁగుల మొగములయొక్క పూజయనెడు వ్రతమును (దంతిముఖ=గజాననునియొక్క - అనఁగా విఘ్నేశ్వరునియొక్క అనియు). సద్యః పూర్ణఫల ఆప్తిచేన్ = అవిలంబితముగా నిండు ప్రయోజనముయొక్క ప్రాప్తిచేత (అవిలంబముగా నిండుగా నిచ్చి యనుట), అంతర్వాణులన్=విద్వాంసులను (లోపలి వాక్కులను అనియు), మనుచున్=రక్షించును. మామనోహృద్యుండు = మాకు (విఘ్నేశ్వరునకును సరస్వతికిని) మనస్సునకు ప్రియుఁడు. కూర్మిన్ = ప్రేమచేత. రాజులు ఏనుఁగు మొగములు పూజించుట యాచారము.

7. ప్రాగల్భ్యంబునన్ = నేర్పుచేత. సర్వంసహా భాగంబందున్ = భూతలమందు. సమ ప్రధానగతి = తుల్య ప్రముఖ మయిన ప్రచారము (తుల్యగౌరవముతో చెలఁగుట). లోకంబులోన్ = సమూహములో. క్షోణిభృత్ మౌళికిన్=రాజశ్రేష్ఠునికి. శ్రీగౌరుల్ = లక్ష్మియు పార్వతియు, ఆహవ జయ శ్రీన్ = యుద్ధమందలి గెలుపు సంపదను. గౌరులన్ = ఏనుఁగులను. నిత్యమున్ = సర్వదా.

భా.—రఘునాథరాజునకు విష్ణుమతమును గౌరవించినందులకు శ్రీ ఆహవజయశ్రీని, శంభుమతమును పాటించినందులకు గౌరి గౌరులను, సమకూర్తు రని భా.

8. అంఘ్రిన్=పాదమందు. హరు మూర్ధంబు ఎక్కి = శివుని తలయందు నెలకొని (శివునికి మిక్కిలి ప్రియయై యనుటయు) ఆపాదమస్తకమున్ వర్ణన కెక్కు = దేహ మాద్యంతమును పొగడ్త నొందినట్టి (హరిపాదమునుండి హరమస్తకమువఱకుం గల యది యని పొగడ్త నొందినట్టి యనియు). దేవి = గంగాదేవి. సహజ ఉదంచత్ కుల

యకరత్నం బని యచ్యుతేంద్రరఘునాథాధీశ్వరస్వామికిన్
సకలైశ్వర్యములున్ నిజేశువలనం దాఁ గల్గఁగాఁ జేయుతన్. 8

## కృతిపతివంశావళి.

క. ఆరాజశేఖరుఁడు ప్రియ
వారిజముఖి తోడుగాఁగ వర్ధిలు విమల
శ్రీరుచిరవంశమున ధా
త్రీరంజనసుకృతి చెవ్వ నృపతి జనించెన్. 9

క. ఆచెవ్వనృపాలాగ్రణి
యాచంద్రార్కముగఁ గాంచి నరుణాచలవృ
ద్ధాచలములఁ గట్టించె మ
హాచతుర సమీర గోపురావరణంబుల్. 10

గీ. శ్రీవి నచ్యుతరాయల దేవి యైన
తిరుమలాంబకు ననుజ యై తేజరిల్లు
మూర్తమాంబను బెండ్లి యై కీర్తి వెలయఁ
జెవ్వవిభుఁడు మహోన్నత శ్రీఁ జెలంగె. 11

ఉత్పన్న నాయక రత్నంబు = తనతోఁబుట్టి వెగడుచున్న జాతియందు జనించిన రాజశ్రేష్ఠుండు (గంగయు శూద్రులును విష్ణుపాదోద్భవులు గావున ఆమెకు వారిజాతి తోఁబుట్టు వయినది). నిజ ఈశువలనన్ = తనపతి యగు నీశ్వరునివలన.

9. ప్రియ వారిజముఖి = ప్రియ భార్య. తోడు = సహధర్మచారిణి. విమల శ్రీ రుచిర వంశమునన్ = ఉత్కృష్టమయిన సంపదచేత కాంతిగలదైన కులమునందు. ధాత్రీ రంజన సుకృతి = భూమిని సంతసింపఁజేయుటచేత పుణ్యవంతుఁడైన.

10. ఆ చంద్ర అర్కముగన్ = చంద్రసూర్యు లున్నంతవఱకు నుండునట్లుగా. కాంచిన్ = కంచియందును. మహా చతుర సమీర గోపుర ఆవరణంబుల్ = మిక్కిలి చనితనముగల గాలిగోపురములను ప్రాకారములను.

11. అచ్యుతరాయలు = కృష్ణదేవరాయలతమ్ముఁడు. అనుజ = చెల్లెలు.

క. ఆ మూర్తమాంబ కఖిల మ
హీమండలనాథుఁ డచ్యుతేంద్రుఁడు సుగుణో
ద్దాముఁడు జన్మించెం; ద
ద్భూమీపతి రంగధాము పూజన్ మించెన్. 12

శా. శ్రీరంగేశుఁడు వచ్చి యచ్యుత ధరిత్రీభర్త యై భాగ్యరే
ఖారూఢిన్ విలసిల్లి తాన తనకుం గైంకర్యముల్ చేసెఁ గా;
కేరా జైనను జేయఁగాఁ గలిగెనే యిట్లీవిమానం బహో!
భూరిస్నిగ్ధముగా, మహామణిమయంబుల్ గా గిరీటాదులున్! 13

చ. గెలిచినగెల్పు, లర్థితతికిన్ దిన మిచ్చిన యీవులన్ వహుల్,
తలఁచిన విక్రమార్కు లొక లక్షయుఁ గర్ణులు కోటియుం గదా
కలిగిన నీడు వత్తు రనఁగాఁ దగు సాహసదానసద్గుణం
బులు ధరయందుఁ బుట్టఁగనె పుట్టిన యచ్యుతభూమిభర్తకున్. 14

శా. వీరాగ్రేసరుఁ డర్థిపోషణగుణావిర్భూతభాస్వద్యశో
ధౌరేయుండు మణీతులాదిక మహాదానావళుల్ సేయఁ దా
నౌరా మార్గము వెట్టినట్టి ఘనుఁ డాహా లోకమం దచ్యుత
క్ష్మారాణ్మౌళి యొనర్చుపుణ్యమహిమల్ శక్యంబె లెక్కింపఁగన్! 15

12. రంగ ధాము = శ్రీరంగనాయక స్వామియొక్క.

13. భూ...గాఁగన్ — భూరి = బంగారముచేత - స్నిగ్ధము గాఁగన్ = దట్టమగునట్లుగాను.

14. గెల్పులు = జయములను. అర్థితతికిన్ = యాచకసమూహమునకు. ఈవులన్ = దానములయొంపలి. వహుల్ = విధములను. అనఁగాన్ తగున్ = అన వచ్చును. సాహస దాన - సాహసమందు విక్రమార్కులును దానమందు కర్ణులును అని క్రమము

15. వీర అగ్రేసరుఁడు = వీర శ్రేష్ఠుఁడు. అర్థి పోషణ గుణ ఆవిర్భూత భాస్వత్ యశః ధౌరేయుండు = యాచకులను బ్రోచుటయను గుణముచేత పుట్టిన ప్రకాశము గలకీర్తిని మోచువాఁడు (అర్థిపోషణచేత కీర్తినొందినాఁ డనుట). మణీ తులా - తన తూనికకు సమానముగా తులలో మణులను దూఁచి వానిని యాచకుల కిచ్చెడు దానము మణీతులాదానము. ఆవళుల్ = పరంపరలు. క్ష్మారాట్ మౌళి = రాజ శ్రేష్ఠుఁడు.

క. ఆపుణ్యఫలంబుగనె ద
యాపాథోరాశి యైన యల యచ్యుత భూ
మీపతికిన్ రఘునాథ
క్ష్మాపాలుం డుదయ మయ్యె జైవాతృకుఁ డై. 16

ఉ. పుట్టిన దాదిగాఁ దనదు పుణ్యమె దాదిగ, వైరిభూమిభృ
ద్ఘట్టమదంబు దా దిగ, సదాదిగధీశనుతప్రతాపుఁ డై,
పట్టమహాభిషేక బహుభాగ్య ధురంధరుఁ డై, యయోధ్య య
న్పట్టణ మేలుసామియొ యనన్ రఘునాథవిభుండు వర్ధిలున్. 17

మ. రసికుం డౌరఘునాథు కీర్తిసతి యౌరా! తొల్త వాగ్బంధమున్
రసవాదంబును రాజవశ్యవిధి నేరంబోలు! గాకున్న, వె

16. దయాపాథోరాశి = కరుణా సముద్రుఁడు, జైవాతృకుఁ డై = చంద్రుఁడుగా (ఆయుష్మంతుఁడుగా అనియుం).

17. దాదిగన్=ధాత్రియి కాఁగా - అనఁగా రక్షించుచుండఁగా. వైరిభూమిభృత్ ఘట్ట మదంబు = శత్రు రాజుల సమూహముయొక్క గర్వము. తాన్ దిగన్ = తాను (గర్వము) తగ్గిపోఁగా. సదా = ఎల్లప్పుడును. దిక్ అధీశ నుత ప్రతాపుఁడు = దిక్కుల యేలికలచేత (ఇంద్రాదులచే ననుట) కొనియాడఁబడిన తేజము కలవాఁడు. అయోధ్య...సామియొ = శ్రీరాముఁడో.

18. తొల్తన్ = బాల్యమందే. వాగ్బంధమున్ = ఎదిరినోట మాటరాకుండఁ జేయువిద్యను (ధావళ్యమందు సరస్వతిని జయించుటను). రసవాదంబున్ = వెల తక్కువలోహములను వెండిగాను బంగారముగాను మార్చువిద్యను (ధావళ్యమందు పాదరసముతో వాదించుట యనియు). రాజ వశ్య విధిన్ = రాజులను వశపఱుచుకొను విద్యను (ధావళ్యమందు చంద్రుని లోఁగొనుట యనియు). నేరంబోలు=నేర్చుకొన్న దికావలయును. వెక్కసపుం బ్రౌఢిన్ = మిక్కుటమయిన నిపుణతను. శేషఫణిన్ మూఁగన్ జేయన్= వేయినోళ్లవాఁ డయినయనంతుని నోరెత్తనీకుండం జేయుటకు (ధావళ్యమున శేషాహిని మించుటకు ననియు). తారాద్రిన్=వెండికొండను. ఉల్లసముల్ పల్కఁగన్=పరిహాసించుటకును (ధావళ్యమున మించుటకును అనియు). ఛత్త్ర చామర మహాలక్ష్ముల్ కనన్= వెల్లగొడుగు వెల్లచామరము అనువానియొక్క గొప్పసిరులను పొందుటకును (రాజచిహ్నము లగు ఛత్త్రచామరములను ధావళ్యమున మించియుండుటకు ననియు).

క్కసపుం బ్రౌఢి వహించి శేషఫణి మూఁగం జేయఁ, దారాద్రి ను
ల్లసము ల్వెల్కఁగ, ఛత్త్ర చామరమహాలక్ష్ము ల్గనన్ శక్యమే? 18

చ. నలువగ నెన్న నైన రఘునాథ నృపాలుఁడు గల్గఁగా, మహీ
స్థలి నిఖిలైకధర్మములుఁ దామరతంపర లై చెలంగెఁ, గొ
ల్లలుగ నశేషసజ్జనకులంబు సుఖంబు గనెన్, సమస్తవి
ద్యలు గసటెల్లఁ బాసి మెఱపై వెలవెట్టె సభాంతరంబులన్. 19

ఉ. శైలము లెక్కి, యష్ట మదసామజ వాళుల మీఁదుగా మహా
కోలము వెన్ను దాఁటి పలుగొమ్ము మొనం బడి, సర్వగావిమ

భా.—లోకములో ఎవతె యేని విద్యావంతురాలు ముందుగానే వైరివాగ్బంధన విద్యను రసవాదవిద్యను రాజవశ్యవిద్యను నేర్చి, అనంతరము దంటతనము మెఱసి గొప్ప గొప్పపండితులను వాదమున నోరెత్త నీకుండ చేసి యోడించి, తాను బంగారము సేయు నేర్పరి గావున వెండిని తిరస్కరించి, రాజులను మెప్పించి, ఛత్త్రచామరశ్రీలను పొందుట యెట్టిదో అట్టిదిగా, ఈ జేని కీర్తియొక్క వృత్త మున్న దని సాదృశ్యము.—ఈతని కీర్తి సరస్వతీ పాదరస చంద్ర శేషాహి కైలాస ఛత్త్ర చామరములకన్న ధవళమై యున్నదనియు, ఎల్లలోకములందు వ్యాపించిన దనియు భా.

19. నలువ గ నెన్న నైన=బ్రహ్మదేవునిం గాఁ దలంప దగినట్టి. నిఖిల ఏక ధర్మములు - నిఖిల = సకలమైన - ఏక = ముఖ్యమయిన - ధర్మములు = వైదిక కర్మలు. తామరతంపరలు = అభివృద్ధినొందినట్టివి. కొల్లలుగన్ = అవారిగా. సజ్జనకులంబు - సజ్జన = సాధుజనులయొక్క (సత్ అనఁగా సత్యమునుం గావున సత్యము పల్కు జనుల యొక్క యనియు). కులంబు = సమూహము. కసటు = మాలిన్యము. మెఱపు ఐ = ప్రకాశ మొంది.

తా.—ధర్మము వేదాధీనము; వేదము బ్రహ్మాధీనము; బ్రహ్మ కమలాసనుఁడు సత్యలోకవాసి, విద్యలకు దేవత యైన సరస్వతికి పతి. కావున ఆ బ్రహ్మవంటివాఁడయిన రఘునాథరాజు రాజ్యమేలుచుండఁగా, ధర్మములు తామరతంపరలై, సత్యమాడు జనులకు సుఖము గలిగి, సకలవిద్యలకును ఆరాజుసభయందు మెఱుఁగు గలిగి, ఆవిద్యల గలవారికి బహుమానములు దొరకినవి.

“వేదా దేవ పరిజ్ఞాతో ధర్మ ఇత్యుక్తవాన్ మనుః.” బృహస్పతిః.

“సత్యే సాధౌ విద్యమానే ప్రశస్తేఽభ్యర్హితే చ సత్.” అమరః.

జ్వాలలు గ్రమ్ము శేషు తల చాయనె యోపక వచ్చి, కూడె నా,
భూలలితాంగి కెంతవల పో రఘునాథనృపాలమౌళి పైఁ గా! 20

---

## కృతిపతిసామ్రాజ్యము.

---

సీ. రత్నాకరాంతోర్వరావిహారుం డౌట
నగ్రహారము లసంఖ్యములుగఁ జేసె,
నమితదానవినోది యగుటఁ గన్యాంతర
భద్రకుంభీక్షణపరతఁ దనరె,
దక్షిణనాయకోత్తముఁ డౌట మేలైన
మలయజగంధిమండలము నేలె,

**20.** శైలములు=సప్తకులపర్వతములను. అష్టమదసామజ మౌళుల మీఁదుగాఁ= ఎనిమిది మదపుటేనుఁగుల (అనఁగా అష్టదిగ్గజముల) శిరముల పైగా. మహాకోలము = గొప్పపందియొక్క (ఆదివరాహముయొక్క). ఓడక=వెనుదివియక. భూలలితాంగికిఁ= భూసుందరాంగికి (భూదేవికి అనుట).

తా.—సప్తకులగిరులు, అష్టదిగ్గజములశిరములు, ఆదివరాహమువీఁపు, శేషుని తలలు - ఇవన్నియుఁ భూమిని మోచుచుండునట్టివి. మదశబ్దముచే అపాయకరములని సూచితము. వాఁడి అనుటచే కత్తివాదరవోలె కాలిం జీల్చునది యని భా. 'కొమ్ముమొనం బడి' యనుటచే వరాహావతారమున విష్ణుమూర్తి భూమిని ప్రళయార్ణవమునుండి కోఱతో నెత్తుట సూచితము. పద్యమున-వలపుకత్తియ అత్యంతసాహసములు చేసి వలపుకానికడ కేఁగు తీరున-నని ధ్వని. శైలాదుల కన్నిటికి విశ్రాంతి యొసంగి రఘునాథరాజు భూమిని తనభుజమునం దాల్చె ననియుం, అట్లనఁగా భూమిని ఆతఁడు చక్కఁగా పరిపాలించుచున్నాఁ డనియు భా.

**21.** (౧) రత్నాకర అంత ఉర్వరా విహారుండు = (రత్న = ముత్తెములకు - ఆకర=గనియైన) సముద్రము హద్దుగాఁగలదైన భూమిని ఏలువాఁడు. అగ్రహారములు= ఉత్తమమయిన ముత్తెపుంబేరులకు (బ్రాహ్మణులయిండ్లవరుసలను). (౨) అమిత దాన వినోది=మిక్కుటమయిన (గజ) మదముచేత హర్షించువాఁడు. భద్ర కుంభి ఈక్షణ పరతన్=భద్రజాతి గజమును చూచుటయందు ఆసక్తుఁడగుటతో.(భద్ర=మంగళమయిన-కుంభీ=దానధారకై యుంపఁబడిన జలకలశముయొక్క-ఈక్షణ=ఉత్సవమందు-పరతన్ = ఆసక్తుఁడై). (3) దక్షిణ నాయకోత్తముఁడు=దక్షిణదేశముయొక్క రాజేంద్రుఁడు-(అ

భరతవిద్యాధురంధరుఁ డౌట రంగస్థ
 లంబు రామాలంకృతంబు చేసె,

గీ. నార కర్ణాటసింహాసనాధిరాజ్య
 భరణనిపుణ గుణోద్దండ బాహుదండ
 జనిత సాపత్న్యసంవాద జయరమా మ
 హీలలితకేళి రఘునాథ నృపతిమౌళి. 21

శా. రాజౌఁ భోగియు సౌమ్యుఁడుఁ గవియు సర్వజ్ఞుండు నీడౌ నసఁ
 దేజః ప్రౌఢవచో వివేక నయ భూతి శ్లాఘలఁ మించు నౌ;
 రాజౌఁ భోగియు సౌమ్యుఁడుఁ గవియు సర్వజ్ఞుండు నెబ్భంగులఁ
 యోజింపఁ రఘునాథభూరమణవర్యుండే ధరామండలిఁ. 22

నేక కాంతలయందు ఏకరీతిగా అనురాగము చూపు నాయకోత్తముఁడు). మలయజ గంధి మండలముఁ=చందనపరిమళము గలిగినట్టి దేశమును - చందనము దక్షిణమందు మలయ పర్వతములోఁ బుట్టును గాన నిట్లు చెప్పుట - (మలయజగంధి=చందనగంధులగు స్త్రీల యొక్క-మండలముఁ=సమూహమును. (ర) భరత విద్యా ధురంధరుఁడు=నాట్యవిద్యా విశారదుఁడు (దశరథసుతుఁడగు భరతుని నేర్పునందు సమర్థుఁడు). రంగస్థలంబుఁ= నాట్యప్రదేశమును (శ్రీరంగక్షేత్రమును). రామా అలంకృతంబు=స్త్రీలతో అలంకరింపఁ బడినదానినిగా(రామ=శ్రీరామవిగ్రహముతో-అలంకృతంబు=అలంకరింపఁబడినదానినిగా)

కర్ణాట సింహాసన అధిరాజ్య భరణ నిపుణ గుణ ఉద్దండ బాహుదండ జనిత సాపత్న్య సంవాద జయ రమా మహీ లలిత కేళి=కర్ణాటదేశపు గద్దియయందు రాజాధి రాజత్వమును వహించుటయందు నేర్పుగల గుణముచేత సమర్థమయిన దండమువంటి భుజముచేత పుట్టింపఁబడిన సవతితనపుఁ బోరాటముకలవారయిన జయలక్ష్మి భూదేవ తలయొక్క ముచ్చటయగు క్రీడగలవాఁడు—ఎల్ల రాజులను జయించి కర్ణాటరాజ్యము నేలినవాఁ డనుట. నృపతి మౌళి=రాజుల కిరీటమైనవాఁడు - రాజశ్రేష్ఠుఁ డనుట.

22 రాజుఁ భోగియుఁ సౌమ్యుఁడుఁ కవియుఁ సర్వజ్ఞుండుఁ ఈడు = చంద్రుఁడును శేషుఁడును బుధుఁడును శుక్రుఁడును ఈశ్వరుఁడును సాటి. తేజః ప్రౌఢ వచః వివేక నయ భూతి శ్లాఘలఁ = కాంతి గడుసు వాక్కు తెలివి నీతి ఐశ్వర్యము వీనివలని పొగడ్తలచేత-ఇంతవఱకుంగల క్రమాలంకారముంగనునది, రాజుఁ భోగియుఁ సౌమ్యుఁడుఁ కవియుఁ సర్వజ్ఞుండుఁ = ఏలికయుం భోగములుగలవాఁడును మంచి వాఁడును గ్రంథకర్తయు సర్వము తెలిసినవాఁడును. యోజింపఁ = ఆలోచింపఁగా

సీ. అరిదిసింగపుఁబల్ల మధురించె నేరాజు
మేలుఁదేజీకిఁ బదివేలు సేయఁ,
జికిలిబంగరుదిండ్ల పికిలిపచ్చల యంద
లం బెక్కె నేరాజు లక్ష సేయఁ,
గనకమయంబుగాఁ గట్టించె నేరాజు
సాటి లేనినగళ్లు కోటి సేయఁ,
గంఠమాలిక మొదలుగాఁ బెట్టె నేరాజు
గొప్పసొమ్ములు పదికోట్లు సేయ,
గీ. నతఁడు ప్రభుమాత్రుఁడే బహుళాగ్రహార
నిత్యసత్త్ర మహాదాన నికర పోషి
తాహిమాచలసేతు ద్విజాభిగీర్ణ
పుణ్యవిభవుండు రఘునాథభూవిభుండు. 23

చ. త్రికరణశుద్ధి నచ్యుతుని శ్రీరఘునాథనృపాలు వైఖరిన్
సకలమహీసురావళికి సత్త్రము లెప్పుడుఁ బెట్టలేఁడ కా
యొకదొర, యందు లెక్కవిని 'యొక్కనాఁటికె యింతలెక్క! మిం
తకుఁ దెగసాగెనా!' యనఁ దా ముదమందినఁ జాలు నెమ్మదిన్. 24

23. అరిది సింగపుఁ బల్లము = ఆశ్చర్యకరమయిన సింహాసనము నిర్మితమయిన జేయను. తేజికిన్ = గుఱ్ఱమునకు. పదివేలు = పదివేలవరహాలు....బహుళ = పెక్కులయిన. నికర = సమూహముచేత. ఆ హిమాచల సేతు = హిమవత్పర్వతము మొదలు కొని రామసేతువువఱకును గల - (భరతఖండము వెల్ల నున్నట్టి యనుట) - ద్విజ అభి గీర్ణ=బ్రాహ్మణులచేత కొనియాడఁబడిన,

24. త్రికరణశుద్ధిన్ =(మనోవాక్కాయముల నెడు) మూఁడుకరణములయొక్క నిర్మలత్వముతో (అనఁగా తలఁచినట్లు చెప్పి చెప్పినట్లు నడచుకొనుచు). వైఖరిన్=వలె. మహీసుర ఆవళికిన్ = బ్రాహ్మణుల సమూహమునకు. పెట్టలేఁడ కా = పెట్టలేఁడు సరియే గదా. ఒకదొర = ఒక్కరాజయినను. అందున్ లెక్కన్ = ఆరఘునాథ రాజుని సత్త్రముల యందలి (వ్యయ) సంఖ్యను.

సీ. అడుగుమాత్రమె కాక యంత కెక్కుడుగ నీఁ
జాలెనే యల బలి చక్రవర్తి?
యావేళ కటు దోఁచినంతమాత్రమె కాక
కోర్కి కెచ్చిచ్చెనే యర్కసూతి?
తూఁగినమాత్ర మిత్తు ననెఁ గా కిచ్చె వ
చ్చినది కొ మ్మనియెనే శిబివిభుండు?
కలమాత్ర మపు డిచ్చెఁ గాక కట్టడ గాఁగ
ననిశంబు నిచ్చెనే యమృతకరుఁడు?
గీ. వారి నేరీతిఁ బ్రతి సేయవచ్చు నెల్ల
యర్థులఁ గృతార్థుల నొనర్చునట్టి యప్ర
తీపవితరణికి మహాప్రతాపతిగ్మ
ఘృణికి నచ్యుతరఘునాథనృపతిమణికి? 25

ఉ. తప్పులు వేయుఁ గల్గినను దాళును, నమ్మినవారిపట్లఁ దాఁ
జెప్పినమాట యూర్జితము సేయు, నొకం డొరుమీఁదఁ గొండెముల్
సెప్పిన వానికై మునవి చెప్పినరీతిగ నెంచు, నీడు గా
రిప్పటిరాజు లచ్యుతనరేంద్రుని శ్రీరఘునాథశౌరికిన్. 26

**25.** (౧) అడుగుమాత్రమె=అడిగినంతయే - ఎక్కువ కాదనుట (వామనమూర్తికి అంజవేసినంతమాత్రమే ఇచ్చెననియు). (౨) తోఁచినంత=మనస్సులో ఎంత ఇచ్చుటకు సంకల్పము కలిగినదో అంత - దోఁచినంత—ఇంద్రుఁడు కర్ణునికవచకుండలములను కైకొనుట దోఁచుకొనుటగా నిట చమత్కరింపఁబడినది. అర్కసూతి=సూర్యునినుండి జన్మముకలవాఁడు-కర్ణుఁడు. (౩) తూఁగినమాత్రము=తనశక్తికి వలనుపడినంతమాత్రము-తూఁగినమాత్రము=కాటాలో తూఁచినప్పుడు తనబరువునకు సమానమయినంతమాత్రము (పావురమును తఱుముకొని వచ్చిన డేగకు తనదేహమాంసమును శిబిచక్రవర్తి యిచ్చినకథ నిట ననుసంధింపవలయును). (౪) కలమాత్రము=కలిగినంతమాత్రము (పదియాఱవభాగము మాత్రము). కట్టడ గాఁగన్ = నియమముగా. అనిశంబున్=సర్వదా - (నిశ కాని వేళయందు - అనగా పగటియందు).

అప్రతీప వితరణికిన్=ఎదురులేని యీవికలవానికి. మహాప్రతాప తిగ్మఘృణికిన్=గొప్ప తేజమునందు వేఁడి వెలుఁగయినవానికి.

**26.** తాళును = క్షమించును. ఊర్జితము సేయున్=నెఱవేర్చును.

సీ. ఆకారమున నలునంతవాఁ డౌనె కా,

హయసమ్యగారూఢి నంతవాఁడె;

యతిదయామతి రామునంతవాఁ డౌనె కా,

యసమానగురుభక్తి నంతవాఁడె;

యమృషోక్తి ధర్మజు నంతవాఁ డౌనె కా,

యన్నసత్త్రఖ్యాతి నంతవాఁడె;

యాలంబునఁ గిరీటియంతవాఁ డౌనె కా,

యమితనాట్యప్రౌఢి నంతవాఁడె;

గీ. రసికమాత్రుండె యంతఃపుర ప్రడీన

సార సారస్వ తాధార శారి కాశు

కవన కృతముఖ శుక కలా కలన హృష్ట

బుధజనాస్థాని రఘునాథ భూమిజాని. 27

ఉ. మాటల నేర్పులా సరసమార్గములా కొలువుండు రీతులా

పాటలగంధులా కళలభాగ్యములా బహుదానలీలలా

27. (గ) హయ సమ్యక్ ఆరూఢిక్ = గుఱ్ఱములను చక్కఁగా స్వారిచేయుట యందును (నలమహారాజు అశ్వహృదయ మను విద్యను నేర్చినవాఁడు). (3) అ మృషా ఉక్తిక్ = అసత్యము కాని మాటయందు-సత్యము పలుకుటయందు. ధర్మజు(ఁడు) = ధర్మరాజు. (8) ఆలంబునక్ = యుద్ధమునం. కిరీటి = అర్జునుని. నాట్యప్రౌఢిక్ — అర్జునుఁడు బృహన్నలగానుండి, విరాటరాజుకొమారితకు ఉత్తరకు నాట్యవిద్యను నేర్పిన కథ నిట ననుసంధింపవలయును.

అంతః...స్థాని — అంతఃపుర = రాణిగార్ల యొద్దనుండి - ప్రడీన = ఎగిరివచ్చినవియు - సార సారస్వత ఆధార = శ్రేష్ఠమైన విద్యకు తావలములును - (అగు) - శారికా = గోరవంకలయొక్క - ఆశుకవన = తాత్కాలిక కవిత్వముచేత-కృతముఖ = (పలుకులందు) నేర్పరులయిన - శుక = చిలుకలయొక్క - కలా = విద్యను-అకలన = గ్రహించుటచేత - హృష్ట = సంతసించిన బుధజన = పండితులుంగల - ఆస్థాని = సభ గలవాఁడు (రాణిగార్లచే గోరవంకలు, శిక్షితములు, గోరవంకలవలన చిలుకలు నేర్చినవి అని భా.) భూమిజాని = రాజు.

నాటకశాలలా యొక టవన్వల దెస్సిటఁ జూడ నన్నిటన్
మేటి యనంగఁ గీర్తిఁ గొలుఁదుఁ జుమీ రఘునాథనృపాలుఁ డిమ్మహిన్. 28

వ. అని రఘునాథమహీకాంతు ననంతశోభనగుణమ్ములలోనఁ గొన్ని యభివర్ణించి. 29

గీ. నన్ను నడిపిన బహుళసన్మాన మెంచి,
యఖిలవిద్యావిశారదుఁ డగుటఁ గాంచి,
యవని నింకెటిరా జెవ్వఁ డని నుతించి,
కృతు లొసఁగఁ గీర్తి కల దని మతిఁ దలంచి. 30

ఉ. తా రసపుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేకకృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహి మించినచో, నిక శక్తు లెవ్వ ర
య్యా రఘునాథభూపరసికాగ్రణికిన్ జెవి సోఁకఁ జెప్పఁగన్? 31

మ. కలిగెంగా దనసమ్ముఖం బనియు, సత్కారంబు తాఁ జేయు నా
తల నెందే శిరసా వహింతు రనియుం, దాఁ గాక లే దెందు సా
ధులకుం దిక్కనియుం, దయన్ మనుపురీతు ల్గాక శక్యంబె వి
ద్యల మెప్పింపఁగ నచ్యుతేంద్రరఘునాథస్వామి నెవ్వారికిన్? 32

చ. అని గణియించి;—రైనను, గుణాంశ మొకించుక కల్గినన్ బళా
యను, నది గాక మిక్కిలి నిజాశ్రితపక్షము గల్గు, సత్కృపా
ఖని, యణుమాత్రమైన నొకకానుక దెచ్చినఁ గొండగాఁ గనున్,
మనమున నచ్యుతేంద్రరఘునాథుఁడె శ్రీరఘునాథుఁ డెన్నఁగన్. 33

30. అవనిన్=భూమిలో. కృతు లొసఁగన్=గ్రంథముల నంకితముచేయుటచేత.

31. తాన్=రఘునాథరాజు. రసపుష్టిమైన్=శృంగారాది రసములు నిండి యుండునట్లుగా. జాతి=స్వభావము. వార్త=వృత్తి. ప్రసన్న=ప్రసాదగుణముగలట్టియు - గంభీర=ప్రౌఢిగలిగినట్టియు.

32. సత్కా...రని=రఘునాథరాజు తాను ముందుగా గౌరవించినయెడల అనంతర మెక్కుడికేఁగినను ఎల్లవారును గౌరవించుచునే యుందురను నభిప్రాయముగలవాఁడై. తాన్=రఘునాథరాజు. మనుపురీతుల్=పోషించువిధములు,

33. గణియించి—గణించినవాఁడు ఈ కవి.

క. కావున, నే నొనరించిన । యీవిజయవిలాస మనెడి కృతిరత్నంబున్
కేవలభక్తిని గానుక । గావించెద; నని నితాంత కౌతూహలినై. 34

క. శుభవాసరమున నయ్యెడ । నిభరాజముఖోపదా నిరీక్షేచ్ఛ మహా
విభవాభిరాముఁడై భా । వభవాకృతి భద్రపీఠ వాసోజ్జ్వలుఁడై. 35

సీ. కుందనంపుఁబసిండి కుల్లాయిజగలపైఁ
చౌకట్లనిగనిగ ల్చౌకళింప,
హురుముంజిముత్యాల యరచట్టపై గొప్ప
పతకంపుహారము ల్పరిఢవిల్ల,
వెలఁజెప్పరాని కెంపుల వంకజముదాడి
పీతాంబరంబుపైఁ బెరిమె నెఱప,
గబ్బిమన్నె కుమార గండపెండారంపు
జిగి పదాగ్రంబుపైఁ జెంగలింప,
గీ. దొరల మంత్రులఁ గవుల నాదరణసేయు
కరముకంకణకాంతి నల్గడల నిండ,

34. నితాంత కౌతూహలిన్ = మిక్కుటమయిన కోరిక కలవాఁడను.

35. ఇభరాజ ముఖ ఉపదా నిరీక్షా ఇచ్ఛన్ = ఉత్తమగజములు లోనగు కానుకలను పరికించుటయందలి కోరికచేత. అభిరాముఁడు = ఒప్పుచున్నవాఁడు. భావభవ ఆకృతిన్ = మన్మథుని యాకారముతో. భద్ర పీఠ వాస ఉజ్జ్వలుఁడు = శుభమయిన యాసనమందు (లేక - సింహాసనమందు) కూర్చుండుటచేత వెలుంగువాఁడు.

36. (౧) కుందనపుఁబసిండి = మేల్మిబంగారపు. జగలపైన్ = కాంతులమీఁదికి. చౌకట్ల=చెవులపోఁగులయొక్క. చౌకళింపన్ = దాఁటుచుండఁగా. (౨) హురుముంజి= హురుముంజిదేశమునఁబుట్టిన (అచ్చటిముత్తెములు శ్రేష్ఠములు) - ముత్యాల = ముత్తెములు అంటఁగుట్టిన - అరచట్టపైన్ = అరచొక్కామీఁద, పరిఢవిల్లన్ = వ్యాపింపఁగా. (౩) వంకజముదాడి=వంకరకటారి. పెరిమెన్ = అతిశయమున. నెఱపన్= వ్యాపింపఁ జేయఁగా. (౪) గబ్బి మన్నె కుమార గండ పెండారంపుజిగి = గర్వితులయిన మన్నె రాకొమరులయొక్క చేత (యని తెలుపుటకై బిరుదుగా ధరించినట్టి) యందెయొక్క కాంతి. చెంగలింపన్ = దుముకుచుండఁగా.

నిండుకొలువుండెఁ గన్నుల పండువుగను
శ్రీవి నచ్యుతరఘునాథ భూవిభుండు. 36

గీ. అట్టి లోఁడ్డోలగం బున్న యవసరమున
వినయభయసంభ్రమములు నా వెంటనంట
నను గృపాదృష్టిఁ జల్లఁగాఁ గనుచునుండ
సమ్ముఖమ్మున కరిగి యంజలి ఘటించి. 37

ఉ. ఏలికమాత్రమే మహిమ నీశ్వరుఁడే తలపోసి చూడ, నా
పాలిటి రామభద్రుఁ డని బంగరుఁబూవులఁ బూజ చేసి నేఁ
జాల నలంకృతిం బొసఁగు సత్కృతి కానుక చేసి కీర్తి భూ
శ్రీ లలితాంగులన్ వలపఁ జేసిన శ్రీరఘునాథశౌరికిన్. 38

ఉ. శ్రీరసభావముల్ వెలయఁ జెప్పి ప్రబంధము లెన్నియేని మీ
పేరిట నంకితం బిడిన, బిడ్డల నొంపఱఁ జేసుపెట్టినన్,
దీరున మీఋణంబు బయిసఁ దెచ్చితిఁ గాన్క పరిగ్రహింపు మ
య్యా రఘునాథభూపరసికాగ్రణి, మామకకావ్యకన్యకన్. 39

సీ. ఘోటక ఖుర పుట క్షుణ్ణ ధరా జాత
పాంసువు పై నుల్లభంబు గాఁగ,
భటసింహ విక్రమోద్భట సింహనాదముల్
స్వస్తివాదంబుల చంద మొందఁ,

కరము కంకణ = చేతి కడియముయొక్క.

37. ఒడ్డు ఓలగము = నిండు సభ. సంభ్రమంబు = తొట్రుపాటు. అంజలి ఘటించి = చేదోయి మోడ్చి.

38. ఏలిక = రాజు. ఈశ్వరుఁడే = శివుఁడే. అలంకృతిన్=శబ్దాలంకారముల తోను అర్థాలంకారములతోను. (నగలతో ననియు). కీర్తిభూ శ్రీ లలితాంగులన్=కీర్తి భూదేవి శ్రీదేవి యను నంగనలను - వలపఁ జేసిన=తన్ను కామించునట్లు చేసిన-కీర్తి పొంది రాజ్య మేలుచు సిరిగలవాఁడై యున్న - అనుట.

39. మామక = నాదయిన.

40. పెండ్లికిఁ బోవుదొర మేలుకట్టుక్రింద స్వస్తివాచనంబులతో, భేరీవాదన ముతో, పొంగయిన కౌతుకముతో తరలిపోయి కన్నెయింటికై కొనివచ్చును. రఘునాథ

బదిదిక్కు లొక్కటఁ బగిలి బీఁటలువాఱ
 భేరీనినాదముల్ బూరటిల్ల,
విజయ సమారబ్ధ వేళ కౌతుకమున
 మొగమున గరువంపు మురువు దోఁప,
గీ. నారి! పెండ్లికి నేఁగిన ట్లనికి నేఁగి,
యక్షతంత్రంబు లివి యేటి జక్కి మనుచు
రేకమోవక గెల్చుట నీకె చెల్లు,
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 40
సీ. ఎంచి రంటివి గాని యీసారి గట్టిగాఁ
 దెగుఁ గార్య మను వార్త దెలుప వైతి,
మించి రంటివి గాని మేదిని యుదరంగ
 నడిచె సైన్యం బని నుడువ వైతి,
వంటి రంటివి గాని యాఖిలతరభటో
 ద్భటసంగరం బని పలుక వైతి,

రాజు ఆతీరున నే యుద్ధమున కేఁగి జయలక్ష్మిం గైకొనివచ్చును. ఆసాదృశ్యముయొక్క వివరణము పెద్దపాదములందు చెప్పఁబడియున్నది —

(౧) ఘోటక...పాంసువు=గుఱ్ఱముల గొరిజ డొప్పలచేతఁ (క్షుణ్ణ)=చూర్ణీకరింపఁబడిన భూమినుండి పుట్టిన ధూళి. ఉల్లభంబు = మేఁకట్టు. (౨) భట...నాదముల్ = బంటుదంటలయొక్క పరాక్రమముచే వెక్కసమయిన సింగపు బొబ్బలు. (౩)విజ...మునన్=గెలుపుచేత అరంభింపఁబడిన యుత్సాహముయొక్క కుతూహలముచేత. గరువంపు మురువు = గర్వముయొక్క సొంపు.

అనికిన్ = యుద్ధమునకు అక్ష తంత్రంబులు = పాచికల (అనఁగా జూదపు) టక్కులు. ఇవి = ఈయుద్ధపు మొగ్గరములు. రేకమోవక=అవలీలగా. సమరనిశ్శంక = యుద్ధములో జంకులేనివాఁడా. సాహసాంక=సాహసమే భూషణముగాఁ గలవాఁడా.

41. (౧) ఎంచిరి='రఘునాథరాజుగారు మీదోషమును ఎంచినారు' అని చారుఁడు చెప్పినమాటను-'అంటివి గాని' అని ఆయా యుపహితవీరులు అనువదించి 'ఈసా... వైతి' - అని చారుని నిందించుచున్నారు; ఇట్లే కడమపాదములయందును అన్వయము తెలియంగవలయును. కార్యము తెగన్=పని తీరును - అనఁగా మాట దండన యగును, (౨)మేదిని=భూమి. నుడువవైతివి=పలుకవైతివి.(౩)అఖిలతర భట ఉద్భట సంగరంబు=

మొగిసి రంటివి గాని ముకుటము ల్తెగి రాజ
    శేఖరుల్ పడుట సూచింప వైతి,
గీ. అనుచు నీధాటి కెరవాఱు నహితవీరు
లదరునను మాట వెడలక బెదరి పల్కు
చారుఁ గని నేరమెంతుఁసు సారెసారె,
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 41

సీ. భిన్నకటంబు లై పేరు పెంపును లేక
    గంధనాగంబు లెక్కడ నడంగె?
బాహ్లిక శక సింధు పారసీకోద్భవ
    హయఘట్ట మేగొందియందు డిందెఁ?
ఖోటుగంటులఁ దూఱి పోవు దారుణమైన
    మాస్తిలగమి యెందు మ్రగ్గి పోయెఁ?
గర్వంబు మేనులు గన్నట్టు లుండెడు
    దొరలయామిక లెందుఁ దొలఁగి పోయెఁ?
గీ. బరుల పాళెంబు లీరీతిఁ బన్ను మొంద,
మాయ వన్నెను నీఖడ్గ మంత్రవాది;

కదుభయంకరమైన బంట్లయొక్క యుదగ్రమైన యుద్ధము (సంభవించును) (౪) మొగిసిరి=కలిసిరి. ముకుటముల్=కిరీటములు. రాజశేఖరుల్=గొప్పరాజులు.

ధాటికిన్ = దాడికి. ఎరవాఱు=పరవశమగునట్టి - అహితవీరులు=శత్రుశూరులు. అద...చారున్ = తత్తరముచేత నోట మాట రాక తొఱచుచు 'ఎంచిరి' 'మించిరి' 'అంటిరి,' 'మొగిసిరి' అని పల్కుచున్న చారుని.

42. నీవు నీకత్తివ్రేటులచేత ఎదిరిదొరల గజ తురగ పదాతి సైన్యములను మంత్రమహిమచేతనో యనునట్లు క్షణములో అవలీలగా రూపుమాపి వారి యహంకారమును దించి వారిని జయించితి వనుట.—(౧) భిన్నకటంబులు = చీలిన చెక్కిళ్లుగలవి. గంధనాగంబులు=మదపుటేనుఁగులు. (౨) బా...క = బాహ్లిక శక సింధు పారసీక దేశములయందు-ఉద్భవ=పుట్టువుగలవైన-హయ=గుఱ్ఱములయొక్క - ఘట్టము = సమూహము. (౩) మాస్తిలగమి=శూరుల సమూహము. మ్రగ్గి=అణఁగి. (౪) ఆమికలు=అహంకారములు.

పాళెంబులు = చిన్నపట్టణములు. బన్నము = భంగమును. ఖడ్గ మంత్రవాది=

గెలిచినను నేటి మే లైన గెలుపు గంటి!
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 42

సీ. రంభ వాకిటను దోరణములు గట్టెడు
తీవర మొకకొంత దీలుపడియె,
మేనక యింటిలో మేల్కట్లు సవరించు
సంరంభ మొకకొంత సడలువాఱె,
గనకాంగి యింటిలోఁ గర్పూరవేదికల్
సవరించు టొకకొంత జాగుపడియె,
హారిణి బంగరుమేడ నరవిరిసెజ్జలు
నిర్మించు టొకకొంత నిలుక దయ్యె,
గీ. మబ్బుగొబ్బున నీశౌర్య మహిమ వినక
తెగువతోడుత నెదిరించి తిరిగి విఱిగి
పాఱిపోయిన మన్నీల పాటుసూచి,
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 43

సీ. అతుల భూరి ప్రతా పార్క దీధితిచేత
గట్టిగాఁ గాఁకలు పుట్టు పిదప,

క త్తియను మాంత్రికుఁడు, ఏమిమేలైనగెలుపు=ఏమిన్యాయ్యమైన గెలుపును (మంత్ర మాయలచేత నయిన గెలుపు అన్యాయ్యపుగెలుపు అని వ్యాజస్తుతి.)

43. రఘునాథరాజుతో మన్నీలకు పోరు బొసఁగఁగానే రంభాద్యప్సరసలు తమపొందుకై వీరస్వర్గమునకు పోరం దోరిన వీరులు వత్తు రని తమయిండ్ల నలంకరింపం ద్వరపడిరి; ఆమన్నీలు పోర లేక విఱిగి పాఱుటం గాంచి ఆయలంకార ప్రయత్నమును మానిరి.—ఆవివరమును కవి వర్ణించుచున్నాఁడు.—

తీవరము = తొందర. దీలుపడియెన్ = తగ్గిపోయెను. సంరంభము = త్వర. సడలువాఱెన్ = మందగించెను. కర్పూరవేదికల్ = కప్పురపుటరంగులను. జాగుపడియెన్=విలంబమొందెను. అర విరి సెజ్జలు=సగము వికసించినపూవుల పానుపులను. మబ్బుగొబ్బునన్=అజ్ఞానాతిశయముచేత. మన్నీల = (ఎదిరి) దొరలయొక్క.

44. (౧) అతు...చేతన్=సాటిలేని మిక్కుటంపు ప్రతాపమనెడి(అర్క దీధితి= సూర్యుని కాంతి) ఎండచేత. పిదపన్ = తరువాత. (౨) ఘోర...చేన్=భయంకరపు

ఘోరారి గళ రక్త ధారాళ వృష్టిచే
నాని దుక్కికిఁ బదనైనపిదప,
హయ దట్ట ఖుర పుట హలాగ్ర ముఖంబున
నంతట దున్నిన యట్టిపిదప,
మొలచిన నీకీర్తి మొలకలు తఱుచుగాఁ
వెదపెట్టి పైరు గావించుపిదపఁ,
గీ. గాపు నిలుపవె బేతాళ గణము నెల్లఁ;
బట్టిపట్టుల కరిగి నీ వరుల నోదె
పాటు చేసితి వనుట యేపాటి తలఁప?
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 44

సీ. ఒకరు వోయినదెస కొకరువోవక పాఱి
నరివీరులకు దాహ గరిమ మించె,
గడగడ వడఁకి నల్గడల కేఁగక భీతిఁ
జెందిన వారిపై జెమట పుట్టె,

లయిన (అరి = ) శత్రువుల కంఠముల నెత్తురనెడు తెంపులేని వానచేత. పదను = తడి. (3) హయ...ముఖనన్ = గుఱ్ఱముల సమూహములయొక్క గొరిజల డొప్పలనెడు నాగేటిగుంపులయొక్క మొనల చేత. (4) తఱుచుగాన్ = దట్టముగా. వెద పెట్టి = విత్తనము చల్లి.

పట్టులకున్ = తావులకు. అరిగి = పోయి. అరులన్ ఓదెపాటు చేసితి వనుట = శత్రువులను ఓదెలుఓదెలుగా పైరుకోసి వైచినట్లు కోసి వైచితివని చెప్పుట—నీ వరులన్ ఓదెపాటు చేసితివి=నీవు పైరు కావించిన కీర్తిసస్యములను కోఁత కోసి ఓదెలు గావించితివి-అనఁగా నీవు వర్ధిల్లఁ జేసికొన్న నీకీర్తియొక్క ఫల మయినపుణ్యమును అనుభవము దెసకు తెచ్చుకొనుచున్నావు.—ఇచట పైరు పండించి కైకొనుటకును శత్రుసంహార పూర్వకజయమునకును చెప్పఁబడినసామ్యమును సమగ్రముగా నరసికొనుది.

45. వేసవిసూర్యునియెండ తగ్గమయినవారికి దప్పి, చెమట, కందుట, ఒప్పుతఱుఁగుటయుం గలుగును. రఘునాథరాజుని కోపవీక్షణ కాంతి తగ్గ మయినవారికిని అట్టి దశయే కలిగినందున ఆకాంతిని వేసవిసూర్యునియెండనుగా కవి నిరూపించినాఁడు:—

మున్నాడి యెలగోలుమూఁకలఁ బోట్లాడు
        పరులపైఁ బాటలప్రభలు మీఱెఁ,
జేగ దెచ్చుక కొంత సిగ్గున నెదిరించు
        రాజుల యొప్పు బీరము దొలంగెఁ,
గీ. దెగువతోడుత ధరియించి తీవ్ర కోప,
భరిత రూక్షాక్షి నియమిత ప్రభల పేర
నీవు ఘర్మార్క విస్ఫూర్తి నెఱపునపుడు,
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 45

సీ. తలలు వీడఁగఁబాఱుధరణీశ్వరులఁ జూచి
        యంటి వెన్నాడని యట్టిమహిమ,
పడిన యేనుంగుల ప్రక్కల కొదిగిన
        రాజులఁ జూడని రాజసంబు,
జళిపించు చంద్రహాసములు పాఱఁగ వైచి
        మొ్రొక్కువారలమీఁద మొనపుకరుణ,
నెత్తురు గనుపట్టి హ ర్తినభీతిచేఁ
        గలవరించినవారిఁ గాచుగరిమ,

(3) మున్నాడి=మూఁదుమిగిలి. ఎలగోలు మూఁకలన్=ముందునడుచుబలములతో. పరుల పైన్ = శత్రువులమీద - (శత్రువుల) దంతులమీఁద అని యేని. పాటల ప్రభలు = తెలుపుతోఁ గలిసిన యెఱ్ఱ కాంతులు. పరులపై...మీఱె—పోట్లచేఁ దొరిగిన రక్తముచే వైరులు ఎఱ్ఱ పెక్కిరని భావము. (4) చేగ = చేవ. రాజులు=(ఎదిరి) దొరలయొక్క (చంద్రులయొక్క అనియు). ఒప్పుబీరము = సొంపును పరాక్రమమును,

తీవ్ర...పేరన్ = ఉగ్రమయిన కోపముతో నిండిన తీక్ష్ణమయిన కంటియందు బద్ధములయియున్న కాంతు లనెడు నెపముచేత. ఘర్మఅర్కవిస్ఫూర్తిన్ = వేసవి సూర్యుని ప్రకాశమును. ధరియించి = తాల్చి. నెఱపు = వ్యాపింపఁజేసెడి.

46. వెన్నాడని = తఱుముని. మహిమ, రాజసము, కరుణ, గరిమ, కీర్తి—అను నివి రఘునాథరాయునివి. రాజసంబు = గర్వము. జళిపించు = తాము ఆడించుచున్న.

గీ. మెన్నఁ దనమీఁద బలముతో నెనసి మొనసి
విటుగురాణువఁ బొమ్మను వీరవరుని,
కీర్తి గంటిమి జగదేక కీర్తనీయ
సమరనిశ్శంక రఘునాథ సాహసాంక. 46

రఘునాథరాయఁడు ఈకృతి నందుట.

క. అని విన్నవింపఁ జిత్తము । ననలొత్తఁ బరిగ్రహించి నాపై నింతిం
తనరానివత్సలత్వము । కనిపింపఁగ హర్షభర వికస్వర ముఖుఁడై. 47

గీ. కల నయిన మిమ్ము గా కన్యుఁ గొలువ నంటి;
కృతు లొకరి కీను, మీకె యంకితము లంటి;
పలికినప్రతిజ్ఞ చెల్లింప వలదె యిట్లు?
వాఙ్నియమరూఢి నీయంత వాఁ డిఁకేఁడి? 48

క. వాసించుఁ గవిత చెప్పిన, వీసర వో వొకట, భక్తివిశ్వాసంబుల్
నీసొమ్ములు,సామాన్యుఁడవే? సూర్యవరప్రసాది విజ్జగ మెఱుఁగన్.49

క. ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతి గలుగం జెప్ప నేర్తు, వెల్లెడఁ బెళు కౌ

చంద్రహాసములన్ = కత్తులను. మొనపు = నెఱపునట్టి. హత్తిన = అంటిన.

47. ననలొత్తన్ = పుష్పింపఁగా - సంతసింపఁగా ననుట. పరిగ్రహించి = (నే నిచ్చిన కృతికన్యను) స్వీకరించి. హ...డు = సంతోషముయొక్క పెంపుచేత వికసించుచున్న మోముగలవాఁడు.

48. మిమ్మున్—రఘునాథరాజాను. ఈను = ఒసగను. వాఁడు ఇఁకన్ ఏఁడి (—ఎక్కడనున్నాఁడు). వాక్ నియమ రూఢిన్ = మాటయొక్క నిశ్చయముయొక్క స్థాపనయందు - పలికినప్రతిజ్ఞను నెఱవేర్చుటయందు అనుట.

49. వాసి = భేదము. ఇంచున్=మనోహరముగా నుండును, ఒకటన్ వీసర వోవు = (నీవు) ఎందును వెలితిపడవు.

50. ఎల్లెడన్ బెళుకు ఔ కృతిన్ అపారముగాన్ వింటిమి=అన్నివిషయముల

కృతి వింటి మపారముగా,
క్షితిలో నీమార్గ మెవరికిఁ రాదు సుమీ. 50

గీ. క్షత్త్రధర్మమ్మె కద నీకుఁ గలది మొదలఁ,
దమ్ములు సుతుల్ హితులు గూడ మమ్ముఁ గొలిచి,
తిపుడు కృతియును జెప్పి మా కిం పొనర్చి,
తోకటఁ గా వన్నిటను బ్రయోజకుఁడ వీవు. 51

గీ. అని సుధామధురోక్తుల నాదరించి,
మంజులపదార్థ భూషణాంబరకదంబ
కరి తురంగాది వాహనోత్కరము లిచ్చి,
న న్నసాధారణముగ మన్నన యొనర్చె. 52

చ. అభినవభోజరాజ బిరుదాంకుఁడు శ్రీరఘునాథశౌరికిఁ
శుభమతి నేలినందులకు సూడిద చేసితి నౌర, మిక్కిలిఁ
సభల గణింప మన్నన లొనర్పఁ ప్రబంధము, నింతయుత్తమ
ప్రభునకు నంకితం బొనరుపం గలిగెం గద యంచు వేడుకన్. 53

ఉ. ఆనతి యిచ్చెనా, యది శిలాక్షర ; మెవ్వని నేని మెచ్చెనా,
వాని గృహార్థుఁ జేయుఁ; బగవాఁ డయినన్ శరణంబుఁ జొచ్చెనా
యా నరు నేర మెంచక తనంతటివాని నొనర్చు; నిచ్చెనా
యేనుఁగుపాఁడి; యీడు గలదే రఘునాథనృపాలమౌళికిన్ ! 54

యందును మెఱుఁగయిన కవనమును లెక్కలేక వింటిమి గాని.

52. సుధా మధుర ఉక్తులన్ = అమృతమువలె తీపయిన మాటలతో, మంజుల పదార్థ = మనోహరములయిన వస్తువులు - భూషణ=ఆభరణములు - అంబర = వస్త్రములు-(వీని) కదంబ = సమూహము. కరి=ఏనుగులు. తురంగ = గుఱ్ఱములు. ఉత్కరములు=సమూహములు.

53. అభి...ఁడు=క్రొత్తభోజరాజు అనెడి బిరుదు చిహ్నము కలవాఁ డయిన. శుభమతిన్ = మంచిమనస్సుతో. సూడిద=కానుక. ప్రబంధమున్ సూడిద చేసితిని అని యన్వయము.

54. అనరున్ = అపురుషుని. ఏనుఁగుపాఁడి—అమిత మనుట.

ఉ. ఎందును విద్యలే యెఱుఁగ రెవ్వ; రెఱింగినఁ గొంతమాత్రమే ;
యందును సాహితీరసమహత్త్వ మెఱుంగ; రెఱిఁగి రేని, యా
యంద మెఱుంగలేఁ; రెఱిఁగి నప్పటికిన్, విని మెచ్చి యీయ; రె
న్నం దగు నచ్యుతేంద్రరఘునాథవిభుండె ప్రవీణుఁ డన్నిటన్. 55

సీ. ఏరాజుభుజశౌర్య మేదులఖానాది
వజీరులచెలిమికి వశ్యవిద్య,
యేరాజువిక్రమ సారంబు విద్వేషి
మహీమపలాయన మంత్రశక్తి,
యేరాజువీక్ష సమీహితకర్ణాట
రమ నాట్యవిద్యకు రంగభూమి,
యేరాజుచరితంబు వారాశివేష్టిత
మేదినీపతులకు మేలుబంతి,

గీ. యతఁడు చెలువొందుఁ జినచెవ్వ యచ్యుతేంద్ర
బహుజననపుణ్య పరిగణ్య ఫలనిభాత్మ

55. సాహితీ రస మహత్త్వము = సాహిత్యపు రుచియొక్క గొప్పతనమనుట.

56. (౧) ఇతనిభుజశౌర్యమును మెచ్చి ఏదులఖాన్ మొదలగు వజీర్లు ఇతనికి వశ పడిరని భా. (౨) మంత్రప్రభావముచేతనుంబోలె ఇతనిపరాక్రమాతిశయముచేత శత్రువుల గొప్పతనము పటాపంచలై పోయినది. (౩) వీక్ష = చూపు. సమీహిత = కోరఁబడిన - కర్ణాట రమ = కర్ణాటదేశపు రాజ్యలక్ష్మియొక్క. రంగభూమి = నాట్యస్థానము. ఇతనిచూపులో కర్ణాటరాజ్యలక్ష్మి ఆడుచుండెను అనుట. (౪). ఈయననడువడిని చూచి ఆప్రకారమే ఎల్లరాజులును నడుచుకొనుచుండిరనుట. వారాశి = సముద్రముచేత - వేష్టిత = చుట్టువాఱుకొనఁబడిన, మేలుబంతి = ఒరవడి,

చిన...త్ముండు = చినచెవ్వరాయని తనయుఁడైన యచ్యుతరాయనియొక్క అనేకజన్మముల పుణ్యములకు లెక్కింపఁదగిన(=లెక్కకుసరియయిన)ఫలమనెడు (నిభ=) మిషచేత నయినట్టి తనయొక్క కొడుకుతనముయొక్క సంతోషముతో నిండినమనస్సు గలయట్టి విష్ణుమూర్తి - అనఁగా విష్ణుమూర్తియే చినచెవ్వయచ్యుతరాయల యొక్క బహుజన్మపుణ్యములకు లెక్కకు తగినఫలమిచ్చెడు మిషమున నాతనికి రఘునాథరాజరూప

పుత్త్రభావ ప్రమోద సంపూర్ణ హృదయ
పంకజాతుండు రఘునాథ పార్థివుండు. 56

సీ. సింహాసనము మాట శిథిల మౌటలు విని
గట్టిగా నిలుపఁ గంకణము గట్టె,
కోటిసంఖ్యలుమీఱఁ గూర్చిన ధనరాశిఁ
గొల్చువారల కిచ్చెఁ గొల్చువలెనె,
తుండీర పాండ్యాది మండలేశ్వరులపై
దండెత్తి విడిసె నుద్దండమహిమ,
నేల యీనినయట్లు నిలిచిన వైరులఁ
బంచబంగాళమై పాఱఁ దఱిమెఁ,
గీ. గర్వితారాతి మస్తక ఖండనోత్థ,
రక్తధారానుషంగాతిరక్తధార
నిజకృపాణికఁ గావేరినీటఁ గడిగె,
నిఖిలగుణశాలి రఘునాథ నృపతిమౌళి. 57

సీ. ఘనఘనాఘనముల కాల సంకెలఁ బెట్టు
పాండ్యుని వెన్నాడి పాఱఁ దఱిమెఁ,
దుండీరనాథుండు దురమునఁ బఱవంగఁ
జూచి ప్రాణము దయఁ గాచి విడిచెఁ,

మున కొమరుఁడుగా జనించి అంతవానికి తాను పుత్త్రుఁడయినందులకు మిగుల సంతోషముతో నొప్పుచున్నాఁడు.

57. (౧) కంకణము కట్టెన్=ప్రతిజ్ఞ చేసెను. (౨) కొల్చువారలకున్=సేవకులకు. కొల్చువలెన్=ధాన్యమువలె. (౩) పాండ్యమును తుండీరమును మండలవిశేషములు. మండలేశ్వరులపైన్ = దేశాధిపతులమీఁదికి. (౪) పంచబంగాళమై = పటాపంచలై.

గర్వి...ణికన్ = మదించిన (అరాతి=) శత్రువులయొక్క శిరముల కోఁతచేత (ఉత్థ=) వెడలిన నెత్తుటి (ధారా=) చాలుయొక్క (అనుషంగ=) సంపర్కముచేత మిక్కిలి యెఱ్ఱనయిన వాఁడిరకలదైన తన కత్తిని.

58. (౧) ఘన...కాలన్—ఘన=గొప్పవైన - ఘనాఘనముల=వర్షించుచున్న మేఘములయొక్క - కాలన్=కాళ్లను. పాండ్యరాజొకఁడు మేఘముల కాళ్లకు సంకె

గయ్యాళి వెనుకఁ ద్రొక్కనిరాజు లెదిరింపఁ
జేరిన రాజకౌశికులఁ బట్టెఁ,
బోరాడఁగా రాని వైరుల కోటలు
పంపులచే లగ్గ పట్టి తివిచె,
గీ. నితఁడు సామాన్యుఁడే ధర నెంచి చూడ
విజయ నిస్సాణ రాణ నిర్విణ్ణ హృదయ
భీత రాజన్య సైన్య నిర్భీతి దాన
బిరుద నిజ పాణి రఘురాఘ భిదురపాణి. 58

ఉ. ఇచ్చునెడన్ జదార్థ మడి గిచ్చునొ? తా దయసేయఁ గా దనన్
వచ్చునొ? మించి యొక్కడన వచ్చినఁ దా నది యిచ్చగించునో?
యిచ్చిన నిచ్చెనే; సరగ నెవ్వరిపై దయచేసెఁ జేసెనే!
యచ్చతురాస్యుఁడుం దెలియఁ డస్యుతు శ్రీరఘునాథు చిత్తమున్. 59

---

షష్ఠ్యంతములు.

---

క. ఏతాదృగ్గుణ ఖనికిన్ । సీతా దృఙ్మోహ నాంఘ్రి సేవా ధనికిన్
శ్రీ తాసి కలిత బాహా । న్వీ తాసిక విమత రాజ నిఖిలావనికిన్. 60

లలు వైచివాఁ డని వోలాస్యకథ. తటివెఁన్—గమనము పోఁగొట్టినవానికి అతివేగ గమనము కలిగించె నని చమత్కారము. (౨) పఱవంగన్=పరుగెత్తుచుండఁగా. (౩)చేరిన రాజకౌశికులఁ బట్టెన్—ఇక్కడ పాఠనిశ్చయము కనఁబడలేదు. రాజకౌశికులన్ = రాజేంద్రులను. (౪) పంపులచేన్—(సేనా) భాగములచే. లగ్గ పట్టి = నిచ్చెన వేసి.

విజ...పాణి = జయ భేరీ ధ్వనికి డిల్లఁబోయిన రొమ్ములు గల భయపడిన మూర్ధాభిషిక్తుల సైన్యములకు అభయమును ఇచ్చుటయను బిరుదుగలదైన తన చేయిగలవాఁడు. భిదుర పాణి = (భిదుర = వజ్రాయుధము - పాణి = కేలంగలవాఁడు) ఇంద్రుఁడు.

౫౯. అడి గిచ్చునో—క్త్వార్థకారసంధి. మించి=అతిక్రమించి. అన వచ్చినన్= తేవల దని చెప్పినేని. సరగన్ = శీఘ్రముగా. చతురాస్యుఁడు = బ్రహ్మ (చతుః= నాలుగు - అస్యుఁడు = మోములుగలవాఁడు.)

క. సాక్షాన్మనోజునకు క్షో। దక్షమ రస భావ సుకవితా భోజునకున్
దాక్షిణ్యగణేయునకున్। దక్షిణ సామ్రాజ్య విభవ ధౌరేయునకున్.

క. సుస్థిర లక్ష్మీ మహిత మ। ణి స్థగిత గృహాంగణునకు నేపాళ నృపా
ల స్థాపన చణునకు సక। లాస్థాన ప్రణుత వర గుణాభరణునకున్.

క. కీర్త్యౌదార్యాధరి తా।మర్త్య మహీరుహ సుధాబ్ధి మహికాఘృణికిన్
ధౌర్త్యవ దరి కరి సృణికిన్। మూర్త్యంబా గర్భ శుక్తి ముక్తామణికిన్.

60. (ఏతాదృక్=) ఇట్టి సుగుణములకు గనియగు జానకియొక్క (దృక్=) నేత్రములను (మోహన=) వలపించెడు శ్రీరామమూర్తియొక్క (అంఘ్రి=)చరణముల యొక్క. కొలువుచేత ధనికుఁడును (ఆకొలువే ధన మనుట), (శాత=) వాఁడియైన (అసి=) కత్తితో కూడుకొన్న (బాహా=) భుజమునందు (అన్విత=) చేరినట్టి (అసిక=) ఉనికిగల శత్రురాజులయొక్క సమస్త (అవనికిన్=) భూమిగలవాఁడును (శత్రురాజులను జయించి వారిరాజ్యముల నెల్ల తానే యేలుచున్నాఁ డనుట.)

61. మనోజుఁ డనఁగా మన్మథుఁడు. క్షో...జునకున్=నలుఁగుడునకు (అనఁగా కఠినపరీక్షకు) ఓర్చునట్టి శృంగారాదిరసములును రత్యాదిభావములునుగల మంచికవన మందు భోజరాజు-(తత్తుల్యుఁ డనుట), దా...నకున్=దయచేత గణింపఁదగినవాఁడును, ద...నకున్ = దక్షిణదేశాధి రాజత్వపు విభవమును వహించువాఁడును.

62. మిక్కిలి శాశ్వతమైన సిరిచేత ఒప్పుచున్నదియు మణులతో పొదుగఁబడినదియు (నగు) నింటి (అంగణునకున్=) ముంగిలిగలవాఁడును, నేపాల రాజును నెలకొల్పుటయందు నేర్పరియు, ఎల్ల (ఆస్థాన=) రాజసభలయందు కొనియాడఁబడిన యుత్తమగుణములు ఆభరణములుగాఁ గలవాఁడును.

63. కీ...కిన్—కీర్తి = యశస్సుచేతను-ఔదార్య = ఈవిచేతను - అధరిత= క్రిందుసేయఁబడిన-అమర్త్య మహీరుహ=(దేవ తరువు) కల్పవృక్షము - సుధా అబ్ధి= (అమృత సముద్రము) పాలసముద్రము - మహికా ఘృణికిన్=(మంచుకిరణములందుఁ గల) చంద్రుఁడును గలవానికి (ఈ చెప్పినవానికన్న కీర్త్యౌదార్యములు కలవాఁడనుట), ధౌ...కిన్-ధౌర్త్యవత్ = (ధూర్తత్వము) వంచన కలవారయిన - అరి = శత్రువులనెడు - కరి = ఏనుఁగులకు - సృణికిన్ = అంకుశమైనవాఁడును, మూ...కిన్— మూర్త్యంబా = మూర్తమ్మయొక్క - గర్భ = కడుపనెడు - ముత్తెపుఁజిప్పయొక్క- ముక్తామణికిన్ = ముత్తెపుపూసకును (ఆమెకడుపున జనించిన యుత్తముఁ డనుట.)

క. అఘటిత ఘటనా చాతు।ర్య ఘ నోర్జిత కార్య నిర్వహణ ధూర్వహ ధీ
మఘవాచార్యున కచ్యుత । రఘు నాథ వసుంధ రాధి రాడ్వర్యునకున్.

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన విజయవిలాసం
బను శృంగార ప్రబంధమ్మునకుం గథాక్రమం బెట్టి దనిన నైమిశారణ్య
మహర్షులకు రోమహర్షణి యిట్లనియె.

---

కథావతారణము.

---

శా. చంద్రప్రస్తరసౌధ ఖేలనపర శ్యామా కుచద్వంద్వ ని
స్తంద్ర ప్రత్యహ లిప్త గంధ కలనా సంతోషిత ద్యోధునీ
సాంద్ర ప్రస్ఫుట హాటకాంబురుహ చంచ చ్చంచరీకోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమాహేలాకళావాస మై 66

64. అ...కున్ = సమకూడనిదానిని సమకూర్చుటయందలి నేర్పుచేత గొప్ప బెట్టిదములయిన పనులను సాధించు భారమును వహించునట్టి బుద్ధియందు ఇంద్రగురువు (అనఁగా బృహస్పతియగు), (అయినట్టి), వసుంధరా=భూమియొక్క-అధిరాట్ వర్యునకున్=రాజాధిరాజశ్రేష్ఠునికి.

65. అభ్యుదయ పరంపరా అభివృద్ధి గాన్=శ్రేయస్సుల వరుసయొక్క పెంపు కలుగునట్లుగా. రోమహర్షణి = సూతుఁడు.

66.—చంద్ర...రంబు—చంద్రప్రస్తర=చంద్రకాంతమణులయొక్క-సౌధ=మేడలయందు - ఖేలన పర = ఆటయందు ఆసక్తలైన-శ్యామా = నడిజవ్వనులయొక్క-కుచద్వంద్వ = చనుఁగవలయందు - ప్రత్యహ=దినదినమును - లిప్త = పూయఁబడిన - గంధ=పరిమళద్రవ్యములయొక్క - కలనా = ప్రాప్తిచేత - సంతోషిత = తనియింపఁబడిన - ద్యోధునీ = మిన్నేటియందలి - సాంద్ర - దట్టమయిన - ప్రస్ఫుట = విరిసిన - హాటక = బంగారపు - అంబురుహ = తామరలయందు - చంచత్ = ఒప్పుచున్న - చంచరీక = తేంట్లయొక్క - ఉత్కరంబు = సమూహముగలదైన, ఇంద్రప్రస్థపురంబు=ఇంద్రప్రస్థ నగరము, ర...మై—రమా=సిరియొక్క-హేలా=విలాసముయొక్క - కళా=విస్తృతి-ఆవాసమై=ఉనికిపట్టయి. భాసిలున్=ఒప్పును.

## పురవర్ణన.

ఉ. ద్వారక ముద్దుఁజెల్లె లఁట తన్నగరీమణి; సృష్టి యన్నిటన్
దీఁగడైనచో నిదియ నేర్పుల మేరని యెంచి చేసెఁ బో
ధారుణి విశ్వకర్మ; గుఱి దానికి నెక్కడ నీడు లేనిసిం
గారము గల్గు, టట్లు వెనుకన్ సృజియింపక యుండుటే సుమీ. 67

క. వెండియుఁ బైఁడియుఁ దడఁబడ
నుండుం బురి నెందుఁ జూడ; *సుగ్రాణములై
యుండంగా బలె నందలి
యిండులఁ గైలాస మేరు పృథ్వీధరముల్. 68

## చాతుర్వర్ణ్య వర్ణన.

సీ. తడఁబాటు గలుగ వేదముల నాతని కించుఁ
బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు,

తా.—ఇంద్రప్రస్థపురమందలి మేడలు ఆకాశగంగవఱకు పొడవై యున్నందున, ఆమేడలయందు క్రీడించుచుండు నడికవరాండ్ర మైపూఁత నెత్తావిని అని ఆకాశగంగలోని బంగారు తామరలయందలి తేంట్లు సంతోషపడుచున్నవి. ఆప్రకారమున నాపురము లక్ష్మికి ఆటపట్టయి యొప్పుచున్నది.

67. తన్నగరీమణి=ఆయుత్తమపట్టణము. ద్వారక = ద్వారకయొక్క. సృష్టి = నగరనిర్మాణవిద్య. అన్నిటన్=అన్నివిషయములయందును. తీఁగడ ఐనచోన్=కడకు పోటు పొందినంతట. అదియ = ఈయింద్రప్రస్థపురమే. నేర్పులమేర + అని. విశ్వకర్మ = దేవశిల్పి. గుఱి = ఇంతులకు తార్కాణము. దానికిన్ = ఆయింద్రప్రస్థపురమునకు. అట్లు=ఆయింద్రప్రస్థపురమువలె.

68. పైఁడియున్ = బంగారంబును. పురిన్ = ఆనగరమందు. కైలాస మేరు పృథ్వీధరముల్=వెండికొండ యగు కైలాసంబును బంగారుకొండ యగు మేరువును.

69. (౧) ధరణిసురులు=బ్రాహ్మణులు. వేదములన్=వేదపాఠమునందు. ఆతనికిన్=బ్రహ్మకు, తడఁబాటు=పొరఁబాటు —సోమకాసురుఁడు వేదములను హరించినప్పుడు బ్రహ్మకు వేదపాఠమందు పొరఁబాట్లు వచ్చినవని పౌరాణికగాథ; (డలలకభేదముచే- తలఁబాటు అనఁగా శిరశ్ఛేద మని యర్థాంతరమును కొందఱు చెప్పుదురు; శివుని చే

* పాఠాంతరము.—సుండఁగవలయున్ । భండారములై యుండఁగ ।...

కడమాటు పగవానిఁ గని చేమఱచె నంచు
భార్గవు మెచ్చరు బాహుజనులు,
పనికి రా కొకమూలఁ బడియె నాతనివస్తు
వని కుబేరుని మెచ్చ రర్యజనులు,
వీటిపాటైన నాఁగేటిపాటున నేమి
యని హలాయుధు మెచ్చ రంఘ్రిభవులు,

గీ. పాడిఁ దప్పక, ధర్మంబుఁ బట్టు విడక,
లక్షలకు నమ్మఁ జాలి, నల్గడల భూమి

బ్రహ్మశిరము ఛేదింపఁబడిన కథ ననుసంధింతురు; ఈపక్షమందు-వేదపాఠములో తలఁ బాటుకలదు అనఁగా తలవంపు - గలదు - అనఁగా అవమానపడినవాఁడు అని ధ్వని.) (౨) బాహుజనులు=క్షత్రియులు. కడమాటు=కడపటిపర్యాయము అనఁగా శ్రీరాము నెదుర్కొన్నప్పుడు. చేమఱచెన్=విలువిద్యయందలి సాధనస్ఫూర్తిని మఱచెను (తనవిం కిని ఆరాముని కిచ్చివైచెను అని ధ్వని). భార్గవున్=పరశురాముని. (3) అర్యజనులు= వైశ్యులు, పనికిన్ = వ్యాపారమునకు. ఒకమూలన్ = ఒకగొందిలో (ఉత్తగదిక్కున ని ధ్వని). వస్తువు = ధనము (నవనిధు లనుట). (౪) అంఘ్రిభవులు = (విష్ణుమూర్తి యొక్క-చరణమునుండి పుట్టినవారైన) శూద్రులు. వీటిపాటు అయిన = (వీటి = శేరియొక్క - పాటు=నాశము) ఊరికి చేటుదెచ్చిన (బలరాముఁడు తన నాఁగటితో హస్తినాపురమును కోడఁబెఱికి యమునలో ద్రోయం గడంగుట ధ్వనితము) - నాఁగేటి పాటునన్ = నాఁగేటికృషిచేత (నాఁగేలు శత్రువుల నెత్తిమీఁదఁ బడుట - అనఁగా నాఁగేటిప్రహారణములచేత నని ధ్వని). హల ఆయుధున్=హలము (నాఁగలి) ఆయుధ ముగాఁ గలవాఁడైన బలరాముని.

గీత మెల్ల మొత్తముగా ప్రతిజాతికి నన్వయించును:—పాడి = న్యాయమును. ధర్మంబు=వేదోక్తవిధులను. లక్షలకున్ నమ్మన్ చాలి=తమకడ లక్షలక్షలుగా ఒరులు కల్లడయుంచిన ఆధనమును వెండియు వారికి అర్పించువారై. భూమివరులు మేలు అనన్=రాజులు మెచ్చుకొనునట్లుగా. చదువుసాములన్—బ్రాహ్మణులకును అన్యోన్య క్షాత్రమ ద్రోణాదులకుం బోలె సాములు కలవు-శూద్రులకును వేదేతరమయిన చదువు కలదు - ధనధాన్యసంపదలు ఎల్లవారికిం గలవు.

మఱియొకవిధమున గీతపాదములు నాల్గును నాల్గుజాతులకును యథాక్రమముగా న్వయించును.

వరులు మే లనఁ దగి, యిట్లు పురిఁ బొలుతురు
చదువుసాముల ధనధాన్యసంపదలను. 69

కోట.

ఉ. 'నీసరి యైనదేవతటినిం గలఁగించెద, నీ వడంపుమా
నాసరి శేషపన్నగఫణానివహంబు,' నటంచు నప్పురిన్
బాసలు సేసికొన్న వన భాసిలు సాలశిఖాళి ఖేయముల్;
మోసమె యైన, విష్ణుపదముల్ బలిపీఠము ముట్టనేటికిన్? 70

పాడి దప్పక—(పాడి యనఁగా వేదాధ్యయనమందలి పాఠవిశేషము - బ్రాహ్మణులు దానిని తప్ప రని యర్థము (బ్రహ్మ దానిని తప్పెనాఁ డని భా.) పాడి యనఁగా మర్యాదయు-కనుక-బ్రహ్మ తనకొమాౕత నే సరస్వతిని వరించి మర్యాదను విడిచినాఁడనియు భా.) ధర్మంబు పట్టు విడక = (క్షత్రియులు) వింటియొక్క యవలంబమును మానక (పరశురాముఁడు తనపగతుఁడైన రామునిచేతికి తనవి ల్లిచ్చి సాధనహీనుఁడై నిలిచినాఁడని భా.) లక్షలకున్ అమ్మన్ చాలి—(వైశ్యులు) లక్షవరహాలకయినను అమ్ముటకు వలసినంతసరకును సర్వదా సిద్ధముగా నుంచుకొనియుందురు (కుబేరుఁడు తన కెంత ధన మున్నను మంచివస్తువులను విక్రయించుటకు సమర్థుఁడు గాక యున్నాఁడని ధ్వని.) నల్లదలన్ భూమిన్ వరులు మేలు అనన్ =(శూద్రులు)భూమిలో ఎల్లదేశములయందును తాము పండించిన ధాన్యములు శ్రేష్ఠ మయినవి అనునట్లుగా (బలరాముఁడు అంతటి నాఁగలి పెట్టుకొనియు వరి పండింపలేఁ డాయె నని ధ్వని). చదువు లోనగునవి బ్రాహ్మణాదులకు వలువురకు వరుసగాను నన్వయించును.

70. నీసరి...నివహంబున్—ఇది కందకముతో కోటకొమ్మలచాలు చెప్పెడు మాట. దేవతటినిన్ = ఆకాశగంగను. శేష పన్నగ ఫణా నివహంబున్ = అనంత నాగునియొక్క పడగల సమూహమును. బాసలు = ప్రమాణములు (ఒడంబడిక). సాల శిఖా ఆళి = కోట కొమ్మల వరుసయు. ఖేయమున్ =కందకమును. భాసిలున్ = ప్రకాశించును. మోసమె ఐనన్ = అట్లు ప్రమాణము చేసికొనుట నిజము కాదేని. విష్ణు...ఏటికిన్ = (సాలశిఖాళి) దేవాలయములో విష్ణుపాదమును (ఖేయము) దేవాలయములో ధ్వజస్తంభముకడ నుండుబలివారణపీఠమును తాఁకనేల - గుడిలో విష్ణుపాదమును బలిపీఠమును తాఁకి ప్రమాణము చేయుట ప్రసిద్ధము—విష్ణుపద మనఁగా ఆకాశమును బలిపీఠ మనఁగా రసాతలంబునుం గావున కోటకొమ్మలచాలు ఆకాశమును కందకము రసాతలమును ముట్టుచున్నవని తాత్పర్యము.

## మేడలు.

ఉ. రేలమృతాంశులోఁ శశము రెమ్ముద మంచుఁ దలంచి జాళువా
మేలిపసిండి సోయగపు మేడల గుజ్జెనగూళ్ల సందడిన్
బాలిక లుండి, యావలఁ జనం గని, చింతిలి, 'వంటయింటి కుం
దేలిదిఁ యెందు బోఁగలదు? నేఁటికి నే!'మని యందు రందులన్. 71

ఉ. పున్నమ రేలఁ దత్పురముపొంతనె పో శిఖరాళి దాఁకి వి
చ్ఛిన్నగతిన్ సుధారసము చింది పయిం దిగువాఱ నంతనుం

71. రాత్రులలో ఆనగరమున జాళువా బంగారపు మేడలయందు బాలికలు 'ఈరాత్రి చంద్రుఁడు మనయింటిగుండ పోవునపుడు అతని యొడిలోని కుందేటిని ఒడిసి తివిచికొందము' అని సంకల్పించుకొన్నవారై, అతఁడు వచ్చినసమయాన గుజ్జెనగూళ్ల సందడిలో కుందేటిని పట్టం బరాకుపడినవారై, చంద్రుఁడు దూర మేఁగినంతట కని చింతించి, 'కానీ ఈకుందేలు నేఁటికి తప్పించుకొన్నను రేపు తప్పించుకొనుసా, ఇది మన వంటయింట నున్నట్లే గదా.' అని ఒండొకరితో అనుకొందురు.

రేలు=రాత్రులయందు (ఈపదము అందు రను క్రియకు విశేషణము). అమృతాంశులోన్=చంద్రునిలోని. శశమున్=కుందేటిని. రెమ్ముదము=ఒడిసి తిగిచికొనియెదము గాక. జాళువా = జాళువాదేశపు (జాళువా యను ప్రదేశమునుండి హెచ్చు వన్నె బంగారము వచ్చును) - మేలి పసిండి = మేల్మి బంగారపు-సోయగపు = అందమయిన - మేడలన్=మేడలయందు. గుజ్జెనగూళ్ల=బొమ్మలపెండ్లి భోజనముల యొక్క-సందడిన్= తొందరలో.

72. చంద్రుఁడు క్షీణించుటకు మేడలశిఖరములు పైన దుస్సి (సుధ=) అమృతము కాఱిపోవుటయే కారణము. బంగారు మేడలకు బంగారమును తెలుపునట్టి పేరు కలుగక 'సౌధములు' అని సుధామయార్థమును తెలుపునట్టి పేరు కలుగుటకు కారణము చంద్రుని సుధ వానిపైఁ దిగజాఱుటయే:—

శిఖర ఆళి=శిఖరముల పంక్తి విచ్ఛిన్నగతిన్ = ఒడిగిపోవుట వలన. పయిన్= మేడలమీఁదికి. అంతనుండిన్ = పున్నమనుండి (అంతనుండియున్ అనుటకు.) కల = చంద్రుఁడు. నిక్కము=నిజము. ఇలన్=భూమిలో. సౌధనామముల్ — సుధాశబ్దమునకు సున్నమర్థము - సున్నముచే నిర్మితములుగాన మేడలకు సౌధములు అని పేరుగలిగినది.

డి న్నెల సన్నగిల్లు; నది నిక్కము గానిని రేని, యూ పవా
ర్వన్నె ఘసిండిమేడలకు రాఁ గని రా మించ శ్లాఘ్యమానముల్? 72

గుఱ్ఱములు.

ఉ. వేడుక నప్పురిహారుల వేగము గన్గొని లేళ్లు గాడ్పుతోఁ
'గూడి చనన్వలె న్మనము, గూడఁగ నోపక యోచినట్టి గా
రోడని వారి మోచు ట'ని యొద్దికఁ బందెము వైచి కూడలే
కోడెను గాక, యోయఁగఁ బ్రయోజన మే యనిలుం గురంగముల్?

ఏనుంగులు.

ఉ. చుట్టును గట్టి యుండును నొక చో నెడ మించుక లేక యుండఁ ద
త్పట్టణబాహ్యభూములఁ మదావళమండల మొప్పు నెప్పు! ని
ట్టట్టు దెమల్ప రా కరిభయంకర మై దివితోడ రాయుచున్;
బెట్టనికోట గాదె గజబృందము రాజధానికిన్. 74

దానిని కవి యిట అమృతకారణమునం గలిగినట్లు ఉత్ప్రేక్షించినాఁడు.—మేడలు చంద్రమండలమునంటియున్న వనుట - అత్యాతోన్నతము లని భావము.

73. వాయువునకు లేడి వాహనము - అంతు లకు ఈ యుత్ప్రేక్ష:—హారుల=గుఱ్ఱములయొక్క. కూడి = ఈగుఱ్ఱముతోఁ గూడి. మనము—గాలియు లేళ్లును అను కొనుట. ఒద్దికన్ = చెలిమితో. ప్రయోజనము=కారణము. అనిలున్=వాయువును. కురంగముల్ = లేళ్లు.—ఇడిలో అంవలిగుఱ్ఱములు లేళ్లను మించి వాయువునకు సమాన ముగా నున్నవని భా.

74. చుట్టున్=నగరముచుట్టురా నెల్లయెడలను. ఒకచోన్ = ఎటనేనియు. మదావళ మండలము =, మదపుటేనుఁగుల సమూహము. కట్టి యుండున్ = కట్టఁబడి యుండును. (గట్టి=శత్రువుల కభేద్యమయిన దార్ఢ్యము-అనియు.) ఉండన్ = ఉండు నట్లుగా. బాహ్య=బయటి. అరి=శత్రువులకు. దివితోడన్=ఆకాశముతో-రాయుచున్= ఒరయుచు-(ఏనుఁగులు మిక్కిలి యున్నతము లనుట.) రాజధానికిన్=రాజుండు పట్టణమునకు. గజబృందములు=ఏనుఁగుల సమూహములు.—ఇందుం గలసమానధర్మములు నేనింటినిం జరికింపవలయును.

బంట్లు.

ఉ. గాళిను లాపురీభటశిఖామణు లెక్కటియుక్కుతున్క, లా
ఖీలతరాశనుల్ చిదిమి పెట్టినబంటులు వైరి కెల్ల, వే
తాళుఁడు వచ్చి డగ్గఱిన దబ్బర గా దొకదెబ్బ దీయఁగాఁ
జాలుదు రేమి చెప్ప మఱి సాదన నేటున సాహసమ్మునన్! 75

పౌరులు.

సీ. ఆరామసీమలయందు నుండి పవళ్లు
మదము మెసఁగ వసంతుఁ డెదురు సూచుఁ,
మునిమాపుకడలఁ గ్రొన్ననవింటి నెఱజోదు
కేళిమందిరముల కేఁగఁ జూచుఁ,
బ్రొద్దు వోయినవేళ రోహిణీప్రాణేశుఁ
డుదిరిమేడలమీఁద వెదకి చూచుఁ,
దెలతెలవాఱంగ మలయగంధవహుండు
నోరణగండ్లలోఁ జొచ్చి చూచు,
గీ. నాపురివిలాసవతుల యొయారములకుఁ
గడు సొగసి వారి రాకలు కాచి కాచి;

75. గాళిసులు=దిట్టలైన. భట శిఖామణులు = శ్రేష్ఠులగు బంట్లు. ఎక్కటి = సాటిలేని. వైరికిన్ ఎల్లన్=ఎల్ల శత్రువులకును-అఖీలతర అశనుల్=మిక్కిలి భయంకరమయిన పిడుగులను - చిదిమి పెట్టిన బంటులు = చిదిపి చేసిన కొలఁదివారు (ఇట నిది బంటిశబ్దము పరిమాణార్థకము). సాదనన్ ఏటునన్ సాహసమ్మునన్ = వారి గరడీని దెబ్బను తెగువను. సాదనచే ఉక్కుతున్కలై, ఏటున అశనితుల్యులై, సాహసమున బేతాళుని దెబ్బదీయువా రని క్రమ మరయునది.

76. ఇతరులకు విరహోద్దీపకులగు వసంత మదన చంద్ర మలయానిలులు ఆపురి సొగసుకత్తెలను వలచి తమతమ తావులనుండి తమతమ సమయంబులందు వారిరాక నెదురుచూచుచుందు రని ఆస్త్రీల సౌందర్యాతిశయమును వర్ణించుట:—

ఆరామ సీమలయందున్=ఉద్యానవన ప్రదేశములందు. మదము ఎసంగన్ = సంతస మతిశయింపఁగా. మునిమాపు కడలన్ = రాత్రిముఖ సమీపములయందు,

విరహులఁ గలంచువారె యుద్విగ్నము గాఁగ,
మన్నవారల నిఁక వేఁతె మున్న వేల? 76

క. మగవానిని మగవాఁడును
మగువను మగువయును వలచు; మఱి యే మన న
న్నగరపు రాజకుమారుల
జిగిబిగిసోయగము చెలుల సింగారమ్ముల్? 77

మలయమారుతము.

చ. పొలయలుక లాని యున్న పువ్వుఁబోణులు, ఖండిత నాయికాలలా
మ్ములు, మది నీర్ష్యకోల్ వల ... మానినుల్, 'లేటికి వచ్చెనమ్మ తాఁ
బిలువని పేరఁటం?' బనుచు బెగ్గిలి నాథులఁ గౌఁగిలింపఁగాఁ
బొలుపుగ నందుఁ బెండ్లినడపుల్ నడుపున్ వలిగాలితెమ్మెరల్. 78

క్రో..దు = మన్మథుఁడు. రోహిణీప్రాణేశుఁడు = చంద్రుఁడు ఉదిరి = అంగారపు. గంధవహుండు = మారుతుఁడు. సోరణగండ్లలోన్ = కిటికీలలో. విలాసవతుల = శృంగార చేష్టలుగల స్త్రీలయొక్క. కడున్ = మిక్కిలి. సొగసి = మోహించి.

77 మగువ = స్త్రీ. ఏమనన్ = ఏమివర్ణింపను. జిగి = కాంతి సోయగము = సౌందర్యమును. రాజకుమారులలో మగవానిని మగవాఁడు వలచు ననియు చెలులలో (అనఁగా-రాజకుమారికలలో) మగువను మగువ వలచుననియు క్రమ మెఱుఁగునది.—అత్యంతసుందరు లనుట.

78. పొల యలుక = (ప్రణయకలహమువలనఁ గలిగిన కపటపుఁ) గోపమును. అని యున్న = వహించి యున్నట్టి - పువ్వుఁబోణులున్ = పువ్వువలె కోమలలగు స్త్రీలును, ఖండిత నాయికా లలామములున్ = కాంతుఁ డన్యకాంతతో రాత్రిం గడపి వచ్చినందులకై దుఃఖితలై యలిగియున్న సుందరీమణులును, మదిన్ = మనస్సులో, ఈర్ష్యకోలం వలయం మానినులు(న్) = కాంతుఁడు తమ్ము వేఁడుకొనవలయు నని కోరుచున్న యీర్ష్యావతు లును, ఏటికి... అనుచున్ = ఈ వలి గాలి తెమ్మెర (= చల్లని మెల్లని మలయమారుతము) పిలువని పేరంటముగా నేలవచ్చినది అని (మలయమారుతము విరహోద్దీపనము చేసి తమ బింకము సాగనీక పోయిన దన్న యీరసముచే దానిరాకను పిలువని పేరంటం బని తూల నాడుట), నాథులన్ కౌఁగిలింపఁగాన్ = కాంతులను కౌఁగిలించుకట్లుగా, అందున్ = అపురంబున, వలి గాలి తెమ్మెరల్, పెండ్లి నడుపుల్ నడుపున్ = పెండ్లి వర్తనలను జరి పించును (స్త్రీపురుషులను కూర్చు ననుట).

పుష్పలావికలు.

ఉ. ప్రాయపు గాయకుల్ వెల నెపానను జూడఁ, 'నేర్పు లే
రా యిది! దండ మీఁద గొసరం దొరకొంటిరి! మంచిసాములే!
పో! యటులైనచో సరసముల్ పద విూ కిపు డం'చు నప్పురిన్
గాయజతూపు లమ్ముదురు కందువమాటలఁ బువ్వులావికల్. 79

పాత్రలు.

సీ. గొప్పలై మిన్నందు చప్పరాల్ లెక్కలాఁ
గులు వైనచోఁ జంద్రకళ లనంగఁ,
గనకంబు వర్షించు ఘనుల మ్రోలల నటించి
మెఱయుచోఁ దొలకరి మెఱుపు లనఁగ,
నూటికిఁ జాలు నేదియు నొక్కచోఁ
బ్రతిసేసి పంచాళ బ్రతిమ లనఁగఁ,

79. గాయకుల్ = కొనువారు. వెల నెపానన్ = వెలఁజూచెడు నెపమున. చూడన్ = (పుష్పలావికలను అనఁగా పువ్వు లమ్ముచెలువలను) కనఁగా. 'నేర్పు... ఇపుడు'—ఇది ఆ గాయకులనుగూర్చి పుష్పలావిక లనెడు మాట. * దండన్ = పూమాలను (కైదండను - ఆలింగనము నంట). మంచి సాములే = మంచిదొరలే (మంచివారయ్యలే). అటు లయినచోన్ = దండనే కొసరి యిచ్చెదల (ఆలింగనమునే మీ కొసంగుదుమేని). సరసముల్ = చవుకలు (ఇది దక్షిణదేశ వ్యవహారోచితమయిన యర్థము - కామతంత్రమున కుచితమయిన సరసోక్తుల అని యర్థాంతరము-శ్లేషగా దండ యిమ్మనుట సరసోక్తి గావున నిట్లనుట). కాయజు తూపులు = మదనబాణములను - అనఁగా పూవులను. కందువ మాటలన్ = సంకేతపు మాటలతో-అట్లే ఆలింగన మిచ్చెదము గొప్పబహుమతి యీవలయు నని సంకేతము.

80. (౧) మిన్ను అందు చప్పరాలు = ఆకాశము నంటెడి యుప్పరిగలను-లాఁగులు = దాఁటులు - కళలు = రేఖలు (స్వరూపమున చంద్రకళలను బోలి ఆకాశమున చంద్రసమీపమున నుండుటచేత ఈభ్రాంతి). (౨) కనకంబు వర్షించు ఘనుల మ్రోలన్ = బంగారమును అవారిగా నిచ్చెడు ధనవంతులయెదుటను, నటించి = ఆడి - మెఱయుచోన్ = ప్రకాశించువేళయందు (స్వరూపమున మెఱపులం బోలి - ఘను లనఁగా మేఘ

* 'వెలఁది, యీ నీదండవెల యెంత?' 'నాదండకును వెలఁబెట్ట నెవ్వనితరంబు?' వసు.

కుపితనాథులఁ గూర్మిఁ గొసరుబింకెన నాటఁ
గనుచో మరుశిలీముఖముల బోలెఁ,
గీ. జెలఁగి యింపుగ నగఁ బాడఁ జెప్పఁ జనవ
వలవ వలపింప నేర్చిన యలరుఁబోఁడ్లు
విపుల భరత కళా శాస్త్ర నిపుణ లైన
బిరుదుపాత్రలు గలరు తత్పురమునందు. ౮౦

విటులు.

సీ. అతివినోదముగాఁగ రతుల మెప్పించు నీ
పచ్చలకడియాల పద్మగంధి,
చక్కెరమోవి విచ్చి చవులఁ దేలించు నీ
ముత్యాలకమ్మల ముద్దులాఁడు,

ములు గావున - వర్షించుచున్న మేఘములచెంత ఆడుచు మెఱయుచుండుటచేత ఈ భ్రాంతి). (౩) మాటికిన్ = మాటిమాటికిని. చూపఱమదికిన్ = చూచువారి మనస్సునకు. (స్వరూపమున బంగరుబొమ్మలం బోలి అనఁగొల్పుటచేత ఈ భ్రాంతి.) (౪) కుపిత నాథులన్=తమ మీఁద అలిగిన నాయకులను - కూర్మిన్ కొసరుబింకెన = స్నేహమును వేఁడుకొను బెడంగు - నాటన్ = హృదయములోఁ జొచ్చునట్లుగా. మరు శిలీముఖములు = మన్మథబాణములు. (మన్మథబాణసామ్యము తమకు సిద్ధమై యుండుటచేతను కూర్మి పుట్టించుటచేతను విటులహృదయములలో నాటుకొనుటచేతను ఈ భ్రాంతి.)

నగన్ = నవ్వుటకును - (కనన్ - అనుపాఠమున చూచుటకు అని యర్థము- నేత్రాభినయమున నేర్పుగలవా రని భా. అనన్ - అనుపాఠమున సంభాషించుటకు అని యర్థము.) వలవన్=కామించుటకు. అలరుఁబోఁడ్లు=కుసుమకోమలులు. విపులన్= భూమిలో (సెల్ల నెక్కుడుగా). భరత కళా శాస్త్ర నిపుణలు = భరతశాస్త్రమునందును కళాశాస్త్రమునందును నేర్పరులు. బిరుదు పాత్రలు=బిరుదులు దాల్చిన యాటకత్తెలు.

81. (౧) రతులన్=పొందులచేత(రతి యనఁగా పచ్చల తూనికలో నొక యెత్తు- పచ్చలకడియాలది గాన రతులతూనికచే మెప్పించు నని చమత్కారము). (౨) చక్కెర మోవి = మధురాధరమును (చక్కెరమోవు=చక్కెరమోసు అయిన యధరము ననియు చమత్కారము.) చవులన్=రుచులచేత (చవు లనఁగా ముత్తెముల కాంతివిశేషము - దానినే నీరు అని వ్యవహరింతురు - ముత్యాలకమ్మలది గావున చవులం దేలించు నని చమ

తృణముగా లోఁజేయు నెుత్తెవాని నీ
నీలాలముంగఱు నీలవేణి,
వెలలేనిపొందిక విడివడ మెఱయు న
కెంపులబొగడల కీరవాణి,
గీ. యనుచుఁ దమలోన నెఱజాణతనము మీఱ
హార కాంతామణుల మేటివార్త లెల్లఁ
దెలుపుచును వెన్నెలబయళ్లఁ గలసి నగుచు
విటులు విహరింతు రప్పురి వీథులందు. 81

తోఁటలు.

గీ. పోఁకమ్రాఁకులమహిమ కప్పురపుటనఁటి
యాకుఁదోఁటల సౌభాగ్య మందె కలదు,

త్కారము). (౩) ముంగఱు=ముక్కుఱకలదైన - నీల వేణి - నీలములవంటి జడగలది -
* తృణముగాఁ లోఁజేయుఁ = తృణప్రాయముగా లోకువ చేసికొనును (మహానీల
మణికి తృణమును గ్రహించు స్వభావము కలదు. నీలంపుముంగఱు కలది గాన తృణము
నాక్షేపించు నని చమత్కారము). (౪) కీరవాణి=చిలుక పలుకులది. పొందికఁ=పొందు
నందు . విడి=పరాక్రమము - పడఁ=వ్యాపించునట్లుగా - మెఱయుఁ = ప్రకాశిం
చును ; వెలలేని పొందికఁ = ఎంత వెలయిచ్చినను తీఱనట్టి సంఘటనము చేత - విడి =
అరుణ కాంతి - పడఁ = వ్యాపించునట్లుగా - (కెంపులబొగడలది గావున ఎక్కువ
వెలగల కూర్పుచేత ఎఱుపు హెచ్చునట్లుగా మెఱయు నని చమత్కారము).

తమలోనఁ—తా మనఁగా విటులు.

82. కప్పు...గ్యము— ఇది తయు నొక ద్వంద్వసమాసము - కప్పురపు
టనఁటి = కర్పూరపు టరఁటి చెట్లయొక్కయు - సౌభాగ్యము = సొంపు. అందె =
ఆ పురమందె. మౌక్తిక సౌధ సంపదల మహిమ = ముత్యాల మేడల సిరులయొక్క
యతిశయము - ప్రబలఁ=వర్ధిల్లు చుండును. పేటి రహిఁ = అనగరముయొక్క బాగును.

* గీ. వింగి యత్తఱిఁ దన్మహానీల మైన । గరిమకుం దగ బహుతృణగ్రాహి యయ్యె,
ననఁగఁ బెణతకలమాది యవసరాశి । తతులు గెకు లన న భ్రంకషతః జెందె, ఆ ము.

ప్రబలు మహా_త్తికౌసౌధసంపదలం హి...
వీటిరహి మెచ్చవలయుఁ బో వేయు నోళ్లఁ.                    82

ధ ర్మ రా జు.

ఉ. ఆణి మెఱుంగుము త్తెపు టొమారపు మ్రుగ్గులు రత్నదీపికా
శ్రేణులు ధూపవాసనలు హృద్యనిరంతర వాద్యఘోషముల్
రాణఁ బొసంగఁ బ్రోలు మిగులం గనువిం దొనరించు నిత్యక
ల్యాణముఁ బచ్చతోరణము నై జను లందఱు నుల్లసిల్లఁగన్.        83

ఉ. ఆపుర మేలు, మేలు! బళి! యంచుఁ బ్రజల్ జ యనెట్టుచుండ, నా
జ్ఞా పరిపాలన వ్రతుఁడు శాంతి ... సత్యభా
షా పర తత్త్వ శోభితుఁడు సాధుజ... జ్ఞానవి
ద్యా పరతంత్ర ... ధర్మతనూజుఁ ... ఉదగ్ర తేజుఁడై.        84

వేయు నోళ్లన్ = సహస్ర ముఖములతో.— పోఁకలు కర్పూరము తమలపాకులు ము_త్తెపుసున్నమును గలసిన వీడెము యొక్క రుచి ఆ వీడెమును వేయినోటికే తెలియును గాని వేయని నోటికి ఎఱుకపడదు.—అని వ్యంగ్యము.

83. ఆణి = గుండ్రని (ఈశబ్దము ము_త్తెములగుండ్రదనమందు వర్తించును) మెఱుంగు = నీరుగల. రత్న దీపికా శ్రేణులు=రత్నముల (తో చేయఁబడిన) దీపముల వరుసలు. హృద్య = మనోహరమయిన. రాణక్ బొసఁగన్ = రమణ మీఱఁగా. ప్రోలు=పట్టణము. నిత్య కల్యాణము = నిరంతరము శుభములు కలదియు - కావున నే- పచ్చతోరణమున్ = పచ్చని చిగురుటాకుల తోరణము గలదియును.

84. ఏలుట - ధర్మతనూజుఁడు (యముని కుమారుఁడు అనఁగా ధర్మరాజు) క_ర్త. జయ నెట్టుచుండన్ = జయ జయ యని ఘోషించుచుండఁగా (జయ - అని సంస్కృత ము - జి ధాతువుయొక్క లోణ్మధ్యమ పురుషైక వచనము - దానికి సర్వోత్కర్షతో వర్ధిల్లుము అని ఆశీర్వచన మర్థము). ఆజ్ఞా పరిపాలన వ్రతుఁడు= (తాఁ జేసిన) యాజ్ఞను నెఱవేర్చుటయే దీక్షగాఁ గలవాఁడు. శాం...డు = ఓర్పును దయయుం అభరణములు గాఁ గలవాఁడు. సత్య...డు = సత్యము పలుకుటయొక్క యుత్కృష్టమయిన స్వ రూపము నెఱిఁగినవాఁడు. ఆదరణుఁడు = ఆదరించువాఁడు. దా...డు = ఈవియను విద్యకు స్వాధీనమయిన మనస్సుకలవాఁడు (ఇచ్చుటయందు అత్యంతాసక్తుఁ డనుట). ఉ...డై — ఉదగ్ర = తీవ్రమయిన - తేజుఁడై = ప్రతాపము కలవాఁడై.

శా. దేవబ్రాహ్మణభక్తిప్రోవు, ప్రియసత్యత్వంపుఁగాణాచి, వి
ద్యావైదుష్యము నెక్కుడు, ధర్మ[illegible]తార్కాణ, మర్యాదకున్
తావౌచిత్యముజీవగఱ్ఱ, హిత[illegible]వ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి, యజాతశత్రుఁ[illegible] ధర్మపుత్రుఁడే చూడఁగన్! 85

సీ. అవలఁ బోయినవెన్క నాడుట యెన్నఁడు లేదు,
మొగముముందఱ నంట మొదలె లేదు,
మనవి చెప్పినఁ జేయఁ గనికి యెన్నఁడు లేదు,
కొదువగా నడుపుట మొదలె లేదు,
చనవిచ్చి చౌక చేసినది యెన్నఁడు లేదు,
పదరి హెచ్చించుట మొదలె లేదు,
మెచ్చినచోఁ గొంచె మిచ్చు టెన్నఁడు లేదు,
మొకమిచ్చకపుమెచ్చు మొదలె లేదు,
గీ. మఱియుఁ దొల్లిటిరాజులమహిమ లెన్న
నితఁడె పో సార్వభౌముఁ డప్రతిముఁ డనఁగఁ
బ్రజలఁ బాలించె సకలదిగ్భాసమాన
కీర్తివిసరుండు పాండవాగ్రేసరుండు. 86

85. ప్రోవు = ప్రోగు = రాశి. ప్రియసత్యత్వంపు = ప్రియముగా పలుకు స్వభావమునకు - గాణాచి = చిరకాలనివాసస్థానము. వి...క్కు - చతుర్దశవిద్యల యందలి నేర్పునకు రతికుఁడు. తార్కాణ = దృష్టాంతభూతుఁడు మర్యాదకున్=వినయమునకు. తావు = చోటు. ఔచిత్యము = ఉచితభావమునకు - జీవగఱ్ఱ = జీవ సాధనము. హి...గి = హితులయొక్కయుం ధర్మనిరతులయొక్కయుం సమూహమును సంతోషపెట్టుట యను సంపద వజ్రకవచముగాఁగలవాఁడు. అజాతశత్రుఁడు=ధర్మరాజు.

86. ఆడుట = దూషించుట. అంట = దూషించుట. మనవి = విజ్ఞాపనము. కొదువగాన్=తక్కువగా. చనవు = అధికారము. చౌక = చేసినది = తక్కువపఱచుట. పదరి = త్వరపడి. సార్వభౌముఁడు=సర్వభూమ్యధీశ్వరుఁడు. అప్రతిముఁడు = సాటిలేనివాఁడు. భాసమాన = ప్రకాశించుచున్న. విసరుండు = సమూహముగలవాఁడు. పాండవ అగ్రేసరుండు = పాండవులలో మొదటివాఁడగు ధర్మరాజు.

సీ. ఎంత లెస్సగ నున్న నంత వేడుకె కాని
ప్రజలకల్మి కసూయపడుట లేదు,
తనుఁ గొల్వవలె నంద అనుప్రియంబె కాని
మానిసివెగటించుటైన లేదు,
నిచ్చ వేఁడిన నర్థి కిచ్చు చిత్తమె కాని
మును పింత యిచ్చితి ననుట లేదు,
రేవగల్ ధర్మ మార్జించు దృష్టియె కాని
న్యాయంబు దప్పినపడక లేదు,
గీ. 'కలఁడె యిటువంటిరాజు లోకమున నెందు!
జలధి వలయిత వసుమతీ చక్ర మెల్ల
నేలవలె శాశ్వతముగాఁగ నీఘనుండె,
యేల వలె నన్య' లన నా నృపాలుఁ డలరె. 87

ఉ. కోప మొకింత లేదు, బుధకోటికిఁ గొంగుఁబసిండి, సత్య మా
రూపము, తారతమ్యము లెఱుంగు, స్వతంత్రుఁడు, నూతనప్రియా
టోపము లేని నిశ్చలుఁడు, డిటుల్ కృతలక్షణుఁడై చెలంగఁగా,
ద్వాపరలక్షణుం డనఁగ వచ్చునొకో యిల ధర్మనందనుల్? 88

క. దుర్జయ విమతాహంకృతి! యూర్జిత యామానక ద్రైన్య మర్దన చణ దోః

87. వేడుక = సంతోషము. మానిసి వెగటు = మనుష్యులు తన్నుఁజేరుట యందు వైరస్యము. నిచ్చ = సదా. అర్థికిన్ = యాచకునికి. రేవగల్ = రాత్రియుం బగలును. దృష్టి = తలంపు. జల...ము = సముద్రముచేత పరివేష్టింపఁబడిన భూమండలమును. ఏల వలెన్ = ఎందులకు కావలయును.

88. బుధ కోటికిన్ = విద్వాంసుల సమూహమునకు. నూతన = క్రొత్తలు - ప్రియ = ఇష్టములగునట్టి - ఆటోపము = ఆడంబరము. కృతలక్షణుఁడు = గుణములచే ప్రసిద్ధి చెందినవాఁడు - కృతయుగ ధర్మములు కలవాఁడు అనియు. ద్వాపరలక్షణుండు = సందిగ్ధమయినధర్మము కలవాఁడు - ద్వాపరయుగధర్మములు కలవాఁడు అనియు. — ధర్మరాజు ద్వాపరయుగమువాఁ డయినను కృతయుగధర్మముల నాచరించువాఁ డని భా.

89. దుర్జయ...ఖర్జులు = జయింపశక్యముగాని (విమత=) శత్రువులయొక్క

ఖడ్గులు గల రతనికి భీ। మార్జున నకుల సహదేవు లనుజన్ముల్. 89

క. పంచామరతరులో, హరి। పంచాయుధములో, గిరీశుపంచాస్యములో,
యంచున్ సకలజనంబులు। నెంచఁగ బాండవులు వెలసి రేపురు ఘనులై, 90

చ. ఒరిమయు భక్తియు న్నెనరు నోర్పు ఘనంబడఁ, బెద్దపిన్న యం
తరువు లెఱింగి, మాట జవదాఁటక, చెయ్వుల వేఱు లేక, యొం
డొరులమనమ్ములోన్ మెలఁగుచుండిరి పాండుకుమారు, లెంత నే
ర్పరు! లిల నన్నదమ్ములసరాగము వారలదే సుమీ; యనన్. 91

అర్జునుఁడు కథానాయకుఁడు

ఉ. అన్నలపట్లఁ దమ్ములయెడాటమునన్ సముఁ డౌను నెన్నఁగా
నెన్నిక గన్నమేటి, యొదు రెక్కడ లేక కృపాలకోటిలో
పన్నెయు వాసియుం గలిగి వర్తిలుపౌరుషశాలి, సాత్త్వికుల్
తన్ను నుతింపఁగాఁ దనరు ధార్మికుఁ డర్జునుఁ డొప్పు నెంతయున్. 92

అహంకారమును తుడిచివైచుటయందును యాచకుల దీనత్వమును అణఁగఁగొట్టుటయందును నేర్పుగలవైన బాహువులయొక్క దురదగలవారు (శత్రువులం గొట్టుటకును యాచకుల కిచ్చుటకును వారిబాహువు లెప్పుడును దురదగొని యుండు ననుట). అనుజన్ముల్ = తమ్ములు.

90. పంచ అమరతరులు=అయిదు దేవవృక్షములు (మందారపారిజాత సంతాన కల్పవృక్ష హరిచందనములు.) హరి=విష్ణుమూర్తియొక్క - పంచాయుధములు=పాంచజన్య సుదర్శన కౌమోదకీ నందక శార్ఙ్గములనెడు శంఖ చక్ర గదా ఖడ్గ చాపములు. గిరీశుపంచాస్యములు = శివుని యైదు ముఖములు (సద్యోజాతము వామదేవము అఘోరము తత్పురుషము ఈశానము అనునవి). వీరు పంచకముల చేతను వరుసగా - దాని యందును శత్రుసంహారమందును పవిత్రతయందును సగమోత్కృష్టు లని భావము.

91. ఒరిమ = అణఁకువ. నెనరు = దయ. అంతరువులు = తారతమ్యములు. చెయ్వులన్ = పనులయందు. వేఱు=భేదము. మనమ్ములోన్ = మనస్సుప్రకారము. సరాగము = ఒద్దిక.

92. పట్లన్ = ఎడల. ఎడాటమునన్ = ఎడల. ఎన్నిక = ప్రసిద్ధి. కన్నమేటి = పొందిన శ్రేష్ఠుఁడు. పన్నెయున్ వాసియున్ = ప్రసిద్ధియు గొప్పతనమును. పౌరుష శాలి = పరాక్రమముచే శోభించువాఁడు. సాత్త్వికుల్ = శాంతస్వభావము కలజ్ఞానులు. ధార్మికుఁడు = ధర్మమెఱింగినవాఁడు.

చ. అతని నుతింప శక్యమె? జయంతునిసమ్ముఁడు సోయగమ్మునన్,
బతగకులాధిపధ్వజుని ప్రాణసఖుండు కృపారసమ్మునన్,
త్రిశిఖరికన్యకాధిపతికిన్ ప్రతిజోదు సమిజ్జయమ్మునన్,
డతని కతండె సాటి చతురబ్ధిపరీత మహీతలమ్మునన్. 93

గీ. పాఱఁజూచినఁ బరసేన పాఱఁజూచు,
వింటి కొరగిన రిపురాజి వింటి కొరగు,
వేయు నేటికి? కలపాండవేయుసాటి
వీరుఁ డిల లేఁడు; ప్రతి రఘువీరుఁ డొకఁడు. 94

క. అతిలోక సమీక జయో
న్నతిచే ధర్మజున కిం పొనర్చుచు, వినయా
న్వితుఁడై సమస్తజన స
మ్మతుఁడై నరుఁ డుండె నిటు లమానుషచర్యన్. 95

93. సోయగమ్మునన్ = సౌందర్యమందు - జయంతునిసమ్ముఁడు = జయంతునికి సమానుఁడు (ఇతఁడును జయంతునివలెనే ఇంద్రపుత్త్రుఁడే గావున వాస్తవముగానే అతని యనుజుఁ డని యర్థాంతరము). కృపా = దయా. పతగ కుల అధిప ధ్వజుని ప్రాణ సఖుండు = పక్షి వంశ ప్రభువు (అనఁగా గరుత్మంతుఁడు) ధ్వజముగాఁ గలవానికి (అనఁగా నారాయణునికి) (శ్రీకృష్ణులవారికి అనుట) సమానుఁడు-(వాస్తవముగానే శ్రీకృష్ణుల వారికి ప్రాణమిత్త్రుఁ డని యర్థాంతరము). సమిత్ జయమ్మునన్ = యుద్ధమందలి గెలుపు విషయములో-త్రిశిఖరికన్యకా అధిపతికిన్ ప్రతిజోదు = పార్వతీపతికి (అనఁగా శివునికి) సాటి (మాయాకిరాతుఁ డగుశివునితో పోరాడి గెలిచినవాఁ డని యర్థాంతరము). చతుః అబ్ధి పరీత మహీ తలమ్మునన్ = నాలుగు సముద్రములచేత చుట్టువేసికొనఁబడిన (సమస్త మయిన అనుట) భూ మండలమందు.

94. పాఱఁజూచినన్ = (అర్జునుఁడు శత్రుసైన్యమును) కడవెల్లం గాంచినయెడల, పరసేన = శత్రుసైన్యము, పాఱన్ చూచున్ = పలాయనమునకుం గడంగును; వింటికిన్ ఒరగినన్ = విల్లు చేకొనినచో, రిపు రాజి = శత్త్రువుల పంక్తి, వింటికిన్ = ఆకాశమునకు, ఒరగున్ = ఏఁగును (రణనిహతులై శత్రువులు వీరస్వర్గమున కేఁగుదు రనుట).

95. అతిలోక = లోకాతీతమయిన-సమీక జయ ఉన్నతిచేన్ = యుద్ధమందలి గెలుపుయొక్క గొప్పతనము చేత. వినయ అన్వితుఁడై = అడకువతోఁ గూడుకొన్నవాఁడై.

గదునియాగమనము.

ఉ. అంతట నొక్కనాఁడు మధుసూదన్ యదువంశభవుండు రుక్మిణీ
కాంతుఁడు కూరిమిం బనుపఁగాఁ గుశలం బరయంగ వచ్చి యే
కాంతపువేళ ద్వారవతియందలి వార్తలు దెల్పుచున్ దటిత్
కాంతిమనోహరాంగు లగు కన్నెల చక్కఁదనంబు లెన్నుచున్. 96

సుభద్రావర్ణనము.

పం. కనన్ సుభద్రకున్ సమంబు గాఁగ నేమృగీవిలో
కనన్; నిజంబుగాఁగ నే జగంబునందుఁ జూచి కా
కనన్; తదీయ వర్ణనీయ హావ భావ ధీ వయః
కన న్మనోజ్ఞ రేఖ లెన్నఁగాఁ దరంబె గ్రక్కునన్! 97

ఉ. ప్రాయపుఁ డెక్కునన్ జెలువపల్కులు చిల్కల గారవించుఁ, గం
దోయి చకోరపాళి దయతోఁ బెనుచుం, జనుకట్టు మచ్చికల్
సేయు సదా రథాంగయుగళిన్, నడ లంచల బుజ్జగించు; నౌ,
నేయెడ నింపు గావు గణియింప నవీన వయోవిలాసముల్! 98

నరుఁడు=అర్జునుఁడు. అమానుషచర్యన్=మనుష్యులకు అలవిగాని నడువడిచేత.

96. యదువంశభవుండు=యాదవుఁడు. రుక్మిణీకాంతుఁడు=శ్రీకృష్ణుఁడు. అరయంగన్=విచారించుటకు. తటిత్ కాంతి మనోహర అంగులు=మెఱపుయొక్క జిగిచేత రమణీయమయిన మేనుగలవారు.

97. ఏ మృగీవిలోకనన్=ఆఁడు లేడి కనులవంటి కనులుగల దానిని ఎవతెనుగాని (ఏసుందరిని గాని అనుట). నేన్...అనన్=నేను లోకమందంతటను చూచిగాని చెప్పవాఁడనుగాను. గ్రక్కునన్=కటాలున. తదీయ—ఖలు=ఆమెవయిన పొగడఁదగినవైన హావము భావము బుద్ధి ప్రాయము (కనత్=)ప్రకాశించుచున్న మనోహరమయిన సౌందర్యవిశేషములను - (మదనవికార మెఱుఁగని మనస్సునందు మదనవికారముయొక్క జననమాత్రము భావ మనఁబడును. భ్రూనేత్రాది చలనములచే సంభోగేచ్ఛ తెలియం నట్టి యల్పసంలక్ష్యభావమే హావ మనఁబడును.)

98 ప్రాయపు టెక్కునన్ = ఎలజవ్వనంపు విలాసము చేత. చెలువ=సుభద్ర యొక్క. గారవించున్—దయతోఁ బెనుచున్—మచ్చికలు సేయున్—బుజ్జగించున్—ఈ

చ. అతివ కుచంబులున్ మెఱుఁగుటారును వేనలియున్, ధరాధిపో
న్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యుదయంబు, నిప్పు డొం
దితి మని పూటపూటకిని నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడున్!
క్షితి నటు గాదె యొక్కొకరికిన్ నడుమంత్రపుఁగల్మి కల్గినన్. 99

సీ. కేళికాసరసిలోఁ దేలి యాడుటఁ జేసి
శైవాలలత కొంత సాటి వచ్చుఁ,

పదములు సామ్యమును చెప్పను—పోలును అని తాత్పర్యము. కన్దోయి=కనుఁగవ. చకోర పాళిన్=వెన్నెలపులుఁగులగుంపును. రథాంగయుగళిన్ = జక్కవకవను. మచ్చికల్= మాలిమి. నడలు=నడకలు. అంచలన్ = హంసలను. బుజ్జగించున్ = లాలనసేయును. (కీరవాణి - చకోరాక్షి - కోకస్తని - అంచయాన అనుట). ఇంపు=మనోహరము. నవీన వయో విలాసముల్=ఎల ప్రాయముయొక్క శృంగార చేష్టలు - వయస్సు అనఁగా పక్షి యుం గావున - నూతన = క్రొత్తలయిన - వయః = పక్షులయొక్క - అనఁగా కీర - చకోర - కోక - హంసలయొక్క - విలాసములు=క్రీడలు - అని యర్థాంతరము,

99. అతివ=సుభద్రయొక్క - కుచంబులున్=స్తనములును, మెఱుఁగుటారును =మెఱుఁగుగలిగిన నూఁగారును, వేనలియున్ = కొప్పును, ధరాధిప ఉన్నతియున్= భూపతియొక్క ఔన్నత్యమును, అహీన భూతి కలనంబున్=తక్కువ కాని యైశ్వర్యము యొక్క ప్రాప్తిని, ఘన అభ్యుదయంబున్ = శ్రేష్ఠమైన శ్రేయస్సును, (ధరాధిప = పర్వతశ్రేష్ఠములయొక్క - ఉన్నతియున్=ఔన్నత్యమును, అహీ ఇన=సర్పశ్రేష్ఠము యొక్క - భూతి = సంపదయొక్క - కలనంబున్ = ప్రాప్తిని, ఘన = మేఘ ములయొక్క - అభ్యుదయంబున్=శోభనమును, అని శ్లేష.) ఇప్పుడు=ఈమెకు యౌవ నము వచ్చిన యీ కాలమందు. ఇక్కడ పర్వతములకు స్తనములకును, సర్పమునకు నూఁగారునకును, మేఘమునకు కొప్పునకును, సామ్యమనియు, క్రమాలంకారమనియుం, తెలియునది. నిక్కెడున్ - నీల్గెడున్ - విఱ్ఱవీఁగెడున్ - అనుపదములకు గర్వపడు చుండును అని లక్ష్యార్థము నిక్కెడున్ అనఁగా కుచములు పైకి నిక్కఁబొడుచుకొని యుండు ననియును, నీల్గెడున్ అనఁగా నూఁగారు నాభి మొదలు స్తనములవఱకు సాఁగి యుండు ననియును, విఱ్ఱవీఁగెడున్ అనఁగా కొప్పు గొప్పదిగా నుండు ననియును భావము. నడుమంత్రపుఁగల్మి = మొదట లేక మధ్యను వచ్చిన భాగ్యము. అటు గాదె = నిక్కుట నీల్గుట విఱ్ఱవీఁగుటయే గదా కలుగును. ఇట నడుమంత్రపు కల్మి అనఁగా స్తన ములు నూగారు కొప్పు అనువీనికి బాల్యమున లేక యౌవనమందు సమృద్ధి వచ్చుట.

100. (౧) కేళికాసరసిలోన్=జలక్రీడల కొలనిలోపల; శైవాల లత=నాఁచుఁ

క. అయ్యారే! చెలు వెక్కడ! నయ్యారే గెలువఁజాలు నంగజునారిన్
వెయ్యాఱులలో సరి లేదయ్యా రుచిరాంగరుచుల నయ్యంగనకున్.

క. కడు హెచ్చు కొప్పు; దానిం
గడవం జనుదోయి హెచ్చు; కటి యన్నిటికిన్
గడు హెచ్చు; హెచ్చు లన్నియు,
నడుమే పస లేదు గాని నారీమణికిన్. 104

ఉ. అంగము జాళువా పసిఁడి యంగము; క్రొన్నెల వంక నెన్నొసల్;
ముంగురు లింద్రనీలముల ముంగురు; లంగజు డాలు వాలుఁజూ
పుంగవ; యేమి చెప్ప! నృప పుంగవ, ముజ్జగ మేలఁ జేయు న
య్యంగనఁ బోలు నొక్కసకియుం గనఁ బో నెఱ మించ నన్నిటన్.

అనున్=చదరంగపుఁబరిభాషప్రకారము షహా పెట్టును - తిరస్కరించును - అనుట - రాజశబ్దమునకు చంద్రుఁడు నర్థము గనుక రాజు అని అను నని అర్థాంతరము-[కొందఱు-కొన్ని శబ్దములందు క్రార వికల్ప మగుటంబట్టియు, శ్లేషయందు అర్థానుస్వారమునకు పాటింపు లేనందునను - తోసి=త్రోసి - రాన్=వచ్చుటకు-చనున్=తగును - అనియు వివరింతురు ] ముఖము చంద్రునిం బోలియున్న దని భావము.

103. అయ్యారే=శభాసు! చెలువు=(ఆ) చక్కఁదనము-(చెలువ ఎక్కడన్ = ఆ సుందరి యెక్కడ ఇతర స్త్రీలెక్కడ అనియును.) అయ్యారే = అనూఁగారే. అంగజు నారిన్=మన్మథుని వింటియల్లెత్రాటిని - అనఁగా - తుమ్మెదచాలును - మన్మథుని భార్యను రతీదేవిని అని యర్థాంతరము. వెయ్యాఱులలోన్=వేలకొలఁది (అనఁగా అధికసంఖ్యగల) స్త్రీలలోఁగాని ఆఱులకొలఁది (అనఁగా అల్పసంఖ్యగల) స్త్రీలలోఁగాని, రుచిర అంగ రుచులన్=ప్రకాశించుచున్న అవయవ కాంతులచే, అయ్యంగనకున్= ఆసుభద్రకు.

104.—కడవన్ = అతిశయించునట్లుగా. కటి = పిఱుఁదు.

105.—అంగము = ఆమెయొక్క శరీరము, జాళువా పసిఁడి యంగము=జాళువా దేశపుఁ గుందనపుబంగారముయొక్క యందము ; నెన్నొసల్ = శ్రేష్ఠమైన అలాటము, క్రొన్నెల వంక = (విదియనాఁటి) క్రొత్త చంద్ర రేఖ; ముంగురులు = నొసలిపైనుండు చిఱుకెంద్రుకలు, ఇంద్రనీలముల=ఇంద్రనీలమణులయొక్క - మున్ = మొందటి=మొదటి-గురులు=ఉపాధ్యాయులు; వాలుఁజూపుంగవ = వాలికగల కనుదోయి, అంగజు డాలు=మన్మథుని కేతనము - అనఁగా మీనము; నృపపుంగవ=ఓరాజ

ఉ. ఎక్కడఁ జెప్పినాఁడఁ దరళేక్షణ చక్కఁదనమ్ము లింక ? న
మ్మక్క ! యదేమి నంగ ! నిపు డందుల తాంశము దెల్ప లేదు నే;
నొక్కొకయంగ మెంచ పలయుం బదివేలము ఖంబు; లాయెఁ బో!
చొక్కపుఁ జూపులో సొలపు చూచినఁ గాక యెఱుంగవచ్చునే ? 106

చ. అని బహుభంగులం బొగడ నంగన ముంగల నిల్చినట్లుఁ, దాఁ
గనుఁగొని నట్లు, నై, నృపశిఖామణి డెందమునందుఁ బట్టఁ జా
లని యనురక్తి నవ్వరవిలాసిని నెన్నఁడు చూడఁ గల్గునో
యని తలఁకించుచున్న సమయమ్మున గ్రక్కున దైవికమ్మునన్. 107

## అర్జునుని తీర్థయాత్ర.

మ. ఒక భూమీదివిజుండు చోరహృత ధేనూత్తముఁడై వేఁడికొం
టకుఁ దా ధర్మజు కేళిమందిరముదండం బోయి కోదండ సా
యకముల్ దెచ్చుటఁ బూర్వక్లప్త సమయ న్యాయానుకూలంబుగా
నొకయేఁ డుర్వి ప్రదక్షిణం బరుగు నుద్యోగంబు వాటిల్లినన్. 108

శ్రేష్ఠుఁడా, కాంతి=సౌందర్యము, అన్నిటన్=సకల లక్షణములచేతను, మించన్ = అతిశయించునట్లుగా, ముజ్జగము ఏలఁ జేయు= (స్వర్గమర్త్యపాతాళము లనెడు) మూఁడులోకములను ఏలునట్లు చేయునట్టి - అనఁగా అట్టిశుభలక్షణములు కలట్టి - (పా.—ముజ్జగ మెల్లఁ జేయు = మూఁడులోకము లను విలువగా నిడఁదగినట్టి), అయ్యంగనన్ పోలు=ఆ సుందరికి సమానమైనట్టి, సకియన్ = స్త్రీని, కనను పో=నేను చూడలేదు సుమా.

106. తరల ఈక్షణ = చంచలాక్షి యొక్క. చొక్కపుఁ జూపులో సొలపు= సొగసైన చూపులో నుండెడి యొయ్యారము.

107.—బహుభంగులన్ = అనేక ప్రకారముల. నృపశిఖామణి = రాజశ్రేష్ఠుఁడు (అర్జునుఁడు). డెందమునందున్=మనస్సులో. అనురక్తిన్ = ప్రేమతో. అవ్వర విలాసినిన్ = ఆ యుత్తమ విలాసవతిని.

108.—భూమీదివిజుండు = బ్రాహ్మణుఁడు. చోర హృత ధేనూత్తముఁడై = దొంగలచే హరింపఁబడిన శ్రేష్ఠమైన యావుగలవాఁడై. తాన్=అర్జునుఁడు. కేళిమందిరముదండన్ = క్రీడాగృహముచెంతను. కోదండ సాయకముల్ = వింటిని అమ్ములను. తెచ్చుటన్=తెచ్చినందులకు. పూర్వక్లప్త సమయ న్యాయ అనుకూలంబుగాన్ = పూర్వ

ఉ. అన్నకు మ్రొక్కి 'తీర్థ భజనార్థముగాఁ జనియెదన్' నంచుఁ దా
విన్నప మాచరించుటయు, 'విప్ర హితమ్మునకన్న ధర్మ మే
మున్నది? గోప్రదక్షిణమె యుర్వి ప్రదక్షిణ' మంచు నిట్టు లే
మన్నను, మాన కన్నరుఁడు ప్రార్థన సేయఁగ నెట్టకేలకున్. 109

చ. తనదు పురోహితుం డయిన ధౌమ్యునితమ్ముని గారవంపు నం
దనుని విశారదున్ సకల ధర్మవిశారదు వెంటఁ బోవఁగా
నొనరిచి, కొండఱన్ బరిజనోత్తములన్ నియమించి, యాదరం
బెనయ సమస్త వస్తువులు నిచ్చి, యుధిష్ఠిరుఁ డంపె వేడుకన్. 110

చ. పరిణయ మాటకేఁగు గతిఁ బౌరు లనేకులు వెంట రా, శుభో
త్తరముగ నయ్యెడం గదలి, తద్దయుఁ దాలిమి మీఱ ధర్మశ
త్పరుఁ డయి యందు నందు నరపాలురు కాన్కలొసంగఁగా, నిరం
తరమును బుణ్యతీర్థములఁ దానము లాడుచు నేఁగి యవ్వలన్. 111

గంగాస్నానము.

భు. సునాసీరసూనుండు సూరిన్ నిమజ్జ
జ్జనౌఘోత్పతత్పంకశంకాకరాత్మో

మందు నిర్ణయించుకొనఁబడిన నియమ పద్ధతికిఁ దగినట్లుగా. ఉర్వి = భూమికి. అరుగు నుద్యోగంబు = పోవుపని. పాటిల్లినన్ = సంభవింపఁగా.

109. భజన = సేవ. చనియెదన్ = పోయెదను. తాన్ = అర్జునుఁడు. ఆచరించుటయున్ = చేయఁగా. విప్ర హితమ్మునకన్నన్ = బ్రాహ్మణులకు మేలుసేయుట కన్న. గో...ము = ఆవును ప్రదక్షిణించిన భూమిని ప్రదక్షిణించిన ఫలమే కలుగును.

110. గారవంపు నందనునిన్ = ప్రియపుత్త్రుని. విశారదున్ = తెలిసిన. విశారదున్ = విశారదుఁ డనువానిని. వెంటన్ = అర్జునునితో. ఎనయన్ = మించఁగా.

111. పరిణయము = పెండ్లి. ఆటకున్ = ఆడుటకు. ఏఁగుగతిన్ = పోవువిధమున. పౌరులు = ఊరివారు. శుభోత్తరముగన్ = శుభము వెంటనే అగునట్లు, తద్దయున్ = మిక్కిలి. తాలిమి = ఓర్పు. తానములు ఆడుచున్ = స్నానములు చేయుచు.

112. సునాసీరసూనుండు = దేవేంద్రపుత్త్రుఁడైనయర్జునుఁడు. నిమ...త్రిన్ — నిమజ్జత్ = మునిఁగి స్నానముసేయుచున్న - జన ఓఘ = జనసమూహమునుండి - ఉత్పతత్ =

ర్మి నిర్మగ్న నీరేజ రేఖోన్నమ ద్భృం
గ నేత్రోత్సవ శ్రీని గంగాభవానిన్. 112

క. సంతోషబాష్పధారలు । దొంతరగాఁ జూచి మ్రొక్కి తోయధివరసీ
మంతిని నా త్రిజగద్దీ । వ్యంతిని భాగీరథీ స్రవంతిని బొగడెన్. 113

శా. తా నైరింపక పర్ణ యుండఁగ భవద్గర్భమునం దాల్చి తే
జోఽసహ్యున్ శరజన్ముఁ గాంచి యల నీహార క్షమాభృత్కుమా
రీ సాపత్న్యముఁ గన్న మోహపుఁ బురంధ్రీరత్న మౌ దీవు; కా
వే సర్వజ్ఞుఁడు నిన్ను నేల దలపై నెక్కించుకో జాహ్నవీ ? 114

క. వెల్లు వెగఁ జల్లు విస మా । తెల్ల దొర కుతిక మోవఁ దిని బ్రతుకుట నీ

ఎగురుచున్న - పంక=పాపమో అను - శంకా=సందేహమునకు - ఆకర=ఆస్పదమైన - ఆత్మ=స్వకీయములయిన - ఊర్మి=తరంగములయందు - నిర్మగ్న=మునిఁగియున్న - నీరేజ రేఖా=పద్మశ్రేణినుండి - ఉన్నమత్=పైకిలేచుచున్న - భృంగ=తేంట్లుగలదిగనుక - నేత్రోత్సవ=కన్నులపండువైన - శ్రీన్=శోభఁగలదైన - గంగా భవానిన్ = భవునకుఁ బత్నియైన గంగను - అందుండి లేచుచున్న తుమ్మెదలబారు పాపములపంక్తియో యన నొప్పుచుండె ననుట - గంగ పాపహారిణి యని తాత్పర్యము.

113. దొంతర గాన్=వెంబడివెంబడిగా స్రవించుచుండఁగా. తో...తినిన్— తోయధి=సముద్రునియొక్క-వర సీమంతినిన్=శ్రేష్ఠమైన భార్యయు, (అ) త్రిజగత్ దీవ్యంతినిన్=స్వర్గమర్త్య పాతాళములయందు ప్రకాశించుచున్నదియు, (అగు), భాగీరథీ స్రవంతినిన్ = భాగీరథి అను పేరుగల (యా) నదిని.

114. జాహ్నవీ=ఓగంగాదేవీ, ఈవ = నీవే, అపర్ణ = పార్వతి, తాన్=తాను, సైరింపక=చూపోపక, ఉండఁగన్. తేజః అసహ్యున్=తేజస్సుచేత సహింప నలవిగాని, శరజన్మున్=తెల్లుచూలి యయిన కుమారస్వామిని, భవద్గర్భంబునం దాల్చి = నీగర్భమందు ధరించి, కాంచి=కని, అల=ఆ - నీహార క్షమాభృత్ కుమారీ = మంచుకొండ పుత్త్రిక యైన పార్వతియొక్క - సాపత్న్యమున్=సవతితనమును, కన్న=పొందిన - మోహపు పురంధ్రీరత్నము, ఔదు=వలపుగలిగిన శ్రేష్ఠురాలవైన కుటుంబినివి ఔదువు, కావేని= అట్లు కానియెడల. సర్వజ్ఞుఁడు = సర్వముఁ దెలిసిన యీశ్వరుఁడు,...ఎక్కించుకోనేల. ఇట గంగను శివుఁడు జటాజూటమునం దాల్చి యుండుటయు, కుమారస్వామి గంగలో శరవణమందు జనించి గాంగేయుఁ డగుటయు ననుసంధేయములు.

115. వెల్లు వెగఁ జల్లు విసము=అధికమైన వేఁడిని వెదజల్లుచున్న కాలకూటమును.

చల్లఁదనమ్మునఁ గాదే। కల్లోలవతీమతల్లి, గంగా, తల్లీ. 115

క. పువ్వారుఁబోఁడి వై, సరి
యెవ్వా రన, భీష్ముఁ గాంచి యిం పొందితి వీ;
వవ్వావి యెఱుఁగుదు వె మా
యవ్వా, పోషింపఁ బాడి యగు నను నీకున్. 116

చ. సకలశుభమ్ము లిమ్మనుచు సన్నుతు లీగతిఁ జేయ, నాస్రవం
తిక దయఁ దెల్పఁ బంచినగతిం జను దెంచె నుదంచ దూర్మికా
నికర విలోల ఖేల దళినీ కలగాన లసత్ ప్రఫుల్ల హ
ల్లక సుఖదోలికా విహృతి లాలస బాలసమీర మయ్యెడన్. 117

క. చను దెంచిన, హా! యని య
జ్జననాయకుఁ డలరుచున్ విశారదుఁ గని, 'యీ
యనుకూల మారు తాగతిఁ
గనుఁగొన నామోదసూచకం బైనదిగా. 118

ఆ తెల్లనిదొర = ఆ శివుఁడు. కుతికపోవన్=కంఠమువఱకు (కడుపునిండ అనియు.) కల్లోలవతీ మతల్లి=నదీ శ్రేష్ఠమా.

116. పువ్వారుఁబోఁడివి=పువ్వువంటి మేనుగలదానవు.

117. సన్నుతులు=స్తోత్రములు. ఆస్రవంతిక=ఆ(గంగా)నది, దయఁ దెల్పన్ పంచిన గతిన్=తనదయను గ్రహమును తెలుపుటకై పంపించినదో యనునట్లుగా, అయ్యెడన్= అసమయమున, ఉదం...రము—ఉదంచత్=మిక్కిలి ప్రకాశించుచున్న - ఊర్మికా= తరంగములయొక్క-నికర=సమూహమందు - విలోల=మిక్కిలి తూఁగుచున్నవియును - ఖేలత్ = క్రీడించుచున్నవియు-(అయిన) - అళినీ = తేఁటిపెంఁడులయొక్క - కల= అవ్యక్తమధురమైన - గాన=సంగీతము చేత - లసత్=ఒప్పుచున్న - ప్రఫుల్ల=లెస్సగా వికసించిన - హల్లక = ఎఱ్ఱకలువలనెడు - సుఖదోలికా = సౌఖ్యమైన తొట్లయందలి - విహృతి=విహారమందు - లాలస=ఆసక్తిఁగల - బాలసమీరము=పిల్లవాయువు, చనుదెంచెన్. సమీరమునకు బాలత్వము చెప్పుటవలన - ఎఱ్ఱగలువలనెడి తొట్లయందు ఊఁగుటకు వేడుకపడుటయు, గంగాదేవిచేత కరుళ్లనెడు చేతులతో ఊఁపఁబడుటయు, తుమ్మెదలగాన మను లాలిపాటలచేత నొప్పుచుండుటయు, అను బాల్యధర్మములు సూచితములు.

118. మారుత ఆగతిన్=గాలియొక్క రాకను. కనుఁగొనన్ = ఆలోచింపఁగా.

క. 'తల నీ గంగాతీర్థము। చిలికినవాఁ డీశ్వరుండు; చేరెఁడు లోఁ గోఁ
గలిగినఁ, దరఁగలఁ దేలం। గలిగినఁ, దన్మహిమ లెన్నఁ గాఁ దర మగునే!

క. 'మునుకలు గంగానదిలో
నొనరించుటకన్న భాగ్య మున్నదె?' యనుచున్,
మును కలుగంగా దిగి పరి
జనములు కైలా గొసంగ స్నానోన్ముఖుఁ డై. 120

క. తమి నిగుడ గుడాకేశుం
డమరనదీ విమలవారి నాడుచు నుండన్,
యమునానదిఁ గూడిన తో
యము నా నది తనరెఁ దత్కచామేచక మై. 121

ఉ. దానము లెన్ని యే నచటి తైర్థిక భూసుర సంఘ మెల్ల డెం
దాన ముదమ్ము చెందఁగ నొసర్చి, దృఢవ్రతచర్య నిత్యముం
దానము చేయుచున్, హరికథాశ్రవణం బొనరించుచుండె నం
దా నముచి ద్విషత్తనయుఁ డాశ్రిత కల్పమహీరుహం బనన్. 122

* ఆమోద సూచకంబు=పరిమళమును (సంతోషము నని యర్థాంతరము) తెలియఁజేయునది.

119. చిలికినవాఁడు=చల్లుకొన్నవాఁడు-ఈశ్వరుండు=ఈశ్వరతుల్యుఁ డగును - (శివుఁడు గంగను శిరమున దాల్చియున్నాఁ డని ధ్వని). లోన్ = లోపలికి, కోన్= పుచ్చుకొనుటకు. తరఁగలన్=తరంగములయందు.

120. మునుకలు=మునిఁగిచేయుస్నానములు. మును కలుగంగాన్ = (తానే) ముందుగా. కైలాగు=చేయూఁత. ఉన్ముఖుఁడై =అభిముఖుఁడై.

121 తమి నిగుడన్ = ఆసక్తి అతిశయించుచుండఁగా, గుడాకేశుఁడు - (గుడాకా = అలస్యమునకు - ఈశుఁడు = దొర - అనఁగా అలసతలేని వాఁడు) అర్జునుఁడు, అమ...రిన్— అమరధునీ = దేవనదియొక్క - విమలవారిన్ = నిర్మలమైనయుదకమునందు, ఆడుచున్ = స్నానమాడుచు, ఉండన్, యమునానదిన్ గూడిన, తోయము = విధము (జలము అనియు, నాన్ = అనునట్లుగా, త...మై— తత్ = అతనియొక్క - కచ=కురులచేత - ఆ మేచకమై = అంతటను నలుపుగలిగినదై, నది=గంగానది, తనరెన్—యమునాజలము నలు పని యెఱుంగవలయును.

122. ఆ నముచి ద్విషత్ తనయుఁడు = నముచి యను నసురునికి శత్రువగు

## ఉ లూ పి క థ.

క. భోగవతినుండి యెప్పుడు
భాగీరథికడకు వచ్చి భాసిలు ము న్నే
నాగకుమారిక, యరయ్యల
నాగ యులూపి తమి నొక్కనాఁ డటఁ జెంతన్. 123

గీ. హిమకర సైక సైకతమునందు విహరించు
కైరవేషువేషు ఘననిభాంగు
నెనరు దవుల దవులనే చూచి, క్రీడిగా
నెఱిఁగి యౌర! యౌరగేందువదన. 124

క. మును ద్రౌపదీస్వయంవర,
మున కేఁగిన కామరూప భోగులపలనన్
విని యున్న కతనఁ దమకము
మనమునఁ బెనగొనఁగఁ జేరి మాయాన్విత యై. 125

ఉ. గు ట్టసియాడ, గబ్బి చనుగుట్టలపైఁ బులకాంకురావళుల్
తెట్టువగట్టఁ, గోరికలు దేటలు వెట్టఁగ, వేడుకల్ మరిన్

నింద్రుని పుత్త్రుఁడయిన యర్జునుఁడు. ఎన్నియేని = పెక్కింటిని. తై...మూ=తీర్థవాసు లగు బ్రాహ్మణుల సమూహము. అశ్రి...ంబు=ఆశ్రితులకు కల్పవృక్షము.

123. భోగవతినుండి=భోగవతియను పేరుఁగల సర్పరాజధానినుండి.ఎప్పుడున్= నిత్యముగా. తమిన్=కోరికతో. చెంతన్=సమీపమున.

124. హిమ కర=మంచు తడిచేత - ఏక=ముఖ్యమైన - సైకతమునందున్=ఇసుక దిబ్బయందు, కైరవ ఇషు=(తెల్లగలువ బాణముగాఁగల) మన్మథునియొక్క - వేషన్= వేషముగలవానిని. ఘననిభ = మేఘముతోసమానమైన - అంగున్ = దేహముగలవానిని. నెనరు తవులన్ = స్నేహభావము తగులుకొనునట్లుగా. దవులనే = దూరమునుండియే. క్రీడిగాన్=అర్జునుఁడని. ఔరగేందువదన—ఔరగ = సర్పజాతిసంబంధమైన-ఇందు వదన—చంద్రముఖి (ఉలూపి).

125. కామరూప భోగులపలనన్ = ఇష్టమైనరూపము (ధరింపఁ) గలవారగు సర్పములవలన. తమకము = కోరిక. మాయా అన్విత = మాయతోఁ గూడుకొన్నట్టిది.

దొట్టికొనంగ, నచ్చెరువు తొంగలి ఱెప్పల వీఁగ నొత్తఁగాఁ,
బెట్టిన దండ దీయక విభీతమృగేక్షణ సూచె నాతనిన్. 126

క. ఏణాక్షి నపుడు వెడవిం|గాణిం గని చకులరుఁదూపు గమిఁ జక్కెరదో
ఖాణముగాఁ గలిగిన కం|ఖాణపుదొర పింజ పింజ గాడఁగ నేసెన్. 127

ఉ. పైపయిఁ గౌతుకంబు దయివాఱి యుండఁగ, నంత మజ్జనం
బై పువుఁజప్పరమ్మున నొయ్యారముగాఁ గయిసేసి, దానలీ
లాపరతంత్రుఁడై, కలకలన్ నగుచుండెడిసవ్యసాచి నిం
ద్రోపలరోచిఁ జూచి తల యూఁచి యులూపి రసోచితంబుగన్. 128

క. 'సిగ సంపెఁగపూ లొసపరి
వగ, కస్తురినామ మొఱపు, వలెవా టౌగా!
సొగ సిటు లుండఁగవలె!' నని,
సొగసి లతాతన్వి యతనిసొగసు నుతించెన్. 129

126. గుట్టు=మర్మస్థానము. ఆసిరపాడన్=చలింపఁగా; పులక అంకుర ఆవళుల్ =పులకల మొలకల వరుసలు. చెట్టుపగట్టన్ = తెట్టతెట్టెలుగా నేర్పడఁగా. తేటలు వెట్టఁగన్ = తేరుచుండఁగా. తొట్టికొనంగన్ = హత్తుకొను చుండఁగా. అచ్చెరువు = అబ్బురపాటు తొంగలి ఱెప్పలన్ = వాలు కనుఱెప్పలను. వీఁగనొత్తఁగాన్ = తొలఁగఁద్రోయుచుండఁగా. పెట్టిన దండన్ = నడుముపై మోపిన బాహువును. విభీత మృగ ఈక్షణ=బెదరిన లేడి చూపులవంటి చూపులుగల దైన యులూపి.

127. ఏణ అక్షిన్=లేడికన్నులవంటి కన్నులుగలదైన యా యులూపిని. వెడ సింగాణిన్=వెఱ్ఱిచెఱకువింటిని, అలరుఁ దూపు గమిన్ = పువ్వు బాణ సమూహమును. ఖాణము = దాణా. కంఖాణపు=వాహనముగల. చక్కె...దొర = చిలుక నెక్కెడు మన్మథుఁడు. పింజ పింజ=పిడి వెనుక పిడి - గాడఁగన్=నాటునట్లు.

128. కౌతుకంబు = కుతూహలము. దయివాఱి = పొరలిపాఱి. మజ్జనంబు = స్నానము. పువుఁ జప్పరంబునన్ = పువ్వుల చవికెలో. కయిసేసి = సింగారించుకొని. దాన లీలా పరతంత్రుఁడు = ఈవియనెడు పనియందు ఆసక్తుఁడు. సవ్యసాచిన్ = అర్జునుని. ఇంద్ర ఉపల రోచిన్=ఇంద్రనీల మణుల కాంతి వంటి కాంతిగలవానిని. రస ఉచితంబుగన్ = (శృంగార) రసమునకుఁ దగినట్లుగా. [ఉలూపి యనియే నాగర భారతములం దున్నది.]

129. సిగన్ = జుట్టునందలి. సంపె...వగ = సంపెఁగపూలయొక్క సుందర

క. రాకొమరునెఱులు నీలపు
రాకొమరు నిరాకరించు, రాకాచంద్రుఁ
రాకొట్టు మొగము, కెంజిగు,
రాకుఁ గని పరాకు సేయు నారి పదంబుల్! 130

ఉ. తీరిచినట్టు లున్నవి గదే కనుబొమ్మలు, కన్ను లంటిమా
చేరలఁ గొల్వఁగావలయుఁ, జేతులయందము చెప్ప గిప్ప రా,
దూరులు మల్చివేసినటు లున్నవి, బాపురె! యొమ్మునందలి సిం
గారము! శేషుఁడే పొగడఁగావలె నీతని రూపరేఖలన్. 131

క. అకటా! నన్నితఁ డేలిన | నొకటా నచ్చికము లేక యుండఁగ వచ్చున్,
నికటామృతధారలు మరు | నికటారి మెఱుంగు లీతనికటాక్షంబుల్.

మైనతీరు. కస్తు...ఱపు = కస్తురినామముయొక్క (ఒఱపు=) సొంపు. వలెవాటు = మెలిపెట్టి పైచికొన్న యుత్తరీయము. సొగసు=సౌందర్యము. సొగసి = చొక్కినదై. లతా తన్వి = తీఁగవలె సన్ననిదైన యాయువతి. నుతించెన్ = మెచ్చుకొనెను.

130. రా...లు—రాకొమరు = రాజకుమారునియొక్క - నెఱులు = తల వెండ్రుకలు. నీలపురా=నీలమణులయొక్క - కొమరున్ = చక్కఁదనమును. రాకా చంద్రున్ = పున్నమచందమామను. రాకొట్టున్ = (రారా పోరా అని నీచపఱుచును) తిరస్కరించును. కెంజిగురాకున్=ఎఱ్ఱని చిగురుటాకును. పరాకు సేయుఁన్ = పరధ్యానముగా నుండుచు - సరకుసేయ దనుట. పదంబుల్ = పాదములు.

131. తీరిచినట్టులు = దిద్దినట్లుగా. గిప్పన్—నిందయందు పదాద్యక్షరమగు చకారమునకు 'గి' కారము వచ్చినది. ఊరులు = తొడలు. మల్చివేసినటులు = తిన్నగా తీర్చినట్లుగా. శేషుఁడే = వేయిముఖములు గల సర్పరాజే.

132 అకటా = అయ్యో. ఏలినన్ = పరిగ్రహించినయెడల ఒకటా= (ఒకటన్ అనుటకు గ్రామ్యము) ఏవిషయమందైనను - (లేక - ఒకటియా = ఒకటైనను). నచ్చికము = కొఱఁత. కటాక్షంబుల్ = క్రేగంటిచూపులు. నికట అమృతధారలు = సమీపమందున్న అమృత ధారలవంటివి - మరుని కటారి మెఱుంగులు = మన్మథుని కత్తుల కాంతులవంటివి - (రమణీయము లగుటచే ఆనందమును, కాంతిలేని మదనోద్దీపన సేయుటచేత శోకమును, కలిగించుచున్నవని భా.)

ఉ. ఆ దరహాసచంద్రికల యందము, నాప్తులమీఁదఁ జిల్కు న
త్యాదర శీతలేక్షణ సుధారసధారయుఁ, జూడఁజూడఁ నా
హ్లాదము గొల్పఁగాఁ గల కలాతుహినంబుఁ, దలంచి చూచినన్
మాదిరి సేయవచ్చు జననాథు మొగంబును జంద్రబింబమున్. 133

ఉ. ఊఁదుకపోవు శంఖము నహో గళరేఖ, శరాసనంబులన్
వాదుకుఁ బట్టి కన్బొమల వైఖరి వంకలు తీర్చున్, గటా
క్షోదయలీల సాయక సమూహములన్ విషమాస్త్రు గెల్చుఁ బో,
యేదొర సాటి యీ నరున కెన్నఁగ వీరవిలాససంపదన్. 134

ఉ. కమ్మని జాళువా నొరయఁ గల్గిన చెక్కులటెక్కువాఁడు, చొ
క్కమ్ము జాతికెంపు వెలగాఁ గొను మోవి మెఱుంగువాఁడు, స

133. దరహాస చంద్రికల = చిఱునవ్వు అనెడు వెన్నెలలయొక్క. అత్యాదర శీతల ఈక్షణ సుధారసధారలన్ = ఎక్కువ మన్ననగలిగినట్టి చల్లని చూపులనెడి యమృతధారలును. కళాతుహినాంశు = లావణ్యముయొక్క అతిశయము - షోడశకళల యొక్క అతిశయము. మాదిరి=సాటి.—ఇందు చంద్రబింబమునకును మొగమునకును జెప్పఁబడిన సామాన్య ధర్మముల నరయునది.

134 గళరేఖ=కంఠముయొక్క సౌందర్యము, శంఖమును=(మన్మథుని)శంఖమును, ఊఁదుకపోవన్ = తిరస్కరించును - (ఊఁది వేయును); కన్బొమల వైఖరి=భ్రూవిలాసము, శరాసనంబులన్ = (మన్మథుని) సింగిణివిండ్లను, వాదుకుఁ బట్టి = వివాదమునకు తలపెట్టి, వంకలు దీర్చున్ = వంకలుదిద్దును - (కుంటుబోఁ గొట్టును); కటాక్ష ఉదయ లీల = కడకంటిచూపులు పొడచూపు విధము, సాయక సమూహములన్ = బాణముల మొత్తములతో, విషమాస్త్రున్ = మన్మథుని (క్రూరములగు బాణములుగలవానిని అనియు భా.) ... ఈ నరునకున్ = ఈ యర్జునునకు. వీర విలాస సంపదన్=వీరుల విలాసములయొక్క భాగ్యమునందు. ఇందు తిరస్కారపదములకు తత్తదుపమాన నైసర్గిక వృత్తము ధ్వనిత మగుట రమణీయముగా నున్నది.— ఊఁదుక - వాదుకున్ జఘన్య ప్రయోగములు.

135. కమ్మని జాళువాన్=చక్కని మేల్మి బంగారమును, ఒరయఁగల్గిన = రాపాడ గలిగినట్టి - చెక్కుల టెక్కు వాఁడు=చెక్కిళ్ల యందము గలవాఁడు; చొక్కమ్ము=పరిశుద్ధము, జాతికెంపున్=పద్మరాగమాణిక్యమును, వెలగాన్ = (తనకు - అనఁగా మోవికి) మూల్యముగా, మోవి=పెదవి; ధనాధిపసూనునిన్=నలకూబరుని, రూపసంపదన్=రూప

త్క ష్మగురూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించువా,
డమ్మక చెల్ల! నాహృదయ మమ్మక చెల్లదు వీని కియ్యెడన్. 135

సీ. ముద్దాడవలదె యీ మోహనాంగునిమోముఁ
గండచక్కెరమోవి గలఫలంబు?
రమియింపవలదె యీ రమణుపేరురముపై
వలిగుబ్బపాలిండ్లు గలఫలంబు?
శయనింపవలదె యీ ప్రియునిసందిటిలోనఁ
గప్పుపెన్నెఱికొప్పు గలఫలంబు?
వసియింపవలదె యీ రసికునంకమునందుఁ
జెలువంపుజఘనంబు గలఫలంబు?
గీ. రాజసము తేజరిల్లు నీరాజుఁ గూడి
యింపుసొంపులు వెలయఁ గ్రీడింపవలదె
నాకలోకంబువారల కైన లేని
యలఘుతరభోగభాగ్యముల్ గలఫలంబు? 136

క. అని యింటి లువ్విళ్లూరెడు
మనమునఁ గోనియాడి, యంత మాపటివేళం

ముతోఁ గూడుకొన్న సంపదచేతను-అనఁగా రూపము చేతను ధనముచేతను, ధిక్కరించు వాఁడు=తిరస్కరించుచున్నాఁడు; నాహృదయము = నామనస్సును, అమ్మక చెల్లదు= అమ్మివేయక తప్పదు, అమ్మక చెల్ల=ఆశ్చర్యము.

136 ముద్దుఆడవలదె=ముద్దుపెట్టుకొనవలదా (ముద్ద అడ వలదె=ముద్దముద్దగా మ్రింగివేయవలదా అనియుం భావము). కండచక్కెర మోవి=కలకండవంటిమాధుర్యము గల యధరము. రమియింపన్=క్రీడింప. వలి గుబ్బ పాలిండ్లు = వట్రువలైన గుబ్బలవంటి కుచములు. శయనింపన్=పరుండ, సందిటిలోనన్=దండ చేతిమీఁద శిరస్సునుంచి ప్రక్కపాటుగా. అంకమునందున్=తొడమీఁద. జఘనంబు=పిఱుఁదు. నాకలోకంబు వారికిన్= స్వర్గలోకవాసులకు. అలఘుతర = మిక్కిలిఅధికములయిన, భోగభాగ్యముల్ = అష్ట భోగములును సంపదలును.

137. ఉవ్విళ్లూరెడు = కోరికలు కోరుచున్న. మాపటివేళన్ = సాయంకాల

గనుఁ బ్రామి చొక్కుఁ జల్లిన
యనువున నందఱు వితాకులై యుండంగన్. 137

చ. 'ఇటు జపియించినన్ విడుతునే నిను నే నిఁక' నంచు, జాహ్నవీ
తటమున సంధ్య వార్చి జప తత్పరుఁడై తగువాని యామినీ
విటకులశేఖరుం గొనుచు, వే పురికిం జని నిల్పె నట్టి యు
న్నటులనె మాయ యచ్చుపడ నల్లభుజంగి నిజాంగణంబునన్. 138

క. నిలిపిన, జప మెప్పటివలెఁ । జలిపినవాఁ డగుచుఁ బాకశాసని యంతం
దళుకుం బిసాళి వాలుం । దెలిగన్నులు విచ్చి చూచె నివ్వెఱతోడన్.

సీ. 'దట్టంపుఁదెలినీటి తరఁగచాల్ కడ గొత్తి
నెలఱాలజగతి దా నిలుచు టేమి ?
కొలఁకుఁదామర గందములఁ గ్రిందఁ బడవైచి
కలపంపుఁదావి దాఁ గవియు టేమి ?

సమయమందు. కనుఁబ్రామి = కనుకట్టుమాయచేసి. చొక్కుఁజల్లిన యనువునన్ = చొక్కుపొడుము చల్లిన(యెడల నెట్లగునో ఆ)ప్రకారముగా. వితాకులై=విభ్రాంతులై.

138. ఇటు...నిఁక - 'ఈజపాలు నాకడసాఁగవు' అనులోకోక్తి కనుసారముగా ప్రయోగము. జాహ్నవీ తటమునన్=గంగ యొడ్డున. జప తత్పరుఁడు=జపమందు ఆసక్తుఁడు. యామినీవిట కుల శేఖరున్=చంద్ర వంశ శ్రేష్ఠుని. పురికిన్=తన నగరమయిన భోగవతికి. అచ్చుపడన్=ఏర్పడఁగా. భుజంగి=నాగకన్యకయైన యులూచి (భోగాంగన అనియు.) నిజ అంగణంబునన్ = తనదైన యింటిముంగిటియందు.

139. చలిపినవాఁడు = కావించినవాఁడు. పాకశాసని = అర్జునుఁడు. తళుకుం బిసాళి = మెఱుపుగలిగి ప్రకాశించుచున్న - వాలుం దెలి కన్నులు = వాలికయు ధావళ్యమును గల నేత్రములను. విచ్చి = తెఱచి. నివ్వెఱతోడన్=మిక్కిలి అబ్బురపాటుతో.

140. (౧) తెలి నీటి తరగ చాల్ = తెల్లని (గంగా) జలముయొక్క తరంగ పంక్తిని, కడ గొత్తి = తొలఁగఁద్రోసి. నెల రాల జగతి=చంద్ర కాంతమణుల యరుఁగు. (౨) కొలఁకు తామర గందములన్ = కొలని తామరపూవుల పరిమళములను. కలపంపు తావి = (కస్తూరి మొదలైన పరిమళద్రవ్యములతోఁ గూడిన) శ్రీచందనపు వాసన. కవియుట = కమ్ముకొనుట. (౩) చిగురు జొంపపు = చిగురాకు గుత్తులుగల-

చివురుజొంపపుమావి జేబు మాయము సేసి
పసిఁడియుప్పరిగ దాఁ బ్రబలు టేమి?
నిద్దంపుటిసుమంతిన్నియపాన్పు దిగఁద్రావి
యలరులపాన్పు దా హత్తు టేమి?
గీ. మసమసకసంజకెంజాయ మలుఁగు వెట్టి
మిసిమికెంపులకాంతి దా మెఱయు టేమి?
మొదల నే గంగతటి నున్నయదియు లేదొ?
మాయయో కాక యిది?' యంచు మరలి చూడ. 140

సీ. తెళుకుఁగాటుకకంటి సొలపుఁజూ పెదలోనఁ
బట్టి యుండెడిప్రేమఁ బట్టి యీయఁ,
చికిలిబంగరువ్రాఁత జిలుఁగుటొయ్యారంపుఁ
బైఁట గుబ్బలగుట్టు బైట వేయ,
సొగసుఁగుచ్చెలసిటువగలు కన్నులపండు
గలుగ మాయపుఁగౌనుఁ గలుగఁ జేయ,
నిడుదసోగ మెఱుంగు జడకుచ్చు గరువంపుఁ
బిఱుఁదురేఖకు గెల్పుబిరుదు చాటఁ,

మావి జేబుల్=మామిడిచెట్లగుంపును. పసిఁడి యుప్పరిగ=బంగారపు మేడ. (౪) నిద్దంపు= తళుకుఁగల. దిగఁద్రావి=మాయముచేసి. అలరుల పాన్పు=పువ్వుల పఱుపు. హత్తుట = సమకూడుట.

మసమసక = మసకమసకఁబాఱుచుండెడు - సంజ కెంజాయ = సంధ్యాకాలపు టెఱ్ఱని కాంతి. మిసిమికెంపుల = ప్రకాశమానమైన పద్మరాగ మాణిక్యములయొక్క.

141. (౧) తెళుకు=తళుక్కుమని చలించుచున్న. సొలపుఁజూపు = దీనభావముగల చూపు. (౨) చికిలి బంగరు వ్రాఁత జిలుఁగు=తళుకుగల బంగారు (తీఁగలు బుట్టాలు పొందికలుగాగల) వ్రాఁతపనియొక్క చిక్కఁదనముగలిగినట్టి. పైఁట - కర్త, గుట్టు - కర్మ. (౩) కుచ్చెల=కుచ్చిళ్లయొక్క. మాయపుఁ గౌనుఁ గలుగఁ జేయుట=లేని నడుము ఉన్నదానినిగా చేయఁగా. (౪) జడకుచ్చు=జడ (చివర నుండెడు బంగారుకుప్పె చేసిన) కుచ్చు. గెలుపు బిరుదుఁ జాటుట=జయసంబంధమైన బిరుదును ప్రకటన చేయు

గీ: గంటసరి నంటుకస్తురి కమ్మవలపు
కప్పురపువీడియపుఁడావిఁ గలసి మెలఁగ,
నొఱపులకు నెల్ల నొజ్జ యై యుండె నపుడు
భుజగగజగామిని మిటారిపొలుపు మీఱి. 141

క. అటు లున్న కొమరుఁ బ్రాయపుఁ
గుటిలాలకఁ జూచి మదన గుంభిత మాయా
నటనంబో యిది గంగా,
ఘటనంబో యని విచారఘటనాశయుఁ డై. 142

ఉ. తియ్యనివింటివాని వెను తియ్యక డగ్గఱఁ జాలు న య్యసా
హాయ్యతనూవిలాసి దరహాసము మీసముఁ దీర్ప నప్పు డా
తొయ్యలివంకఁ గన్గొని 'వధూమణి, యెవ్వరివాన వీవు? వే
రెయ్యది నీకు? నొంటి వసియింపఁగఁ గారణ మేమి?' నావుడున్. 143

ఉ. మేలి పసిండిగాజులసమేళపుఁ బచ్చల కీల్కడెంపు డా
కేలు మెఱుంగుగబ్బిచనుఁగ్రేవకుఁ దార్చుచు సోగకన్నులం
దేలఁగఁ జూచి "యోయుదపతీనవమన్మథ, యీజగంబు పా
తాళమ, నే నలూపి యను నాన, భుజంగకులరాజకన్యకన్. 144

చుండఁగా (జయశీలురు గంటనుగాని కచ్చునుగాని బిరుదుగా వేసికొనుట ఆచారము.)

కంటసరిన్=మెడలోని హారమును. కస్తురి కమ్మ వలపు=కస్తూరియొక్క మనో హారమయిన పరిమళము ఒఱపులకున్ = కాంతులకు. ఒజ్జ=గురువు. భుజగగజగామిని= పాఁపవెలఁది. మిటారి పొలుపు మీఱి = శ్రేష్ఠమైన చక్కఁదనముచే నతిశయించి.

142. కొమరుఁ బ్రాయపు=లేఁత వయసుగల - కుటిల అలకన్ = వంకరలైన ముంగురులుంగల యువతిని. మదన = మన్మథునిచేత - గుంభిత = కూర్పఁబడిన - మాయా నటనంబో = ఇంద్రజాల ప్రవర్తనమో. గంగా ఘటనంబో = గంగయొక్క కల్పనయో. విచార ఘటనా ఆశయుఁడు = చింతయొక్క కూర్పుగల మదిగలవాఁడు.

143. తియ్యనివింటివానిన్ = మన్మథుని. అ అసాహాయ్య తనూ విలాసి = సమాన రహితమయిన శరీర సౌందర్యముగల యా యర్జునుఁడు. దర హాసము = చిఱు నవ్వు. తీర్పన్ = అలంకరించుచుండ. వధూ మణి=ఓ రమణీ రత్నమా.

144. మేలి...కేలు = మేల్మి బంగారపు గాజులతో జోడింపఁబడిన పచ్చల

క. సరిలేనివిలాసము గని । వరియించి టఁ దోడికొనుచు వచ్చితి ని న్నో
కురువీర, వసింపఁగ నీ । కులు వీర, దృఢాంకపాలిఁ గోరినదానన్. 145

ఉ. కుం పెసఁగన్ గటాక్షలవ మాత్రము చేతనె ముజ్జగంబు మో
హింపఁగఁ జేయు భార మిఁక నీవు వహించితి గానఁ, గేళినీ
చంపకగంధి బిత్తరపుఁ జన్నుల మీఁద సుఖించుచుండు నా
సంపెఁగమొగ్గముల్కి గడ సాములి సోమరి గాక యుండునే?" 146

క. అను నచ్చెలివాక్యములు
విని యచ్చెరు వంది "రూప విభ్రమ రేఖా
ఖను లెందు నాగకన్యలె
యని విందుము, నేఁడు నిక్క మయ్యెన్ జూడన్. 147

క. అన్నన్న! మొగము వెన్నుని
యన్నన్న జయించుఁ గన్ను లన్నన్ నలినా
సన్నములు, నడుము మిక్కిలి
సన్నము, మాటలు సుధాప్రసన్నము లెన్నన్. 148

కీలుకడియములు గలయట్టి యెడమచేయి. క్రేవకున్ = చెంతను. తేలఁగన్ = ఒయ్యారముగా. మదవతీ = యౌవనమదము గల యింతులకు.

145. వరియించి=వలచి. (ఓ) కురు వీర = కురుకుమారుఁడవైన పరాక్రమశాలీ. నీ కులువు = నీతోడను. ఈర=ఇయ్యరా. దృఢ అంకపాలిన్ = (నీ) బిగి కౌఁగిటిని. [పా.—దరి నీవిలాసముం గని.—వరియించిట - క్త్వార్థేకారసంధి.]

146. పంపు ఎసఁగన్=మైకము అతిశయించునట్లు గా. కటాక్ష లవ మాత్రము చేతనె=క్రీగంటిచూపుయొక్క లేశ మాత్రము చేతనే. కేళినీ చంపక గంధి=సంపెఁగ తావివంటి మేనితావి గలదైన రతీదేవియొక్క. సంపెఁగ మొగ్గ ముల్కి గడ సాములి= చంపక ముకుళము బాణముగాఁగల కోల సాదనగాఁడు (మన్మథుఁడనుట)—(పా. గడు సామలి—గడుసు=దిట్టరి - అము=అహంకారము - అలి = క్షయించి.) మదనకార్య భారమును నీవు వహించినందున మదనుఁడు విశ్రాంతి కలవాఁడై భార్యతోఁగూడి సుఖించుచు అలసుఁ డగు నని భా.

147. అచ్చెరువు=ఆశ్చర్యము. విభ్రమ = విలాస. ఖనులు = గనులు.

148. అన్నన్న = ఔరౌర. వెన్నుని = విష్ణుమూర్తియొక్క - అన్ను =

గీ. నువ్వుఁబువ్వు నవ్వు జవ్వనిఁ నాసిక,
చివురుసవురు జవురు నువిదమోవి,
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి,
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవ మేను. 149

క. రవరవలు నెఱపు నీలపు
రవ రవణముతోడఁ జెలి యరాళ కచంబుల్;
కవకవ నవ్వున్ వలి జ
క్కవకవఁ గలకంఠకంఠి కఠినకుచంబుల్. 150

ఉ. చెక్కులయందమున్ మొగముచెల్వముఁ జన్గవనీటు వేణితీ
రెక్కడ జూడ! మన్నిటికి నెక్కువ దే మన సైకతంబుతో
నెక్కటికయ్యముల్ సలుపు నొక్కటి యొక్కటి చాలదే మరుం
డక్క గొనన్, రతింగెలిచి డక్కఁ గొన, న్నవమోహనాంగికిన్!” 151

చ. అని మది మెచ్చి యొచ్చె మొకయందును లేని మనోహరాంగముల్
కనఁగొని 'యానె కా, వ్రతము గైకొని యుండెడినన్ను నేల దో

భార్యయైనలక్ష్మీదేవియొక్క-అన్నన్ = అన్నయైన చంద్రుని. నలిన = కమలములకు - అపన్నములు = చేరువచుట్టములు. సుధా ప్రసన్నములు = అమృతమంను దయగలవి.

149. ఉవిద=చెలువరొయొక్క. చివురు సవురున్ = చిగురుటాకుయొక్క సొగసును. జవురున్ = దండించును. బిబ్బోకవతి వేణి = సింగారియొక్క జడ. మబ్బు ఉబ్బున్ = మేఘముయొక్క గర్వమును. గెబ్బున్ = గెంటివేయును. తెఱవ = స్త్రీయొక్క - మేను = శరీరము. మెఱపు ఒఱపున్ = మెఱపుయొక్క కాంతిని. పఱపున్ = అవలకుఁ బాఱఁదోలును.

150. అరాళ కచంబుల్ = వంకలుగల తలవెండ్రుకలు, నీలపు రవ రవణముతోడన్ = నీలమణి శకలముల చక్కఁదనముతో; రవరవలు నెఱపున్ = జగడము సేయును. వలి జక్కవ కవన్ = గుండ్రని చక్రవాక యుగళమును.

151. చెక్కుల = చెక్కిళ్లయొక్క. చెల్వమున్ = సౌందర్యమును. సైకతంబుతోన్ = ఇసుకతిన్నెతో. ఎక్కటికయ్యముల్ = పెద్దజగడములు. ఒకటి = ఈపిఱుఁదు. మరుఁడు డక్కఁ గొనన్=మన్మథుని స్వపక్షునిఁ జేసికొనుటకును. డక్కఁ గొనన్ = ఢక్క అను వాద్యవిశేషమును వహించుటకును (జయభేరి వేయించుటకు.)

152. ఒచ్చెము = కొఱఁత. ఒకయందునన్=ఒకదానియందును. ఔనె కా=

డ్కొని యిటుఁ దెచ్చె నీ వెడఁగుఁ గోమలి? భుజగ మేడ, మారుతా
శనజగ మేడ? నేఁత ఘన సాహస మింతుల కెంచు నెంచుచున్. 152

క. 'కాముకుఁడ గాక వ్రతినై
భూమిప్రదక్షిణము సేయఁ బోయెడివానిం
గామించి తోడి తేఁ దగ
వా మగువ? వివేక మింత కైనన్ వలదా?' 153

ఉ. నావుడు మోమునన్ మొలచు నవ్వొలయన్, వలిగబ్బిగుబ్బచన్
దీవికిఁ గానటించుక నటించుకవున్ గనిపింప, బల్కె రా
జీవదళాక్షి "యో రసికశేఖర, యో జన రంజ నైక లీ
లావహరూప, యో నుత గుణా, తగునా యిటు లానతీయఁగన్? 154

క. నిను గీతి సాహితీ మో
హనవాణులు చెవులు వట్టి యాడింపంగాఁ
గని యుండి, 'కాముకుఁడఁగా,
న'ని పల్కిన నాకు నచ్చి కానె నృపాలా? 155

సరియే కాని. ఏల=ఎందులకు - తోడ్కొని=తనతోఁగూడ తీసికొని - ఈ యర్థమున 'దోడ్కొని' యని కళామాత్రముపై గసడదవాదేశము - (శ్లేషయందు అర్ధానుస్వార శకట రేఫములు గణనీయములు గావుగాన - ఏలన్=తన్ను నే నేలుటకై అని యర్థాంతరము.) ఈ వెడఁగుఁ గోమలి=ఈ వెఱ్ఱి పడుచు మారుతాశన జగము=నాగలోకము.

153. కాముకుఁడన్=కామించువాఁడను. వ్రతిన్ = నియమముఁ దాల్చినవాఁడను. తగవా = మర్యాదయా. మగువ = ఓచెలువా. వలదా=అక్కఱలేదా.

154 ఒలయన్ = వ్యాపింపఁగా. వలి గబ్బి గుబ్బ చన్ దీవికిన్=గుండ్రని దిట్టపు గుబ్బలవంటి చన్నులయొక్క. యౌన్నత్యమునకు. కానటు=కానియట్లు=సహింపలేనట్లుగా. ఇంచుక = కొంచెము. కవున్ = నడుము. రాజీవ దళ అక్షి = తామర రేకులవంటి కన్నులుగలయోలాపి. రసికశేఖర = రసజ్ఞులకు సిగదండ యగువాఁడా (గసజ్ఞశ్రేష్ఠుఁడా యనుట). నుత గుణా = కొనియాడఁబడిన గుణములు కలవాఁడా. జన...రూప = జనులను రంజించునట్టి ముఖ్యమయిన విలాసమును అవహించెడి సౌందర్యముగలవాఁడా. (అవహ - అని ప్లుతయతికై ఛేదము.)

155. గీతి...ణులు - గీతి = సంగీతము - సాహితీ = సాహిత్యము అను -

క. అతులిత విలాస రేఖా, కృతులన్ వలపించి యిటులఁ ద్రిభువనలీలా
వతుల నలయించు టేనా, వ్రత మనఁగా నీకు రూప వంచితమదనా!

చ. తెలియనిదానఁ గాను; జగతీవర, ద్రౌపదియందు నొకండు మీా
రలసమయంబు సేయుట, ద్విజార్థము ధర్మజుపాన్పుటింటిముం
గలఁ జని శస్త్రశాల విలు గైకొను, టందునిమిత్త మీావు ని
శ్చలమతి భూప్రదక్షిణము సల్పఁగఁ బచ్చుట, నే నెఱుంగుదున్.157

గీ. చెఱకువిలుకానిబారికి వెఱచి నీదు
మఱుఁగుఁ జేరితిఁ జేపట్టి మనుపు నన్నుఁ;
బ్రాణదానంబుకన్నను వ్రతము గలదె?
యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార! 158

మోహన = రంజించెడి - వాణులు = వాక్కులఁ స్త్రీలు (ఇక్కడ స్త్రీలింగశబ్ద స్వారస్యముచేత నాయికలుగా స్ఫురించుచున్నారు). చెవులు వట్టి యాడింపంగాన్=తమకు స్వాధీనునిఁగాఁ జేసికొని యుండఁగా-(చెవులు పట్టి=ఆలింపఁబడినవై - చెవులకు ఇంపై-ఆడింపంగాన్=ఆనందముచే తలయూఁచునట్లు చేయఁగా-అనియు) నచ్చిక=నమ్మకము. గీతి సాహితు లని మోహనబాణుల నిరువురనే చెప్పుటచే చెఱి యొక చెవి పట్టి యాడించి రని చమత్కారము.

156. అతులిత విలాస రేఖా అకృతులన్ = సాటిలేని శృంగార చేష్టలచేతను సౌందర్యముచేతను రూపముచేతను. త్రిభువన లీలావతులన్=(స్వర్గ-మర్త్య-పాతాళములనెడు) మూఁడులోకముల విలాసవతులను. అలయించుటేనా = ఆయాస పెట్టుటయేనా. వంచిత = తిరస్కరింపఁబడిన.

157. తెలియనిదానన్ = మూఢురాలను. జగతీవర = ఓరాజా. అల సమయంబు=(ఆమెను ఒక్కొక్కసంవత్సరము ఒక్కొక్క పాండవుఁడు కూడవలసినదనెడి) కట్టుఁబాటును. ద్విజార్థము=బ్రాహ్మణునికొఱకు. శస్త్రశాలన్=ఆయుధశాలయందు.

158. చెఱకున్=బంధనమునకును (ఖయిదునకు ననుట)-విలుకాని బారికిన్ = ధనుర్ధరుఁడై నన్ను గుఱిపెట్టుచున్న యొకానొకఁడు హింసకును-(చెఱకు విలుకాని బారికిన్=చెఱకు విల్లుగల మన్మథుఁడు పెట్టెడు హింసకు అనియు.) వెఱచి=జడిసి. నీదు మఱుఁగున్ చొచ్చితిని = నీచాటున దాఁగితిని (నిన్ను శరణుఁ జొచ్చితి ననుట.) చేపట్టి = అవలంబించి (పాణిగ్రహణము చేసి-) అని భా. మనుపు = బ్రతికింపుము.

ఉ. న్యాయమె నీకు మేల్పడిన నాతి నలంచుట? యంత్రమత్స్యమున్
మాయఁగఁ జేసి మున్ ద్రుపదనందన నేలవె? యంగభూపతా
కాయతయంత్రమత్స్య మిపు డల్లనఁ ద్రెళ్ళఁగ నేసి యేలుకో,
తీయఁగఁ బంచదార వెను తీయఁగఁ బల్కు ననున్ ద్వితీయఁగన్." 159

క. అనుడు నుడురాజకుల పా
వనుఁడు 'సమస్తమ్ము నెఱుఁగు వలఁతివి గద, యీ
యనుచితము దగునె? పరసతి
నెనయుట రాజులకు ధర్మమే యహిమహిళా?' 160

చ. అన విని పాఁపపూపజవరా లెదలో వల పాఁప లేక, యా
తని తెలిముద్దు నెమ్మొగము తప్పక తేట మిటారి కల్కి చూ
పునఁ దనివారఁ జూచి, "నృప పుంగవ, యిన్నిట జాణ వూరకే
యనవలసింటిగా, కెఱుఁగ వా యొకమాటనె మర్మకర్మముల్? 161

159. మేల్పడిన నాతిన్ అలంచుట = ఆపేక్షపడిన స్త్రీని శ్రమపెట్టుట. న్యాయమె = న్యాయ్యమా. యంత్ర మత్స్యమున్ = చేఁపరూపముగాఁ జేయఁబడిన యంత్రమును. మాయఁగఁ జేసి = మాయించి (కోలతోఁ గూల్చి యనుట - లేక - మాయ యగునట్లుచేసి - కూల్చి యనియే భా.) అంగభూపతాకా ఆయత యంత్ర మత్స్యము = మన్మథునియొక్క ధ్వజమగు గొప్పదైన కపటపుఁ జేఁపను అల్లనన్ = సులువుగా. త్రెళ్ళఁగన్ ఏసి = కూల్చి. ఏలుకో = ఏలుకొమ్ము. ద్వితీయఁగన్ = భార్యనుగా. [పతాకాయిత = ధ్వజముగా ఆచరించుచున్న - అనుపాఠమున యతిభంగము.]

160. అనుడున్ = అనఁగా. ఉడురాజకుల పావనుఁడు = చంద్రవంశమును పవిత్రముచేయువాఁ డయిన యర్జునుఁడు. వలఁతివి = ప్రౌఢవు. పరసతిన్ = ఒరు భార్యను. ఎనయుట = పొందుట. అహిమహిళా = ఓనాగ కన్యకా;

161. పాఁపపూపజవరాలు - పాఁప = సర్పసంబంధమైన - పూప = లేఁతవయస్సుగల - జవరాలు = పడుచు. ఎదలోన్ = మనస్సులోపల. వలపు = మోహమును. తెలి = తెల్లని. నెమ్మొగము = చక్కనిముఖమును. తేట మిటారి కల్కి చూపునన్ = తళుకుగల యొయ్యారపు సొగసుఁ జూపుచేత. తనివి ఆరన్ = తృప్తి తీరునట్లుగా. నృపపుంగవ = రాజశ్రేష్ఠుఁడా. జాణవు = చమత్కారివి. అనవలసి అంటి(వి) గాక = రూఢిచేసికొనుట మంచిదని అంటివే గాని. మర్మకర్మముల్ = మఱుఁగుపడియుండెడు భావములను.

ఉ. కన్నియఁ గాని వేఱొకతెఁ గాను; మనోహరరూప, నీకు నే
జన్నియ వట్టి యుంటి నెలజవ్వన మంతయు నేఁటిదాఁక; నా
కన్నులయాన; నా వలపుఁగస్తురివాసము తోడు; నమ్ము; కా
దన్నను, నీదు మోవి మధురామృత మానిట బాస సేసెదన్. 162

చ. ఇలపయి మత్స్యయంత్ర మొక యేటున నేసి సమస్తరాజులన్
గెలిచిన మేలువార్త లురగీవరగీతిక లుగ్గడింప, వీ
నుల నవి చల్లగా విని, నినున్ వరియింప మనంబు గల్గి, నీ
చెలువము వ్రాసి చూతు నదె చిత్తరువందు ననేకలీలలన్. 163

ఉ. చెప్పెడి దేమి నా వలపు చేసిన చేఁతలు? కొల్వులోన ని
న్నెప్పుడు గంటి, నప్పుడ పయింబడ నీడిచె; నిల్వఁ బడ్డపా
టప్పుడ దొంత యైయుఁ గల; దట్టి హాళాహాళి కింతసేపు నీ
వొప్పెడిదాఁకఁ దాళుట కదో! మది మెచ్చవు గా నృపాలకా!" 164

162.—కన్నియన్ = పెండ్లికాని పడుచను. మనోహర రూప = రమణీయమయిన రూపముగలవాఁడా (-రూపన్ అనియు భేదము - రమణీయమయిన రూపము గలదానను అని యర్థము) ఎలజవ్వనమున్ = లేఁతప్రాయమును. జన్నియ వట్టి యుంటిన్ = మీఁదుకట్టి యుంచితిని.(దేవతకు మీఁదుకట్టినవస్తువును జన్నియ అనుట వాడుక.) కన్నుల యాన = కన్నులమీఁది ఒట్టు. వలపు = పరిమళించుచున్న - (నామాట యసత్యమేని నాకన్నులుపోవును - కస్తురివాసము ధరించు యోగ్యత నాకు లేక పోవును అని భావము.) బాస = ప్రమాణము. నీదు...చేసెదన్ = విను ముద్రాంకి దివ్యప్రమాణము చేసినట్లు అని ధ్వని - ప్రమాణార్థము మనువు అధరామృతమాన నిచ్చిన నదియే తన కీప్సితసిద్ధి యని యుక్తియు చమత్కారమును.

163.—ఉరగీ వర గీతికలు = నాగ కన్యకల శ్రేష్ఠ గానములు. ఉగ్గడింపన్ = కొనియాడఁగా. వీనులన్ = చెవులతో. అవి = ఆ వార్తలు. చెలువము = చక్కఁదనమును. చిత్తరువందున్ = చిత్రపటమునందు.

164.—కొల్వులోనన్ = (గంగాతీరమందలి) సభలో. ఈడిచెన్ - వలపు కర్త. నిల్వన్ = పయింబడక యాఁగుటకై. పడ్డపాటు = పడినశ్రమ. హాళాహాళికిన్ = తత్తరపాటునకు. తాళుటకున్ = సైరించినందులకు.

గీ. అనిన, 'ఫణిజాతి వీ, వేను మనుజజాతి,
నన్యజాతిఁ బ్రవర్తించు టర్హ మగునె?
యేల యీకోర్కి?' యనిన రాచూలి కనియెఁ,
జిలువచెలువంపుఁ బల్కులఁ జిలువచెలువ. 165

ఉ. 'ఏ మనఁ బోయెదం దగుఁ మెంచక నీ విటు లాడఁ? దొల్లి శ్రీ
రాముకుమారుఁ డైన కుశరాజు వరింపఁడె మా కుముద్వతిన్?
గోమలచారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁ బెండ్లియాడఁడే?
నీమన సొక్కకే కరఁగ నేరదు గాని నృపాలకాగ్రణీ. 166

ఉ. ఈ కలహంసయాన నను నెక్కడి కెక్కడినుండి తెచ్చె! నా
హా! కడుదూర మిప్పు డని యక్కునఁ జేర్పక, జంపుమాటలన్
వ్యాకుల పెట్టు టేల? విరహాంబుధి ముంచక పోదు నన్; జలం
బే కద నీకు నంచి దిఁక నీఁతకు మిక్కిలి లోఁతు గల్గునే?' 167

చ. అని వచియించునప్పుడు, ముఖాబ్జము నంటెడి విన్నఁబాటు, చ
క్కని తెలిసోగకన్నుఁగవఁ గ్రమ్ముచు నుండెడి బాష్పముల్, గళం
బునఁ గనిపించు గద్గదిక, ముప్పిరి గొన్నవలవంతఁ దెల్ప, ని
ట్లను మదిలోఁ గరంగి రసికాగ్రణి యాకరభోరు భోరునన్. 168

165.—ఫణి = నాగ. రాచూలికిన్ = రాకొమరునికి చిలువచెలువ = నాగకన్యక. చిలువ చెలువంపుఁ బల్కులన్=చిలువలు పలువలుగల విలాసముతోఁ గూడుకొన్న పల్కులచేత.

166. ఏమనఁబోయెదన్=ఏమిచెప్పఁగలను. (ఏన్ = నేను-మనఁబోయెదన్= (బ్రదుకుదునా-అని కాకువుగ నేనియు-బ్రదుకను అని విపరీతలక్షణగా నేనియు నొండె). తగులము = మోహము. కుముద్వతిన్ = ఆపేరుగలకన్యను. కోమల చారు మూర్తి= మృదు సుందర స్వరూపుఁడు. నర్మదన్ = నర్మద అను పేరుగలదానిని.

167. ఈ కలహంసయాన=ఈ రాజహంసగమన. అక్కునన్=వక్షఃస్థలమునందు, జంపు మాటలన్ =ప్రొద్దుపుచ్చు మాటలచేత. విరహ అంబుధి = ఎడఁబాటనెడి సముద్రము. నన్ = నన్ను. చలంబే కద = మాత్సర్యమే కదా. ఈఁత...నే = మరణమే సంభవింపనుండఁగా అంతలో తక్కుదుఃఖములు లక్ష్యమా.

168. విన్నఁబాటు = ఖిన్నత్వము. గళంబునన్ = కంఠమునందు. గద్గదిక

ఉ. 'చక్కెరబొమ్మ, నావ్రతము చంకము దెల్పితి, నంతె కాక నీ
చక్కఁదనంబు గన్న నిముసం బయిన న్నిలుపోప శక్యమే
యక్కునఁ జేర్చ కాంచు దయ నానతి యీఁ, దల వంచె; నంతలో
నెక్కడనుండి వచ్చెఁ దరళేక్షణకున్ నునుసిగ్గుదొంతరల్! 169

ఉ. అంకి లెఱింగి యాసరసుఁ డంత 'వివాహవిధిజ్ఞుఁ డైన మీ
నాంకుఁ డొనర్చినాఁ, డిది శుభైకముహూర్తము, రమ్మ' టంచుఁ బ
ర్యంకము మీఁద నచ్చెలిఁ గరగ్రహణం బొనరించెఁ దన్మణీ
కంకణ కింకిణీగణ వికస్వర సుస్వరముల్ సెలంగఁగన్. 170

మ. ఒకమాణిక్యపుబొమ్మ యెట్టివగకీలో, జాళువా జాలవ
ల్లిక బాగాల్ కపురంపుటాకుమడుపుల్ దెచ్చి రాజాన్నచా

డగ్గుత్తిక (గద్గదస్వరము). ముప్పిరి కొను = మూఁడింతలైన - వలవంతన్ = మదన వ్యథను. తెల్పన్ — చెప్పఁబోటు చెప్పుచుండ గద్గదిక అను మూఁడును వంత మూఁడింత లగుటం దెలిపెడి ధ్వని. కరభోరున్ =(కరభమనఁగా మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మూలము వఱకుం గల చేతియొక్క బయటివైపు) కరభమువంటి ఊరువులు అనఁగా తొడలు గలయులూపితో. భోరునన్ = త్వరితముగా [కరభోరువున్-అని యుండవలయును - ప్రయోగము లేదు అసాధువు. 'భోరునన్' అసాధువు-'బోరనన్' అను రూపము సాధువు]

169. నిలుపు ఓపన్ —(నిలుపు = నిలుపుటను - ఓపన్ = సహించుటకు). ఆనతి ఈన్ = సెలవీయఁగా. తరళ ఈక్షణకున్ =చంచలమైన చూపులుగలదానికి. దొంతరల్ = పరంపరలు.

170. అంకిలి = ఇంగితము. వివాహ విధి జ్ఞుఁడు = పెండ్లి పద్ధతిని ఎఱిఁగినవాఁడు. మీనాంకుఁడు = మన్మథుఁడు. శుభ ఏక ముహూర్తము=కల్యాణము ప్రధానముగాఁగల రెండుగడియలకాలము. పర్యంకము = మంచమును. చేరన్ = డాయునట్లుగా. కరగ్రహణము = చేయిపట్టుట (పెండ్లియం). తత్ = ఆ యులూపిచేతిదైన. మణి కంకణ = రత్న కంకణములయొక్క - కింకిణీ గణ=చిఱుగజ్జెల గుంపుయొక్క- వికస్వర = వికసించిన - సు స్వరముల్ = ఒప్పిదమైన నాదములు. చెలంగఁగన్ = మ్రోఁగునట్లుగా.

171. మాణిక్యపు బొమ్మ=రత్న పుత్రిక; ఎట్టి వగ కీలో=ఏ విధమయిన సూత్ర

యును నందియు, నతండు లేనగవుతో నావేళ నావ్యాళక
న్యక కెంగేల నొసంగి కైకొనియె సయ్యాటంబు పాటిల్లఁగన్. 171

ఉ. శయ్యకుఁ దార్చఁగా దుఱుము జాఱె; సదంతటఁ జక్కఁదిద్దఁ బోఁ
బయ్యెద జాఱె; నయ్యదిరిపాటున గ్రక్కున నీవి జాఱె; రా
జయ్యెడ నవ్విలాసిని యొయారము చూచి కవుంగిలించె; నౌ,
నెయ్యెడ మేలె చూతురు, గ్రహింపరు జాణలు జాఱుపాటులన్. 172

ఉ. కౌఁగిటఁ జేర్చునప్పటి సుఖంబె లతాంగికిఁ బారవశ్యమున్
మూఁగఁగఁ జేసె; మోవిపలునొక్కు లురోజ నఖాంకముల్ మొద
ల్గాఁగల కంతుకేళి సుఖలక్షణముల్ పయిపెచ్చు లయ్యె; న
ట్లౌఁ గద యెట్టివారలకు నగ్గలపుం దమి గల్గి యుండినన్. 173

చ. చనుఁగవ సాముకండెపుఁ బిసాళి యురంబున సారెఁ గాననే
మన సునుపున్, సుధారసము మాటికిఁ గ్రోలనె చూడఁ, జొక్కు గీ
ల్కొను సరసోక్తులన్ వినవె కోరు సనా, యిటు లావిభుంగవుం
బునని విభుండు చూఁడుకలపుల్ వలచెన్ ఫణిరాజకన్యకన్. 174

మో. జాపవా జాఁతల్లికన్=బంగారపుఁ దాంబూలపుఁ బళ్ళెములో. బాగాల్=సన్నముగా నొత్తిన పోఁకలు. కపురంపు టాకు మడుపుల్=కర్పూరము రాచిన తములపాకు చుట్టలు. వ్యాళకన్యక = నాగస్త్రీయొక్క. సయ్యాటంబు పాటిల్లఁగన్ = (భార్యాభర్తల) చెలగాటము ఏర్పడునట్లుగా.

172. శయ్యకుఁ దార్చఁగాన్ = పాన్పుమీఁదికిఁ జేరఁదీయఁగా. తుఱుము = కొప్పు. పయ్యెద = పైఁట. అదిరిపాటునన్=కొందరపాటుచే. గ్రక్కునన్ = తటాలున. నీవి = కోఁకముడి. జాణలు = నేర్పరులగు పురుషులు.

173. పారవశ్యమున్ = పరవశత్వమును - అనఁగా - ఒడలెఱుంగమిని. మూఁగఁగన్ = కమ్ముకొనునట్లుగా. మోవి పలు నొక్కులు = అధరమునందలి దంత క్షతములు. ఉరోజ నఖ అంకముల్=చన్నులయందలి గోటి గుర్తులు. కంతుకేళి = మన్మథ క్రీడయొక్క. పయిపెచ్చులు=మీఁదికొసరులు. అగ్గలపుం దమి=మిక్కుటమైన మోహము.

174. చనుఁగవన్, సాము...రంబునన్=సాముచే కండలుగట్టిన ప్రకాశమానమగు రొమ్మునందు. సారెన్ = మాటిమాటికి. కాననే = చూచుటకే = అననే అనుపాతమున అదుముకొనుటకే.) చొక్కు గీల్కొను = పారవశ్యముతోఁ గూడిన

గీ. నాగరికముద్రగల మంచి నాగరి యఁట,
నాగవాసములో వింత నటనల దఁట,
కులుకుగుబ్బలప్రాయంపుఁ గోమలి యఁట,
వలచి వలపింపదే యెంతవారి నైన. 175

క. ఈగతి రతికేళీసుఖ
సాగరమునఁ దేలి యున్న సమయంబునఁ, ద
ద్యోగం బెటువంటిదొ, స
ద్యోగర్భంబున సుపుత్త్రుఁ డొకఁ డుదయించెన్. 176

క. ఆచక్కనిబాలుఁడు వా
క్ప్రాచుర్యము గాంచు నని శుభగ్రహదృష్టుల్
చూచి, యిలావంతుం డని
యాచతురుఁడు నామకరణ మలరిచి, యంతన్. 177

ఉ. కామినిఁ జూచి, 'రమ్ము! గజగామిని, యిక్కడ నొక్కనాఁ డిఁకం
దామసమైన, నక్కడ హితవ్రతి తైర్థికకోటి యాత్మలో

(పా. కీల్కొనన్ = తనకు పారవశ్యము కలుగునట్లుగా). మూఁడు వలపుల్వలచెన్ = ముమ్మాటికి మోహించెను. (కనుట - క్రోలుట - వినుట - అను మూఁడు భోగములకు సరిగా మూఁడు వలపు లని కవిహృదయము).

175. నాగరికముద్ర = నాగరికపులక్షణము - అనఁగా, నగరవాసముచే కలిగిన చాతుర్యము. నాగరి = సౌందర్యము గలది. నాగవాసములోన్ = నాగలోకములో (వేశ్యా జనముయొక్క మేళములో, అనియు). నటన = నడుపడి (నాట్య మనియు). కులుకు గుబ్బల = శోగసైనకుచములుగల - ప్రాయంపుఁ గోమలి = లేఁతవయసు సుందరి. ఎంత వారినైనన్ = ఎట్టి ప్రౌఢులను అయినను. వలచి = తాను మోహించినదై.

176. పా. రతికేళి సుధా సాగరమునన్ = కామక్రీడ యనెడి యమృతసముద్రములో. సద్యోగర్భంబునన్ = అప్పుడే సంపూర్ణమైన గర్భమువలన.

177. వాక్ప్రాచుర్యము = వాక్కునందు ప్రసిద్ధిని. వాగ్మిత్వమును. ఇలావంతుఁడు = వాక్కు కలవాఁడు (ఇలా = వాక్). నామకరణము అలరిచి = పేరు పెట్టుటను గావించి.

178. గజగామిని = ఏనుఁగు నడకలవంటి నడకలుగలదానా. తామసము = విలంబము. హితవ్రతి తైర్థిక కోటి = ఆప్తులయొక్కయు తాపసులయొక్కయు తీర్థ

నే మని యెంచునో? యిపుడ యేఁగవలెన్; దరువాత నీసుత
గ్రామణి నీవు వచ్చెదరు గాక'ని యూఱడిలంగఁ బల్కినన్. 178

ఉ. అంటినప్రేమ జాహ్నవికి నప్పుడ తోడ్కొని వచ్చి, యల్ల వా
ల్గంటి విశేశ్వరుం దనదుగబ్బిచనుంగవఁ జేర్చి బాష్పముల్
కంటఁ దొరంగుచుండఁ, దిరుగం దిరుగం గనుఁగొంచుఁ, గ్రమ్మతెన్,
జంట దొలంగి సంజను వెసం జను జక్కవ వెంటియుంబలెన్. 179

ఉ. అంతట నా జరాక గని యాప్తపురోహిత భృత్యవర్గ మ
త్యంత ముదమ్ముచెంది 'యిటు లార్తులఁ గాచుట కేమొ గాక యే
కాంతముగాఁగ నేఁగుదురె? యంచుఁ దలంచితి; మీరు వచ్చువ
ర్యంతము మమ్ము మే మెఱుఁగ; మందఱప్రాణము లీవ భూవరా.' 180

చ. అని పలుకం బ్రసన్నముఖుఁడై విభుఁ డిష్టసఖున్ విశారదుం
గని, "యొకవింత వింటె? ఫణికన్యక యులూపి యనంగ నొ ర్తు న
న్గొని, తమ నాగలోకమునకుం జని, తన్ను రమించు మంచుఁ, జె
ప్పని ప్రియ మెల్లఁ జెప్పి, యొడఁబాటొనరించి కరంచె డెందమున్. 181

ఉ. చెప్పెడి దేమి? కన్నుఁగవ చేరల కెక్కుడు; చంద్రబింబమే
తప్పదు మోము; మోవి సవతా చివు? రెక్కడిమాట? గొప్పకున్
గొప్ప పిఱుందు; గబ్బిచనుగుబ్బలు కౌఁగిటి కెచ్చు; జాళువా
యొప్పులకుప్ప మేను; నడు మున్నదొ లేదొ, యెఱుంగ నెంతకున్. 182

యాత్రాపరులయొక్కయు సముదాయము. గ్రామణి = శ్రేష్ఠుఁడు. ఊఱడిలంగన్ = సమాధానపడునట్టుగా.

179. అంటినప్రేమన్ = (మనస్సునకు) తగిలియున్న యనురాగముతో. వాల్గంటి = నిడుదకన్నులది (ఉలూపి). తొరంగుచుండన్ = రాలుచుండఁగా. క్రమ్మఱెన్ = మరలెను. జంటన్ తొలంగి = జోడు విడఁబాసి. సంజన్ = సంధ్యాకాల మందు. వెసన్ = శీఘ్రముగా. జక్కవవెంటి = చక్రవాకి.

180. ఆర్తులన్ = పీడితులను. ఏకాంతముగాఁగన్ = ఒంటరిగా. ఈవ=నీవే.

181. ఒడఁబాటు = సమ్మతి. కరంచెన్ = కరఁగించెను. డెందమున్ = మనస్సును.

182. మోవి = అధరమునకు - సవతా = సమానమా,

ఉ. చెంగున దాఁటు చూపు లిరువక్కని జేడిస లేమొ? మీటినన్
గ్రంగన వాఁగు కబ్బులుచొకారపు దాళము లేమొ? రూప మా
నం గన నైన చెక్కిళులు నద్దము లేమొ? చొక్క మా
రంగున మీఱు దానియధరంబును గోరు నేమొ నెచ్చెలీ! 183

ఉ. ఆయెలనాగ వేణి మెఱుఁగారు కటారికి మాసటీఁ డగుం
బోయన వచ్చు; న మ్మెఱుఁగుఁబోఁడి పిఱుందు సమస్త భూమికిన్
రాయ లనంగ వచ్చు; నల రాజ నిభాస్య యెలుంగు గట్టివా
కోయిల కంచు కుత్తికలకున్ బయకాఁ డన వచ్చు, నెచ్చెలీ. 184

క. మదిరాక్షి మోవిజిగి ప్రతివదనము గావించుఁ గీర వదనముతోడన్;
మదనుని విలు గొన వచ్చున్ సుదతీమణి కన్నబొమలసుద తీ రెంచన్.

చ. అల జడ యందమున్ మెఱుఁగు టారు విటారము నాకు ముందుగాఁ
జిలువ కొలం బటంచుఁ జెలి చెప్పక తెల్లనె చెప్పెఁ; దత్తనూ

183. ఇరు ఒక్కని జేడిసలు = రెండు ఎడఁబాయని జేడిపచేఁపలు. వాఁగు = శబ్దించెడు. చొకారపు - పా. చొకాటపు = సొగసైన. రూపము అనన్ కనసైన చెక్కిళులు=మనరూపము అందు ప్రతిబింబింపఁగ చూచుకొనఁ దగినవైన కపోలములు (అద్దమువంటి వనుట). చొక్కము = నిర్మలము.

184. ఆ ఎలనాగ వేణి = ఆ లేజవరాలి జడ. మెఱుఁగారు కటారికి = కాంతి గల కటారి అను నాయుధవిశేషమునకు. మాసటీఁడు = శూరుఁడైనదొర. రాయలు= ప్రభువు అల రాజ నిభ ఆస్య=చంద్రునిఁ బోలిన మొగముగలయద్దానియొక్క-ఎలుంగు= స్వరము. గట్టివా కోయిల=గయ్యాళి కోయిలలయొక్క - కంచు కుత్తుకలకున్ = కంచు వలె మ్రోఁగు కంఠధ్వనులకు. బయకాఁడు = తీర్పరి (కొనుగోలు సేయువాఁడు).

185. మదిరాక్షీ = (చూపఱను) మదింపఁజేయు నేత్రములుగల దానియొక్క (ఉలూపియొక్క). కీరవదనముతోడన్ =చిలుకముక్కుతో. ప్రతి వదనము గావించున్ =ఎదురు మోము ఒడ్డును (ప్రతివాదము చేయును - చిలుకపలుకులకన్న మధురమగు పలుకులు ఆ మోవికడనుండి వెలువడు నని భావము). కొనకా వచ్చున్ = వెలపెట్టి విలువఁ గడంగును. సుద తీరు = ఆద్యంతముల చక్కఁదనము.

186. విటారము = విజృంభణము. చిలువకొలంబు = నాగకులము. అల... చెప్పె - జడయు నూఁగారును పామువలె నున్న వని భా. తత్ తనూ విలసనము =

విలసన మెన్నఁ గన్నడియు విన్నఁది గాఁ దిలలో లతాంగు ల
ప్పొలఁతుక కాలిగోరులకుఁ బోలదు; పోలునొ యేమొ తారకల్? 186

సీ. మరుని గెల్పుల కథా మహిమమ్ము విలసిల్లు
నోజప్పుఁ జిత్తరుఠీవి నుల్లసిల్లు,
వీనుల కమృతంపు సోనలై వర్తిల్లు
శారికా ముఖ సూక్తి సందడిల్లు,
కస్తూరి కాది సువస్తులఁ బ్రభవిల్లు
పరిమళమ్ముల జోకఁ బరిఢవిల్లు,
జెప్పఁ జూపఁగ రాని సింగారము ఘటిల్లు
పెక్కు శయ్యల సొంపు పిక్కటిల్లు,
గీ. వింతహారువుల పనులచే విస్తరిల్లు
దివ్య మాణిక్య కాంతులఁ దేజరిల్లు,
నందముల కెల్ల నందమై యతిశయిల్లు
పాఁప జవరాలి బంగారుఁ బడకటిల్లు. 187

ఆ మేని విలాసము. లతాంగులు = తీఁగఁబోఁడులు. తారకల్ = నక్షత్రములు - చంద్రభార్యలు - నక్షత్రములకును కాలిగోళ్ళకును సామ్యము ప్రసిద్ధము - చంద్రభార్యలు ఆమెకు సాటి కానే కారనుట.

187 (౧) మహిమము ల్ విలసిల్లు = మహిమలు ప్రకటమగుచున్నట్టి ఒజప్పుఁజిత్తరుఠీవిన్ = అందమయిన చిత్రపటములయొక్క విభవముచేత. ఉల్లసిల్లన్ = ఒప్పుచుండును. కర్త - పడకటిల్లు - ఇట్లె అంతట నెఱుంగునది. (౨) వీనులకున్ = చెవులకు. సోనలు = వర్షములు, శారికా ముఖ సూక్తిన్ = గోరవంకలు లోనగువానియొక్క మధురభాషితముచే. సందడిల్లున్ = సందడిగల్గియుండును. (3) సువస్తులన్ = మంచి వస్తువులవలన. ప్రభవిల్లు = పుట్టుచున్న పరిమళమ్ముల జోకన్ = నెత్తావులయొక్క యతిశయము చేత, పరిఢవిల్లున్ = ప్రబలుచుండును. (౪) సింగారము = అలంకారము శయ్యలన్ = శయ్యలచేత. సొంపు పిక్కటిల్లఁగా = సొంపు మీఱియుండును.

హారువుల = అందములు గల. విస్తరిల్లు = వ్యాపించునట్టి. పాఁపజవరాలి = నాగతరుణియొక్క.

క. ఆ భోగము తద్వస్తు చ
యాభోగము నెందుఁ గన్నయవి కావు సుమీ;
సాభోగపురము సరి యా
సాభోగవతీపురంబు సార్థం బయ్యెన్. 188

ఉ. ఆ మదిరాక్షి భోగవతి యన్ నగరిం గ్రుంకఁగఁ జేసి, తత్పుర
స్థేముని హాటకేశ్వరు భజింప నొనర్చి, యటు తోడి తెచ్చి, న
న్నీమహి నిల్పి, పోఁగ నిదె యిక్కడె, నన్నెడఁ బాయ లేని యా
ప్రేమ కుడింత యెంత యని పేర్కొ నరాద"ని తెల్పెఁ దెల్పఁగన్. 189

ఉ. వాఖరి మించ నిట్టు లను న త్త్రిశిఖాకుని 'చోద్య మయ్యె నా
వైఖరి విన్న, నే మనఁగ వచ్చు, నహో! మనుజేంద్ర చంద్రమ
శ్శేఖర, చిల్వరాకొలము చేడియ నొక్కతెఁ జెప్ప నేల, నీ
రేఖ గనుంగొన న్వలవరే ఖచరీ ముఖ సుందరీమణుల్!' 190

188. ఆ భోగము = ఆ సుఖానుభవము, తద్వస్తుచయ ఆభోగము=ఆవస్తువుల సముదాయముయొక్క పరిపూర్ణత్వము సాభోగపురము = స్వర్గము [భోగ మనఁగా సుఖము - అది లేనిది అభోగము. అభోగము కానిది సాభోగము - నాకశబ్దమువలెనే- అని యొకమతము; నభోగు లనఁగా ఆకాశగాములు - అనఁగా వేల్పులు-సాభోగపుర మనఁగా వారిపుర మగు స్వర్గము అని యొకమతము.] ఆభోగవతీపురంబు = భోగవతి అను పేరుగల యానగరము. సార్థము=అర్థపంకము - భోగములు గలది యను నర్థము నకు సరిపడియున్న దనుట.

189. మదిరా అక్షి=కన్నులయందు మదిరా (=సురా) పానముచే కలుగు విలాసము సహజముగానే కలయట్టిసుందరి యని కొందఱు, మదింపఁ జేయునది మదిరము-మదిరము లగు నత్తులు గలది మదిరాక్షి అనియుం జెప్పనగు. అన్ నదిన్ = అను పేరుగల యేటియందు. తత్ పుర స్థేమున్ = ఆ పట్టణవాసియైన. హాటకేశ్వరున్= హాటకేశ్వరుఁడను పేరుగల యీశ్వరుని. ఒనర్చి+ఇటు. ఆప్రేమము అది = అట్టి యా ప్రేమను. పేర్కొనరాదు=వచింప నలవికాదు. తెల్పెన్ - కర్త అర్జునుఁడు.

190. వాఖరి = ముఖరత=వాగ్మిత. చోద్యము=ఆశ్చర్యము. ఆ వైఖరిన్ = ఆ విధమును. మనుజేంద్ర చంద్రమశ్శేఖర=ఓ రాజ పరమేశ్వరా. చిల్వ రా కొలము చేడియన్=సర్పరాజ వంశపు బోటిని. రేఖ = సౌందర్యమును. ఖచరీ ముఖ సుందరీ మణుల్ = దేవస్త్రీలు మొదలగు రమణీ రత్నములు.

కఌ అని పలుక నలరి, బలరిపు
తనయుండట గదలి, మొదలి తైర్థికులుం దా
నును, మంచుఁగొండ యండకుఁ
జని, తచ్ఛిఖరావలోక జనితాదరుఁడై. 191

సీ. పదియాఱువన్నె గుబ్బలి రాచకూఁతురు
పట్టంపురాణిగాఁ బరఁగుజాణ,
పతియర్ధదేహంబు సతి యంట నిజముగాఁ
బ్రబలు కన్నియఁ గన్న భాగ్యశాలి,
ముజ్జగమ్ము పవిత్రముగఁ జేయు తీర్థముఁ
గొనసాఁగఁ జేసిన యనఘమూర్తి,
భూమిధరారాతిచే నొక్కవోవని
యరిది బిడ్డనిఁ గాంచినట్టి మేటి,
గీ. యోషధుల నొసఁగించిన యుత్తముండు,
చల్లఁదనముల కెల్ల దీక్షాగురుండు, 192

191. అలరి = సంతోషించి. బలరిపు తనయుండు = ఇంద్రుని కొడుకు (అర్జునుఁడనుట). మొదలి తైర్థికులును = తనతో మొదట వచ్చిన తీర్థయాత్రికులును. మంచుఁగొండ = హిమవత్పర్వతముయొక్క - అండకున్ = సమీపమునకు. తచ్ఛిఖర = ఆగిరి శృంగములను - అవలోక = చూచుటయందు - జనిత = పుట్టింపఁబడిన - ఆదరుఁడై = కోరికగలవాఁడై.

192. (౧) పదియాఱువన్నె గుబ్బలి రాచ = మేరుపర్వతశ్రేష్ఠునియొక్క - ప...యు = మేనక. జాణ = చతురుఁడు. (౨) సతి యంట = భార్య అనిచెప్పుట. (౩) ముజ్జగమ్ము...ర్థముఁ = (స్వర్గ మహీ పాతాళము లనెడు) మూఁడు లోకములందును ప్రవహించుటచేత వానిని పావనము చేసెడు గంగానదిని. కొనసాఁగన్ - గంగను శివజటాజూటమునుండి పడినప్పుడు హిమవంతుఁడు తన శృంగంబున గ్రహించినందున అవతలి పాయలు కలిగిన దని భా. (౪) భూమిధర అరాతి చేన్ = ఇంద్రుని చేత. నొక్కవోవని = ఱెక్కలు నఱుకఁబడని - అరిది బిడ్డనిన్ = ఆశ్చర్యకరుఁడైన కుమారుని.

ఓషధులన్ = కరుపుల్లలతాదులను(మూలికలను). దీక్షాగురుండు = నియమము నేర్పెడి యొజ్జ. జనన సీమ = ఉత్పత్తి స్థానము సద్గుణ ... స్థాన భూమి = మంచిగుణములకు

సకలప్రాణిసంఘాశకి జననసీమ,
యీశానస్వామి సద్గుణోత్థానభూమి. 192

వ. (1) అని బహుప్రకారమ్ముల హిమగిరి ప్రభావము వర్ణించి తత్ప్రదేశమ్మున శాఖాశిఖోల్లిఖితగ్లావృక్షం బగునగస్త్యవటవృక్షంబు గనుంగొని, యచట నికట వికంకట కటక కమనీయ మణిశృంగం బగు మణిశృంగంబు గని, యగణ్య పుణ్యాగమ సమర్థం బగుహిరణ్య బిందుతీర్థమ్మునఁ గృతావగాహుండై గోహిరణ్య ధరణ్యాది దానమ్ము లనేకమ్ములు గావించి; (2) ప్రాగ్భాగమునఁ గలి కలిత నర శరణ్యం బగు నైమిశారణ్యంబు సొచ్చి, యచ్చటం గోటిగుణితాంగీకృతానత జనతా సమర్పిత నారాయణుం డగుబదరీనారాయణుం బూజించి; (3) మనీషి మనీషిత ఫలప్రదాన శుచిప్రయాగం బగుప్రయాగంబున కేఁగి, ముముక్షుజన హృదయంగమం బగు త్రివేణీసంగమంబునఁ దాన

సభాప్రదేశము, ఇంక-జాణ మొదలగు హిమవద్విశేషణములు అనూపావములంకు ప్రతిపాదితమైనవిషయమునకు అనుగుణమైన యభిప్రాయము గలవియై సొంపారుచున్నవి.

193. (1) శాఖా శిఖా సముల్లిఖిత గ్లౌ బుక్షంబు=కొమ్మల కొనలచేత గీరయఁబడిన చంద్రనక్షత్రములుగలది. అగస్త్య=అగస్త్యమను పేరి-వటవృక్షంబు=మఱ్ఱిచెట్టును. నికట=సమీపమునందు - వికంకట = విశాలమైన - కటక=పీఠులును - కమనీయ=సుందరములైన-మణిశృంగంబు=మణుల శిఖరములును కలది. మణిశృంగంబు = మణిశృంగము అను పేరి పర్వతమును. అ గణ్య పుణ్య ఆగమ = లెక్కింప శక్యముగాని పుణ్య ప్రాప్తికి. కృత అవగాహుండు = చేయఁబడిన స్నానముఁగలవాఁడు. గో హిరణ్య ధరణీ ఆది = ఆవులు పైఁడి భూమి లోనగు. (2) కలి కలిత నర శరణ్యంబు = కలిచే కూడఁబడిన జనులకు ఆశ్రయింపఁదగినది. కోటి గుణితా అంగీకృత=కోటి యింతలుగలది యగునట్లుగా అంగీకరింపఁబడిన-ఆనత జనతా సమర్పిత=నమ్రమైన జనసమూహముచేత అర్పణము చేయఁబడిన - నారాయణుండు=నారాయణోపనిషత్తు గలిగినవాఁడు (3) మనీషి = విద్వాంసులచేత - మనీషిత=కోరఁబడిన - ఫల = ప్రయోజనముయొక్క - ప్రదాన = ఇచ్చుటగల - శుచి = పవిత్రమైన - ప్రయాగంబు=శ్రేష్ఠములైన అశ్వమేధాది యాగములు గలది. [పా.—శచీప్రియాగంబు=కల్పవృక్షము.] ముముక్షు హృదయంగమంబు=మోక్షాసక్తులకు మనోహరము. త్రివేణీ సంగమంబునకు=గంగా యమునా సర

ములుం దానంబులుం గావించి, యచ్చట మాధవు నారాధించి; (4) భవరసానుభవ భీరు సానుక్రోశం బగుపంచక్రోశంబు ప్రవేశించి, యభ్యర్ణమణికర్ణికయగు మణికర్ణికం గ్రుంకి, యన్నపూర్ణవిశాలాక్షీ సనాథుఁ గాశీవిశ్వనాథు దర్శించి; (5) త్రైర్థిక సమాహిత సమ్యగయను గయకుం జని, యచట నుచితకృత్యంబులు నిర్వర్తించి; (6) పురుషోత్తమమ్మున కేఁగి, యింద్రద్యుమ్నసరస్సున శిరస్సుమజ్జనంబై, నమజ్జన దృక్చకోర జ్యోత్స్నాధుని జగన్నాథునిఁ గొలిచి; (7) యాతల గౌతమీ తటినీ తోయస్నాత యై జగన్మోహన మనోజవశీకరణ కారణ కళాప్రావీణ్య లావణ్య హావ భావ ప్రకట నటనరేఖా శ్లాఘా దూరీకృత రంభోర్వశీరంభోర్వశీక కిరణ కిరణ నిభ విభా రంగన్మణి

స్వతీ నదులు కలసినచోటను. దానంబులున్=స్నానములును. (4) భవ రస అనుభవ= సంసార దుఃఖానుభవమువలన - భీరు = భయశీలురైనవారిపట్ల - సానుక్రోశంబు = దయతోఁగూడినది పంచక్రోశంబు = పంచక్రోశసంజ్ఞగల వారాణసిని. అభ్యర్ణ=సమీప మందలి - మణి కర్ణిక = మణిఖచితమైన సారదకర్ణాభరణముగలిగిన - మణికర్ణికన్ = మణికర్ణికాఘట్టమునందు. అన్నపూర్ణవిశాలాక్షీసనాథున్ = ఆసంజ్ఞగల పార్వతీ దేవితోఁగూడిన - విశ్వనాథున్=కాశీ విశ్వేశ్వరుని (5) త్రైర్థిక = తీర్థయాత్రాగతుల యందు - సమాహిత = ఉంపఁబడిన - సమ్యక్ అయ = లెస్సయైన శుభముగలది. (6) పురుషోత్తమమ్మునకున్ = జగన్నాథక్షేత్రమునకు. శిరః సు మజ్జనంబు ఐ = తలమునుఁగ స్నానము చేసి నమత్ జన=నమస్కరించెడు జనులయొక్క - దృక్ చకోరక=నేత్రములనెడు చకోరములకు - జ్యోత్స్నా ధుని = వెన్నెల ప్రవాహంబు. జగన్నాథునిన్=జగన్నాథస్వామిని (7) ఆతలన్=అవతల. గౌతమీ తటినీ=గోదావరీనదియొక్క - తోయ=నీటియందు - స్నాత = స్నానముచేయువాఁడు. జగన్మోహన = జగత్తును మోహింపఁజేయుచుండు మనోజ వశీకరణ=మన్మథుని (సైతము) వశ్యునిఁ జేసికొనుటకు - కారణ = హేతువైన - కళా ప్రావీణ్య=విద్యలయందలి సామర్థ్యము చేతను - లావణ్య= అవయవములయందలి ముత్తెపునీటివంటి కాంతిచేతను - హావ భావ=హావము భావము అను శృంగారచేష్టలచేతను - ప్రకట=ప్రసిద్ధమైన-నటన రేఖా= నాట్య విలాసమువలని- శ్లాఘా=పొగడికచేతను - దూరీ కృత=దూరస్థులుగాఁ జేయఁబడిన (=జయింపఁబడిన) - రంభోర్వశీ=రంభ ఊర్వశి అనెడు - రంభోరూ = అరఁటిచెట్లవంటి తొడలుంగల

రంగమంట పోజ్జ్వలాసికా కృతలక్షణ లాసికా కృతలక్షణ కృతలక్షణ కటాక్షవీక్షణసుధా రసధారా సేచన తాసేచి తాసేచనకాంగుండై, పాపాటవీ విపాటనపాటవ సంసూచన దీక్షా రామేశ్వరుం డగు ద్రాక్షారామేశ్వరుం జేరి జోహారు లుపహారంబులు సమర్పించి; (8) సంతతానంత కాంతిరంహుం డగు నంతర్వేది నృసింహు సేవించి, యందు భవసాగరతరణి యగు సాగర సంగమంబునఁ దీర్థంబాడి; (9) కృష్ణవేణ్యాది పుణ్యతరంగిణుల మునింగి; (10) యుత్తుంగ శృంగ విలోకి లోకసాత్కృత సుపర్వపర్వతం బగు శ్రీపర్వతంబు లోచనపర్వంబుగాఁ జూచి ప్రణమిల్లి, మల్లికార్జును సమ్మోదమునఁ బ్రణుతించి, తన్మనోజ్ఞభ్రమరీ

(సుందరీమణులు) గలవాఁడై - అశీత కిరణ కిరణ నిభ=సూర్య కిరణములతో సమానమైన - విభా=కాంతిచేత - రంగత్ = ఒప్పుచున్న - మణి = రత్నముల(చే నిర్మింపఁబడిన) - రంగ మంటప=నాటక శాలయందు - ఉజ్జ్వల ఆసికా కృత లక్షణ=దీప్యమానమైన కత్తుల చేత చేయఁబడిన చిహ్నము కలవారైన(అనఁగా కత్తులం గేలఁగొని నటించుచున్న) లాసికా=నర్తకీజనముయొక్క - కృత లక్షణ=చేయఁబడిన సంస్కారముగలవి గావున నే - కృత లక్షణ = గుణములచేత ప్రసిద్ధములయిన - కటాక్ష వీక్షణ = క్రేగంటి చూపులనెడి - సుధా రస ధారా=అమృత రస ధారలయొక్క - సేచనక=ప్రోక్షణముచేత - ఆ సేచిత= అంతట తడుపఁబడిన - ఆసేచనక = ఎంత చూచినను తనివితీఱనట్టి - అంగుండు = అవయవములుగలవాఁడు. పాపాటవీ=పాపములనెడి యడవియొక్క - విపాటన=ఛేదించుటయందు - పాటవ=సామర్థ్యమును - సంసూచన=జ్ఞాపనముచేయుటయందలి - దీక్షా= నియమమునందు - రామ = వినోదించుచున్న - ఈశ్వరుండు = సాంబమూర్తి. జోహారులు=ప్రణామములు. ఉపహారంబులున్ = కానికలును. (8) సంతత = నిత్యమయిన - అనంత = కడలేని - కాంతి = ప్రకాశముయొక్క - రంహుండు = వేగముగలవాఁడు. భవ = సంసారమనెడు - సాగర = సముద్రమునకు - తరణి=ఓడ. సాగరసంగమమ్మునన్=గోదావరి సముద్రములోఁ గలియుచోట. (9) కృష్ణవేణీ=కృష్ణానది. తరంగిణులన్=నదులయందు. (10) ఉత్తుంగ శృంగ విలోకి=ఉన్నత శిఖరమును చూచునట్టి - లోకసాత్ కృత=లోకులకు ఈయఁబడిన - సుపర్వ - పర్వతంబు=దేవ పర్వతము (మేరువు) గలది. శ్రీ పర్వతంబున్ = శ్రీశైలమును. లోచన పర్వంబుగాన్=కన్నుల పండువుగా. మల్లికార్జునున్ = మల్లికార్జునస్వామిని. సమ్మోదమ్మునన్ = సంతోషముతో. ప్రణుతించి=స్తోత్రములు చేసి. తత్ = ఆ స్వామియొక్క - మనోజ్ఞ = హృదయకమలమందు -

విభ్రమ రమ్య యగు భ్రమరాంబం బ్రశంసించి; (11) భక్తశోభన పరంపరా సంపాదక పాదకమల రజోలేశు నహోబలేశు భజించి; (12) నిజ భజనరత జన ప్రతిపాదితానశ్వరపదంబు లగు వేంకటేశ్వర పదంబులకు నమస్కృతులు విస్తరించి; (13) దుస్తరాంహస్తూలికా సందోహ దాహ దోహల నిజాహ్వయస్మరణ స్ఫులింగంబు శ్రీకాళహస్తిలింగంబు నంతరంగంబున హర్షతరంగంబు లుప్పొంగం గాంచి; (14) కాంచీపురంబున కరిగి కరిగిరీశ్వరుండై విరాజిల్లు వరద రాజుల, నమ్రజనకమ్ర ఫలదాయకు నేకామ్రనాయకుం బూజించి; (15) యువులం గావేరికాంతరిత కాంతాంతరీపంబునం బ్రసన్నరూపంబునం బొటిల్లు కోటి హరిత్తురంగధాము రంగధాము సేవించి; కుంభఘోణచంపకారణ్యాదిపుణ్యక్షేత్రమ్ము లీక్షించి; (16) దక్షిణపయోరాకర వీచినికర శీకర తుందిలమందానిల లాస్యకాండ జాతిశీతల సికతాతల విహితయాత్రా

భ్రమరీ విభ్రమ = ఆడుతుమ్మెదయొక్క విలాసముచేత - రమ్య = సుందరి. భ్రమరాంబన్ = ఆ పేరుగల పార్వతిని. (11) భక్త = ఉపాసకులకు - శోభన పరంపరా = ఎడతెగని శుభములను - సంపాదక = పొందించుచుండెడి - పాద కమల = కమలములవంటి పాదములయొక్క - రజోలేశున్ = రేణువుయొక్క కణము గలవానిని. అహోబలేశున్ = అహోబల నారసింహస్వామిని. (12) నిజభజన = తనసేవ యందు - రత = ఆసక్తిగలవారగు - జన = జనులకు - ప్రతిపాదిత = ఈయఁబడిన - అనశ్వర = నాశములేని - పదమ్ములు = స్థానములుగలవి. (13) దుస్తర = అతిక్రమింపనలవి గాని - అంహః = పాపములనెడు - తూలికా - దూదియొక్క - సందోహ = రాశి యొక్క - దాహ = కాల్చుటయందు - దోహల = ఉత్సాహవంతమయిన - నిజ ఆహ్వయ స్మరణ = తన నామ స్మరణ మనెడి - విస్ఫులింగంబు = నిప్పురవ కలది. హర్ష తరంగంబులు = తెరలుగా వచ్చు సంతోషము (14) కరి గిరి ఈశ్వరుఁడు = కరిశైలమున కధిపతి. నమ్ర జన = నమస్కరించువారికి - కమ్ర ఫల దాయకున్ = కమనీయమైన ఫలము నిచ్చెడు. (15) కావేరికా అంతరిత కాంత అంతరీపమ్మునన్ = కావేరిచేత చుట్టుకోఁబడిన మనోహర ద్వీపమునందు. కోటి హరిత్తురంగ ధామున్ = కోటి సూర్యులయంత తేజస్సు గల. (16) దక్షిణనీరాకర = దక్షిణసముద్రపు-వీచికా నికర = తరంగ పరంపరల - శీకర = తుంపురులచేత-తుందిల = బలిసిన-మందానిల = మెల్లనివాయువులయొక్క - అస్కందన =

యాత నిరవధిక పథికనికాయ కాయమానాయమాన లవల్యేలావల్లీ వేల్లిత క్రముక ప్రముఖాఖిలశాఖి శాఖాశిఖాలతాంతర కుహర విహరమాణ వివిధగరుద్రథకులకలకలోద్వేలవేలా మనోజ్ఞమార్గంబున నపవర్గరమేశ్వరంబగు రామేశ్వరంబునకుం బోయి, సేతుదర్శనం బొనర్చి, విధూతస్నాతృజన వృజిన జనుష్కోటి యగు ధనుష్కోటిం గృతస్నానుండై, పాండుసూనుం డందులం దులాపురుషాదిదానమ్ము లాచరించి, రఘువీరభూభుజ భుజాదర్పదర్పణం బగు రామాయణంబు పారాయణంబు చేసి, భూసురాశీర్వాదసంపదలం బొదలి; (17) యచ్చోటు గదలి, పదుమూఁడవనాఁ పాండ్యక్ష్మారుహీమండలాఖండలుం డగుమలయధ్వజుం డేలు మణిపురంబు చేరం బోవు సమయమ్మున. *

చిత్రాంగదా వివాహఘట్టము.

సీ. మంగళస్నానసంభ్రమమున తెల్పి [illegible]
[illegible] దేలి,

పైకొనుటచేత - అతిశీతల=మిక్కిలిచల్లనైన - సికతాతల=ఇసుకనేలలందు - విహిత=కావింపఁబడిన - యాతాయాత=రాకపోకలుగల - నిరవధిక పథిక నికాయ=అనంతమగు మార్గస్థుల సమూహమునకు - కాయమానాయమాన=పందిటివలె నాచరించుచున్న - లవలీ ఏలావల్లీ వేల్లిత=లవలి యనుతీఁగలచేతను ఏలకితీఁగలచేతను అల్లుకొనఁబడిన - క్రముక ప్రముఖ=పోఁక మొదలగు - అఖిల విశాల శాఖి=ఎల్ల గొప్ప వృక్షముల - శాఖా శిఖా=కొమ్మకొనలయొక్కయు - లతా=తీఁగలయొక్కయు - అంతర=నడుమలను - కుహర=తొఱ్ఱలయందును - విహరమాణ=విహరించుచున్న - వివిధ గరుద్రథ కుల=నానావిధ పక్షి సమూహముల - కలకల=కోలాహలధ్వనులచే - ఉద్వేల=అతిశయమైన - వేలా=సముద్రతీరమందలి, అపవర్గరమా ఈశ్వరంబు=మోక్ష లక్ష్మికి అధిపతి. సేతు=శ్రీరాములవారు కట్టించినట్టి యానకట్టును. విధూత స్నాతృ జన వృజిన జనుః కోటి=దులిపివైవఁబడిన స్నానము చేయు మానవుల పాపయుక్తమయిన జన్మల పంక్తిగలది. ధనుష్కోటిన్=ఆపేరుగల తీర్థమందు. తులా పురుష=పురుషునియెత్తు తూఁచిన ధనము. భూభుజ=రాజుయొక్క - దర్పణంబు=అద్దము. పొదలి=వర్ధిల్లి. (17) అఖండలుండు=ఇంద్రుఁడు.

* ఈ వచనమందలి ద్రాక్షారామక్షేత్రమునకు ద్రాక్షతోఁటల బాహుళ్యంబునం జేసి ఆనామము వ్యవహృతిం బడసినను, దక్షవాటిక యగుటంబట్టి పురాణములయందు దాక్షారామసంజ్ఞ ప్రసిద్ధమై యున్నది.

ధవళముల్ విని చొక్కు హావణిఁ జెల్వొందు లీలఁ
హాళిఁ గోయిలపల్కు లాలకించి,
తలఁబ్రాలు వోయుచిత్తరముఁ దెల్పుచు నాటఁ
గ్రొన్ననల్ దోయిళ్లకొలఁది నొసఁగి,
బువ్వాన భుజియించుపోఁడిమి దెల్పుచు జాడ
గుమి గూడికొని మరందములు గ్రోలి,
గీ. తనకు దోడ్తోడ నసు వెండ్లి కనఁబడంగఁ
జేయునటువలె గానఁబడెడు నెలలఁ గూడి
వనవిహారంబు గావించి చనెడు పాండ్య
రాజసుతఁ జూచి యాపాండురాజసుతుఁడు. 194

చిత్రాంగదా వర్ణనము.

గీ. "ఈ వెలంది యొడల్ పైఁడిలో వెలంది;
యీ నెలంత లలాటంబు లేనెలంత;
యీ సుపాణి రదశ్రేణియే సుపాణి;
యీబిడారు మృగీమద శ్రీబిడారు; 195

క. వాతెఱకు నమృతమే తుల, మే తులకింపుల పిసాళి మిసిమికిఁ గ్రొమ్మిం
చే తుల, చేతుల కబ్జము। లేతుల, లేతులు నెలంతలీ చెలి కౌనల్?

ధవళముల్ = మంగళహారతిపాటలను. హావణి = విలాసమును. హాళిన్ = ఆసక్తితో. చిత్తరము = సొగసు. క్రొన్ననల్ = క్రొత్తగా విరియుచున్న పుష్పములను. దోయిళ్ల కొలఁదిన్ = దోసిళ్లదోసిళ్లగా. మరందములు = తేనెలు.

195. ఈ వెలంది ఒడల్ = ఈ తరుణియొక్క శరీరము, పైఁడిలో వెలంది = బంగారములో శ్రేష్ఠమైనది; ఈ నెలంత = ఈ స్త్రీయొక్క - లలాటంబు = నుదురు, లేనెలంత = (విదియనాఁటి) లేఁత చంద్రునియంత; ఈ సుపాణి = యోగ్యమైన హస్తములుగల ఈబాలయొక్క - రద శ్రేణియే = పలువరుసయే, సుపాణి = సుపాణి యనెడి యుత్తమజాతిముత్తెములు; ఈబిడ ఆరు, మృగీమద శ్రీ బిడారు = కస్తూరి శోభ చాల్పు.

196. వాతెఱకున్ = అధరమునకు, ...తుల = సమానము; మే = శరీరము యొక్క - తులకింపుల = ప్రకాశముల యొక్క - పిసాళి మిసిమికిన్ = మనోహరమైన

క. కన్నె నగుమోముతోడం
బున్నమచందురుని సాటిఁ బోలుప కతనన్,
నెన్నుదురుతోడ మార్కొని
మున్నందఱుఁ జూడ రేకమోపక యున్నన్. 197

క. కమలముల నుజ్జగించుం,
గుముదమ్ముల బుజ్జగించుఁ గొమరూపుఱుఁ బు
న్నమ చలువమావు వెన్నెలల
కొమరం దొరయుఁ బుడికి పుచ్చుకొనఁబోలుఁ జెలియా. 198

శా. చెండ్లా గుబ్బలు? జాళువా తళుకులా చెక్కిళ్ల డాల్? సింగిణీ
విండ్లా కన్బొమ? లింద్రనీలములా వేణీరుచుల్? తమ్మిలేఁ
దూండ్లా బాహువు? లింతచక్కఁదనము న్నంగా! మాజవ్వనిం
బెండ్లాడంగలవాఁడు చేసినది సుమ్మీ భాగ్య మూహింపఁగన్!" 199

మ. అని 'కన్గొంటె విశాఖ' యనిన, "నా కన్గొను సొంపౌ నవ్వచ్చు; నా
జననాథాగ్రణి, యీవిధాత తన సౌందర్య మీక్షించినం

కాంతికి, క్రొమ్మించే = క్రొత్తమెఱుపే; అబ్జములే = పద్మములే; *ఏతులవెలందులు = లోకసాధారణస్త్రీలు.—ఏతుల! ఏతులలు! అని ఛేదించిన తులలు గా వని యర్థము.

197. కన్నె = కన్యకయొక్క. నెన్నుదురుతోడన్ = శ్రేష్ఠమైన లలాటములో, మార్కొని=ఒడ్డారించి, అందఱున్ చూడన్=ఎల్లవారియెదుట (అనఁగా బట్టబయలైన యవమానమునకు పాలై), రేకమోపక యున్నన్ = బాబు మోయుపనిని (తపాలా నౌకరిని) చేయుచున్న యెడల. నెన్ను...న్నన్ - విదియనాఁడు సాయంకాలమున ఎల్లవారును చంద్రరేఖను అభిముఖముగా చూచుట ప్రసిద్ధము.

198. ఉజ్జగించున్ = తక్కువపఱచును; కుముదంబులన్ = తెల్లగలువలను, బుజ్జగించున్=మన్ననసేయును; కొమరు = విలాసమును, పుడికి=పెఱికి; పున్నమవెన్నెలపసు లగు కమలనికార కుముదజాలనములను ఈ మాపులు చేయుచున్నవి గాన ఇవి పున్నమవెన్నెలను హరించినవి గావలయు.-అని యర్థము. అమూఁటిని బోలినవని భావము.

199. డాలు=కాంతి. వేణీరుచుల్=జడకాంతులు. తమ్మిలేఁ దూండ్లా=తామరతోఁగూడుకొన్న లేఁత తూఁడులా (అరచేయి తామర). జవ్వనిన్=యౌవనవతిని.

200. విధాత=(దీనినిచేసిన) బ్రహ్మదేవుఁడు. తను అంగిలోన్=సన్నమైన శరీర

* 'ఏతుల యనంగఁ బరపాటిమింతి, చాఁడ। లల్లువసితముఁ దేఁపు, పళ్యల్లలాటు,' ఆంధ్రశబ్దార్ణవము.

దనుఁ జూ మెచ్చు విఘాత చిత్తమున; నీ తన్వంగితోఁ బోల్పఁగా
నెన లే దెచ్చటఁ; జూడుమా తుహినభూభృత్సేతుపర్యంతముల్?

క. 'మలయధ్వజ బాహుజను
స్తిలకునిగాఁ బుట్టి, చిత్రాంగద వే,
రలఘుకులశీల, గుణములు
గల దీకన్య.' యని చెప్పఁగా వింటి నృపా." 201

చిత్రాంగదపై అర్జునుని విరాళి.

క. అన విని మనమునఁ గోర్కులు
కొనసాగఁగ 'నినృపాలకునితో నెయ్యం
బొనరింపవలయు, నేఁ డ,
వ్వని సుందరి యెంతుఁ జూచ్చి వచ్చుచు నుండన్. 202

సీ. పద్మరేఖలఁ బొల్చు బాలికాతిలకంబు
చరణమ్ము లూఁదిన తెరువు సూచి,
మలయధ్వజతనూజ కొలువు సేసిన జీవ
దంతపుఁజవికెఁ జిత్తరువు సూచి,
పొన్నగున్నలనీడఁ గన్నె పుష్పాపచితి నె
మరుపుఁ బూజించినహరువు సూచి,
కొమ్మ కౌఁగిటఁ జేర్ప గోరంట నంటిన
మొనగుబ్బ కస్తూరిమురువు సూచి,

గల సుందరితో. ఎన = సమానము. తుహిన భూభృత్ సేతు పర్యంతముల్ = మంచుకొండ మొదలుకొని రామసేతువు వఱకు - భూమండలము నెల్లను అనుట.

201. బాహుజను స్తిలకుని = రాజశ్రేష్ఠుని. 202. నెయ్యంబు = స్నేహము.

203. (౧) పద్మరేఖలన్ = పద్మరేఖలతో. పొల్చు = శోభించుచున్న - తెరువునకు విశేషణము. [ఆకన్యపాదములు పద్మములవలె నున్న వనియు, వానియందు మహాభాగ్యసూచకమయిన పద్మరేఖలు కల వనియు భా.] ఊఁదిన = మోపిన (౨) కొలువుచేసిన = రథ చేసినట్టి - జీవదంతపుఁ జవికెన్ = బ్రతికియున్న యేనుఁగుదంతముతోఁ జేయఁబడిన మండపమునందలి, చిత్తరువు = వ్రాఁతరూపములను. (3) పొన్నగున్నల = లేఁతపొన్నచెట్లయొ

గీ. అదియు నొకశకునంబుగా నభినుతించి
చేతి కందిచ్చినట్లనె చేసెఁ జాగఁ
గలదు వలిగబ్బిగుబ్బెత చెలిమి యనుచు
నాత్మలో నెంచి యా భావ మపనయించి 206

చ. 'నెల యుదయించె నప్డు జలనీరజముల్ కుముదంబు లౌను రేల్;
గలువలదాయ రాకకు బగల్ కుముదంబులు నీరజంబు లౌఁ;
దలఁపఁగ నింతవింత గల దా!' యని కందువమాటలాడుచున్,
బళిర! కిరీటి మాటలు, దనప్రౌఢి విశారదుఁ డెన్నుచుండఁగన్. 207

రాత్రివర్ణనం.

ఉ. అంగజరాజు పాంథనిచయమ్ములపై విజయంబు వొనర్ప నేఁ
గంగఁ దలంచునంత మును గల్గఁగ దాసులు వట్టు జాళువా
బంగరుటాలవట్టములభంగిఁ గనంబడెఁ బూర్వపశ్చిమో
త్తుంగ మహీధరాగ్రములఁ దోఁచుక శాత్రకమిత్ర బింబముల్. 208

అరుదేరన్ = రాఁగా, నెత్తావుల దీవులు = శ్రేష్ఠమైనవాసనలకు ద్వీపములు.—పరిమళించు రెండు తామరమొగ్గలను చేత నిడుటలో 'ఇవ్వాది లోఁగు నెత్తావులు కదంబించు చిత్రాంగదాకుచయుగ్మము నచేతి కబ్బును లే' యని విశారదుని యభిప్రాయము.

206.—వలిగబ్బిగుబ్బెత = దట్టనగల నిండుకుచములుగల చిత్రాంగదయొక్క. ఆభావము = ఆయభిప్రాయమును. అపనయించి = పోనడఁచి - పా.—అభినయించి.

207.—రేల్ = రాత్రులందు. నెల = చంద్రుఁడు. ...జలనీరజముల్ = జలకమలములు. కుముదంబులు ఔను = కలువ లగును - అని చతురోక్తి - (కు = చెడిన - ముదంబులు = సంతోషముకలవి - అనఁగా - వికాసము లేనివి అగు నని భా.) పగల్ = పగటియందు, కలువలదాయ = సూర్యునియొక్క...కుముదంబులు నీరజంబులు ఔన్ = కలువలు కమలము లవును - అని చతురోక్తి - (నీర...ఔన్-నిర్గత రజము లగును - అనఁగా పుప్పొడి లేని వగు ననుట - ముడుఁచుకొను నని తాత్పర్యము.)...కందువ = చమత్కారపు. కిరీటి = అర్జునుఁడు. ప్రౌఢిన్ = జాణతనమును.

208.—అంగజ = మదనుఁడను. పాంథ నిచయమ్ముల పైన్ = తెరువరుల (=విరహుల) సమూహముల మీఁద. మును గల్గఁగ = ముందు గా. దాసులు = సేవకులు. ఆలవట్టములు = గుండ్రని గుడ్డ విసనకఱ్ఱలు. ఉత్తుంగమహీధర అగ్రములన్ = ఎత్తైన

చ. వెడవిలుకానికిన్ జెఱకువిల్లును గల్వలరాజు కోరికల్
గడలుకొనంగ సామునియుఁ గల్వలరాయఁడు నిచ్చ మన్ననం
బడయుడు,వాని కెక్కుడుగ మాధ్వికలు తావును గాన్క తెచ్చె నా,
బళిబడి గంధలుబ్ధమధుపమ్ములు రాఁ జనుదెంచెఁ దెమ్మెరల్. 211

చ. ఒకచిగురాకుఁ గొమ్మఁ బిక, మొక్క ప్రసూనలతాగ్రసీమఁ దేం
ట్లొ,కఫలశాఖ రాచిలుక యున్, రొద సేయఁగ,గాడ్పుపొందు వా
యక, పయి వెన్నెలల్ వొలయ, వాఁటుని సొంపుల నింపు జొంప మా
వొకయెలమావి క్రింద సురుఁడో యనఁగా నరుఁ డుండె. నయ్యెడన్;

క. విధుచకచకలును బుంద్రే
ఘుధసుర్ధరునంపసేకలు శుక పిక శారీ

రిల్లునట్టుగా కవనము చేయఁగా స్పర్ధచేత చంద్రకవి రాజసభలో ప్రసాదసౌకుమార్య సామరస్యగుణవంతమయిన కవనము చెప్పి పూర్వోక్త శ్రోతలకన్న మూర్ఖులగువారిని కూడ మెప్పించెను.—లోకములో నెట్టి కవులును తమ కాలపుఁ గవులను మచ్చరింతురే గాని మెచ్చుకొనరు గదా—అని కవియొక్క మెంట్లు

211. వెడవిలుకానికిన్=మన్మథునకు...లకోరి=బాణమును, (మదనునియొక్క) కోరికల్, కడలుకొనంగన్=కొనసాగునట్లు సామునియున్ = వసంతుఁడును, కల్వల రాయఁడున్ = చంద్రుఁడును. మన్ననన్ పడయుడున్ = గౌరవమును పొందఁగా, వానికిన్ ఎక్కుడుగన్ = ఆ కొన్నలకంటె నధికముగా (ఆ వింటికిని అకోరికిని - ఎక్కుడుగన్ = ఎక్కువెట్టుటకును తోడుగుటకు సాధనముగా), మాధ్వీకన్ = అల్లెత్రాళ్లను, తావును = తెమ్మెరలును,...బళిబడిన్ = పరంపరగా, గంధ లుబ్ధ మధుపమ్ములు = (తెమ్మెరల) పరిమళమునందు ఆసక్తిగల తుమ్మెదలు, రాన్ = వెంబడివచ్చుచుండఁగా, తెమ్మెరల్ = మలయమారుతములు, చనుదెంచెన్ = వచ్చినవి [మదనునికి విల్లు చెఱకు - తూపు కలువ - వింటినారి తుమ్మెదబారు - నని కవిసమయము.]

212. కొమ్మన్ = కొమ్మయందు, పికము = కోకిల,—ప్రసూన లతా అగ్ర సీమన్ = పూ రెమ్మ కొన తావునందు,...శాఖన్ = కొమ్మమీఁద, (చిగురాకు మెసవి కోకిలయుం, పూఁదేనె త్రాని తేంట్లును, ఫలములు మెక్కి చిలుకయు, మదమెక్కి), రొద సేయఁగన్=ధ్వని సేయుచుండఁగా, గాడ్పుపొందు పాయక = మలయ మారుతుని స్నేహమును వదలక (కర్త ఎలమావి), జొంపము = గుబురుగానున్నట్టి,...ఎలమావి= లేతమామిడిచెట్టుయొక్క.—సౌందర్యమున స్మరతుల్యుఁడై స్మరపరివారముతో స్మరుని యమ్ములపొది యైన యెలమావి క్రింద నుండుటచేత నీయుత్ప్రేక్ష.

మధులిట్టులు మలయానిల
మధు లిట్టులు తపదు ధైర్యమహిమం గలంపన్. 213

ఉ. చందనగంధి నెన్నుదురు చందురులో సగఁబాలు, బాలము
ద్దుందెలిచూపు లంగజుని తూపులలో సల మేల్తరంబు, లిం
దిందిరవేణి మోవి యల దొనియలో నికరంపుఁదేట, యే
మందము మందయాన మొగమందము? మీలు నవారవిందమున్. 214

ఉ. బంగరు బొంగరాల పరిపాటి చనుంగవ, మీలసూటి త
ళ్కుంగనుదోయి, చంద్రప్రతికోటి మొగం, బెలదేఁటిఘాటికన్
న్నం గడుమేటి వేణి, పులినంబులసాటి పిఱుం, దయారె! చి
త్రాంగదపాటి జోటి కలదా! యని మెచ్చుఁ గిరీటి మాటికిన్. 215

213. విధు చకచకలును=చంద్రునియొక్క చకచకమని మెఱయు కాంతులును, పుండ్రేక్షు ధనుః ధరు నంప సెకలున్=తెల్లచెఱకు విల్లు దాల్చిన మన్మథుని బాణముల తాపములును, శుక...లున్=చిలుకలు కోకిలలు గొరవంకలు తుమ్మెదలును, మలయానిల మధులు=మలయమారుతుఁడును వసంతుఁడును, ఇట్టులు = ఈ ప్రకారము.

214. సగఁబాల=నిశ్చయముగా అర్ధభాగము. అంగజుని తూపుల=కాముని బాణముల, మేల్తరంబులు = మొదటిరకములు; ఇందిందిర వేణి = తుమ్మెదలవంటి కొప్పు గలదానియొక్క - మోవి = అధరము. నికరంపు తేట = తేరిన సారము; ఏమి, అందము = అనుదము; మందయాన = మెల్లని నడక గలదానియొక్క - మొగము + అందము=ముఖముయొక్క సౌందర్యమును. అరవిందమున్=తమ్మిని. [మొగమందము - మొగమునందము అనుట సాధువు.]

215. పరిపాటి=విధము. మీల = (బేడిస) చేఁపలయొక్క. ప్రతికోటి = ఎదురువాది. ఘాటికన్నన్ = బారుకంటె. పులినంబుల = ఇసుక తిన్నెలయొక్క. చిత్రాంగదపాటి = చిత్రాంగదవంటి. జోటి = వెలఁది.—బొంగరము ప్రక్క బొంగరము అభిప్రాయముగాన 'పరిపాటి', మీలు సూటిగా చూపులవలె దూఁటుచుగాన 'సూటి', చంద్రునికి కోటి యనఁగా శృంగము కలదు గాన 'ప్రతికోటి', దాఁటుచున్న దశలోని తేంట్లు అభిప్రేతములు గాన 'ఘాటి,' పులినగుణములలో ఏకదేశమాత్రముగాని తదీయ దశావిశేష మాత్రముగాని గాక పులిన మంతయు నభిప్రేత మగుటనందున 'సాటి', యనియుం గల పదప్రయోగంపుసొంపుం బరికింప నింపగు. మాటికిన్-అనఁగా ఒక్కొక్క యవయవమునకును ఒక్కొక్కమాటు.

క. ఈకరణిఁ దలంచుచు నాళీకనిభాసన నెపక్ నిలిపి రే గడపెన్;
లే కెటులు నిద్ర వచ్చుఁన్ రే కగు నామువ్వవిద నెనకు నిల్పినదాఁకన్.

గీ. అపుడు నృపుఁడు ప్రఫుల్ల నవాంబుజ ప్ర
సన్నముఖుఁ డయి బలయుధ్వజ క్షితీశ
కమలహితునకు మామకా గమనవార్తఁ
దెలుపు మంచు విశారదుఁ బిలిచి పనిచె. 217

మలయధ్వజుఁడు అర్జునుని గౌరవించుట.

ఉ. పనిచిన నేఁగి యాతఁడు నృపాలుని మంత్రిముఖాంతరమ్మునం
గనుఁగొని, 'యంత్ర మత్స్యము జగం బెఱుఁగన్ భుజశక్తి నేసి జ
వ్వనిఁ గయికొన్న యర్జునుఁడు వచ్చినవాఁ డిదె తీర్థయాత్రగా
జనవర.' యంచు విన్నపము సల్పిన నంత ససంభ్రమమ్ముగన్. 218

క. తననగరువంటిదే చక్కని నగరొక టాయితమ్ముగాఁ జేసి పురం
బు నలంకరింపఁగాఁ జేసినవాఁడై యపుడు సకలసేవలు గొల్వన్. 219

చ. ఎదురుగ వచ్చి పాండవధరణీశ్వరుఁ డర్జునుఁ గాంచి, 'నేఁడు గా
సుదినము;మీరు రాఁ గలుగుశోభన మెన్నఁడు గల్గుఁ? బ్రోలికిం

216. ఈకరణిన్ = ఈవిధముగా. నాళీక నిభ ఆననన్ = కమలము వంటి ముఖము గలదానిని. రే కున్ అగు = రాత్రికిఁ దగినదైన.

217. ప్రఫుల్ల నవ అంబుజ ప్రసన్న ముఖుఁడు = వికసించిన నూతన కమలము వలెనే తేటగల ముఖముకలవాఁడు. క్షితీశ కమలహితునకున్ = రాజ సూర్యునకు (కమలహితు డనఁగా సూర్యుఁడు - ఇట నీపదము శ్లేషార్థగోచరము, ఇతఁడు అంబుజ ప్రసన్నముఖుఁడు గాన అంబుజహితునివంటివాఁ డయిన మలయధ్వజుఁడు ఇతనికి మిత్త్రుఁడై యితనికార్యమును నెఱవేర్చునని హృదయము). మామక = నాదయిన-ఆగమన=రాక యొక్క - వార్తన్=వృత్తాంతమును - (మామకా గమనవార్త...తనకూఁతును నాకిచ్చి వివాహము చేయుమని అడుగుము అని చమత్కారము).

218. మంత్రి ముఖాంతరంబునన్=మంత్రి మూలముగా. 'యంత్ర...వర'— నీకూఁతునకు ఉత్తముఁడగు వరుఁడు, ఇచ్చి ధన్యుఁడవు కావచ్చును, అని భా.

219. నగరు = దివాణము, ఆయితమ్ముగాన్ = సిద్ధముగా.

బడఁ డొని యుద్ధమునఁ దోఁచి భద్రగజమ్ముల నెక్కి వచ్చి రిం
పోదవ హాళాహాళిఁ గడపి నొత్తెడు పౌఁజులదిక్కు సూచుచున్. 220

గీ. రాజవీథుల నెసఁగ నీరాజనములు,
కటిక వా రెచ్చరింప సైకటికభూమి,
వందిజనములు వొగడఁ, జెల్వొంది మిగులఁ;
బురము సొత్తెంచె నిజసూనుఁ డబ్బురముగాఁగ. 221

క. నెట్టుకొని నరుఁడు గనుచోఁ,
బట్టణమునఁ గలసను స్త్రభామలు కహహా!
యెట్టివిచిత్రమొ! మనసునఁ
బుట్టినవాఁ డపుడు మనసుఁ బుట్టించెఁ జుమీ! 222

ఉ. చక్కఁదనంబు రూపునఁ బొసంగుట కాదు, గుణంబులందునుం
జక్కఁదనంబు గల్గునెఱజాణ, జగంబున నీడు లేని నా
చక్కనిరాఁతునుం దొఱయఁ జాలినవాఁ, డితఁ డల్లుఁ డైనఁ గా
మిక్కిలి కీర్తి గల్గు, నని మెచ్చు మనమ్మున రాజు సారెకున్. 223

చ. అడుగడుగందునున్ మణిపురాధిపుఁ డిట్టుచితోపచారముల్
కడు నొనరించి యుద్వాహనకౌతుకహేతుకళావిశేష మా
విడిదికిఁ దెచ్చి, నిల్పి యతివిస్మయ మొందఁగ విందు వీడుకో
లుడుగరలున్ ధనంజయుని యుల్లము రంజిలఁ జేసె నెంతయున్. 224

---

220. పోలికిన్ = పురమునకు. పదఁడు = తరలుఁడు. భద్రగజంబులన్ = పట్టపుటేనుఁగులను. హాళాహాళిన్=సందడిని. పౌఁజుల=సేనలయొక్క.

221. నీరాజనములు=పురస్త్రీలు సమర్పించువారతులు. సైకటికభూమిన్=సమీపప్రదేశమందు. కటికవారు=వెండిబెత్తాలవారు (చోపుదార్లు). అబ్బురము=ఆశ్చర్యము.

222 నెట్టుకొని = పూనికచేసికొని (లేక - ఒకరినొకరు ప్రక్కకు త్రోసికొని దారి చేసికొని పోయి) మనసునఁ బుట్టినవాఁడు = మన్మథుఁడు. మనసున్ = కోరికను. కుమారుఁడు తండ్రిని బుట్టించుట ఆశ్చర్యము గాదా.

223. చక్క...జాణ—ఇది యర్జునవర్ణనము. దొఱయన్ = పరిగ్రహించుటకు.

224. ఉద్వా...షము = పెండ్లి యుత్సవము కారణముగాఁ గలిగినట్టి సింగా

మ. సరసాగ్రేసర, వాసరప్రభు తనూజ స్థూలలక్షా, పురం
దరజిద్భోగధురంధరా, భరతశాస్త్రప్రౌఢమార్గైకలా
స్యరసాస్వాదనకోవిదా, శ్రవణభూషా దివ్యరత్నత్విషా
తరణిశ్రీకర గల్లభా, విభవభృత్ తంజాపురీవల్లభా. 225

క. తరుణీ మన్మథ, యాశ్రిత । భరణగుణాభరణ శౌర్య,బహు రాజ్యధురం
ధర, సత్యాదిమచక్రే । శ్వర, యభినవభోజరాజ వరబిరుదాంకా. 226

క. యాచనకవినుత, వనితా । సేచనకమనోహరాంగ, శృంగారకళా
సూచన, కమ్రకవిత్వా । లోచన కందళితహర్ష లోలుపహృదయా. 227

రింపుల యతిశయముగలది. విడిదికిన్ = దిగెడుబసకు. అతివిస్మయము = అధికాశ్చర్యమును. వీడుకోలు = సెలవుగొనుట. ఉడుగరలన్ = కానుకలును. ధనంజయుని = అర్జునునియొక్క - ఉల్లము = మనస్సు.

225. సరస అగ్రేసర = రసికులలో శ్రేష్ఠుఁడా, వాసరప్రభుతనూజ = సూర్యసుతుఁడైన కర్ణునివలె - స్థూలలక్షా = మహాదాతా, పురందర జిత్ భోగ ధురంధరా = ఇంద్రుని మించిన భోగములను వహించువాఁడా, భరత శాస్త్ర ప్రౌఢ మార్గ ఏక లాస్య రస ఆస్వాదన కోవిదా=భరత శాస్త్రమందలి ప్రౌఢిమతోఁ గూడికొన్న *మార్గమను పేరుగల ముఖ్యమైన నాట్య విలాసముయొక్క అనుభవమందు పండితుఁడా, శ్రవణ భూషా దివ్య రత్న త్విషా = కర్ణ భూషల సొంపులయందలి శ్రేష్ఠమైన మణులయొక్క కాంతులచేత - తరణి శ్రీ కర గల్ల భా = సూర్యుని శోభను చేయుచున్న చెక్కిళ్ల కాంతిగలవాఁడా, విభవ భృత్ తంజాపురీ వల్లభా = వైభవమును భరించుచున్న తంజావూరనెడు పురమునకు అధిపతీ.

226. తరుణీ మన్మథ=యువతులకు మదనుఁడా. ఆశ్రిత భరణ గుణ ఆభరణ = ఆశ్రయించినవారిని పోషించుటయనెడు గుణమే ఆభరణముగాఁ గలవాఁడా, శౌర్య బహు రాజ్య ధురంధర = పరాక్రమముచేత అనేకరాజ్యముల భారమును వహించిన వాఁడా, సత్య ఆదిమ చక్రేశ్వర=సత్యమందు హరిశ్చంద్రుఁడా, అభినవ భోజరాజ వర బిరుద అంకా = నూతన భోజరాజు అనెడు మేలి బిరుదు కలవాఁడా.

227. యాచనక వినుత=యాచకులచే స్తోత్రము చేయఁబడినవాఁడా, వనితా ఆసేచనక మనోహర అంగ=స్త్రీలకు ఎంత చూచినను తృప్తి తీరని సుందరమైన శరీరము గలవాఁడా, శృంగార కళా సూచన=శృంగార చేష్టలను కనిపింపఁజేయువాఁడా, కమ్ర

* 'మార్గో దేశీతి తద్ ద్వేధా కథితం నాట్య వేదిభిః । తత్ర మార్గోభవే న్నాట్యం నాట్యవేదోక్తలక్షణమ్.'

(తోటకవృత్తము.)

అతులాగమ శాస్త్రనిరస్త సురే
జ్య, తులాధిక విద్వదవాప్త శత
క్రతులాభ, శుభోదయ కారణ ర
త్న తులాపురుషాధిక దానచణా. 228

గద్యము.

ఇది శ్రీసూర్యనారాయణవరప్రసాదలబ్ధ సారస్వతసుధాసారజనిత
యశోలతాంకూర చేమకూర లక్ష్మణామాత్యతనయ వినయ
ధురీణ సకలకలాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ
భూపాలదత్త హస్తముక్తాకటక విరాజమాన

కవిత్వ = సుందరమైన కవిత్వము చెప్పుటయందలి - ఆలోచన = యోజనయందు - కందళిత = అంకురించుచున్న - హర్ష = సంతోషమందు - లోలుప = ఆసక్తిగల - హృదయా = మానసము గలవాఁడా.

228. అతుల = సమానరహితమైన - ఆగమ = ఆగమములచేతను - శాస్త్ర = శాస్త్రములచేతను - నిరస్త = తిరస్కరింపఁబడిన - సురేజ్య = దేవగురువుగలవాఁడా - (ఆగమములందును శాస్త్రములయందును బృహస్పతికంటె ఎక్కువగా తెలిసినవాఁడా - అనుట), తులా అతిగ = మిలిని మించిన - విద్వత్ = విద్వాంసులచేత - అవాప్త = పొందఁబడిన - శతక్రతు లాభ = ఇంద్ర విభవము గలవాఁడా - (లెక్కలేని విద్వాంసులకు ఇంద్రవిభవము నిచ్చినవాఁడా అనుట), శుభోదయ = శుభములపుట్టుకకు - కారణ = హేతువైన - రత్న = నవరత్నములయొక్క - తులాపురుష = తులాభారము - అధిక = మొదలుగాఁగల - దాన చణా = త్యాగమునందు సమర్థుఁడాఁడా.

గద్య = పద్యము కానట్టి వాక్యబంధము. ఇది = ఈ చెప్పఁబడిన గ్రంథము. శ్రీ సూర్యనారాయణ = సూర్యనారాయణ మూర్తియొక్క - వరప్రసాద = మనోరథానుగ్రహముచే - లబ్ధ = పొందఁబడిన - సార సారస్వత = దృఢమైన విద్యలనెడి - సుధా ఆసార = అమృతముయొక్క జడివానచేత - జనిత = పుట్టింపఁబడిన యశః లతా అంకూర = కీర్తియనెడి తీఁగయొక్క మొలకలుగలిగినట్టి - చేమకూర లక్ష్మణామాత్య తనయ = చేమకూర వారనెడి యింటిపేరుగల లక్ష్మణమంత్రి కుమారుఁడును - వినయ ధురీణ = వినయముయొక్క భారమును వహించిన వాఁడును - సకలకళా ప్రవీణ =

వేంకటరాజ కవిరాజ
ప్రణీతంబైన విజయవిలాసం బను
మహా ప్రబంధమ్మునందుఁ
బ్రథమాశ్వాసము

సమస్త విద్యలు తెలిసినవాఁడును...దత్త = ఇయ్యఁబడిన - హస్తముక్తా కటక = చేతులయందలి ముత్యాలు దాపిన కడియములచేత - విరాజమాన = ప్రకాశించుచున్న - వేంకటరాజ కవిరాజ ప్రణీతంబైన = వేంకటరాజు అను కవిశ్రేష్ఠునిచే రచింపఁబడిన.

## ద్వితీయాశ్వాసము.

క. శ్రీధుర్యశౌర్య, ధైర్య। క్ష్మాధరమూర్ధన్య, యాదిగర్భేశ్వర, వి
ద్యాధిక, వితరణదీక్షా। రాధాసుత, యచ్యుతేంద్ర రఘునాథనృపా.

గీ. అవధరింపు కథాకర్ణనాతివేల
హర్షు లయినట్టి దివ్యమహర్షులకును
దత సమస్తపురాణకథాశతాంగ
సూతుఁడై విలసిల్లెడుసూతుఁ డనియె 2

### వివాహార్థమై రాయబారము.

ఉ. ఆ చెలువంపురాకొమరుఁ డంత వయస్యునిఁ జూచి యింపుతో
'నీ చతురత్వ మీవినయ మీ యుచితజ్ఞత యెందు నేనియుం
జూచితె? మైత్రికిం దగిన చో టగు; శోభనపుం బ్రసంగముం
సూచనఁ జేసి రాజుమదిచొప్పెఱుఁగ న్వలదా విశారదా?' 3

మ అనినం 'మీమదిలోఁ దలంచినది మేలొ, సిద్ధసంకల్పు లీ
ర'ని యావేళనె చిత్రవాహనుఁడు కొల్వై యుండఁగాఁ బోయి,యా

1. శ్రీ ధుర్య శౌర్య=సిరితో నిండిన పరాక్రమముగలవాఁడా, ధైర్య క్ష్మాధర మూర్ధన్య=ధైర్యమునందు మేరువువంటివాఁడా, ఆదిగర్భేశ్వర = అగర్భశ్రీమంతుఁడా, విద్యాఅధిక=విద్యలచేత ఎక్కువవాఁడా, వితరణ దీక్షా రాధాసుత=ఈవియొక్క నియమమందు కర్ణునివంటివాఁడా.

2 అవధరింపు=చిత్తగింపుము. కథా ఆకర్ణన అతివేల హర్షులు = కథను వినుటయందు అత్యంతసంతోషముగలవారు. తత...సూతుఁడు = విస్తీర్ణములైన నానావిధములైన పురాణముల కథ అనెడు రథములకు సారథి.

3. వయస్యునిన్ = సఖుఁడైనవిశారదుని. ఉచితజ్ఞత = తగినదాని తెలియుట. శోభనపుం బ్రసంగమున్=శుభకార్యమును గుఱించిన ప్రస్తావమును. చొప్పు=తీరును.

4. సిద్ధ సంకల్పులు=సిద్ధమైనకార్యము నే తలపెట్టువారు. చిత్రవాహనుఁడు =

యన 'రారమ్మ'ని గారవించి సుముఖుండై 'రాజుగారిప్డు దే
మనినా రెయ్యవి వార్తలం'చుఁ బలుమాఱాసక్తితోఁ బల్కఁగన్.

చ. 'అవనితలేంద్ర, మావిభుని హర్షము దేమని విన్నవింతు? సం
స్తవ మొనరించి రింతవడి సామిచరిత్రమె వేయినోళ్ల; న
ర్ణవపతితోడఁ బాంధవ మొనర్చినమాధవులీల వారు బాం
ధవ మొనరింపఁ జిత్తమిడినారు, గుణాంబుధు లీరు గావునన్.' 5

క. నావిని సంతోషము మది! నావిర్భవ మొంద "నా మహారాజునకున్
దేవేరిగ నాకన్యం। బావనగుణ నీవుఁ గనుట భాగ్యము గాదే! 6

చ. కల దొకమాటఁ దెల్పఁగల కార్యము; తొల్లి ప్రభాకరుండు నాఁ
గలఁ డొకఁ డస్మదీయకుల కర్త; యతం డనపత్యుఁడై యచం
చలమతి శంకరున్ గుఱిచి చాలఁ దపం బొనరింప నంతటన్
'గలుగుఁ గుమారుఁ డొక్కఁడుగా'నని యిచ్చె వరంబు వేడుకన్. 7

క. అంగజహరుని ప్రసాదము
నం గలుగుచు వచ్చె సుతుఁడు నాఁ డాదిగ మా
వంగడమున; నది యిప్పుడు
వెంగడమై కూఁతు రుద్భవించెన్ సాకున్. 8

మలయుచున్నవాఁడు. కొలువు = సభ. రాజుగారు = అర్జునమహారాజుగారు.

5. అవనితలేంద్ర = భూమండలేశ్వరా. ఇంతవడి = ఇంతసేపు. సామి=దేవరవారియొక్క - సంస్తవ మొనరించిరి=స్తుతించిరి. అర్ణవపతితోడన్=సముద్రరాజుతో. ఈరు=మీరు. గుణ అంబుధులు = గుణ సముద్రులు. అర్ణ...గావునన్ - మీకూఁతును పరిగ్రహింపం గోరి యున్నారని సారాంశము.

6. నాన్ = ఇట్లనఁగా. ఆవిర్భవము = ఉదయము. దేవేరిగన్ = భార్యనుగా. పావనగుణన్ = పవిత్రమైన గుణములుగలదానిని.

7. ఒకమాటన్ = ఒకమాటచేత (సంగ్రహముగా ననుట). కలఁడు=ఉండెను. అస్మదీయ = మాదైన - కుల=వంశమునకు - కర్త = చేసినవాఁడు (మూలపురుషుఁడు అనుట). అనపత్యుఁడు=సంతానము లేనివాఁడు. అచంచల మతిన్=చలింపనిమనస్సుతో. గుఱిచి = గుఱించి.

8. అంగజహరుని ప్రసాదమునన్ = ఈశ్వరుని యనుగ్రహముచేత. వంగడమునన్=వంశమునందు. వెంగడము ఐ = వ్యర్థమై.

క. ఆ దుహితఁ గుమారునిమ
ర్యాదగఁ జూచుకొని యుండు ; నాకన్నియకుం
బ్రాదుర్భవించువానిన్
నాదుకులంబునకు వలయు నాథునిఁ జేయన్. 9

క. కా దనరా దీకార్యము;
జాదులును బ్రసాద మా విశారద, నాకున్
నాదు హితం బొనఁగూరిచి,
నా దుహితం బెండ్లిసేయు నరనాథునకున్." 10

గీ. అని యతనిఁ బంచె, నాకడాఁకర్జునుండు
సమ్మతించె, ముహూర్తనిశ్చయము సగొప్ప,
హితుఁ డన విశారదుఁడె గాక యొండుఁ గలరె?
కోర్కి వెలయంగ దొరఁ బెండ్లికొడుకుఁ జేసె. 11

## అర్జునుఁడు చిత్రాంగదం బెండ్లియాడుట.

క. సుత్రామనిభుఁడు పాండవధ
రిత్రీవిభుఁ డానతీయ, శృంగార కళా
చిత్రాంగదయుత యగు నా
చిత్రాంగదఁ బెండ్లికూఁతుఁ జేసిరి కాంతల్. 12

9. దుహితన్ = కొమార్తను. మర్యాదగన్ = మాటుగా. ప్రాదుర్భవించు వానిన్=పుట్టెడివానిని. నాథునిన్ = కర్తను.

10. జాదులును ప్రసాదము = జాజిపువ్వులును ప్రసాదము కూడ.

11. పెండ్లికొడుకుఁ జేసెన్=మిక్కిలి సౌఖ్యము నొందించె నని సామాన్యార్థము. వివాహము సమకూర్చె నని వాస్తవము.

12. సుత్రామ నిభుఁడు=దేవేంద్రునితో సమానుఁడైన. ధరిత్రీ విభుఁడు=రాజు. అనతి ఇయ్యన్ = ఆజ్ఞ యియ్యఁగా. శృంగార కళా చిత్ర అంగద యుత=శృంగారమును లావణ్యమును అనెడి యాశ్చర్యకరమైన భుజకీర్తులతోఁ గూడుకొన్నది.

క. గరిత లలంకృతి సేయఁగ
గరువపుమురు వపుడు హెచ్చి కన్నియ దనరెం,
బరిణయపుం గైసేఁతల
నరపతియొఱు పతిశయిల్లునటనఁ జెలంగెన్. 13

మ. తనవంశంబున్నృపాలుపెండ్లిఁ గనుతాత్పర్యంబునన్ వచ్చెనో
యనఁ జంద్రుం డలరెన్; గిరీటి సుము ఖుండై యంతఁ గైసేసి తె
చ్చినభద్రేభము నెక్కి తీవి మెయి వచ్చెన్ బాండ్యభూపాలు లో
చనముల్ సల్లగఁ గ్రొత్తముత్తియపుసేసల్ జవ్వనుల్ సల్లఁగన్. 14

చ నలుగడ హృద్యవాద్యనటనం బొలయుం, గపురంపుటారతు
ల్వెలయు, ద్విజశ్రుతుల్ చెలఁగ, విప్ర వధూ శుభ గానలీల శో
భిలఁగ, వివాహవేదికకుఁ బెండ్లికుమారుఁడు వచ్చె నిట్టు, లా
వల నలపెండ్లికూఁతురును వచ్చె రణచ్చరణాంగదంబులన్. 15

శా. "పంకేజాతములన్ దిసంతు లడుచున్ బాలామణీపాదముల్;
వంకల్ దీర్చు మనోజసాయకములన్ వాల్చూపు; లేణాంకునిన్
శంకల్ సేయు మొగంబు; జక్కవకవన్ జక్కట్లు దిద్దుం గుచా
హంకారంబు; మదాళిమాలికల నూటాడించు వేణీరుచుల్. 16

13. గరితలు=స్త్రీలు. గరువపు మురువు=బింకమైన శృంగారము. పరిణయపుం గైసేఁతలన్=పెండ్లియలంకారముల చేత.నటనన్=విధము చేత. నరపతి=అర్జునునియొక్క.

14. తన...లరెన్—అర్జునుఁడు చంద్రవంశ్యుఁడు. భద్ర ఇభమున్ = భద్ర జాతి యేనుంగును.

15. హృద్య వాద్య నటనంబు = మనోహరమైన వాద్యములతోఁగూడిన నాట్యము. ఒలయన్ = వ్యాపించుచుండఁగా. ద్విజ శ్రుతుల్ = బ్రాహ్మణుల వేదపాఠములు. విప్ర వధూ = బాపన ముత్తైదువులయొక్క. వేదికకున్ = అరఁగునకు. రణత్ చరణ అంగదంబులన్ = మ్రోయుచున్న కాలి యందియలతో.

16. పంకేజాతములన్ = తామరలను. దిసంతు లడుచున్=చెంపలు గొట్టును. మనోజ సాయకములన్ = మన్మథ బాణములను. ఏణాంకునిన్=చంద్రుని. చక్కట్లు దిద్దన్=తీర్పులు దీర్చును. మద అళి మాలికలన్=మదించిన తుమ్మెదల బారులను. వేణీ రుచుల్=జడకాంతులు. ఊటాడించున్=ఉయ్యాలలూఁగించును.

క. హరిపతి నడుమున కోడెన్,
గరువపునడకలకు నోడె గజపతి, యింక న
నరపతి లోనగు టరుదే
వరవర్ణిని మెఱుఁగు వాఁడి వాల్చూపులకున్. 17

ఉ. చక్కనికన్య కామణికిఁ జక్కనివాఁ డసుప్రాణనాథుఁడున్,
జక్కనిశోభనాంగునకుఁ జక్కనియింతియుఁ, గల్గు టబ్బురం
బెక్కడ ; నిట్టు లుండవలదే! రతిదేవికి సాటి వచ్చుఁ జో
యిక్కనకాంగి! మన్మథున కీ యితఁ డీడిత రూపసంపదన్!" 18

క. అని రూపకళలు చూపఱు
గొనియాడఁగఁ, బేరఁటాండ్రు గొందఱు తెర వం
చినఁ జూచె నతివ నర్జునుఁ
డనురాగాంబుధి తటాన నటఁ దెర యెత్తన్. 19

గీ. కలదు లే దన నసియాడుకౌనుతీరుఁ,
దళుకు మొగమున కెగయు గుబ్బలబెడంగుఁ,
జూచి యాతని నిడువాలుఁజూపు లపుడు
నిండువేడుక మిన్నంది కొండఁ దాఁకె. 20

17. హరిపతి = శ్రేష్ఠమైన సింహము (అశ్వపతి అను రాజును). గరువపు = గౌరవముగల. గజపతి = గజశ్రేష్ఠము (గజపతి అను రాజు). నరపతి = అర్జునుఁడు (నరపతి అను రాజు). వర వర్ణిని = శ్రేష్ఠమైన కాంతి గల యాచిత్రాంగదయొక్క. వాల్చూపులకున్ = దీర్ఘదృష్టులకు. సింహగజములు దూరమున నుండుటయుం నరుఁడు మేనం గలయుంటయుం 'ఓడెన్' 'లోనగుట' అనుపదముల స్వరసార్థము.

18. అబ్బురంబు = ఆశ్చర్యము. శోభన అంగునకున్ = శుభలక్షణములుగల దేహముగలవానికి. కనకాంగి = బంగారువంటి యంగములుగల చిత్రాంగద. ఇతఁడు - ఈ డిత = స్తుతిఁజేయఁబడిన. ఈడు = సమానుఁడు.

19. చూపఱు = చూచువారలు. అనురాగ అంబుధి = ప్రేమ అను సముద్రము. అటె = అట్టె = ఆశ్చర్యకరముగా. తటానన్ = ఒడ్డుపైకి. తెర యెత్తన్ = పొంగి కరట్లెత్తఁగా.

20. అసియాడు = జవ్వాడు కౌను = నడుముయొక్క. మిన్న...దాఁకెన్ =

చ. చిలుకలకొల్కి గన్గొనియెఁ జేరలఁ గొల్వఁగ రానికన్నులన్,
మొలకమెఱుంగు నిలువుల ముద్దులు గారు నొయారిమీసముల్
కలకల నవ్వు చక్కని మొగంబు వెడందయురంబు, సింగమున్
గలఁచు రువాణపుంగవును, గల్గిన యా కురువీరపుంగవున్. 21

క. అంగజరాజ్యం బేలుట
కుం గట్టినతోరణం బొకో యన నతఁ డా
శృంగారవతికిఁ గట్టెన్
మంగళసూత్రంబు చతురిమన్ గళసీమన్. 22

మ. అనురక్తిం దలఁబ్రాలు వోసె విజయుం డావేళ బంగారుకుం
డన రం గౌ నలినీలవేణిపయిన్ ముత్యాల్ దోయిటన్ ముంచి, 'చ
య్యనఁ బా లొప్పొంగినకైవడిన్ సిరులపెంపై, పూలు రే కెత్తిన
ట్లనె వర్ధిల్లు మ' టన్న దీవనల కెల్లం దావలం బై తగన్. 23

గీ. తామ్రపర్ణీనదీ తీర ధరణి నేలు
దొరతనముఁ దెల్పఁగా రాశి దొరలఁ బోసె
ముదిత చేతులఁ దలఁబ్రాల ముత్తియముల,
ముదితచేతు లగుచు సభాసదులు వొగడ. 24

అత్యంతానందము బొందెను మింటివంటిదైన నడుముం జూచుట మిన్నందుట—కొండల వంటి కుచములం గాంచుట కొండఁ దాఁకుట - అని చమత్కారము.

21. చిలుకలకొల్కి = సుందరి. వెడంద = విశాలమైన. రువాణపుంగవును = అందమైన నడుము.—సింహమునకు నడుము సన్నము.

22. అంగ...బొకో = మన్మథరాజ్యమును ఏలుకొనుటకు కట్టిన తోరణమో అన్నట్లు—మంగళార్థము శుభకార్యారంభములందు గృహద్వారములందు తోరణము గట్టుదురు. చతురిమన్ = చాతుర్యముచేత. గళసీమన్ = కంఠప్రదేశమున.

23. దోయిటన్ ముంచి = దోసిటనిండ ముంచి యెత్తి. బంగారుకుండ అనన్ రంగు సౌగుణాతిశయముచే ప్రియమయినదిగావునను ముద్దుచేతను బంగారుకుండ అని పేర్కొనం దగినదైన - అలి నీల వేణి పయిన్ = తేంట్లవంటి నల్లని జడగలదైన పెండ్లికూఁతుమీఁద.

24. తామ్ర...తెల్పన్-తామ్రపర్ణియందు ముత్తెములు పుట్టును. ముదిత=బాల.

## ర హః క్రీ డ

క. ఈచందంబునఁ గళ్యా। ణోచితకృత్యంబు లెల్ల నొనరిచి యంతన్
రాచూలి భోగ్య వస్తు। ప్రాచుర్య మనోజకేళి భవనమునందున్. 25

చ. మినుకుఁగడాని జీనిపని మేలిమి మంచముపై వసించి యుం
డినయెడ, నొయ్యనన్ సఖులు నేర్పునఁ దోడ్కొనివచ్చి మ్రోల జ
వ్వని నిడి, తోడిచూపులకు వచ్చినవారును బోలె వెన్కకుం
జని; రవ్వఁ గాదె పై నతనుసంగర మానవమోహనాంగికిన్. 26

ఉ. చంచలనేత్రఁ గాంచి నృపచంద్రుఁడు మోహము నిల్పలేక చే
లాంచల మంటి శయ్య కపు డల్లనఁ దార్చి, కవుంగిలింప నుం
కించుఁ, బయంట నంటఁ గమకించుఁ, 'జెలించు టదెప్పు డెప్పు'డం
చించుక సేపులోన మెఱయించు ననేకమనోవికారముల్. 27

ఉ. 'కానుక గాఁగ నిత్తు బిగికౌఁగిలి, పల్కవె కీరవాణి! నీ
దౌనుడితేనె నా చెవుల నానఁ గృపారసధార నాన న

ముదిత చేతులు = సంతోషించుచున్న మనస్సుకలవారు. సభాసదులు = సభ్యులు.

25. రాచూలి=రాజకుమారుఁడైన యర్జునుఁడు. భోగ్య...నందున్=అనుభవ యోగ్యమైన వస్తు సమృద్ధిచేత సుందరమైన క్రీడాగృహమునందు.

26 మినుకు కడాని జీని పని = కాంతిగల కుందనపుఁ దీఁగ పనిగలిగిన. ఒయ్యనన్=మెల్లగా. సఖులు=చెలికత్తెలు. పైన్=మీఁద - అనంతరము. అతను సంగరము= గొప్ప దురము (మరు దురము అని భా.)—యుద్ధమునకు పోవువారిని మిత్రులు వెంబడించి వచ్చి చూచుకొని యుద్ధ మారంభింప నుండఁగా వీడ్కొని వెనుకకుం బోదురు; గొప్ప మదన యుద్ధము కానున్నది గావున చెలులు చిత్రాంగదను చూచుకొని వెనుకకుం బోయిరి; అని భా.

27. చేల అంచలము = చీర చెఱఁగును. అల్లనన్ = మెల్లగా. తార్చి = కదియించి. ఉంకించుచున్ = యత్నము చేయుచును. పయంటన్=పయ్యెదను. గమకించుచున్= పూనిక చేయుచును. చెలి=కాంత. ఇంచుట=ఇష్టపడుట. ఇంచించుక=మిక్కిలి కొంచెము;

28. కానుక = ఉడుగర. కీర వాణి = చిలుక పలుకుల దానా. నుడి తేనె= మాటయను మధువు. చెవులన్ ఆనన్ = చెవులయందు సోఁకునట్లుగా. కృపా రస ధారన్ నానన్=దయా రస ధారచేత తడియునట్లు. నలిన ఆనన=పద్మము వంటి ముఖముఁ

న్నానన మెత్తి చూచు నలినానన; గోలతనాన నేల లో
నానఁ జలంబు? నీకు మరునాన సుమీ; విడు నాన యింకిటన్. 28

ఉ. చక్కెరవింటిదేవర ప్రసాదముఁ గైకొను మిప్పు డింద మో
చక్కెరబొమ్మ' యంచు విలస న్మణికంకణ హస్త మంటి, వే
రక్కఱఁ గప్పురంపువిడె మానెఱజాణ యొసంగి, నిక్కి లేఁ
జెక్కిలి ముద్దువెట్టుకొనెఁ జెప్పెడి దే మిఁక నావినోదముల్! 29

ఉ. ఇగ్గడు వెన్కకుం బయికి నీడ్చినఁ, బైఁట దొలంగఁ జేయఁ గే
లొగ్గదు, రెమ్మి పోఁకముడి యూడ్చినఁ గ్రుంగిలి రెండుకొంగులున్
బిగ్గ నడంచుచున్ విడిచిపెట్టదు; బాల ననం బనేమి? యా
సిగ్గుకు సిగ్గు లే దిటులఁ జేసినపిమ్మట నుండవచ్చునే! 30

గీ. "కోర్కి వెలయంగ నినుఁ దెచ్చి కూర్చినట్టి
తియ్యవిలుకానిఋణ మెందుఁ దీర్చికొందు
నువిద నీచేయి చూచుకయున్న నాకు
నింద మని యంది నీవి నీ వియ్యకున్న? 31

సీ. మకరకేతనుఁ గూర్చి మకరికాలతలు నీ
చెక్కుల వ్రాయంగ మ్రొక్కుకొంటిఁ,

గలదా నా. గోలతనానన్ = బేలతనముచేత. లోన్ చలంబున్ ఆనన్ = మనస్సులో చలము వహించుట. మరు నాన = మన్మథునిమీఁద ఒట్టు; నాన=సిగ్గును.

29. చక్కెరవింటిదేవర=కామదేవునియొక్క. ఇందము = ఇదిగో పుచ్చుకొమ్ము. విలసత్=ప్రకాశించుచున్న. పేరు=మిక్కుటమయిన.

30. ఇగ్గడున్=వెనుకకుతగ్గును. రెమ్మి=ఒడిసి. క్రుంగిలి=ముడుచుకొని. బిగ్గన్=బిగియునట్లుగా. ఇటులన్ చేసిన పిమ్మటన్=ఇంత చీకాకు పెట్టినతర్వాత. ['పనియేమి' 'సిగ్గునకున్'—సాధువులు.]

31. నీచేయి చూచుక యున్న = ముడిని విప్పనీయక బిగఁబట్టికొనియున్న నీ హస్తమును చూచుచున్నట్టి (విన్నాళ్ళ్ర్యాది యున్నట్టి అని యర్థము). నీవిన్=కోఁకముడిని (మూలభవము ననియు).

32. (౧) 'కూర్చి'-ఇది సమాపకక్రియకు విశేషణము. మ్రొక్కుకొన్న విధ మెట్లన—'ఓ మకరకేతనుఁడా, ఆకన్యను నాకుఁ గూర్తువేని దాని చెక్కిళ్లను నీకు

కుసుమాకరునిఁగూర్చి కుసుమమాలికలు నీ
వేనలిఁ దుఱుముంగ వేఁడుకొంటి,
గంధవాహునిఁగూర్చి గంధసారంబు నీ
గుబ్బలఁ బూయంగఁ గోరుకొంటి,
మృగలాంఛనునిఁగూర్చి మృగమదంబున నీకుఁ
దిలకంబు దిద్దఁ బ్రార్థించుకొంటి,
గీ. నిన్ను వరియించునప్పుడే యిన్ని సేయు
వాఁడ నని మున్ను శృంగారవనములోనఁ
వల పెఱిఁగి యేలుకోఁగదే కలికి." యనుచుఁ
గేలి కెలయించె నమ్ముద్దరాలి నపుడు. 32

క. చొక్కులిపొంతఁ గరం బిడి
చెక్కులిచెంత నొకకొంత చిఱునవ్వొలయం
జక్కులిగింతలు గొలిపెన్
మిక్కిలి వింతలుగ రతికి మేకొన నంతన్. 33

ఉ. డాసిన నింగితం బెఱిఁగి డాయఁగ నేరక, తత్తఱంబు న
జేసిన నేతకుం బదులు సేయ నెఱుంగక, మేను మేనితో

ప్రియములయిన మకరికాస్వరూపములవ్రాఁతతో అలంకరించెదను'-అని; ఇట్లే కడమ పాదంబులందు. మకరకేతనున్ కూర్చి=మొసలిటెక్కెము వాఁ డగుమన్మథునికి ప్రీతిగా. మకరికాలతలు=కస్తూరి మొదలగువానిచే వ్రాయఁబడిన మకరికాకృతులుగల తీఁగలు, ...ఇక్కడ మకరికలకును మకరకేతనునకును సంబంధము, ఇట్టే అన్నిటను, [మఱియు నిట-కేతనము మకరము మగది - వ్రాఁత మకరిక ఆఁడుది-ఇందులం గల స్వారస్యమును ఊహించుకొనవలయును]. (౨) కుసుమాకరునిన్=వసంతుని. వేనలిన్ తుఱుముంగన్= కొప్పున ముడిచెద నని. (3) గంధ వాహునున్ = (పరిమళములను వహించు) గాలిని. గంధసారంబు = శ్రీచందనమును. (౪) మృగలాంఛనునిన్ = (లేడి చిహ్నముగాఁగల) చంద్రుని. మృగమదంబునన్=(లేడిబొడ్డునఁబుట్టినదైన) కస్తూరితో. తిలకము=బొట్టు.

ఎలయించెన్=ఆకర్షించెను.

33. చొక్కులిపొంతన్=నాభిసమీపమున. మేకొనన్=అంగీకరించునట్లుగా.

34. డాసినన్ = కదియఁగా. ఇంగితంబు = మనోభావమును కళలుఱుమన్మథ

రాసినయంత నే కళలు రంజిలి, కౌఁగిట జాల యుండెఁ బో;
యాసుఖ మింత దంత దన నైనది గాదుగదయ్య క్రీడికిన్. 34

## గర్భదోహదము.

ఉ. అంగజరాజ్యవైభవసుఖాంబుధి నీగతి నోలలాడి, చి
త్రాంగద సేవఁ జేయ, మలయధ్వజునిల్లటపల్లుఁడై, తదీ
యాంగబలంబు గొల్వ, నరుఁ డంపుల రాజ్యము సేయుచుండ, నా
సింగపుఁజిన్ని లేనడుము చెల్వకు గర్భము నిల్చె నంతటన్. 35

శా. మించెం బోరచి కోరికల్, గడు విజృంభించెం దనుగ్లాని, గా
న్పించెన్ మేచకకాంతి చూచుకములన్, జెక్కిళ్లపైఁ దెల్పు రె
ట్టించెన్, గూర్కులు సందడించె, నడ చండించెన్, మృదామోదమున్
గాంచెన్ వాతెఱ, యోసరించెఁ ద్రివళుల్ సాసాఁటికిం బోటికిన్. 36

క. సీమంతవతీమణికిన్ । సీమంతముఁ జేసి రపుడు నెల లెనిమిదిగా,
శ్రీమంతు కెక్కు గర్భ । శ్రీమంతుం డితఁ డనుట సిద్ధము గాఁగన్.

కళాస్థానములు. రంజిలి = కరఁగి. క్రీడికిన్=అర్జునునికి (క్రీడగలవాని కనియు).

35. అంగజ రాజ్య వైభవ సుఖ అంబుధిన్=సంభోగ సుఖమనెడు సముద్రము నందు. ఓలలాడి = ఈఁదులాడి. ఇల్లటపు = మామగారియింటనే యుండెడి. తదీయ అంగ బలంబు = ఆ మలయధ్వజుని పరివారము.

36. బోటికిన్=చిత్రాంగదకు, రుచి=కాంతియు (రుచి కోరికల్ = రుచులు గలపదార్థములపై కోరికలు - అని యేని;—పా. పోరచికోరికల్ = మూడిదలపై యభిలాషలు)...తనుగ్లాని = శరీరాయాసము, కడున్=మిక్కిలి, విజృంభించెన్=వ్యాపించెను; మేచకకాంతి=నల్లనికాంతి, చూచుకములన్ = చనుమొనలయందు; చెక్కిళ్లపైన్=గండస్థలములయందు; కూర్కులు సందడించెన్=నిద్రలు బలమాయెను; నడ చండించెన్=నడక మందమాయెను; మృత్ ఆమోదమున్=మట్టివాసనలను; త్రివళుల్=కడుపు మీఁద మూఁడుగానుండు ముడుఁతలు, ఓసరించెన్=తొలఁగిపోయెను.

37. సీమంతవతీ మణికిన్=(సీమంత మనఁగా పాపట - అది గలది సీమంతవతి) స్త్రీరత్నమగుచిత్రాంగదకు, సీమంతము=సీమంతోన్నయనమను గర్భసంస్కారమును. శ్రీన్ మంతుకున్ ఎక్కు = ఐశ్వర్యముచేతఁ బ్రసిద్ధిఁబొందెడు - గర్భశ్రీమంతుఁడు= తల్లిగర్భమునం దున్నది మొదలుగా నే భాగ్యవంతుఁడు. ఈతఁడు = ఈజనించునట్టిబా

## బ భ్రు వా హ న జ న న ము.

క. ప్రొద్దుల నెలలన్ వేవుర
సుద్దులుగాఁ జేయఁదగు మహోయశములు గా
ముద్దులబాలునిఁ గనియెను
బ్రొద్దులనెల యెడల నిందుముఖ శుభవేళన్. 38

చ. ధనము లసంఖ్యములు హితబుధద్విజకోటికి నిచ్చి, యప్పు డా
తనయుని బభ్రు వర్ణమాయ ధట్టము నేలెడు నంచు బభ్రువా
హనుఁ డని పేరు పెట్టి, చెలు వందఁగ బంగరుఁదొట్లఁ బెట్టి, శో
భనవిభ వాప్తి రంజిలిరి పాండవపాండ్యవసుంధ రాధిపుల్. 39

సీ. తన కులస్వామి తండ్రిని సుధాంబుధిఁ బోలుఁ
బాలబుగ్గల మించు లీలఁ గనుటఁ,
దన పితామహుని బృందారకాధిపుఁ బోలు
రెప్ప వేయక చూచు రీతిఁ గనుటఁ,



లుఁడు. ['మంతునకున్' - సాధువు.]

38. ప్రొద్దుల...వురన్=సూర్యులను చంద్రులను వేయిమందిని, ఉద్దులుగాన్= సమానులనుగా,...మహః యశములు గాన్ = తేజస్సును కీర్తియును పొందునట్టుగా [అనఁగా వేయిమంది సూర్యులతో సమాన మగు తేజస్సును వేయిమంది చంద్రులతో సమానమగు కీర్తియును పొందువాఁ డగునట్లుగా],...ప్రొద్దుల నెల = ప్రసవించు టకు సమయమైన మాసము, ఎడలన్ = ముగియఁనప్పటికి - (అనఁగా తొమ్మిదవనెల నిండఁగానే).—కలుగనున్న మహోయశములు జననకాలగ్రహాదిసంపత్తివలనం దెలిసినవి.

39. బభ్రు వర్ణ మాయ ధట్టమున్ = పచ్చని వర్ణముగల గుడ్డముల సంపుసు. శోభన విభవ ఆప్తిన్ = శుభ మహోత్సవ ప్రాప్తిచేత.

40. (౧) పాల...నుటన్=పాలు గారెడు బుగ్గలచేత (చెక్కిళ్లచేత అని బా లకపరము - బుడగలచేత అని సముద్రపరము) అతిశయించుచున్న విలాసమును పొంది యుండుటచేత - కుల...బుధిన్=వంశకర్తయైన చంద్రునకుఁ దండ్రియైన పాలసము ద్రుని —బాలుఁడును క్షీరసముద్రుఁడును పాలబుగ్గలు గలవారు గనుక పోలిక యున్న దనుట. (౨) పితామహునిన్ = తండ్రికిఁ దండ్రియైన, బృందారక అధిపున్=దేవేం ద్రుని.—బాలుఁడును ఇంద్రుఁడును రెప్పపాటు లేక చూచువారు గనుక పోలిక యున్న

దన వంశకర్త నుత్పలబాంధవునిఁ బోలుఁ
గరము లర్మిలిఁ జాఁచి గారవిలుట,
దన తాతయనుఁగుఁదమ్ముని నుపేంద్రునిఁ బోలు
నల్లనల్లనఁ దప్పటడుగు లిడుటఁ,
గీ. దాన గాంభీర్య వైభవ దాన కృపలు
కల వని కనంబడఁగ, వేఱ తెలుప నేల?'
యని గురుజనంబు లెంతయు నాదరింపఁ,
జిన్నిబాలుండు ముద్దులు చిలుకుచుండె. 40

గీ. ఆడి తప్పని ధర్మజు ననుఁగుఁదమ్ముఁ
డాకుమారకుఁ జిత్రవాహనున కపుడు
వంశకరుఁగా నొసఁగి వేడ్క, వారిచేత
నంపకము గాంచెఁ దీర్థయాత్రాభిరతిని. 41

సౌభద్రతీర్థము.

మ. చని యాదక్షిణపుణ్యభూమిఁ గనుచున్ సౌభద్రతీర్థంబునం
దును స్నానం బొనరింపఁ బోవ,నట మౌనుల్ గొంద "ఆహా, నిలుం

వనుట - తెప్ప వేయక చూచుట శిశువులకు స్వాభావికము. (3) కరములు = చేతులను, అర్మిలిన్ = ప్రేమతో, గారవిలుటన్ = గారాబముగా నుండుటచేత, ఉత్పలబాంధవునిన్ = కలువల చెలికాఁడైన చంద్రుని.—బాలుఁడును చంద్రుఁడును కరములు చాఁపువారు గనుక పోలిక యున్న దనుట. (౪) తాత...మ్మునిన్ = తాతయైన యింద్రునికిఁ దమ్ముఁడగు, ఉపేంద్రునిన్ = త్రివిక్రమమూర్తిని.—బాలుఁడును త్రివిక్రమమూర్తియును అడుగులు వ్యత్యస్తముగా నుంచువారు గనుక పోలికయున్న దనుట.

దానన్ = ఆ హేతువుచేత, గాంభీ...పలు = గంభీరతయును (అనఁగా తనలోఁతు పరులకుఁ దెలియనీయమి) ఐశ్వర్యమును త్యాగమును దయారసమును. తుల్యరూపచేష్టలచేత తుల్యగుణవిశేషంబులను పెద్ద లూహించి రని భా. జాతకుఁడు తనవంశ పూర్వులను స్వరూప క్రియా గుణములందు పోలుట సహజమే గాన ఈవర్ణన సొంపుగా నున్నది.

41. అభిరతిన్ = కోరికచేత.

42. అనఘ = పాపరహితములయిన (పాపము నడంచునవైన)-ఏతన్ముఖ = ఇది

దనఘైతస్ముఖపంచతీర్థములయం దత్యుగ్రనక్రంబు లుం
డును, నూఱేఁడులనుండి, యిందు నొకనాఁడుం జేరరా దేరికిన్. 42

గీ. 'మోక్షమునకుఁ బోవ మొసలెత్తుకొనిపోయె.'
ననెడువార్త నిక్కమగు నటంచుఁ
గ్రుంక వెఱతు రెవ్వరును; మీర లటుఁ బోకుఁ"
డనిన నవ్వుకొనుచు నర్జునుండు. 43

గీ. ఏను దీర్థము లాడఁగఁ నేగుదెంచి,
యేనుదీర్థము లాడ నోడివలఁ జనుట
పౌరుషమె? యంచుఁ గ్రుంకఁ బో వారిచరము
పట్టె; బట్టిన నమ్మహాబాహుబలుఁడు. 44

క. ఎడమ కరంబుననే య
య్యెడ మకరముఁ బట్టి బైటి కీడిచి వైవన్,
వడి భూమికిఁ జూపినకై
వడిఁ దొల్లిటిరూపు వాసి; వాసి యొసఁగన్. 45

ఉ. పట్టువగుబ్బలుం, దొగరువాతెఱయున్, జిఱునవ్వు వెన్నెలల్
దొట్రిలు ముద్దుమోమును, దళుక్కను మేను, వెడంద సోగ యై
వట్రిలు కన్నుదోయి, నిడువాలుకురుల్, బటువుంబిఱుఁదు, లేఁ
గుట్రనునుం గవున్, గలుగు కోమలి యై యెది మ్రోల నిల్చినన్.46

మొదలుగాఁగలవైన. నక్రంబులు=మొసళ్లు.

44. ఏను=అయిదు - నేను. ఓడి (=వెఱచి.) ఇవలన్. వారిచరము=మొసలి.

45. కరంబుననే = చేతనే. మకరమున్=మొసలిని. భూమికన్ = వేనముస.
కైవడిన్ = విధమున. పాసి = విడిచి. వాసి = చక్కఁదనము.

46. సోగ=విశాలమును దీర్ఘమును. వట్రిలు = తీరుగలిగియుండు. నిడువాలు
కురుల్ = పొడవు గలిగి వాలియుండు తలవెండ్రుకలును. బటువు=వట్రువయైన. లేఁ
గుట్రనునుం గవున్ = లేఁతదై సన్నని కోమలమైన నడుము. కోమలి = మృదువైన
శరీరము గలసుందరి. మ్రోలన్ = ఎదుట.

క. ఆ లోలనయనఁ గనుఁగొని,
యాలోచన సేసె నృపతి యద్భుతమతి యై
యాలో, 'నిది యచ్చరప్రో
యాలో! కా కల్లమరుని యాలో!' యనుచున్. 47

క. "ఈబాలమోమునకు నా | జాబిల్లికి నెంతదవ్వు! సరి వచ్చునొకో!
యీాబిడచనుఁగవ కొకమె | ట్టా బంగరుగట్టు! తక్కువౌ నెంచంగన్.

క. నడు మెంతసైక! మోహో!
పిడికిటిలో నణఁగు; బెళుకు బెడిదపుమీలన్
గడ కొత్తుఁ గన్ను లౌరా!
జడయందము సెప్పఁ బాఁప జగతిం గలదే!" 49

మ. అని యాక్రీడి మనంబునం బొగడి, 'యుగ్రాకారనక్రంబ వై
మును పట్లుండిన దేల? మేలుఁజెలువంపుంగల్కి వై యిప్పు డొ
ప్పిన దే? మెవ్వరిభామినీమణివి? నీ పే రేమి?' నా, నిట్లనున్:—
విను మోభూవర, యానుపూర్విగఁ బురావృత్తాంత మాద్యంతమున్.

47. ఆ లోలనయనన్ = చలించుచున్న కన్నులుగల యా చిన్నదానిని. ఆలోన్ = అంతలోపల. అచ్చరప్రోయాలో = అప్సరఃస్త్రీయో. కాక, అల్లమరుని యాలో = రతీదేవియో.

48. జాబిల్లికిన్ = చంద్రునకును-ఎం...వ్వు = ఎక్కుడి కెక్కుడ (చంద్రుఁడు సాటి గాఁ డనుట). సరి వచ్చునొకో — రాఁడనుట - (దూరము గావున వచ్చి ప్రక్కను సరిగా నిలువనేరఁ డని చమత్కారము) బంగరుగట్టు = మేరుపర్వతము. ఒకమెట్టా = ఒక తాపమా-(ఒకమెట్టు = ఒక కొంచెము - అబంగరుగట్టు - అని యేని). తక్కువౌన్ = కొంచెతపడును - (ఈబాల కుచములముందఱ మేరుపర్వతము ఒక మెట్టయా అనగా ఒక కొండయా - కాదు - ఆకుచములకన్న పల్లమే అగును-అని చమత్కారము).—సహజముగానే, 'ఇన్దుర్ద్వివలక్ష'మ్మను వాక్యముప్రకారము చంద్రుఁడు దూరమున నున్నాఁ డనియు, కొండలు ఎక్కుడు రనియు, 'దవ్వు' 'మెట్టు' అనుపదముల స్వారస్యము.

49. సైకము = సూక్ష్మము. బెళుకు = తళతళమని ప్రకాశించునట్టి. పాఁపజగతిన్ = నాగలోకమునందు నుచితము [జడ పాముకంటె సుందర మనుట].

50. ఆనుపూర్విగన్ = మొదటినుండియు. ఆ+ఆద్యంతమున్ — మొదలు సమాప్త

క. ఏ నంద యనెడునచ్చర
చానం; దరుణేందుధరుని సఖుని యనుంగన్;
నా నెచ్చెలులు త్రిలోకీ
యానేచ్ఛలు గలరు నల్వు రతులశుభాంగుల్. 51

గీ. వారు లలిత, పద్మ, సౌరభేయి, సమీచి
యనెడు పేర్లు గల్గు నట్టివారు;
జగము లెల్లఁ జూచి చనుదెంచుచో మేము
వనధి కాంచి నొక్క వనము గాంచి 52

మ. 'విహరించున్ మలయానిలం బచటఁ.' 'దావిం జిల్కి నెమ్మేనియా
విహరించున్.' 'పికనాదముల్ చెవికిఁ గావించున్ జవుల్.' 'పోదమా
సహకారాళిపదంబుఁ జూడఁగ వయస్యాహాళి వాటిల్లెడున్.'
'సహకారాళిపదంబుఁ జూడఁగ వయస్యాహాళి యానే కదా. 53

51. అచ్చరచానన్=అప్సరః స్త్రీని. తరుణ ఇందు ధరుని సఖుని అనుంగన్ = లేఁత చంద్రుని ధరించిన శివునకు స్నేహితుఁడైనకుబేరునకు ప్రియను. త్రిలోకీయాన ఇచ్ఛలు=మూఁడులోకములయందలి సంచారమందు కోరికగలవారు. అతుల=సాటిలేని.

52. వనధి కాంచిన్ - వనధి = సముద్రము - కాంచిన్=మొలత్రాడుగాఁగల దైన (అనఁగా చుట్టును సముద్రముగలదైన) భూలోకమునందు.

53. 'విహ—బచట'—'తావిన్...హరించున్'—'పిక...చవుల్'—'పోద...ల్లెడున్'—'సహా...కదా'—ఈ అయిదువాక్యములును ఐదుగురవి. తావిన్ = పరిమళమును - చిల్కి = చల్లి (ఇచ్చి). ఆవిన్=శబ్దను - హరించున్ - కర్త మలయానిలము - దేహమునకు నెట్టను తోలంగించి పరిమళముం గలిగించు నని భా. (తాన్ = తాను - విన్=వీని - చిల్కి = త్యజించి - విహరించు అనుపదములో వీని వదలినచో హరించున్ అగును అని చమత్కారము). పికనాదముల్=కోకిలాస్వరములు-చవుల్ = రుచులను - కావించున్ (నాదముల్=నాను ఇచ్చునట్టివి-కాన్=కాను - వించున్ = వినుచున్=వినఁబడుచును - అని చమత్కారము) సహ...ల్లెడున్ = తియ్యమామిడిచెట్ల (అళి=) చాలుపులకు స్థానమును (అనఁగా మామిడితోఁటను) చూచుటకు అను ఓస్నేహితురాలా కోరిక కలుగుచున్నది. చతుర్థపాదమునకు 'నీవు చెప్పినమాట సరియే గదా' అని భావార్థము - (సహకార = హాకారముతోఁ గూడిన ఆళిపదంబున్ = ఆళియను

క. అని యితరేతర చతురో
క్తి నిగుంభన మెఱయ నరిగి, తేఁటువ, నందున్
ముని యొకఁడు తపము సేయఁ
గని, యది విఘ్నంబు సేయఁ గడఁగి కడంకన్. 54

క. నెఱికురులు, గేలుఁజిగురులు,
నిఱిచన్నులు, విరివికన్ను, లించుకకౌనుల్,
చిఱుదొడలు, నంచనడలున్,
మెఱుపులయొఱపులు ఘటింప, నిలిచి నటింపన్. 55

క. మాపొలు పొకింత గనుఁగొని,
తాపసుఁ డట వలపుపేరు దైవ మెఱుంగున్!
శాప మొసఁగె మకరులుగాఁ,
గోపరసావేశ రూక్షకుటిలేక్షణుఁడై. 56

క. అందులకుఁ జాల భయపడి,
యందఱ మడుఁగులకు వ్రాలి, యతిదీనతతోఁ

శబ్దమును - (వ్రా+అళి = వ్రాళి - అనుట)—

54. ఇత...భన=ఒండొరుల చతురవాక్య రచన. అరిగి = ఏఁగి. తేఁటువన్ = తెగువతో. కడఁగి = పూనుకొని. కడంకన్ = పూనికతో.

55. నెఱి...కురులున్ = వక్రత కలిగిన తలవెండ్రుకలును. కేలుఁజిగురులున్ = చిగురుటాకులవంటి హస్తములును. ఇఱి = క్రిక్కిఱిసిన. ఇంచుకకౌనుల్ = సన్నని నడుములును. చిఱు = చిన్న. అంచ = హంసయొక్క. మెఱపులయొఱపులు = మెఱపుఁదీఁగల కాంతులను. ఘటింపన్ = సమకూర్చునట్లుగా. నిలిచి నటింపన్ = ఎదుట చేరి నాట్యము సేయఁగా.—నటనలీలా సులభ చలనములచే అవయవముల లావణ్యము మెఱయుచు మెఱుఁగుచు మెఱపుల విలసనముగా నగపడు నట్లు అని భా.

56. పొలుపు = విలాసము. ఒకింత = కొంచెము. వల...ఱుంగున్ = మోహించుమాట దేవుఁడెఱుఁగును గాని. మకరులు = మకరీశబ్దముయొక్క బహువచనము) ఆఁడుమొసళ్లు. కోప...డు = కోపరసముయొక్క యొగుపుచేత తీక్ష్ణమైనట్టియు (కుటిల=) కుత్సితమైనట్టియు (ఈక్షణుఁడు=) చూపులు గలవాఁడు.

57. కొంవలపడక్ = వ్యాకులపడఁగా. డెందము = హృదయము. అక్క

గొందలపడ, నవు డాతని
డెందము గైకొనియె నక్కటికపుం బెంపున్. 57

ఉ. శీతలదృష్టిఁ జూచి మునిసింహుఁడు 'శాపవచనం బమోఘ మో;
భీతమృగాక్షులార, మది బెగ్గిల నేల? యికన్ వినుఁడు, మీ
చేత గృహీతుఁడై సలిలసీమను నెవ్వఁడు వెల్వరించు మి
మ్మాతఁడె శాపమోక్షకరుఁ డయ్యెడుఁ బొండ'ని పంచెఁ బంచినన్. 58

చ. 'ఇలఁగలవీళ్లు సూడ మన మేటికిఁ బోవలెఁ! బోయినన్ వనిన్
నిలువఁ బ నేమి! నిల్చిన మునిం గని త్రుళ్లఁగ నేల! యంతలో
నలిగి శపింప నేమిటికి నాతఁడు! వ్రాఁతఫలంబు దప్పునే!
కలిగినవే కదా మకరికల్ మన కెప్పుడు వ్రాసి యుండుటల్!' 59

గీ. అనుచు ననుతాపమునఁ ద్రోవఁ జరుచునుండ,
నారదుఁడు సూచి, 'యచ్చరలార, మీరు
చిన్నవోయినమొగముల నున్నవార
లే మి?' నినఁ బూర్వవృత్తాంత మెల్లఁ దెలిపి. 60

గీ. 'ఋషితిలక, కంటివే మా యదృష్ట రేఖ?
కుడిచి కూర్చుండి యిదె యొకబెడఁద దెచ్చు

టికపుం బెంపున్ = దయాతిశయమును. కయికొనియెన్ = పొందినదాయెను.

58. మునిసింహుఁడు = మునిశ్రేష్ఠుఁడు. అమోఘము = వ్యర్థముకానిది. ఓభీత మృగ అక్షులార = బెదరిన లేడియొక్క చూపులవంటి చూపులుగల యోజవ్వనులారా. మదిన్ = మనస్సులో. బెగ్గిలన్ = దిగులుపడుట. గృహీతుఁడు = పట్టఁబడినవాఁడు. సలిల సీమన్ = నీటి చోటినుండి. వెల్వరించున్ = వెలికిఁదివియునో. శాప మోక్ష కరుఁడు = శాపమునుండి విడుదల చేయువాఁడు.

59. ఇలన్ గల వీళ్లు చూడన్ = భూమిమీఁదఁగల పట్టణములను చూచుటకు. త్రుళ్లఁగన్ ఏల = ఏల కేకరింతలు ఆడితిమి. వ్రాఁత = (బ్రహ్మవ్రాసిన) లిపియొక్క, కలి...టల్ = ఎప్పుడును మకరిక లనఁగా మొసలి రూపములు (మకరికాపత్త్రములు.—)మన (కపోలకుచాదులయందు) వ్రాయఁబడియుండుట యున్నదే కదా. మకరి కాలిపి మన కున్నందున మకరికాభావము కలిగిన దని చమత్కారము.

60. అనుతాపమునన్ = పరివేదనతో.

61. ఋషి తిలక = మునిశ్రేష్ఠా (తిలకము=బొట్టు). బెడఁద = ఆపదను. ఏము

కాంతి. మే మేడ! మకరులై యుంట యేడ!
నర్హమే యిట్టిబాధ బింబాధరలకు!' 61

క. అన విని యనిమిషముని “ యో
వనితాతిలకంబులార, వసుధాగీర్వా
ణునిశాపము విధికృత ; మే
ఘనునకుఁ దప్పింప నలవి గా; దటు లగుటన్, 62

ఉ. మీరలు దక్షిణాంబుధిసమీపమునం దగుపంచతీర్థముల్
చేరియు, గ్రాహరూపములఁ జెంది, శతాబ్దము లున్నఁ, దీర్థసే
వారతి భారతాన్వయుఁడు వాసవనందనుఁ డర్జునాఖ్యుఁ డే
తేరఁగలం; డతండు కడతేర్చు మిమున్ దృఢసాహసంబునన్. 63

క. చనుఁ డచటికి నిపు డిం పెన
య ; ‘న దుఃఖం పఞ్చభిః సహ’ యనంగా మున్
విని యుందురె కద ; యేటికి
మనమున నుమ్మలికఁ జెంద ముదవతులారా ?” 64

శా. అంచున్ మన్ముల నూఱడించ, వినయాహ్లాదంబు లెంతే విజృం
భించన్ మ్రొక్కి, ‘జగంబులందును మిమున్ బేర్కొన్న మాత్రం బటా

ఏడన్. ఉంట = ఉండుట. బింబ అధరలకున్ = దొండపండువంటి పెదవులుగల (మా బోఁటి) స్త్రీలకు. అర్హమే = తగునా.

62. అనిమిష ముని = దేవర్షి (యగు నారదుఁడు). వనితాతిలకంబులార = స్త్రీరత్నములారా. వసుధాగీర్వాణుని = భూదేవునియొక్క (అనఁగా బ్రాహ్మణునియొక్క). విధి కృతము = దైవముచేఁ జేయఁబడిన నిర్ణయము.

63. గ్రాహ = మొసలి. శత అబ్దములు = నూఱేండ్లు. తీర్థ సేవా రతిన్ = తీర్థములను సేవించుటయందు ఆసక్తిచేత. భారత అన్వయుఁడు = భరత వంశమువాఁడు. వాసవ నందనుఁడు = ఇంద్రుని కుమారుఁడు. అర్జున ఆఖ్యుఁడు = అర్జునుఁ డను పేరుగలవాఁడు. ఏతేరఁగలండు = వచ్చును. కడతేర్చున్ = రక్షించును.

64. న దుఃఖం పఞ్చభిః సహ = అయిదుగురతోడిదుఃఖము దుఃఖము గాదు - (ఇక్కడ మీరును అయిదుగురే కదా అని భా.) ఏటికిన్ = ఏల. ఉమ్మలికము = దుఃఖము.

65. ఊఱడించన్ = ఓదార్పఁగా. ఎంతేన్ = మిక్కిలి. విజృంభించన్ = ప్రకట

పంచంబై దురితంబు లెల్లఁ జెదరన్, భక్తిన్ మిమున్ నేఁడు ద
ర్శించన్, ఖేదము వోయె మోదము ముదంబు చెన్నారదా నారదా? 65

క. మీకతమునఁ గూర్తుం ...
మాకున్ మితి యొకటి పంటిమి; ... చుంచున్,
లోకేశ్వరసుతుఁ డీవని
జేకొని, యుట వచ్చి నిలిచి చిత్తము వోనన్, 66

క. 'దుర్జనన విసర్జనముఁగ
నిర్జరలోకాధినాథుని సుతుని ...
...ర్జును సర్జన సముదా
యర్జును గనుఁగొనె ... పుట్టితికో!' 67

చ. అని తలపోయుచున్, ... లూని, యిటుండఁగా, నిదే
పనిగ మదీయపుణ్యపరిపాక మనం జనుదెంచి నీవు నన్
మనిచితివే కదా, కడమ ... లో జలచారి చారులో
చనలకు శాప మోచనము సల్పి కృతార్థులఁ జేయు పార్థివా. 68

కానట్లుగా. మిమున్ పేర్కొన్న మాత్రన్ = మీ నామమును ఉచ్చరించిన మాత్రము చేతనే. పటాపంచంబై = పలాయనమై. దురితంబులు = పాపములు. ఖేదము = దుఃఖము. మోదన = సంతోషము. చెన్నారదా = ఒప్పదా. [పొటిడింపన్ - విజృంభింపన్ - దర్శింపన్ — అనుట సాధువు.]

66. మీకతమునన్ = మీవలన. మితి = అవధి. పంటిమి = బ్రతికితిమి. లోకేశ్వర సుతు = బ్రహ్మపుత్రుఁడైన నారదునియొక్క.

67. దుర్జనన విసర్జనముఁగన్ = దుష్టజన్మ (మకరికాజన్మ) పరిత్యాగమగునట్లుగా. నిర్జర = దేవ. సర్జన సముదాయ ఋజున్ = సృష్టియొక్క సమూహమునకు (అనఁగా ఎల్ల ప్రాణులకును) తిన్ననివానిని (దయగలవాని ననుట).

68. తలపోయుచున్ = చింతించుచు. మదీయ పుణ్యపరిపాక మనన్ = నా సుకృతములయొక్క పంటవో అనునట్లుగా. చనుదెంచి = వచ్చి. మనిచితివే = బ్రతికించితివే. జలచారి చారులోచనలకున్ = జలచరములై (మొసళ్లయి) యున్న సుందర నేత్రలకు. శాపమోచనము = శాపమునుండి విడుదలను. సల్పి = చేసి. కృతార్థులన్ = ధన్యురాండ్రనుగా. పార్థివా = ఓరాజా. [ఇటన్ ఉండఁగా = ఇటుండఁగా - అని ఈకవి సంధిచేసె నొండె.]

క. అని నంద వేఁడినం ద। క్కనకతీర్థముల లాడి వారిక్ శాపవిమో
చన మొనరింపఁగ; నేవ్వురుఁ। బనుదెంచి శుభాంగలీల సన్నిధి నిలువన్,

క. 'కలలో నెఱుఁగ మేగణి। కలలో నీచెలువమున్ సకలలోకములన్
కల లోలాక్షులగరగరి। కల లోఁగొనినారొ? చంద్రకలలో వీరల్?' 70

క. అని, తనచే నిజరూపము। గనిరి గదా యనుచు వేడుకన్ దగు నృపతిన్
గని, యాయచ్చర లిట్లని। కొనియాడఁ దొడంగి రధికకుతుకాన్వితలై.

సీ. "బలవైభవంబుచే గెలుచుమాత్రమె కాదు
గమనలీలను గెల్చు గంధకరిని,
కీర్తివిస్ఫూర్తిచే గెలుచుమాత్రమె కాదు
నగుమొగమ్మున గెల్చుఁ దొగలరేని,
బలుసాహసంబుచే గెలుచుమాత్రమె కాదు
మినుకుఁగౌనున గెల్చు మృగకులేంద్రు,
నలఘుదానంబుచే గెలుచుమాత్రమె కాదు
నెఱులకాంతిని గెల్చు నీరదమును,

**69.** ఏవురున్=అయిదుగురును. శుభ అంగ లీలన్=మంచిశరీర విలాసముతో.

**70.** ఏ గణికలలోన్ = ఏ వేశ్యలలోను. ఈ చెలువమున్ = ఈయొప్పును. సకలలోకములన్ = ఎల్లలోకములందును - కల లోలాక్షుల=ఉన్నట్టి చంచలనేత్రల యొక్క - గరగరికలన్ = చక్కఁదనములను - లోఁగొనినారొ = తమలోఁ జేర్చుకొన్నారా. లేక, చంద్రకలలో=చంద్రునికలలా. [కలలోలా-ఇట కాకుగా జేశము రాని వాక్యవిరామసంధి - పద్యపాదము వాక్యమని వైయాకరణ సమ్మతి.]

**71.** నిజ రూపమున్ = తమ వాస్తవస్వరూపమును. కనిరి = పొందినారు. కుతుక అన్వితలై = సంతోషముతో కూడినవారలై.

**72.** (౧) బలవైభవంబుచేన్ = శరీరబలసంపత్తిచేత. గంధకరినిన్=గర్వించిన యేనుఁగును. గమనలీలనున్=నడకయొక్క విలాసముచేతఁ గూడ. (౨) తొగలరేనిన్= చంద్రుని. కీర్తి విస్ఫూర్తిచేన్ = యశస్సుయొక్క ప్రకాశముచేత - (కీర్తి తెలుపని కవిసమయము.) (౩) మృగ కుల ఇంద్రున్ = సింహమును. బలు=అధికమైన. మినుకుఁ గౌనునన్ = మెఱుఁగుగల నడుముచేతఁ గూడ. (౪) నీరదమును = (నీటిని ఇచ్చుదానిని=) మేఘమును. అలఘు = అధికమగు. నెఱుల = తలవెండ్రుకలయొక్క.

నీకు జయ మగు సాహసప్రతిభచే;
నీకు సామ్రాజ్య మగు మహాసంపదలు!' 75

శా. అంచున్, వేలుపుమించుబోణులు శుభోదర్కంబు గాన్పించ దీ
వించన్, వారి ప్రియానులాపములచే వీడ్కొల్పి, గోకర్ణభూ
ప్రాంచద్ధూర్జటిఁ గొల్చి, దక్షిణసముద్రప్రాంత పుణ్యస్థలుల్
గంచుం బోయి, ప్రభాసతీర్థమున వేడ్కం గ్రీడి గ్రీడించుచున్, 76

అర్జునుఁడు ద్వారక కేఁగుట.

గీ. ద్వారకాపుర మచటికిఁ జేరువగుటఁ
జెప్పఁగా విని కడు సంతసిల్లి, "కలదు
గా యిఁక సుభద్ర రూప రేఖా విలాస
విభ్రమంబులు గనఁ జూడ్కి విందు గాఁగ." 77

క. అరచందమామ నేలిన
దొరగా నెన్నుదురు నెన్నుదురు బిత్తరికిం;
బరువంపు మొల్లమొగ్గల
దొరగాఁ బల్కుదురుఁ బల్కుదురు జవ్వనికిన్. 78

నృపచంద్రుఁడా - అని యర్థముగా) మున్ను చంద్రునినుండి వర్ధిల్లినట్లే భారతవంశము ఇఁక నీకనినుండి అభిమన్యు పరీక్షిజ్జనమేజయాదిరూపమున వర్ధిల్లు ననియు, నీతిసాహసములవలన నీతఁడు కౌరవులను జయించు ననియుఁ, మహానీయుఁడు గాననే అన్నకు సామ్రాజ్యము సంపాదించి తనకే కలిగినట్లు ఆనందించు ననియుం—సూచన.

76. వేలుపు మించుఁబోణులు = అప్సరసలు (మించు అనఁగా మెఱుపు - దానివంటి మేనుగలవారు మించుఁబోణులు). శుభ ఉదర్కంబు = శుభరూపమైన యుత్తరఫలము. ప్రియ అను లాపములచేన్ = ప్రియమైన అనుకూల వాక్యములతో. వీడ్కొల్పి=పంపించి. గోకర్ణ భూ ప్రాంచత్ ధూర్జటిన్=గోకర్ణ క్షేత్రమునందు ఒప్పుచున్న సాంబమూర్తిని. క్రీడి=అర్జునుఁడు క్రీడించుచున్ = విహరించుచు. [క్రీడ గలవాఁడు క్రీడి - అని తన నామమును సార్థకము చేయుంచు-అని చమత్కారము.]

78. అరచందమామన్=అర్ధచంద్రుని. నెన్నుదురు=శ్రేష్ఠమైన లలాటమును. ఎన్నుదురు=తలంతురు. పల్కుదురున్=దంతములు కుదిరికను. పరువంపు = విచ్చుచున్న. దొరగాన్ = సమానముగా.

క. అలకలు నీలము, లధరం
బలపగడము, గోళ్లు ముత్తియంబు, లటంచున్
దెలుపఁ బని యేమి చిలుకల
కొలికికిఁ జెలువెల్లఁ బూస గ్రుచ్చిన భంగిన్.” 79

గీ. అనుచు, నాకన్యఁ గైకొను నాసఁ దగిలి,
యతులకు విధేయు లగుదురు యాదవు లని,
తను నెఱుఁగ కుండవలె నన్యు లనియుఁ దలఁచి,
యనుచరజనంబు నందంద పనిచి; యంత, 80

సీ. మృగనాభి తిలకంబు బుగబుగల్ గ్రక్కు లలా
టమునఁపై మృదూర్ధ్వపుండ్రంబు దీర్చి,
తపనీయ కౌశేయ ధారేయ మగు కటీ
రమునఁ గాషాయవస్త్రము ధరించి,
శరణాగతాభయ సంధాయకం బైన
దక్షిణపాణిఁ ద్రిదండ మూని,
రణ చండ కోదండ గుణ కిణాంకం బైన
డాకేల నునుఁగమండలువు దాల్చి,

79. అలకలు నీలములు = ముంగురులు నీలమణులు. చిలకలకొలికికిన్=సుందరీ మణికి. పూసగ్రుచ్చిన భంగిన్=పూసలు గ్రుచ్చినట్లుగా (క్రమముగా ననుట). (నీల ప్రవాళ ముక్తా మణులకు పూస లని వాడుక గాన, ఆసుభద్ర మణులపరముగా నున్నది అని చెప్పినట్లుగా - అని చమత్కారము.)

80. విధేయులు=వశ్యులు అనుచర జనంబున్ = పరివార జనులను. అందంద= అక్కడి కక్కడికి (వేఱువేఱు తావులకు). అంత = అచటనే.

81. (౧) మృగనాభి తిలకంబు=కస్తూరిబొట్టుయొక్క-బుగబుగల్ = గమగమ యను పరిమళములు. మృత్ ఊర్ధ్వ పుండ్రంబు=(తెల్ల) మృత్తికచేనైన నిలువుబొట్టును. (౨) తప...మునన్=బంగారు (నీటి) వ్రాఁతగల పట్టువస్త్రమును ధరించునట్టి నడుము యందు. కాషాయ వస్త్రమున్ = కావి శాటిని. (౩) శర...పాణిన్ = శరణుకై వచ్చినవారికి అభయమును ఇచ్చునదైన కుడిచేతియందు త్రిదండము=(విశిష్టాద్వైత

ఉ. అప్పుడు, సామి డాఁ దలఁచినంతనె వచ్చె కకుబ్జము విస్మయంబు
ఉప్పతిలంగ, వేడ్క వల్లొత్తఁగఁ, గన్నుల హర్ష బాష్పముల్
చిప్పిలఁ, గ్రీడి పాదసరసీజములన్ బ్రణమిల్లి, తద్రుచుల్
రెప్పల నప్పళించుచును లేవక యుండఁగ; సంభ్రమంబునన్, 85

ఉ. గ్రుచ్చి కవుంగిలించుకొని, కూరిమితోఁ గుశలంబు వేఁడి, తా
వచ్చినరాక లోఁ దెలిసి, 'ద్వారక రైవతకాద్రి ప్రాంతనే
యిచ్చుటకిక్ సమీపమ' ననె కృష్ణుఁడు దెల్పుచుఁ దోడితేరఁగా,
వచ్చె రథంబుపై నపుడు వాసవి వేసవి యేఁగునంతలన్. 86

గీ. వచ్చి రైవతకారామవాటి నిల్చి,
కృష్ణుఁ డిష్టగోష్ఠి నారేయి గడపి,
'యిచట నుండుము; తావకాభీష్ట మిపుడు
సేయుదు' నటంచుఁ బైతృష్వసేయు నిలిపి, 87

## రై వ త కో త్స వ ము.

ఉ. ద్వారక కేఁగి, యందు బుధవర్గము బంధుజనంబు లాప్తులుం
గోరి భజింప నుండి, యొకకొన్ని దినంబులమీఁద భక్తవ త్సలుం

ముసు. పొదువన్=కమ్ముకొనఁగా. యదు...రశ్మి=యదు వంశమను పాల సముద్రమునకు పున్నమనాఁటి చంద్రుఁడైన కృష్ణుఁడు-(విశద= తెల్లని - రశ్మి=కిరణములుగలవాఁడు - అనఁగా చంద్రుఁడు). దర...ఁడై=చిఱునవ్వుచే సుందరమైన మోముగలవాఁడై.

85. సామి = దేవుఁడు (శ్రీకృష్ణస్వామి యనుట). విస్మయంబు = ఆశ్చర్యము. ఉప్పతిలంగన్ = ఉదయింపఁగా, వల్లొత్తఁగన్ = అంకురింపఁగా. చిప్పిలన్ = ఉబుకఁగా. సరసీజములన్=పద్మములకు. ప్రణమిల్లి = నమస్కరించి. తత్ రుచుల్ = ఆ పాదముల (యొక్కని) కాంతులను. అప్పళించుచున్ = పొదుగుచు.

86. వేఁడి = అడిగి. రాక = రాకడను. లోన్ = మనస్సులో. రైవతక అద్రి ప్రాంతనే = రైవతకమను పేరికొండకు సమీపమందే. తోడి తేరఁగాన్=తోడ్కొని రాఁగా. వాసవి = అర్జునుఁడు.

87. ఆరామవాటిన్ = ఉద్యానవనమందు. ఇష్ట గోష్ఠిన్=ప్రియమైన ప్రసంగములో. తావక అభీష్టము = నీదైన యభిలాషమును. పైతృష్వసేయున్ = మేనత్త కుమారుని (అర్జునుని).

దారుఁడు వాసుదేవుఁడు మాన్య బు[illegible] రైవతకాచలోత్సవ
శ్రీ ర[illegible] నని [illegible] జూచి పల్కినన్; 88
ఉ. అప్పుడె వారుఁ దీర్పరు[illegible] [illegible] జాళువా
యొప్పులకుప్పలై మెఱయు [illegible] మేరువులుం గురుంజులున్
జప్పరముల్ వితానములు [illegible] యయిత పెట్టి, కానుకల్
దెప్పలుగా నమర్చి [illegible] తీవ్రత రైవతకాచలంబునన్. 89
చ. అపు డొక మాట కంసరిపుఁ డానతి యిచ్చెనొ లేదొ, మంచిచొ
క్కపుఁ గపురంపుఁ గిన్నియలు కస్తురివీణెలు రాశి గాఁగఁ గొం
డపాడవు దెచ్చి వైచి రచటన్; మఱి తక్కినవస్తు లంటిమా,
యపరిమితంబు; లే మనఁగ నవ్విభుపట్టణభాగ్యసంపదల్! 90
క. గంధమాల్యాభరణవస్త్ర కలితు లగుచుఁ,
గామినీరత్నములుఁ దారుఁ గలసి మెలసి,
చనిరి రైవతకోత్సవంబునకు నపుడు
వీరు వా రన కయ్యదువీరువారు. 91
వ. కలయఁగ నైంద్రకావిలిపికంబలెఁ గుంకుమఁ బూసి, 'చూడు మో
పాలఁతుక నాదునేర్పు;' నన, 'బూసినయట్లనె లెస్స యున్న దే!

88. బుధవర్గము=పండితసమూహము. భక్తమందారుఁడు=భక్తులకు కల్పవృక్షమువంటివాఁడు. రైవతక అచల=రైవతకపర్వతముయొక్క - ఉత్సవశ్రీన్ = పూజామహోత్సవ శోభను. రచియింపఁగా వలయున్=చేయ వలయును.

89. తీర్పరులన్=పెత్తనము చేయువారిని. జాళువాయొప్పులకుప్పలు=బంగారుచే సేయఁబడి అందముల రాసులయిన. మేరువులున్=డేరాలును. కురుంజులున్=మంచెలును. చప్పరముల్ = (చలువ) పందిళ్లును. వితానములున్ = మేలుకట్లును. అయిత పెట్టి = సిద్ధపఱచి. తెప్పలుగాన్ = అపరిమితముగా.

90. కంసరిపుఁడు = కృష్ణుఁడు. చొక్కపు = స్వచ్ఛమయిన. కస్తురివీణెలు = స్తూరినించినసంచులును.

91. కలితులు=ఒప్పుచున్నవారు. యదువీరువారు=కృష్ణునిసంబంధులు.

92. కలయఁగన్=నిండారునట్లు. పూసి... ప్రద్యుమ్నుఁడు రతీదేవికిపత్రమున [illegible] యొట్టుండునో అట్లు దాను కుంకుమ రసముఁ బూసి అని భా. ఓపాలఁ

బళి!' యని కేళినీరమణి పల్కఁగ, నవ్వుచు శంబరారి య
ర్మిలిఁ గయిసేసి, యేఁగిరి గిరిం గన నా రుచిరాంగు లిర్వురున్. 92

ఉ. రేవతిఁగుబ్బచంటి మకరీమయ రేఖ లురస్స్థలంబునన్
భావజచిహ్నముద్ర లయి భాసిల, మేలిమి కందు దుప్పటిం
బై వలెవాటు వైచి, నును మైజిగి గందపుఁబూఁత లై తగన్,
రైవతకాద్రి కేఁగె బలరాముఁడు కేళికళాభిరాముఁడై. 93

క. నగధరునివెంట నడిచిరి
మిగులన్ గైసేసి యటఁ దమిన్ గస్తూరి
ఘుగఘుగలు, నుదిరిబంగరు
నిగనిగ నెఱ యందె రవలు, నెఱయం దెఱవల్. 94

చ. పురజను లింపునన్ గనఁగఁ, బొంతల రుక్మిణి సత్యభామయున్
దొరయఁగఁ, దక్కుసార్వరును దోఁ జన, నావెనుకన్ బదాఱువేల్

తుళ = ఓసుందరీ. పూసి...న్నదే = (నీవు రచించినపువిళ) గుత్తముగా పరిపోయినట్లు బాగుగా నున్నదే - (అపికే గుత్తముగా నున్నప్పుడు పూసిన ట్లున్న దని స్త్రీలు వాడుట కలదు) - దేహము కుంకుమపూవులు పూచినయట్లుగా అందముగా నున్నదే అనియు - [ఈ యర్థమున 'పూచిన' అనుటకు 'పూసిన' అని యీతని ప్రయోగము.] కేళినీరమణి= రతీదేవి. శంబరారి=ప్రద్యుమ్నుఁడు. అర్మిలిన్ = ప్రేమచే. కయిసేసి=అలంకరించుకొని. రుచిర అంగులు=ప్రకాశమానమైన శరీరములు గల రతీప్రద్యుమ్నులు.

93. రేవతి = బలరామునిభార్య. మకరీమయ రేఖలు = మకరికాపత్త్రరచనలు. ఉరఃస్థలంబునన్ = (బలరాముని) వక్షఃప్రదేశమందు. భావజ చిహ్న ముద్రలు = మన్మథుని టెక్కెపు ముద్రలు.— [రేవతికుచముల మకరీపత్త్రములు ఆలింగనవశముచేత బలరామునివక్షఃస్థలమున అంటి మకరధ్వజుఁడగు మన్మథుని ధ్వజ ముద్రలో అనన ట్లుండె నని తాత్పర్యము.] కందు దుప్పటిన్ = నల్లని పట్టుశాలువును. పైన్ వలెవాటున్ వైచి = మెలిపెట్టి మీఁద ధరించి. నును మైజిగి = నిద్ద మగుదేహకాంతి.

94. నగధరుని=గోవర్ధనధారియైన శ్రీకృష్ణుని. తమిన్=కోరికచేతను. ఉదిరి... రవలు = అపరంజి బంగారపు నిగనిగ గలిగిన మేలి యందెల నాదములు. నెఱయన్= వ్యాపింపఁగా (కర్త ఘుగఘుగలును రవలును.) తెఱవల్=(రుక్మిణీ సత్యాది) కాంతలు.

95. పొంతలన్ = పార్శ్వములందు. దొరయఁగన్ = సమానముగా వచ్చు

తరుణులు గొల్చి రాఁగఁ, బ్రమదంబునఁ గృష్ణుఁడు వట్టివేళ్లచ
ప్పరములనీడనే యరిగెఁ, బట్టినకానుక లెల్లఁజూచుచున్. 95

క. ఆగతి నరిగి, సమస్తజ । నాగతి రైవతకగిరిమహామహాలీలా
భోగము గన్నులపండువ । గాఁ గాఢకుతూహలంబు నడరం జేయన్,96

రైవతకోత్సవమునకు సుభద్ర వచ్చుట.

ఉ. మున్నతిభక్తిఁ బూజలు సమున్నతిఁ దా నొనరించి, యాత్మయో
షిన్నికరంబులన్ బిదప సేవ లొనర్పఁగఁ జేయుచుండె, నం
తన్ నవరత్నహేమ రచితం బగుపల్లకి నెక్కి వేడ్క రా
నన్నలు రామకృష్ణులు రయమ్మున రమ్మని గారవింపఁగన్. 97

క. చెలియలు సుభద్ర వచ్చెం
జెలియలు వేయాఱులు నిరుచెంతలఁ గొలువన్,
వొలకరిమెఱపో యిది యని
తొలకరిదొరబిడ్డ వెఱఁగుతోడం జూడన్. 98

ఉ. యావతచూళికాభరణ మప్పుడు కొందఱుపోట్లు మ్రుంగలన్
రైవతకోత్సవాగత జనంబు బలాబరి సేయుచుండఁ ద
ద్దైవత కర్చనాదులతి ప్రమదంబునఁ జేసెఁ బైపయిన్
దైవతరాజనందను ధనంజయునిం బతిఁగా దలంచుచున్. 99

చుండఁగా. చప్పరముల = పందిళ్లయొక్క.

96. అగతిన్ =(౧) అవిధముగా - (౨) రాక చేత. గిరి = గిరియొక్క - మహా మహా=మహోత్సవముయొక్క - లీలా=క్రియలయొక్క - అభోగము = విశాలత (బహుత్వము). కుతూహలంబున్ = సంతోషమును. అడరన్ = అతిశయించునట్లుగా.

97. ఆత్మయోషిత్ నికరంబులన్ = తన స్త్రీ సమూహములను. నవరత్న హేమ రచితంబు = నవరత్నములతోను బంగారముతోను చేయఁబడినది.

98. చెలియలు=(౧)చెల్లెలు - (౨) చెలికత్తెలు. వేయాఱులు = వెక్కండ్రు. తొలకరిదొర బిడ్డ = పర్జన్య (=ఇంద్ర) పుత్త్రుఁడగు (నర్జునుఁడు). వెఱఁగుతోడన్ = ఆశ్చర్యముతో.

99. యావత = యువతీసమూహమునకు - చూళికా అభరణము = చూడా

గీ. ఈకరణిఁ బూజ లొనరించి, యిష్టసఖులఁ
గూడి యగ్గిరి కందరా కూట తటి వి
నోద వైఖరు లెల్లఁ గన్గొనుచు, నరస
గోష్ఠి నుండెడు పద్మరాగోష్ఠిఁ, గాంచి. 100

అర్జునుఁడు సుభద్రను వర్ణించుట.

క. మును విన్నది తా నప్పుడు
గనుఁగొన్నది యొక్కతీరు గాఁ దార్కాణై
పెనఁగొన్న మహాశ్చర్యం
బున నన్నరుఁ డిట్టు లనుచుఁ బొగడం దొడఁగెన్. 101

ఉ. చూడమె దేవతాసతుల శోభనకాంతవిలాసవైఖరుల్!
చూడమె నాగకన్యకల లోకమనోహర రూప సంపదల్!
చూడమె మర్త్యకామినుల సోయగముం! దమకంబు పెల్లు తీ
పాడఁగ దీనివంటి యొఱపైన మిటారిని జూడ మెందులన్. 102

క. చెక్కులజిగి, చనుగుబ్బల
చక్కఁదనము, మొగముతేట, జడతీ రౌరా!
చొక్క మగు. దీనిఁ జూచినఁ,
జొక్క మనంగూడ దెట్టి సుజ్ఞానులకున్. 103

భూషణము అగు సుభద్ర. బోట్లు = చెలఁదులు. ఐకాలకరి=కడపుఁద్రోయుట. అర్చనానతులు=పూజా నమస్కారములు. అతిప్రమదంబునన్ = అధికసంతోషముతో. దైవతరాజ నందనుఁడు=ఇంద్ర పుత్త్రుఁడైన. ధనంజయునికిన్ = అర్జునుని.

100. ఈ కరణిన్=ఈ ప్రకారముగా. అగ్గి...లు=అరైవతకాద్రియొక్క గుహలయందును శిఖరములయందును చఱియలయందును (గల) వింతప్రకారములను. పద్మరాగ ఓష్ఠిన్=కెంపువంటి యధరముగల సుభద్రను.

101. తీరు = విధము. తార్కాణ = నిదర్శనము. పెనఁగొన్న=పెనవేసికొన్న.

102. మర్త్య=మనుష్య. తమకంబుపెల్లు=మోహాతిశయము. తీపు ఆడఁగన్ = మాధుర్యమును పుట్టించునట్లుగా. మిటారిన్ = నీటుకత్తెను.

108. చొక్కము=(౧) చిక్కిలినాణెము - (౨) (మేను) మోహపడము.

ఉ. కన్నులు దీర్ఘముల్ ; నగుమొగం బప్పురా! తలకట్టు తమ్మిపూ
పున్నమచందమామలకుఁ; బొక్కిలి జొక్కెదనంబుఁ జెప్పఁగా
నున్నదె! మేలుబంతులు పయోధరముల్ ; మఱి కౌను సున్న యౌరా,
వెన్నిక కెక్కు వ్రాఁతఫల మవ్వరవర్ణినికిన్ నిజంబుగన్. 104

గీ. భ్రమరకమనోహరం బౌటఁ బద్మ మగును,
తారకాహృద్య మగుట సుధానిధి యగు,
రెంటిజగడాలు మోమున నంటియుంట
నబ్జముఖి యంట లెస్స యీయలరుఁబోఁడి. 105

సీ. ధారాధరము వెన్నుఁ దన్ని పుట్టినచాయ
నున్న దీబింబాధరోష్ఠి వేణి.

104 తమ్మి...కుక్ = పద్మమునకును పున్నమచంద్రునకును - తలకట్టు = మాళి (అనఁగా వానికన్న మే లయినది). బొక్కిలి = నాభియొక్క. పయోధరముల్ = కుచములు. మేలు బంతులు = శ్రేష్ఠమైన చెండ్లు. వరవర్ణినికిన్ = ఉత్తమతరుణికి. వ్రాఁతఫలము = బ్రహ్మవ్రాసిన లిపియొక్క ఫలము. [వరవర్ణిని అనగా శ్రేష్ఠమైనవర్ణములు (అక్షరములు) కలదిగావున, వ్రాఁతఫల మనఁగా అక్షరములు వ్రాయుటయొక్క ఫలము ప్రశంసనీయము. ఎట్లన-ఈమె స్వరూపము-దీర్ఘములు, తలకట్టు, బొక్కిలి, ఒరువడి పంక్తులు, సున్న - అని యిట్లు గుణితభేదము అగుచున్నది అని చమత్కారము.]

105. భ్రమరక = తుమ్మెదలచే (ముంగురులచే అని భా.) తారకాహృద్యము = నక్షత్రములకు మనోహరము. కనీనికలచేత మనోహరము అని భా.) సుధానిధి = చంద్రుఁడు. రెంటి...యుంటన్ = పద్మసుధానిధులయొక్క పోరాటములు ముఖము నందు తగిలియుండుటచేత (రెంటియొక్క ఉత్కృష్టకాంతి అంటియున్నందున - అని భా.) ఈయలరుఁబోఁడికిన్ = పువ్వువంటి శరీరముగల యీసుభద్రను. అబ్జ...లెస్స - అబ్జశబ్దము కమలమునందును చంద్రునియందును వర్తించును గనుక అబ్జముఖి యనుట యుభయసమ్మత మగు నని చమత్కారము.

106. (౧) ఈ బింబ అధర ఓష్ఠి = దొండపండువంటి క్రిందిపెదవిగల యీ సుందరియొక్క. వేణి = జడ. ధారా...న్నది = మేఘమునకు చెల్లెలుగా పుట్టినరీతి నున్నది - జడ వెన్ను నంటి యుండునది గనుక మేఘమే వెన్ను నంటి పుట్టినదో అన్నట్లున్న దని యర్థాంతరము-రెండు అర్థములందును వేణి మొగిలువలె నున్న దని భా.

జక్కవకవ బొమ్ము ద్రొక్కి నిల్చినజాడ
నున్న వీనవలా పయోధరములు,
చిన్నిప్రాయపులేడి చెవులు పట్టాడించు
గతి నున్న దీరామ కన్నుదోయి,
నల్లచీమలబారు నడుము దాఁకినపోఁక
నున్న దీచెలువంపుఁ గన్నెయారు,
గీ. విపులపులినంబు వెన్కకు వీఁగ నొత్తు
నందమున నున్న దీమందయాన పిఱుఁదు,
దీని కెన యైనలతకూనఁ గాన మూరు
నోజవజ్రాంగి యీజగన్మోహనాంగి.
క. సైకతము నడుము, విలాసర
సైకమ్ము నెమ్మొగము, దీని పృథుమధురోక్తుల్

(౨) నవలా పయోధరములు = ఉవిద కుచములు, జక్క...న్నవి = చక్రవాక ద్వంద్వమును బొమ్ము ద్రొక్కి పట్టినట్లున్న వని అర్థము - జక్కవకవను అడుగున, అడవేసి తిరస్కరించినట్లున్నవనుట - కుచములు బొమ్మున నుండునవి గనుక జక్కవ కవయే బొమ్ము ద్రొక్కి నిలిచియున్నదో అనున ట్లున్న వనియు. (౩) రామ=రమణి యొక్క; [పట్టాడించు - ఓకసంధి.] చిన్ని...న్నది = లేడిపిల్లను చెవులుపట్టి ఆడించును - లోకువ చేసికొనును అని అర్థము - కన్నులు చెవులపర్యంత ముండునవి గనుక లేడిపిల్లయే చెవులను అవలంబించినదో అన్న ట్లున్నదనుటయు. (౪) ఆరు=నూఁగారుఁ నల్ల...న్నది=నల్లని చీమలబారును మొలకట్టులో చేయి వైచి (జగడమునకు) లాగిన ట్లున్న దనుట, నల్లచీమలచాలే నడుము నంటి ప్రాఁకుచున్నదో అను న ట్లున్న దనియు.

ఈ మంద యాన = మెల్లని నడకగలదైన యీామెయొక్క - పిఱుఁదు = కటి ప్రదేశము, విపు...న్నది=విశాలమైన యిసుకదిన్నను వెనుకకు గెంటుచున్న ట్లున్నది- అవమానముచేయుచున్న దనుట - పిఱుఁదు వెనుకభాగమందుండునది గనుక యిసుక దిన్నెయే వెనుక హత్తుకొని యున్నదో అనున ట్లున్న దనియు. ఎన = సమానము. లతకూనన్ =లేఁదీఁగవంటి శరీరముగల స్త్రీని, ఈజ...నాంగి = జగత్తును మోహింపఁ జేయు రూపముగల యీా సుభద్ర, మనోజవజ్రాంగి=మన్మథుని వజ్రమయ కవచము.

107. సైకతము = ఇసుకదిన్నె. విలాస రస ఏకము = శృంగార రసము ...

పైకముఁ దెగడున్, నవలా
పైకములో నెల్ల మేలుబంతి యిది బళిరా! 107

ఉ. ఈ తరళాక్షి మేనిజిగి యేలిక మేలికడాని పైఁడికిన్;
గుత్తపుగుబ్బలాఁడిజడ కూఁకటి చీఁకటి మూలదుంపకున్;
పుత్తడిబొమ్మకన్నుఁగవ పోలిక వాలికగండుమీలకున్;
బిత్తరిముద్దుమోము పిన్నమ పున్నమచందమామకున్. 108

గీ. కామినీమణి నిడువాలుఁ గన్నుఁగవకు
నెన్నికకు రాని తొగరేకు లీడు సేత
తగదు తగ; దిఁక నలినపత్త్రంబులందు
నీడగునొ యేమొ నూట వేయింట నొకటి? 109

క. మహిలో సరిగలదా యీ
మహిళోత్తంసంబుమేని మహిమకుఁ దెలియన్!

ముగాఁ గలది. పైకము = కోకిలసమూహమును. తెగడున్ = దూషించును. నవలా పైకములోన్ = స్త్రీ ధనములో. మేలుబంతి శ్రేష్ఠురాలు. ఇది = ఈతరుణి.

108. ఈ తరళ అక్షి = చంచల దృక్కులుగల యీ సుందరియొక్క - మేనిజిగి = దేహకాంతి, మేలి కడాని పైఁడికిన్ = కుందనపు మెఱుఁగు బంగారమునకు, ఏలిక = ప్రభువు. ఈ గుత్తపు గుబ్బలాఁడి = క్రిక్కిఱిసిన కుచములుగల యీచెలువ యొక్క. చీఁకటి మూల దుంపకున్ = చీఁకటియొక్క మొదటి గడ్డకు, కూఁకటి = ప్రధానమైనవేరు. ఈ పుత్తడి బొమ్మ = బంగారుబొమ్మవంటి యీ కోమలియొక్క. వాలి... అకున్ = నిడుద మగ చేఁపలకు. పోలిక = ఉపమానము. పిన్నమ = పినతల్లి - (లోకములో పిన్నమ్మను మేనమామను పోలుట ప్రసిద్ధము గనుక ముఖమును జంద్రుఁడు పోలియున్నాఁడు అని తాత్పర్యము - పిన్నమ్మ యనఁగా మహాలక్ష్మి గావున - ఈ ముఖము పూర్ణిమాచంద్రుని యొక్క సిరి యని స్వారస్యము.

109. ఎన్నికకు రాని = లెక్కలోనికి రానట్టి - అనఁగా గౌరవింపఁదగినవి కానట్టి - ('సహస్రపత్త్రం) కమలం శతపత్త్రం కుశేశయమ్' అని కమల నామములలో రేకులసంఖ్య వచింపఁబడియున్నట్లు కలువనామములలో లేదని భావము) తొగరేకులు = కలువరేకులను. నలిన పత్త్రంబులందున్ = తామర రేకులలో. నూట... టి—నూటిలోను వేయింటిలోను (శతపత్త్ర సహస్రపత్త్ర పత్త్రములలో అని భా.) ఏర్పఱిచినచో ఒకానొకటి సమ మగునేమో.

మిహిర కుందనపుసలాకన్
మిహికాకర రేఖమించు మించున్ మించున్. 110

సీ. కలిగెఁబో యీయింతి కులుకుగుబ్బలు సూడ
    శీతశైలాదుల సేవఫలము;
కలిగెఁబో యీనాతి వళులయందము సూడ
    గంగాతరంగముల్ గన్నఫలము;
కలిగెఁబో యీరామ కనుబొమల్ సూడంగ
    మును ధనుష్కోటిలో మునుఁగుఫలము;
కలిగెఁబో యీభామ కటివిలాసము సూడ
    భూప్రదక్షిణము సల్పుటకు ఫలము;
గీ. తోడుతోడనె యిటులఁ జేకూడవలదె!
    తన్వి దీటంగ నింక నీ తన్విఁ గూడి
సరస సంభోగ సల్లాప సరణిఁ దేలు
    నాడుగాఁ ఫలియించుట నాతపంబు. 111

110. ఈ మహిలా ఉత్తంసంబు = (మహిలా = స్త్రీలకు - ఉత్తంసంబు = శిరోమాల్యము) ఈ తరుణీ మణియొక్క - మేని మహిమకున్ = శరీరప్రభావమునకు, మిహి = శ్రేష్ఠమైన - కుందనపు సలాకన్ = బంగారుకణికను, మిహికా కర రేఖ = చంద్ర రేఖయొక్క - మించున్ = కాంతిని, మించున్ = మెఱుపును, మించున్ - అతిశయించును.

111. (౧) హిమవదాది పర్వతములను సేవించినందులఫలమే తత్సదృశములయిన యీ యింతిగుబ్బలం గాంచు భాగ్యము - అని అన్వితార్థము - ఇట్లే ఉత్తరత్ర అర్థమును సాదృశ్యమును ఎఱుంగవలయును. (౨) వళులు = కడుపుమీఁది ముడతలు. (౩) ధనుష్కోటిలోన్ = రామేశ్వరముకడ నున్న ధనుష్కోటి యను తీర్థములో - (ధనుస్సులకు కనుబొమలకును పోలిక). (౪) కటివిలాసము = పిఱుఁదుయొక్క శృంగారము- భూమండలమునకును కటిప్రదేశమునకును పోలిక.

తన్వి = తృప్తి. తన్విన్ = స్త్రీని. [ఈ రమణి దర్శనమే తీర్థసేవాదులకు ఫలము, ఇది లభించినది; ఏతత్సంభోగము తపఃఫలము, అది యెన్నఁటికి లభించునో యని భా.]

హాలి అర్జునయతిని సందర్శించుట.

క. అని కొనియాడుచు నుండఁగ,
వనితామణి యంత నుత్సవము చేసి పురం
బున కన్పుచు, మాయామునిఁ
గనుఁగొని, యాహాలి నితాంత కౌతూహలి యై. 112

గీ. అతని నుత్తమయతియ కా మతిఁ దలంచి,
వినయమునఁ జేరి సాష్టాంగ వినతి చేసి,
'స్వామి యెందుండి యిచటికి వచ్చినారు
తీర్థయాత్ర కే? నది యెల్లఁ దెల్పుఁ'డ నిన, 113

క. హిమశైలసేతువుల మ
ధ్యమునం గలనదులు నిధులు నాశ్రమములు దీ
ర్థములుం దాఁ గనుగొన్న వి
క్రమమునఁ దెలుపం, బ్రమోదరస పరవశుఁ డై, 114

మ. 'కలిగెం భాగ్యవశంబునం గనుఁగొనంగా మిమ్ము; మమ్ముం గృతా
ర్థులఁగాఁ జేయఁగ నాత్మలోఁ దలఁచి చాతుర్మాస్య మిచ్చోట నే
సలుపంగావలె స్వామివా!' రని నమస్కారంబు గావించి, ప్రాం
జలియై, వేఁడిన, సమ్మతించెఁ గుహనా సన్న్యాసి యుల్లాసి యై. 115

గీ. చెలువనేత్రవిలాసంబు చెవులు సోఁక
బాలకుచలీల యెదఁ జాల బట్టఁ గ్రాలఁ,

112. మాయామునిన్ = అబద్ధపుయతి యైనయర్జునుని. హాలి = బలరాముఁడు. నితాంత కౌతూహలి = తీవ్రమయిన కోరికగలవాఁడు.

113. ఉత్తమ యతియ కాన్ = నిజమైన సన్న్యాసియే యని. వినతి = నమస్కారము,

114. హిమశైల సేతువుల = హిమవంతమునకు రామసేతువునకును. నిధులన్ = జ్ఞానులును. ఆశ్రయములు = మునిపల్లెలును. ప్రమోద = సంతోష.

115. చాతుర్మాస్యము = ప్రతిసంవత్సరము ఆషాఢశుద్ధము మొదలు కార్తికశుద్ధము వఱకు నాలుగునెలలు సన్న్యాసులు చేసెడి యొకానొక వ్రతము. ప్రాంజలి = అంజలి చేసినవాఁడు కుహనా = మాయ.

116. చెవులు సోఁకన్ = అతనిని సోఁకి అఁపుటకై చెవులుపట్టుకొఁగా అనియు - వినఁబడినది కాఁగా అనియు అర్థములు - కన్నులు చెవులవఱకు వ్యాపించి

గలికి నెఱి వేణి చెలువంబు గాళ్లఁ బెనఁగ,
నవలఁ బోలేక నిల్చె నయ్యర్జునుండు. 116

క. సీరియు నిటు లాశౌనా । సీరియు నన్యోన్యసూక్తి సితమానసు లై
పోరాని కూర్మి నుండఁగ । నా రాముని కడకు నంత హరి సనుదెంచెన్.

క. చనుదెంచిన, 'స్వాములకున్
వినయము గావింపు మిచట వీరల నిలువుం
డని సార; ముపవనంబున
ననిచి మనసుభద్ర సేవ కొనరుపు మన్నన్, 118

గీ. 'వయసువారును జక్కని వారు వీరు,
మనసు మర్మంబు లేవియు మనకుఁ దెలిసి
యున్నయవి గావు, సేవకు నునుపఁ దగునె
కన్నె? నది యేమొ తెలిసికో' మ్మన్న నతఁడు. 119

సుభద్ర యతి శుశ్రూషకై నియమింపఁబడుట.

క. 'వీరు మహాత్ములు ఘనుఁ; లప
చారంబు నిట్టుల లాదఁ; సం... ములకు మున్

యున్నదని భా. ఎద...క్రాలన్ = అతనిని పోనీక అరొమ్మును అడ్డఁగా అనియు - అతనిమనస్సును మిక్కుటముగా ఆక్రమించి యొప్పఁగా అనియు అర్థములు-కుచభారము ఆమె వక్షస్థలమును నిండుగా ఆక్రమించినదని భా. నెఱి=తీరయిన. కాళ్లఁబెనఁగన్ = పోనీక కాళ్లు పట్టుకోఁగా అని అర్థము.-వేణి మడమలవఱకు వ్రేలాడఁగా నని భా.

117. సీరియున్=బలరాముఁడును. శౌనాసీరియున్=శునాసీరునియొక్క -(=ఇంద్రునియొక్క) పుత్త్రుఁడైన యర్జునుఁడును. అన్యోన్య = ఒండొరుల-సూక్తి = మంచిమాటలచేత - సిత = (ఒండొకటితో) కట్టఁబడిన మానసులు మనస్సులుగలవారు. పోరాని కూర్మిన్ = ఎడఁబాయశక్యముగాని ప్రేమతో. హరి = కృష్ణుఁడు.

118. చనుదెంచినన్ = రాఁగా. ఉపవనంబునన్ = ఉద్యానవనమందు. ఒనరుపుము = నియమింపుము.

120. ఘనులు = దొడ్డవారు. అపచారంబు = దోషము. సంయమములకున్ =

గోరిక వెలయఁగఁ గన్యలె
కారా శుశ్రూష సేయఁగాఁ దగు వారల్,' 120

ఉ. నెమ్మది సంశయింప కిది నీ వొనరింపు మ టన్న, నల్లి కా
ని మ్మని, యమ్మునిప్రవరుఁ గృష్ణుఁడు దోడ్కొని ద్వారకాప్రవే
శ మ్మొనరించి, యంతిపురిఁ జయ్యనఁ జెల్లెలిఁ బిల్వ నంపి, "రా
నమ్మ, సుభద్ర, నీ యభిమతార్థము లెల్ల ఫలించు నియ్యెడన్; 121

శా. కామారి స్ఫురణంబు లెల్ల నడఁగంగాఁ జేసి ధన్యాత్ము లా
స్వామీశుల్ వీరలు; వీరి కిం పొదవు తెఱన్ సేవ గావింపు; మెం
తో మోదంబున నానతిచ్చి బలభద్రుండే నియోగించినాఁ
డేమో చెప్పితి నంచు నుండెదవు సుమ్మీ నీమదిన్ సోదరీ." 122

క. అని తత్కన్యాంతఃపుర
వన వంజుల కుంజ సంజవనమునఁ గుహనా
ముని నుండఁ జేసి, పలికెన్
వెనరు ముదిం బొదల రుక్మిణీసత్యలతోన్. 123

శౌరి రుక్మిణీ సత్యలకు అర్జును నెఱుకపఱుచుట.

క. "అతఁ డెవ్వఁ డెఱుఁగుదురె! మీ
మతిలోనన యుండనిండు; మన కుందనపుం

మానసులకు. కోరిక వెలయఁగన్ = సంకల్పసిద్ధి యగునట్లు. శుశ్రూష = పరిచర్య.

121. మునిప్రవరుగన్=మునిశ్రేష్ఠుని. అభిమత అర్థములు=ఇష్టములయిన కోరికలు (అర్జునునిమీఁది కోరిక యని మర్మము.)

122. కామ ఆది స్ఫురణంబులు ఎల్లన్=కామము లోనగు (అనఁగా కామము క్రోధము లోభము మోహము మదము మాత్సర్యము అను) వాని యుద్రేకములను. మన్మథుఁడు లోనగు వారియొక్క ప్రకాశమును అని మర్మము - ఇట ఆది శబ్దముచే జయంత నలకూబర ప్రభృతులను గ్రహించునది - వారికన్న సుందరుఁ డని భా. ఇంపు ఒదవు తెఱన్ = ప్రీతి కలుగు రీతిగా. మోదంబునన్ = సంతోషముతో. ఆనతి ఇచ్చి = ఆజ్ఞాపించి. నియోగించినాఁడు = నియమించినాఁడు.

123. తత్క...మునన్ = ఆసుభద్రయొక్క యంతఃపురోద్యానవనము లోని యశోకవృక్షముల గుబురునందలి ఆవంలియందు. కుహనా = కృత్రిమ.

బ్రతిమ యగు సుభద్రకు నై
యతివేషము పూనియున్న యర్జునుఁడు సుండీ.	124

క. తనమదిలో నితఁ డర్జునుఁ
డని తెలిసి సుభద్ర సేవ కరుగక యున్నన్,
జని మీా రతనికి భోజన
మొసరింతురు గాక యూర కుండెదరు సుండీ.	125

మ. అతనిం బూజ లొనర్పుఁ డిప్పు" డని నెయ్యంబొప్ప గోపాలుఁ డా
సతి యీా, నర్మిలి మ్రొక్కి, 'సిద్ధుఁ డగుట యెట్లాప్లో యౌనా', యంచు, 'వ
చ్చితివా? యన్న, కిరీటి, కూర్మి కలదా శైలేంద్రపై?' నంచుఁ, ద
త్సతు లేకాంతమునం బ్రియోక్తులను బూజ ల్సేసి వీడ్కొల్పినన్.

గీ. అన్నరుం డంత శ్రీకృష్ణుఁ డున్నవగరి
సరసఁ, గన్నియ రాణివాసమున నమరు
కేళివనిలోన నవరత్న కీలితంపు
బవిరిటాకుల చిన్నియుప్పరిగలోన.	127

గీ. తెఱవ నెఱవంకబొమలును మెఱుఁగువాఁడి
చూపులును జూచి తనచేతిసూటి రోసి
యస్త్రసన్న్యాసన మొనరించినట్టి సుమశ
రాసనుం డనఁ, జెలిమీాఁది యాస నుండె.	128

126. నెయ్యంబు = ప్రేమ. అర్మిలిన్ = ప్రేమతో. కిరీటి = అర్జునా. కూర్మి = ప్రేమ. తత్సతులు = ఆ రుక్మిణీ సత్యభామలు. వీడ్కొల్పినన్ = పంపఁగా.

127. నరుఁడు = అర్జునుఁడు. సరసన్ = చేరువను. కన్నియ రాణివాసమునన్ = కన్య కాంతఃపురమందు కేళివనిలోనన్ = క్రీడార్హమైన యుద్యానవనమందు. నవ... పు = (వజ్రవైడూర్యాది) నవరత్నములు చెక్కిన - బవిరిటాకుల = మావిపట్టెలు గలిగిన - చిన్నియుప్పరిగలోనన్ = చిన్న మేడలో.

128. తెఱవ = అందమయిన - వంక = వంపుగలిగిన. తన... రోసి = తన విలువిద్య యందలి నేర్పును నిందించుకొని. అస్త్ర...నట్టి = విల్లు నమ్ములు విడిచిపెట్టి నట్టి - సుమ...నన్ = పూవిలుకాఁడైన మన్మథుఁడో అనునట్లు. సున్నాసే మొగ్గ కను

క. అం దుండి మనసులోన ము
కుందుం డీగతి నొనర్చు కుశలత కతఁ డా
నందముఁ జెంచుచు నుండెన్,
గొందలు గారాపుఁజెలులు గొల్వఁగ నంతన్. 129

సుభద్ర యతిని శుశ్రూషించుట

ఉ. చందురకావి పావడ పిసాళిరుచుల్ సరిగంచుఁజీరపైఁ
జిందులు ద్రొక్కఁ, వేణి కటిసీమ నటింపఁ, జాళువా
యందెలు మ్రోయఁ, జంటిలపు కంటి చనుంగవ పిక్కటిల్లఁగాఁ,
జందనగంధి వచ్చె రభసమ్మున సమ్మునిరాజసేవకున్. 130

ఉ. వచ్చిన, దౌలఁ గాంచి తన నచ్చి, జపంబు నెపంబు వెట్టి, వి
వ్వచ్చుఁ డొకింతసేపు తన పంకఁ కనుంగొన కున్న, మెల్ల నే
యచ్చట నిల్చినిల్చి, వినయంబునఁ జేరి, కుచంబు లోరగా
హెచ్చినభక్తి మ్రొక్కి, యసిరెయుం జెలి యంజలి సేసి యింపుగన్.

గీ. 'ఓ మహానుభావ; యేమి గావలె దేవ
పూజ కిపుడు? పత్త్ర పుష్పఫలజ

బొమలు మదనునిచాపముకన్న అందమయినవంపు గలిగి, ఆమె చూపులు అతని బాణముల కన్న మెఱుఁగును వాఁడియును గలిగి, యుండెననియు, అర్జునుఁడు ధనుర్బాణములను త్యజించిన మదనునివలె ఉండె ననియు భా.

129. ముకుందుఁడు=కృష్ణుఁడు. కుశలత=నేర్పరితనము. గారాపు=ప్రియలయిన.

130. చందురకావి పావడ = సిందూరపువన్నెగల పరికిణీయొక్క - పిసాళి రుచుల్=ప్రకాశమానమైన కాంతులు, సరి...క్కన్=జరీయంచుగల (తెల్లని) చీరపైని ప్రసరించుచుండఁగా - అనఁగా లోపలఁ గట్టిన చెంద్రకావి పరికిణీయొక్క కుసుంబా రంగు పైఁగట్టిన తెల్లచీరమీఁది కువికి కనఁబడఁగా, జంటి అవిక=జరీగోట్లువేసి కుట్టిన అవిక, అంటి, పిక్కటిల్లఁగాన్ = క్రిక్కిరియం చుండఁగా, చందన గంధి = గంధపు వాసన గలదైన సుభద్ర. మునిరాజు=యతిశ్రేష్ఠునియొక్క-యతియైన రాజుయొక్క- అనఁగా అర్జునునియొక్క అని భా.

131. దౌలన్ = దవ్వులన్=దవ్వులన్ = దూరమునుండి. వివ్వచ్చుఁడు = అర్జునుఁడు. పంకన్=వైపు.

క. కనె జప మతఁడు కడుఁ గ్రొ
త్తావులు చెవి సూక్ష్మ ... జిగిన్,
'జేసి ... జపమున్ ...
చేసినమది గాంచి' ... పృథ ... 135

గీ. భామ మోమున వ్రేలు పద్మాంబుజాక్షుఁ,
ముదిత యెదఁ బాయకుండెడి మూర్తిఁ దలఁచి,
రమణి మైసగమైన విగ్రహము నెంచి
ప్రోవుమని వేఁడుకొను దేవపూజవేళ. 136

గీ. వినతి సేసినఁ భిక్ష గొనవింపుఁ డనిన,
మాట వడ్డింప నిది కొత్తమాయ యనుచు టన్నఁ,

తావి=పరిమళము. గింటెపు=దట్టమైన. జిగిన్=కాంతిని, ఒయారి=విలాసవతి.

136. భామ...పంబున్=భార్యయగు సరస్వతి ముఖము నవలంబించి యున్న యాకృతిని - అనఁగా బ్రహ్మను - తన ముఖమున వ్రేలాఁడుచున్నట్లు ప్రత్యక్షముగా తనకు కనఁబడుచున్న సుభద్రరూపమును - అని అర్థాంత. ముదిత...మూర్తిన్=భార్యయైన లక్ష్మీదేవి వక్షమును విడిచిపెట్టని యాకృతిగల విష్ణుదేవుని అని అర్థము-తనహృదయమును బాయకయున్న యా సుభద్రస్వరూపమును అని అర్థాంత. రమణి...హముక్=భార్యయైన పార్వతి తనదేహములో సగము (శరీరము) గా నున్నట్టి యాకృతిగల సాంబమూర్తిని అని అర్థము - తన దేహములో సగము దేహముగా తనతో ఐక్యమయినట్లు తనకు తోఁచుచున్న యా సుభద్రాదేవి స్వరూపమును అని అర్థాంత. ప్రోవుము=రక్షింపుము.

తా. బ్రహ్మను దలఁచి 'సుభద్రను నాముఖమున వ్రేలునట్లుచేసి నన్ను రక్షింపు' మనియు, విష్ణువుఁ దలఁచి 'సుభద్రను నా యెదఁబాయకుండునట్లు చేసి నన్ను రక్షింపు' మనియు, సాంబమూర్తినిఁదలఁచి 'సుభద్రను నా మేనితో అతికించి రక్షింపు' మనియు, త్రిమూర్తులను ప్రార్థించెను అనియు; తన మోమున వ్రేలఁగట్టినట్లు ప్రత్యక్షయుం బోలె గోచరించుచు, తన మనస్సును బాయక, తనచెంతనే తనదేహము నంటియున్నట్లు తోఁచుచున్న యా సుభద్రారూపమును భావించి 'ఓ సుభద్రా, నన్ను కావుము' అని వేఁడుకొను ననియును;—తాత్పర్యము. ఇట మోమున 'చూచి', ఎదను 'తలచి', సగము 'ఎంచి', అను పదముల యాయా యానుగుణ్యము నరయవలయును.

137. వినతి = వందనము. అలన్ = అల్లన్ = మెల్లగా. నిజాలకున్ = యథార్థ

బల్కు నారాయణా యను భాషణంబె
యల నిజాలకు సన్న్యాసికలె సతండు 137

క. భయభక్తుల నిటు లాకృత
క యతిగ్రామణికి కన్యకామణి శుశ్రూ
ష యొనర్చుచుఁ గొన్నాళ్లుం
డి యొకానొక నాఁడు తనదు డెందమున నిటుల్ 138

ఉ. 'వాసవి రూపచిహ్నములు వార్తలు మున్ విని యుండుదుం గదా,
యా సొబ గెల్ల నేఁడు గన నయ్యెడు వీరలయందు; నైన స
న్న్యాసి కసంగతం బగు, మహాసుకుమారతను గాంచు మారుఁ డీ
గాసికి నోర్చునే? కలరు గా మఱి మానిసిఁ బోలు మానిసుల్.'

క. అని సంశయ మొకయించుట
యును లే కెప్పటివడువున యువతివతంసం బయన్ని
బనువుగ నతనికిఁ బూజన
మొనరించుచు నుండె నంతికోద్యానమునన్. 140

సీ. కరము సాఁచి నవాంబు కలశ మీ విడివడ్డ
కుంకుమాంకపు ముద్దుఁజంక మెఱపు,
ననలు దేఁ బోఁ గాళ్లఁ బెనఁగు నంచ నదల్పఁ
జూచు జంకెనఁ గాఁకి మాపు బెళుకు,

మునకు — సన్న్యాసులు అన్నిటికిని 'నారాయణ' అని పలుకుటకు సంప్రదాయము.

138. కృతకయతిగ్రామణికిన్=కపటసన్న్యాసిశ్రేష్ఠునికి. డెందము=మనస్సు.

139. సొబగు = సౌందర్యము. అసంగతంబు = (వాసవికి) తగనిది.

140. వడువునన్=విధమున. యువతి వతంసంబు=యౌవనస్త్రీలలో శ్రేష్ఠ యగు సుభద్ర - (వతంసము = అవతంసము = సిగబంతి). అంతిక = సమీపపు.

141. (౧) కరము = చేతిని. నవ అంబుకలశము = క్రొత్తనీటిగిండిని. ఈన్ = అందిచ్చునప్పుడు. విడివడ్డ=వెలికి తొలకినట్టి - కుంకుమ అంకపు=కుంకుమ (పూలరసము) అలంకారముగాఁ గల - (విడివడ్డది ముద్దుఁజంక). మెఱపున్ = తళుకును (గీతమందలి 'చూడన్' అనుదానితో నన్వయము). (౨) ననలు = పువ్వులు. అంచన్ = హంసను.

కమ్మవిరినల్లగ ల్వ'ని,
క్రమ్మఱ మఱుపెట్టు గుట్టుఁ గనరా కుండన్. 143

క. నిద్దంపు మేలిసొమ్ములు
దిద్దినకస్తూరిబొట్టు దినచల్వలునై
ప్రొద్దొకసింగారముతో
ముద్దియ చనుదేర మిగుల మోహాతురుఁడై. 144

చ. బలిమిని బట్టఁగాఁ దివురుఁ, బట్టిన నొప్పక యిట్టటన్నచోఁ
బలువు రెఱింగిరేని నగుఁబాటని కొంకుఁ, దలం పెఱుంగకే
కలయఁగఁ జూచుటల్ తగవు గా దని యుండు నతండు, కాంత నె
చ్చెలులు నొకింత పాసి తనచెంత మెలంగుచు నున్న వేళలన్. 145

చ. అటు జగదేకసుందరికినై యతివేషముఁ బూని వచ్చినా
డఁట, తనచేయుభాగ్యమున నప్పువుఁబోఁడియె చెంత సేవఁ జే
యుట కని వచ్చి యుండు నఁట, యొక్కొకపట్టున నొంటిపాటు నా
నఁట, యతఁ డెప్పు డెప్పు డను టబ్బుర మే మదిఁ దత్తఱించుచున్? 146

ఉ. సుందరి రానిచో నెదురుసూచుచు నుండును పట్టె; వచ్చుచో
నిందునిభాస్యచక్కఁదనమే కని చొక్కుచు నుండఁ బట్టె; నీ

ల్వ అని = పరిమళియుక్తమై వికసించిన నల్లగలువ (సుమా) అని. గుట్టున్ = అంత భావమును. మఱు పెట్టు = మఱుఁగుసేయును.

144. నిద్దంపు = మెఱుఁగుగల - మేలి = శ్రేష్ఠమయిన - సొమ్ములు = నగలను. దినచల్వలున్ = దినమునకొకవిధమైన చీరలను ముద్దియ = అమగుద (సుభద్ర). చనుదేరన్ = రాఁగా. మోహ ఆతురుఁడై = మోహము చే త్వరపడుచున్నవాఁడై.

145. తివురున్ = యత్నించును. ఇట్టటన్నచోన్ = ప్రతికూలముగాఁ బలికిన పక్షమున. కొంకున్ = జంకుపడును. తలంపు = ఎదుటిభావమును. కలయఁగన్ = పొందుటకు.

146. జగత్ = జగత్తులో - ఏక = ముఖ్యమైన - సుందరికిన్ ఐ = సౌందర్యము గలదైన యాసుభద్రకొఱకు. పట్టునన్ = సమయమందు. అబ్బురమే = ఆశ్చర్యమా. మదిన్ = మనస్సులో. తత్తఱించుచున్ = తహతహపడుచు.

147. చొక్కుచునుండన్ = పరవశత్వముఁ బొందుచుండుటకు. కపట త్రిదండి

సందడిచేత నే యరుగసాగెను బ్రొ; ద్దిక వేళ యెప్పుడో
సంది జపంబు నర్చనలు సల్పుట కా కపట త్రిదండికిన్? 147

గీ. వెలఁది కెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ,
దరుణి లేఁగౌనుఁ గని హరిస్మరణ మఱచెఁ,
గడమ యన నేల? వేస మొక్కటియ తక్క
మఱచె నన్నియు నాకృత్రిమ త్రిదండి. 148

మ. ఒడలుప్పొంగ నొయారిఁ జూడ; జవరా లొద్దన్నె లంగన్ గను
ర్వొప్పడుచున్; ముద్దులగుమ్మ గంధకుసుమంబుల్ చేతి కందిచ్చిన
ప్పుడు వ్యాపారము లన్నియున్ మఱచు; నప్పూఁబోఁడి రాకుండినన్
గడెసే పొక్క మహాయుగంబు కరణిం గన్పట్టు రామానుజున్. 149

క. ఆనందబాష్పములచే । నా నివధూ హావ భావ నటనల దనలోఁ
దాన తలపోయువానికి । స్నానం బేమిటికి? వేఱె జప మేమిటికిన్? 150

కిన్ = అబద్ధపుఁ త్రిదండ సన్యాసికి.

148. జప ఆవృత్తిన్-(మంత్ర జపము చేయునప్పు డొకసారి తావళమును త్రిప్పుట కావృత్తి యని పేరు) అట్టిదానిని-జపా వృత్తిన్ = దాసానిపుష్పముయొక్క తలంపును అని అర్థాంతరము (దాసానిపూవునకును కెమ్మోవికిని సామ్యము ప్రసిద్ధము - కెమ్మోవి ఆరుణ్యకోమలత్వములయందు దాసానిపూవును మించియున్న దని భా.) లేఁగౌనున్ = లేఁతనడుమును. హరిస్మరణ=విష్ణుస్మరణము - సింహముపై జ్ఞప్తిని (సింహమునడుము వంటి నడుముగలది యని భా.)

149. ఒయారిన్ = ఠీవిగలయాసుందరిని. మహాయుగంబు= నాల్గుయుగముల మొత్తము. రామానుజున్=అజానునకు. [అందిచ్చు=అందు+ఇచ్చు - శబ్ద పల్లవము.]

150. వధూ=సుభద్రయొక్క-హావ భావ = ఆ పేరుల శృంగారచేష్టలయొక్క (హావ మనఁగా కనుబొమలు కన్నులు లో నగుదాని చలనవిశేషములచే కొంచెము తెలియనగు మనోవికారము - భావ మనఁగా నిర్వికారాత్మక మయిన సత్త్వమందు కలుగు ప్రథమవికారము.) - నటనలన్ = అభినయములను. తాన తలపోయు వానికిన్ = (అహావభావములను) తనమనస్సులో తానే అభినయించుకొనుచున్న వానికి అని యర్థము- దానిని ధ్యానించుచున్న వానికి అని యర్థాంతరము.

క. ఈరీతి నుండ నొకనాఁ। డా రాజకుమారి యతని కాహార మిడన్
జేసి, తదారామంబునఁ। గూర్చుండె నెచ్చెలులు వెంటఁ గొని తేరంగన్.

క. వెస లలనామణి బంగరు
వెసలలదొంతరలు డించి, వినయము ముద్రి కిం
పొసఁగఁగఁ, గంకణరవములు
పొసఁగఁగఁగ, నారసి రసాన్నములు వడ్డింపన్. 152

చ. చిలుకలకొల్కి వే యొసఁగు నే ముడిగొల్పెడు జాఱుకొప్పు, నిం
పులు తులకింపుచుండు భుజమూలరుచుల్, జిలుఁగుంబయంటలోఁ
గులుకుమిటారిగబ్బిచనుగుబ్బలు, సూచుట కాని, క్రీడి క
ర్మిలి మఱి లేదు భోజనము మీఁది యపేక్ష యొకించుకేనియున్. 153

గీ. రమణియొయ్యారములపైఁ బరాకు చేతఁ
జవి యెఱుంగఁడు, వడ్డించునది యెఱుఁగఁడు;
భోజనము చేసి లేచె నా రాజసుతుఁడు,
తృప్తి యేరీతి నుండెనో తెలియరాదు. 154

క. అపు డతిరయమునఁ బసి। డిపరంజిపసిఁడిగిండి యందం గొని తాఁ
జపలాక్షి తెచ్చి యిచ్చెఁ, । గపటప్రవ్రాజ్యతి ధౌతకరపంకజుఁడై.

151. తత్ ఆరామంబునన్ = ఆయుద్యానవనమందు. తేరంగన్=తేఁగా.

152. వెసన్=శీఘ్రముగా. లలనామణి = తరుణీరత్నమైనసుభద్ర. వెసలల = కుండలయొక్క. కంకణరవములు = గాజులధ్వనులు. ఆరసి = పరీక్షించి. రస అన్నములు = షడ్రసోపేతము లయిన యోగిరములను.

153. చిలుకలకొల్కి = సుభద్ర, వే = త్వరగా. తులకింపుచుండు = పెంపు మీఱుచుండునట్టి (అప్రశస్తమైన యింపు గాగమును అనుప్రాసార్థమై వేయఁబడినది.) భుజమూలరుచుల్ = కక్షదీధితులు. క్రీడికిన్=అర్జునునకు. ఆర్మిలిన్=ప్రీతితో.

154. రమ...చేత=సుభద్ర విలాసములమీఁది ధ్యానముచేత. చవి=రుచి.

155. అతిరయమునన్ = మిక్కిలి వేగముగా. అపరంజి పసిండి=మేల్మి బంగారు. చపల అక్షి = చంచల నేత్రమైన సుభద్ర. ధౌత కర పంకజుఁడై =కడుగఁబడిన హస్తకమలములు గలవాఁడై (=చేతులు కడుగుకొని).

క. నిగనిగని చంద్రకాంతపు
జగతిపయిం గూరుచుండఁ జవ్వని వెనుకం
బగడపుఁగంబముచాటున
మొగ మించుక కానిపింప మురువు నటింపన్, 156

మ. కంగుల్ దీర్చిన పైఠిణీరవిక చన్కట్టుంటి రాణింపఁగాఁ,
జెంగల్వాల్ నెఱికొప్పునందు నొఱపై చెంతన్ గుబాళింపఁగా,
బంగారందియ ముక్కునం గమిచి పై పై నంచ యెల్గింపఁగా,
సింగారం బగుముద్దుఁజిల్క తనకుం జేదోడు వాదోడు గాన్, 157
ఏకతంబున వసియించి యిట్టు లుండ,
మదన మదనాగ వలమాన మానసాంబు
రుహుఁడు పురుహూతసుతుఁడు నేరుపునఁ బలికె
నాచకోరాక్షిఁ గ్రేఁగంటఁ జూచి యపుడు. 158

**156.** జగతి పయిన్ = అరఁగు మీఁద. మురువు నటింపన్ = ఒయ్యారము గనిపించునట్లుగా.

**157.** కంగుల్ తీర్చిన=ఉగ్గులు ఎడలించినట్టి-అనఁగా ముడుతలు లేని (కంగులనఁగా జరీబుటా అని కొందఱు - ఆపక్షమందు - తీర్చిన యనఁగా కుట్టిన యని యర్థము.)-పైఠిణీ రవిక=పైఠాణి అను వలిపముతో (అనఁగా ప్రత్తియు పట్టును కలయనేసినవస్త్రముతో) కుట్టినరవిక. చన్కట్టు=కుచభాగమును [పా. చన్గట్టు=చనుగొండను.] ఉంటి=పూఁతపూసినట్లు అంటుకొని. రాణింపఁగాన్ = ఒప్పుచుండఁగా. ఒఱపు = అందము. చెంతన్=ప్రక్కను. గుబాళింపఁగాన్=పరిమళించుచుండఁగా. అందియన్-కమిచి=కఱచిపట్టి. అంచ = పెంపుడుహంస. ఎల్గింపఁగాన్=కూయుచుండఁగా [పా. అల్గింపఁగాన్=కోపముఁ దెప్పించుచుండఁగా.] చేదో...గాన్ = సహాయముగా (ఇది లోకోక్తి - మీఁజేత నున్నందున చేతికిని మాటచమత్కారి గనుక వాక్కునకును తోడు అని చమత్కారము.)

**158.** ఏకతంబునన్ = ఒంటరిపాటున. మద...హుఁడు=మన్మథుఁ డను మదించిన యేనుఁగుచేత పెల్లగిల్లుచున్న మన స్సను పద్మముగలవాఁడు-అనఁగా మన్మథునిచే పీడింపఁబడినవాఁడు. పురుహూత సుతుఁడు = ఇంద్ర పుత్త్రుఁడగు నర్జునుఁడు. చకోర అక్షిన్ = వెన్నెలపులుఁగులవంటి కన్నులుగల యాసుభద్రను.

గీ. 'చెలువ, నిను రాజకీరంబు చెట్టవట్టెఁ,
గలికి, నిను రాజహంసంబు కాలు ద్రొక్కెఁ,
మంచిశకునంబు లివి నాదు మాటఁ జూడు,
కన్నె, యీలోనఁ బెండ్లి కాఁ గలదు నీకు.' 159

క. అనవుడు లజ్జావనతా
ననతామరస యయి, 'వీరు వాఁగ మహాత్ముల్,
తనచేసిన సేవకుఁగా
మన మలరి వచించి ర;' నుచు మది నుత్సుక యై, 160

గీ. కురులు కెంపులబొగడల నెరయ దువ్వి,
నిక్కుచనుగుబ్బలఁ బయంటఁ జక్కఁ జేర్చి.
పలికెఁ గలకంఠి మోమునఁ దెలివి తొలుక
ముత్తియపుముంగర యొకింత మోవిఁ గదియ. 161

సుభద్ర యతిని అర్జునువార్తను అడుగుట.

మ. "అవ్వఁగా, మీ రెట ముందు గన్గొనని చాయల్ లేవు గా; నాఁటనుం
డి విశేషంబులు కొన్ని మిమ్ము నడుగన్ వేడ్కయ్యెడున్ నాకు; నె

159. రాజకీరంబు చెట్టపట్టెన్ = రాచిలుక చేతికెక్కినది (రాజశ్రేష్ఠుఁడు పాణిగ్రహణము చేసినాఁడు - అనఁగా - పెండ్లియాడినాఁడు - అని యర్థాంతరము). రాజ... ద్రొక్కె = రాయంచ కాలు ద్రొక్కినది (రాజశ్రేష్ఠుఁడు, కనిసినాఁడు - అనఁగా పెండ్లియాడినాఁడు-అని యర్థాంతరము) శకునంబులు = సూచకములు (పత్నులు అనియు). కన్య = ఓకుమారీ. ఈలోనె = కొలఁదిదినములలోనే —చెట్టపట్టుట పాణిగ్రహణమును కాలు ద్రొక్కుట సన్నికల్లుమట్టించుటను సూచించుచున్న వని భా. హంసకు చేయిలేనందున తనపాదముతోనే సుభద్రపాదమును పట్టిన దని యెఱుంగ వలయును

160. అనవుడున్ =(అర్జునుఁడు) ఇట్లు పలుకఁగా. లజ్జా...యై = సిగ్గుచేత (అవనత=) వంపఁబడిన పద్మమువంటి ముఖముగలదై - అనఁగా సిగ్గుపడి తలవంచుకొని. నాఁగన్ = అనఁగా. అలరి = సంతోషించి. ఉత్సుక = ఇష్టార్థోద్యుక్తురాలు.

161. నెరయన్ = అంటునట్లు. కల కంఠి = అవ్యక్తమధుర వాక్కులుగలది.

162. చాయల్ = దిక్కులు.

య్యవి గన్గొంటిరి పుణ్యభూములు? లట రాజ్యంబు లున్నోజ్జంబు లె
య్యవి? యేయేపురములు గనఁబడియెను మీ కందంద మార్గంబునన్? 162

క. మీ రింద్రప్రస్థముఁ గని
నారా? పాండవులఁ జూచినారా? సుఖులై
వా రందఱు నొకచో ను
న్నారా? వీరాగ్రగణ్యు నను నెఱుఁగుదురా?. 163

సీ. ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబుఁ
బుడికి పుచ్చుకొను నెన్నడుమువాఁడు
నెఱిపెండ్రుకలవాఁడు నీలంపునికరంపు
మెఱుఁగుఁ జామనచాయ మేనివాఁడు
గొప్పకన్నులవాఁడు కోదండగుణకిణాం
కము లైనముంజేతు లమరువాఁడు
బవిరిగడ్డమువాఁడు పన్నిదం బిడి డాఁగ
వచ్చు నందపువెన్ను మచ్చవాఁడు
గీ. గరగరనివాఁడు నవ్వుమొగంబువాఁడు
చూడఁగలవాఁడు మేలైన సొబగువాఁడు
వావి మేనత్తకొడుకు కావలయు నాకు
నర్జునుండు పరాక్రమోపార్జునుండు. 164

163. వీర=పరాక్రమవంతులలో - అగ్రగణ్యుఁ=మొదట లెక్కింపఁదగిన వానిని (శ్రేష్ఠుని అనుట).

164. (౧) మృగరాజమధ్యంబుఁ = సింహముయొక్క నడుమును - బుడికి = ఒడిసి (సింహమునడుము సన్నముగాన సన్నని నడుముగలవాఁ డని యభిప్రాయము.) (౨) నీలంపు నికరంపు = నీలమణివంటి సారాంశముయొక్క. (౩) కోదండగుణ కిణ అంకములు = వింటి నారి (దెబ్బల) వలని కాయ లనెడు చిహ్నములుగలవి. (౪) బవిరి=గుండ్రమైన. పన్ని...వచ్చు = పందెము చేసి (అనఁగా నిశ్చయముగా దాఁగియుండుటకుఁ దగినంత యవకాశము గలయట్టి - అంద...ను = సొగసుగలిగిన వీపును అం దొకమచ్చయుఁ గలవాఁడు.

క. తడవాయె భూప్రదక్షిణ
మడరింపఁగఁ బోయి యా మహామహుఁడు; పదం
పడి పుణ్యస్థలములు నె
న్నఁడు మీ రం దందు నరుగ నరుఁ గానరుగా!" 165

క. అన విని 'సమస్త భూములు
గనినారము తీర్థయాత్ర గావించు నెడన్;
గనుఁగొనినారము సంక్రం
దన నందను;' ననిన ముద మెసం జెన్నొందన్, 166

ఉ. 'ఎచ్చటఁ గంటిరో విజయు నిక్కువ? నిక్కువ మౌనె? రాఁడు గా
యిచ్చటి కే'ంచుఁ గోరికల యేఁకట యేఁకటఁ బెట్టఁ బల్కఁగా;

గర...గరని = మిక్కిలి నాగరకతగలిగిన. చూడఁగల = చూడఁదగిన. సొబగు = చక్కఁదనము. వాడన్ = చుట్టుతీకమందు. పా.—పరాక్రమ ఉపార్జనుండు = పరాక్రమమే సంపాదనగాఁగలవాఁడు - [ఉపార్జునుఁడు = పరాక్రమమందు కార్తవీర్యార్జునునికి చేరు వయినవాఁడు అని యేని - పర = ఇతరులయొక్క - అక్రమ = ధర్మాతిక్రమములయెడ - ఉపార్జునుండు = కార్తవీర్యార్జునునికి చేరువయిన వాఁడు - దండించువాఁ డనుట. ఈ సుభద్రాపరిణయమునకే బ్రాహ్మణ ధేనుహర్తృ దండనోత్సాహమే తీర్థయాత్ర ద్వారముగా మూలకారణము గావునను, ఈకవికి అత్యంత ప్రియమగు ననుప్రాసము ఈపాఠముచేతనే సిద్ధించును. గావునను, ఈయర్థము తోడి యీపాఠమే శ్రేయముగా నున్నది. కార్తవీర్యప్రభావము మాంత్రికులకును పౌరాణికులకును సువిదితము. *]

165. మహామహుఁడు = అధికతేజశ్శాలి. తడవు = చిరకాలము.

166. సంక్రందన నందనున్ = ఇంద్రపుత్త్రుఁడైన యర్జునుని. ముదము=సంతోషము. ఎడన్=మనస్సులో. చెన్నొందన్ = ఒప్పారఁగా.

167. విజయుం = అర్జునునియొక్క - ఇక్కువన్ = ఉనికిని. నిక్కువము = నిజము. కోరికల యేఁకట యేఁకటన్ బెట్ట = వాంఛల యుద్రేకము ఉద్రేకమును పొందు

* సంగ్రామనిర్విష్ట సహస్రబాహు రష్టాదశద్వీప నిఖాతయూపః
అనన్యసాధారణ రాజశబ్దో బభూవ యోగీ కిల కార్తవీర్యః.
అకార్యచిన్తాసమకాల మేవ ప్రాదుర్భవన్ చాపధరః పురస్తాత్
అన్తఃశరీరే ష్వపి యః ప్రజానాం ప్రత్యాదిదేశావినయం వినేతా. రఘు.

నొచ్చెము లేనిబీర మెద నూరఁగ, నూఱఁగఁ జొచ్చె వెంటనే
పచ్చనివింటివాఁ డపుడు పైదలిపైఁ దలిరాకుఁగైదువున్. 167

ఉ. కోమలి యీగతి న్మదిఁ దగుల్పడఁ బల్కిన నవ్వి, "నిర్జర
గ్రామణిసూను మీరెచటఁ గంటిరొ యంటివి? కన్నమాత్రమే?
యే మని చెప్పవచ్చు! నొక యించుక భేదము లేక యాయనే
మే మయి యున్న వారము సుమీ వికచాంబుజపత్త్రలోచనా. 168

గీ. తీర్థములను గ్రుంకి దేవతాసేవలు
చేసికొనుచుఁ బెక్కు వాసరములు
కూడి యతఁడు మేము గోకర్ణమునయందు
నుంటి." మనిన, మచ్చెకంటి యలరి, 169

క. 'ఎక్కడ గోకర్ణం బన?
నిక్కడి కది యెంతదూర? మింతకు నతఁ డీ
చక్కటికి వచ్చునో? లే
కక్కడనే యుండి యవలి కరుగునొ? చెప్పుఁడా.' 170

క. అని రాజవదన మాటికి
ననురాగము తేటపడఁగ నాడెడుమాటల్

నట్లుగా (పా.—ఈరికె యీరికె లెత్తక = (వాంఛల) యంకురములనఁగ అంకురములు మొలచుచుండఁగా.) పచ్చని వింటివాఁడు=మదనుఁడు. ఒచ్చెము=లోపము. బీరము=పరాక్రమము. ఎదన్=హృదయమందు. ఊరఁగన్=పుట్టుచుండఁగా. పైదలిపైన్=ఆస్త్రీ (సుభద్ర)మీఁద. చిగురాకు కైదువున్ = చిగురు టాయుధమును.

168. మదిన్ తగుల్పడన్=మనస్సున నాటునట్లు.—నిర్జర గ్రామణి సూనున్=దేవేంద్ర పుత్త్రుని (అర్జునుని). ఆయ...మీ = ఆయన యొకటి మే మొకటి కాక యేకశరీర మగునట్లుగా మిక్కిలి స్నేహముతో మెలఁగితిమి సుమా - అని అర్థము-నేనే అర్జునుఁడ నని భావము. వికచ అంబుజ పత్త్రలోచనా = వికసించిన తామర రేకుల వంటి కన్నులుగల యోసుభద్రా.

169. మచ్చెకంటి = మచ్చెములవంటి కన్నులుగలదైన సుభద్ర.

171. రాజ = చంద్రునివంటి - వదన=ముఖముగలదైన సుభద్ర. తేటతే రా

లోకోత్తరశుభలగ్నం
బోకోమలి నేఁడు; కోర్కు లీడేఁగూర్పఁగదే." 175

ఉ. నా విని యావినీలకచ నవ్వొకొంకగం బటు గొంత వంచి, యెం
తే వెఱ నివ్వెఱన్ మనిఁగి, 'యీతనిఁ బార్థునిఁగా నొకింత మున్
భావమునం దలంచియును నమ్మక యమ్మకచెల్ల! యూరకే
సేవ లొనర్చుచుంటి.' నని సిగ్గున దిగ్గున లేచి పోవఁగన్. 176

గీ. ఏల పోయెదు నిలునిలు బాల యనుచుఁ,
జెలువగవు నెమ్మొగంబునఁ జెంగలింపఁ,
దమకమున లేచి మరు లేచి తత్కరాంబు
జం బొడిసి పట్టెఁ జే సాఁచి సవ్యసాచి. 177

క. పట్టినమాత్రన దేవకి
పట్టి కరాబ్జము లలాటపట్టిక చెమటల్
పట్టఁ గగుర్పొడిచెం జను
క; ట్టొకయినుమంత వీడెఁ గట్టుంగొంగున్. 178

క. మరుఁ డపుడు చేసితూపులు
ధరియించియు నేమి చెప్పఁ దరుణిన్ నరునిన్

175. చేసెదన్ = చేయుచున్నాను. ఈకైవడిన్ = ఈప్రకారము. లోకోత్తర = మిక్కిలి శ్రేష్ఠమయిన.

176. నాన్ = (అర్జునుఁ డిట్లు) పలుకఁగా. వినీలకచ=నల్లని తలవెండ్రుకలు గలది (సుభద్ర). ఎంతేని వెఱన్ నివ్వెఱన్ = మిక్కిలి భయమునందును ఆశ్చర్యము నందును. పార్థునిఁగాన్=అర్జునునిఁగా. అమ్మకచెల్ల— ఆశ్చర్యద్యోతకము. ఊరక=నిజము తెలిసికొనక. ఏన్ = నేను.

177. చెంగలింపన్ = ప్రకాశింపఁగా. తమకమునన్ = తొందరపాటుచేత. మరులు లేచి=మోహ మతిశయించి. సవ్యసాచి = అర్జునుఁడు. తత్ కర అంబుజము= ఆ సుభద్రయొక్క హస్త పద్మమును.

178. దేవకి పట్టి = దేవకీదేవియొక్క కూఁతురైన సుభద్రయొక్క. లలాట పట్టిక = పలకవంటినొసలు. ఈ పద్యమున సాత్త్వికోదయము చెప్పఁబడినది.

179. మరుఁడు=మన్మథుఁడు. చేసి= చేసి సంఖ్యగల - అయిదనుట. నరునిన్=

సరికోలలఁ బడ నేసెన్

గొరవంకరొదల్ సెలంగఁ గ్రొన్ననవింటన్. 179

క. ఆరీతిం జేపట్టి వ

రారోహన్ వేదిమీఁది కై రాఁ దిగువన్,

దూరము వెస నరుగక యొ

య్యారముగా నమ్రవదన యై యుండంగన్; 180

క. "ఏ మును చూచి యెఱుఁగ నిను;

నీ మును నను జూచి యెఱుఁగ వీవును; నివు డీ

ప్రేమలు వినుకలినే పై

పై మన కిర్వురకుఁ బర్వెఁ బర్వేందుముఖీ. 181

ఉ. శారిక హారికంకణము సద్దున కంటుట గాదు కేలు; మం

జీర ఝళంఝళ ధ్వనికిఁ జేరుట గాదు పదంబు లంచ; వా

గ్ఘోరణిమాధురీమహిమకున్ శుక మాటుట గాదు చెక్కు; లో

పారసనేత్ర, చాకౌఅసు సారెకు వేఁడెదు జాడ లిన్నియున్. 182

అర్జునుని. సరి=ఇద్దఱును సమానముగా - కోలలన్ = బాణములతో - సరికోలలన్= సరి సంఖ్యగల బాణములచే ననియు - జేసితూపులు తొడిగి సరితూపు లేసె నని చమత్కారము. గొరవంక రొదల్=శారికల కోలాహల ధ్వనులవంటి ధ్వనులు - క్రొన్ననవింటన్ = క్రొత్త పూవులుగ్గ వింటితో - గొర...లంగన్—మదనధనుష్టంకారములను స్వజాతి పక్షుల కూఁతలనుగాఁ దలంచి గొరవంకలు రొద చేసినవనుట యొండె-మనమునను విశేషముగా వింటిచారిని మ్రోఁగించెను - అనఁగా విశేషముగా కోల లేసెను-అని భా.

180. వర ఆరోహన్=మంచి నితంబముగల సుభద్రను. వేది మీఁదికై=అరఁగు మీఁదికి. దిగువన్ = లాగఁగా. నమ్ర...యై = వంగిన మోము గలదై.

181. పర్వ ఇందు ముఖీ = పున్నమచందురునివంటి ముఖముగలదానా. ఏన్= నేను. ఈమును=ఇంతకుఁబూర్వము. వినుకలి నే=వినికిచేత నే. పర్వెన్=వ్యాపించినవి.

182. శారిక = గొరవంక, హారి...నకున్ = మనోహరమైన కంకణముల మ్రోఁతకొఱకు, కేలు అంటుట కాదు=హస్తమును పట్టుకొనుట కాదు సుమా; అంచ= హంస, మంజీ...పదంబులు=అందెల ఝళంఝళధ్వనులకై పాదముల నాశ్రయించుట కాదు సుమా; శుకము = చిలుక, వాగ్...లు = (నీ) మాటల జాలుమొక్క తీరుః

సీ. నన్ను గాంధర్వంబునను బెండ్లి యాడవే,
నీ వ్వేల వడఁకెదే చిగురుఁబోణి!
రతిఁ దేల్చి మదనసామ్రాజ్య మేలింపవే,
తల యేల వంచెదే జలజగంధి!
చెలులు వచ్చెదరు నా తలఁపు లీడేర్పవే,
తడ వేల చేసెదే ధవళనయన!
మది నిచ్ఛగించి నా మనవి యాలింపవే,
కడ కేల పోయెదే కంబుకంఠి!

గీ. మనసు దాఁపఁగ నేటికే యనుపమాంగి?
చలము సాధింప నేటికే చంద్రవదన!
మాఱుమాటాడ వేటికే మధురవాణి!
చింత సేయంగ నేటికే దంతిగమన! 190

క. గబ్బిమరుం డొఱ వెఱుకక
గొబ్బునఁ బైఁబడును; నీవుఁ గూడని వార్తల్
సుబ్బినఁ గార్యం బెక్కడఁ,
దబ్బిబ్బౌ గాక పూర్వతను బిబ్బోకా! 191

క. మీఁదట వియోగసాగర
మీఁదం గలవా లతాంగి? యే మెఱుఁగవ; యో!

190. గాంధర్వము—పెద్దలజోలి లేక వధూవరులిద్దఱును సమాధానపడి కలసికొను వివాహము పేరు. రతిన్=మదనక్రీడయందు. సామ్రాజ్యము = దొరతనమును. ధవళనయన=తెల్లని కన్నులుగలదానా. ఇచ్ఛగించి=అంగీకరించి. చలము=పట్టుదల. దంతిగమన = ఏనుఁగు నడకవంటి నడక గలదానా.

191. అపూర్వ తను బిబ్బోకా=ఇంతకుముందెందును లేని శరీరవిలాసముగలదానా. [పా.-పూర్ణతను బిబ్బోకా]. గబ్బి మరుఁడు=క్రూరుఁడైన మన్మథుఁడు. ఒఱ వెఱుకక= కత్తిని ఒఱనుండి తివియుపాటి వ్యవధి లేక (అనఁగా అతివేగమున). కూడని=అనుకూలము గాని (పొందు నొసంగని అని మర్మము). సుబ్బినన్=పలికినచో. తబ్బిబ్బౌ కాక=మదనునివలని తబ్బిబ్బు అనఁగా కీడు ఏమో కాకుండ. ఎక్కడన్ = ఎట్లు కొనవేఱును.

'యీఁడా డన్నను మదనుఁడు
కోఁడా' డనువాఁడు బిగువు కొనసాగు నొకో! 192

క. ఏలే యాలేఖ్యాకృతి
యే? లే ప్రాలేయకరముఖి; చూడ వయో ?
యేలే శైలేయస్తని ?
యేలే బాలేందునిటల, యే లాఁతి నఁటే? 193

సీ. ఆ హార మింపౌ కుచాగ్ర మానక యున్న
నాహార మింపు గా దబ్జవదన ;
చెఱకుఁబా లొదవు వాతెఱ యీనిచోఁ గంతు
చెఱకుఁబా లౌదునే చిగురుఁబోఁడి ;
కళలు దేటెడు నెమ్మొగమ్ము ముద్దిడ కున్నఁ
గళలు దేఱవు సుమీ కంబుకంఠి;
వలతేని దురమున నలరింపకున్న న
వ్వల రే నిదుర రాదు కలువకంటి ;
గీ. నేఁడు గాదు గదే ప్రేమ నీకు నాకు ;
నాటి యున్నది మఱి చిన్ననాఁటినుండి ;
యిటుల నేకాంత సమయ మెన్నఁటికి దొరకు ?
నేల తప్పించుకొనియెదవే లతాంగి?' 194

192. వియోగసాగరము=విరహసముద్రము. ఈఁడా...వాఁడు=(ఇది యొక సామెత) నీ వొకటి తలఁచిన తా నింకొకటి తలఁచువాఁడు-ఈఁడాడును కోఁడాడును తాళవృత్తవిశేషములు.

193. ఆలేఖ్య ఆకృతి యే = చిత్తరుప్రతిమయొక్క యాకారమే - ఏలే - ఎందులకే (ఉత్తరము చెప్పక ఊరకయే యున్నావేమే అనుట). లే ప్రాలేయకర ముఖీ= లేవే చంద్రునివంటి ముఖముగలదానా (నాకౌఁగిటం జేరుటకు కదలవే అనుట). శైలేయ స్తని=పర్వతసమానమైన కుచములుగలదానా, అయో! చూడవు ఏలే, బాల ఇందు నిటల= లేఁత చందురునివంటి నొసలుగలదానా, ఏలే=నన్ను ఏలవే (గ్రామ్యము); ఏఁ=నేను. లాఁతి నఁటే = అన్యుఁడనా (మేనత్తమేనమామబిడ్డలమే కదా అనుట).

194. ఆ హార మింపౌ = ఆ ముత్యాలపేరు రమణీయముగానున్నట్టి. ఆనక =

సీ. కలకంఠి, నీకటాక్షము గల్గ నిన్నాళ్లు
      గురుశిలీముఖముల సరకు సేయఁ;
గనకాంగి, నీసమ్ముఖము గల్గ నిన్నాళ్లు
      చందమామ నొకింత సడ్డ సేయ;
రమణి, నీప్రియవచనము గల్గ నిన్నాళ్లు
      కలికిరాచిలుక లక్ష్యంబు సేయ;
కొమ్మ, నీకరావలంబము గల్గ నిన్నాళ్లు
      లేమావిచివురాకు లెక్క సేయఁ;
గీ. జూడక మొగంబు ద్రిప్పి మాటాడ విపుడు
      చే దిగిచి పట్టుక పరాకు చెప్పినపుడె;
యేమి పుట్టునో కైలాట మింకమీఁద?
      మగువ దయ లేక విడనాడఁ దగునె నీకు? 198

క. మొక మెఱుక కలదు గదవే,
మకరాంకుని యనుఁగు మేనమామకు నీకున్;
తికమకలు సేయ వల దను
మకటా! మేడకుఁజూ కేఁగు నపు డైనఁ జెలీ. 199

198. ఇందు 'కల్గన్' అని చెప్పఁబడినవి నాల్గును రక్షకములు. తిరస్కృతములు నాల్గును ఉద్దీపకములు. 'కటాక్షము'నకు దయ - 'సమ్ముఖము'నకు ఆదరము - 'ప్రియవచన'మునకు అభయోక్తి - 'కరావలంబము'నకు రక్షణయుం గర్భితాభిప్రాయములు. 'కల్గిన' నాల్గింటికిని తిరస్కృతములకు నాల్గింటికిని గలసామ్యమును అరయవలయును. గీత పూర్వార్ధమునకు సీసపాదములతోడి క్రమాన్వయమును కనవలయును. శిలీముఖములు = లేంట్లు (బాణము లొండె). దిగిచి = లాగి. పరాకు చేసినపుడె = ప్రభువులకు సేవకులు పరాకు చెప్పురీతిగా నేను నీకు హెచ్చరికకై విన్నప మాచరించినప్పటికిని. కైలాటము = మోసము, ఏమి...మీఁద = ఇఁక నాకుం బ్రాణాపాయము కలిగెడును. పరాకు చెప్పినపుడు చేయిఁ బట్టుట వినయాదరాతిశయముల చేత. [పట్టుక - గ్రామ్యము.]

199. మకర...కున్ = మన్మథుని మేనమామ యగుచంద్రునకును నీకును, మొక...వే = పరిచయము గలదు గదా (నీముఖము చందమామవలె నున్నది అని ధ్వనితము), మేడ...నన్ = మేడమీఁదికి పోవునప్పు డైనను, తిక...మా = (నన్ను) చిక్కులం బెట్ట

వ. అని, యనేక ప్రకారంబులం దనమనోనురాగంబు తేటపడం బలికినఁ, జెలుల నరయు నెపంబునం బరాకుసేసికొని చిఱుచెమ్మట గ్రమ్ము నెమ్మొగమ్ము మకరంద బిందు కందళి తారవిందమ్ము చందమ్మునం దనర, నరవీడు కుచ్చెళ్ల నెత్తి చెక్కుచు, నొక్కింత జాఱుపయ్యెంటఁ జక్కం జేర్చుచు, నొకింత వదలు వేనలి నలవరించుచుఁ, గొండొక చెదరు పాపటఁ గుదురు కొల్పుచుఁ, జక్కెరవిల్తుం డెక్కడ వెన్నాడునో యనుభయంబునంబోలె నించుకించుక తిరిగి చూచుచు, ననుగత కేకి హంసంబులపై వెగటునంబోలెఁ జలించుచు, నీయొళవు సకియలకుం జెప్పకు మని రాచిల్కకుం బ్రియంబులు సెప్పుచు, మగ తేఁటి యంటియంటని ప్రసూనకళికపోలిక నరవిరిబాగుతో సోలి, కప్పురంపుటనంటుల నంటు ద్రాక్షపందిరుల తెరువునం బూఁదేనె కాలువలు దాఁటి, చెంగలువబావులు డగ్గఱి, కుంకుమనీటి కేళాకూళి యోరవట్టి, వట్టివేళ్ల చప్పరంబులనీడ వ్రీడాభరం బీడిచికొని పోవ; నివ్విధంబున, 200

క. ఆఘనునిఁ బాసి మంజీ । రాఘోషము మెఱయ నరిగె నంతఃపురికిన్ ।
వేఘనజఘన తళుక్కన । మేఘము నెడఁబాసి చనెడు మెఱుఁగో యనఁగన్.

వలదని (చందమామతో) చెప్పుము (మేడ చంద్రుని తగులునంత యున్నత మనియు భా.)

200. పరా...కొని = వినని దానివలెనే కనఁబడి. మక...మ్మునన్ = పూఁదేనె చుక్కల చేత దట్టమయిన పద్మముయొక్క రీతిని. అర వీడు...క్కుచున్ = ఇంచుక వీడిపోయిన చీరకుచ్చెలను పైకి దోపుకొనుచు. వేనలిన్ = కొప్పును. అలవరించుచున్ = చక్కఁగా సవరించుకొనుచు. కొండొక = కొంత. పాపటన్ = పాపటబొట్టును. వెన్నాడునో = వెంటఁ దఱుమునో. అనుగత...లపైన్ = అనుసరించి వచ్చుచున్న నెమళ్లపైని హంసలపైని. వెగటునం బోలెన్ = కోపగించిన రీతిని. ఈయొళవు = ఈ మర్మము. ప్రసూనకళిక = పూమొగ్గ. అర విరి బాగుతోన్ = సగము వికసించినపువ్వము రీతిని. కుంకు...వట్టి = కుంకుమపూవసంతము నించిన యాంతుఖానాయొక్క దరిని పట్టి. చప్పరంబుల = పందిరుల. వ్రీడా భరంబు = సిగ్గుయొక్క యతిశయము.

201. ఘనజఘన = గొప్పనితంబముగలది. మంజీర ఆఘోషము = అందెల ధ్వని.

క. ఎటువంటి నేర్పరి నిశా
విటునల్లుఁడు! నడుకు నిల్చి వెడసింగిణిచే
నటు చూపిటు నిటు చూపటుఁ,
బటురయమున నేసె నా సుభద్రార్జునులన్. 202

గీ. కోప మనువారి బెదరించి కూర్పు నేర్చుఁ,
గూడ మనువారిఁ దమి గొల్పి కూర్పు నేర్చుఁ,
గొమ్మలకు మగలకుఁ బెండ్లిఁ గూర్పు నేర్చు,
జగతి నెంతటి యుపకారి శంబరారి! 203

---

శా. దాక్షిణ్యాకరమూర్తి, షోడశ మహాదానాఢ్య పుణ్యక్రియా
దక్షా, యాశ్రిత దీన రక్షణ కళా ధౌరంధరీ సత్కృపా
వీక్షా, శాశ్వతకీర్తి, వైభవ రమాభృచ్ఛోళసింహాసనా
ధ్యక్షా, దుర్దమ రాట్ కిరీట దళనైకాక్షేమ కాక్షేమకా. 204

202. నిశావిటునల్లుఁడు=రాత్రికి ప్రభువైనచంద్రుని మేనల్లుఁడగు మన్మథుఁడు, వెడసింగిణిచేన్=వెఱ్ఱిచెఱకువింటిచేత - [చూపి ఇటు - చూపి అటు - క్త్వార్థకారసంధులు; కొందఱు-చూపు ఇటు - చూపు అటు-అని విడఁదీసి - అసుభద్రను చూచుచు ఈ యర్జునుని ఈతనిం జూచుచు ఆమెను అని తాత్పర్యముగా వివరింతురు; ఆపక్షమున 'చూపు' తర్వాత 'ఉంచి' అధ్యాహార్యము. మఱికొందఱు-అర్జునుని చూపును సుభద్ర మీఁదికిని సుభద్రచూపును అర్జునునిమీఁదికిని బాణములనుగా మన్మథుఁడు ప్రయోగించెను - అని వివరింతురు.] పటు రయమునన్ = అతి వేగమున.

203. కోపము అనువారిన్=ప్రణయకలహముచే అలిగియున్నవారిని. కూడన్ మనువారిన్=చేరి వసించుచున్నవారిని.కూడము అనువారిన్ అని నేని భేదము. శంబరారి = మన్మథుఁడు.

204 దాక్షిణ్య = ఆశ్రితపక్షపాతమునకు - ఆకర=గనివలెనే యొప్పుచున్న - మూర్తి = ఆకృతిగలవాఁడా, షోడ...దక్షా=(కన్యాదానము మొదలుగాఁగల) పదునాఱు మహాదానములచే(అఢ్య=)సమృద్ధములైన ధర్మకార్యములయందు సమర్థుఁడవైన వాఁడా,ఆశ్రిత...దీక్షా=ఆశ్రితులయొక్కయు దీనులయొక్కయుఁరక్షించువిద్యయొక్క భారవాహిత్వముతోఁ గూడుకొన్న శ్రేష్ఠమగు కరుణతోఁగూడిన చూపుగలవాఁడా, శాశ్వ...ర్తి=స్థిరమైన కీర్తి గలవాఁడా, వైభ...ధ్యక్షా = ఐశ్వర్య లక్ష్మిని (భృత్=)

క. కలహారంభణ కౌతూ। హల పులకిత భుజ పరాక్ర మార్జిత నానా
జలదుర్గ వనీదుర్గ। స్థలదు ర్గాహార్యదుర్గ! సామ్రాజ్యనిధీ. 205

(స్రగ్విణి)

దుగ్ధ వారాశి విద్యోతి కీర్తి, సుధా
భు గ్ధురీ ణామనాగ్ భోగవర్తీ, దయా
దృగ్ధు తాశేష ధాత్రీమరు న్నిస్స్వతా,
స్నిగ్ధ సార స్వతస్సిద్ధ సారస్వతా. 206

గద్యము.

ఇది శ్రీసూర్య ... ... ద్వితీయాశ్వాసము.

---

ధరించుచున్న చోళరాజ్య సింహాసనమున కధిపతివైనవాఁడా, దుర్మ...యశా = అజయ్యులయిన (పా. - దుర్మద = చెడుగర్వముగల) (రాట్ =)రాజులయొక్క కిరీటము అను చీల్పుటయందు ముఖ్యమైన (అక్షయ = ) భంగములేని ఖడ్గము గలవాఁడా.

20౫. కలహ ఆరంభణ=యుద్ధప్రారంభమందలి - కౌతూహల=సంతోషముచేత - పులకిత=గగుర్పాటు గలదైన - భుజ = బాహువుయొక్క - పరాక్రమ = శౌర్యము చేత - అర్జిత=సంపాదింపఁబడిన - నానా=సమస్తమైన - జలదుర్గ = నీటి (మున్నీటి లంక) కోటలును - వనీదుర్గ = అడవికోటలును [పా - అవనిదుర్గ = నేల మాలియ కోటలును] - స్థలదుర్గ = నేలపైనుండు గడీలును - అహార్యదుర్గ = కొండకోటలును గలవాఁడా, సామ్రాజ్య నిధీ = ఐశ్వర్యమునకు స్థానభూతుఁడా.

206. దుగ్ధ వారాశి విద్యోతి కీర్తి = పాలసముద్రమువలె ప్రకాశించుచున్న యశస్సుగలవాఁడా, సుధాభుక్ ధురీణ అమనాక్ భోగ వర్తీ = అమృతాహారులకు (దేవతలకు) భర్త (యైనయింద్రుని)వలె అనల్పమైనభోగములందలి ప్రవర్తనగలవాఁడా, దయా దృక్ ధుత అశేష ధాత్రీమరుత్ నిస్స్వతా = కృపాదృష్టిచేత పోఁగొట్టఁబడిన సమస్తమైన బ్రాహ్మణులయొక్క దారిద్ర్యముగలవాఁడా, స్నిగ్ధసార = మనోహరమైన శ్రేష్ఠాంశముగలిగినట్టి - స్వతఃసిద్ధ = తనంతటతానుగానే కలిగిన - సారస్వతా = సంగీత సాహిత్య కవిత్వాది విద్యలు కలవాఁడా.

# తృతీయాశ్వాసము



క. శ్రీజానకీమనోహర। పూజాంచిత హృత్సరోజ, పోష్యాఖిలది
గ్రాజ, సకలార్థిజనని। ర్వ్యాజకృపా, యచ్యుతేంద్ర రఘునాథమణీ! 1

గీ. అవధరింపు కథాకర్ణనాతివేల
హర్షులైనట్టి దివ్యమహర్షులకును
దత సమస్త పురాణకథా శతాంగ
సూతుఁడై విలసిల్లెడు సూతుఁ డనియె। 2

## అర్జునుని విరహతాపము.

క. ఆరీతి నంతిపురమున
నారీతిలకము సఖీజనమ్ములు గొలువన్
జేరిన పిమ్మట, మదిలోఁ
గూరిన పిమ్మట విరాళి గొని నరుఁ డుండెన్. 3

గీ. కృష్ణననుమతి రుక్మిణీ కీరవాణి
వచ్చి భోజన మిడఁ, దల వంచి, యగ్గ
లం బయిన చింత, వలసియొల్లమి నతండు
సొగటులను బోయి కసిగాటులుగ భుజించె. 4

1. శ్రీజానకీ...జ = శోభాయుక్తురాలగు సీతాదేవికి భర్త (యగు శ్రీరాముల వారి) యొక్క పూజచే ఒప్పుచున్న హృదయ కమలము గలవాఁడా, పోష్యా...జ = పోషింపఁదగినవారగు సమస్త దిక్కులయందలి రాజులు గలవాఁడా, సకలా... కృపా = ఎల్లయాచకులయందును నిష్కారణమైన దయగలవాఁడా.

3. నారీతిలకము = సుభద్ర. పిమ్మటన్ = తర్వాత. కూరిన పిమ్మటన్ = పాదుకొనిన విచారముచేత. విరాళిన్ = విరహమును.

4. రుక్మిణీ కీరవాణి=చిలుక పలుకులవంటి పలుకులుగల రుక్మిణీదేవి. అగ్గలంబు= అతిశయము. వలసి యొల్లమిన్ = అక్కఱ పట్టియు: బట్టనట్లు. సొగటులను బోయి= జడలినవాఁడై. కసిగాటులుగన్ = సైఁపక.

గీ. మును పు సైఁపదు సంతోషమున భుజింప,
వెనుక సైఁపదు చింతచేతను భుజింప,
బాల కడనున్న యప్పు డెడఁబాసి నపుడు,
నొక్కతీరయ్యె భరతవంశోత్తమునకు. 5

ఉ. ఎక్కడఁ జప్పు డైనఁ, దరలేక్షణ వచ్చె నటంచు లేచు; నే
దిక్కున నల్కు డైన, సుదతీమణిమాటని యాలకించు; నే
చక్కిఁ దళుక్కు మన్న, నెల జవ్వని మైసిరి యంచుఁ జూచు; న
మ్మక్క! కిరీటిమోహసముదగ్రత నేమన వచ్చు నయ్యెడన్! 6

ఉ. చక్కెరకెంపుమోవిఁ గని సారెకుఁ జిల్క మొగంబు వేఁడఁగాఁ,
జొక్కపుఁజిల్వకప్పుజడఁ జూచి మయూరము లట్టు సాఁపఁగాఁ,
జక్కసితమ్మిపూవడుగుజాడలఁ గన్గొని రాజహంసముల్
త్రొక్కుడుపాటు చెందఁగ, వధూమణి వచ్చుట లెంచు నెమ్మదిన్. 7

గీ. మారుతమ్ముల వాఁడికి; మలయకూట
మారుతమ్ముల వేఁడికి; మట్టుమీఱు
చంద్రకిరణమ్ములకు, శుక శారి శాళి
చంద్రకిరణమ్ములకుఁ, జాల జలదరించు. 8

6. మైసిరి = మేని లావణ్యము. అమ్మక్క - ఆశ్చర్యద్యోతకము. మోహ సముదగ్రత = వలపుయొక్క అతిశయమును.

7. చొక్కపు చిల్వకప్పు=సొగసయిన పాముకలె నల్లనయిన. మయూరములు= నెమళ్లు. అట్టు = మెడను. తమ్మిపూవు అడుగు జాడలన్ = తామరపూవులవంటి పాద చిహ్నములను.—ఎఱ్ఱచక్కెర పాము తామర అని భ్రమసి శుక మయూర హంసములు మోవిని జడను అడుగుజాడను తినఁగోరిన వని భా.

8. మారు...కిన్ = మన్మథుని (బాణములగు) పద్మముల తీక్ష్ణత్వమునకును, మలయ...కిన్ = గంధపుఁగొండ శృంగముయొక్క వాయువుల వేఁడిమికిని, శుక... లకున్ = చిలుకలు గొరవంకలు తుమ్మెదలు నెమలు అను పిసియొక్క (అనఁగా ఇవి తనపై నొనర్చునట్టి) యుద్ధములకును - (సా - రవమ్ములకున్=ధ్వనులకు), చాలన్... రించున్ = మిక్కిలి భయకంపమును బొందును. చల్లని మలయానిలము వేఁడి యగుట లోనగునది కాంతావిరహముచేత.

చ. విరహిణులం గలంపఁ గల వీరలు వీ రని తమ్ముఁ జేర, న
య్యురుకుచవాలుఁజూపులకు నోడుట సంకటము గాఁగ మీనముల్
హారిణము, నట్లనే తమ శరాంశులు నోడెనా? గాక బాలికన్
గరఁపఁగ రాదె? యేల నను గ్రాఁచెద రీమకరైణలాంఛనుల్ 9

క. ఇచ్చాళ్లీ సేవచేయుచు
నున్నదియుం బోయె నేఁడ యోకౌఁగిలి యి
మ్మన్నంతఁ, 'జదువఁ బెట్టఁగ
నున్నమతియుఁ బోయె.' ననుట హో నిజ మయ్యెన్. 10

గీ. అంతిపురమున కరుగుచో నింతి తిరిగి
యోరగాఁ జూచునపుడు శృంగారరస ము
పారముగ నుబ్బ జాలెత్తె నార దాని
చల మనోహర లోచనాంచలమ చెలమ! 11

సీ. అర్జునుండను నేనె యని తెల్పినంతనే
మిట్టి మీఁదై పడె మెలఁతచూపు;

9. విరహిణులన్=కాంతుల నెడఁబాసిన స్త్రీలను. వీరు = ఈమకరైణలాంఛనులు అనఁగా మదనచంద్రులు. (మకరము = మీనము = చేప; ఏణము = హారిణము=లేడి; లాంఛనము=అంకము=గుఱుతు.) తమ్మున్ = మదనచంద్రులను. చేరన్-చేరినట్టివి మీనహారిణములు. ఉరుకుచ=గొప్పస్తనములు కలదైన సుభద్రయొక్క-వాలుఁజూపులకున్ = వాలికగలచూడ్కులకు. శర అంశులున్ = (మదన)బాణములు (చంద్ర) కిరణములు సైతము. బాలికన్=సుభద్రను. కరఁపఁగరాదె = కరఁగింపరాదా.

తా.—మీనంబును హరిణంబును సుభద్రనేత్రములకు ఓడిపోయి పగ తీర్చుకొనఁగోరినవై, వీరు విరహిణులను నొంపఁగలవీరలుగ బాయని, మీనము మదనుని, హారిణము చంద్రుని, అంకరూపమున ఆశ్రయించినవి గదా; అవి యోడిపోయినట్లే మదనుని బాణములును చంద్రుని కిరణములును సయితము ఆబాలిక చూపులకు ఓడిపోయినవా యేమి? కాకున్న ఈమదనచంద్రులు ఆబాలికను కరంపరాదా, నన్నేల క్రాఁచెదరు?

11. శృంగారరసము = శృంగారరసమనెడు జలము. ఉబ్బన్=పైకుబుకఁగా. దాని లోచన అంచలమ = సుభద్రయొక్క కంటి కొనయే (అనఁగా - కంటికొనయనెడు) - చెలమ = కూపకము. జాలు ఎత్తెన్ = ఏఱుగా ప్రవహించెను.

గాంధర్వమునఁ బెండ్లి గ ట్టనునంతనే
పచ్చకప్పుర మాయె భామపలుకు ;
బలిమిపైఁ బట్టంగఁ దలకొనునంతనే
యొకబండికల్లయ్యె నువిదపెఱుఁదు ;
పొలపుఁబయ్యెదఁ దేఱి చూతు నన్నంతనే
పచ్చపూసాయెఁ బో పడఁతియారు ;
గీ. పేరు వివరించి నే నేల బేల నైతి!
కోరి కెలఁగించి నే నేల గోల నైతి!
బలిమిఁ బైఁబడి నే నేల బయటఁ బడితి!
బత్తి గనిపించి నే నేల పలుచ నైతి! 12

సీ. తెలివ కస్తురిచుక్క దీర్చి వచ్చినచొక్కు
గీఱునామమునాఁటి తీరుఁ గేరుఁ!
దస్వంగి వలిపెంబుఁ దాల్చి వచ్చినఠీవి
వన్నెఁ గట్టిననాఁటి చెన్నుఁ దన్ను ;
వాల్గంటి కీల్గంటు వైచి వచ్చినచెల్వు
జడ యల్లుకొనునాఁటి సౌరు జౌరు ;
నొయ్యారి మెఱుఁగు సొమ్మూని వచ్చిన నీటు
మణిభూష లిడునాఁటి మట్టుఁ దిట్టు ;

12. (౧) మిట్టి మీఁసై పడెన్ = మిడిసిపడెను - బెళుకు చేఁపవలె నుండె నని భా. (౨) పచ్చకప్పుర మాయెన్ = అపురూప మాయెను - పచ్చకర్పూరపుఁబలుకులవలె హృద్యముగా నుండు నని భా. (3) ఒక బండికల్లు అయ్యెన్ = అలవికానిది యాయెను - బండికల్లువోలె నుండు నని భా. (౪) పచ్చపూస అయెన్ = కనుపడని దాయెను - పచ్చపూసల చేరువలె నుండె నని భా.

బేలన్ = గోలన్ = మూఢుఁడను. బత్తి = అనురక్తిని. పలుచన ఐతిన్ = లాఘవము నొందితిని.

13. కేరున్ = తిరస్కరించును. వలిపెంబు = తెల్లనిసన్నవస్త్రము. వన్నె = రంగులవస్త్రము. కీల్గంటు = ప్రేలుసిగ. సౌరున్ = సొగసును. జౌరున్ = కొట్టును.

గీ. నాతి రాయంచగుమిఁ గూడి నడచుచుమురువు
చెలులు గొలువంగఁ జనునాఁటి సొలపు నలఁపుఁ,
జక్కఁదనములప్రోవైన చంద్రముఖికి
నిచ్చలపురూపు లెస్సైన నింపు నింపు. 13

ఉ. మిక్కిలి తేజిచూడ మిఱుమిట్టులు గొల్పుఁ; జరించునప్పు డ
మ్మక్క! తళుక్కనన్ మెఱసిన ట్లగు; నేమన వచ్చు! నద్దిరా!
'చొక్కపుఁబైఁడిబొమ్మ' యనుచుం జను లాడిన నాడి; రింతె కా
కెక్కడిదోయి షో యలదృగేశుక మేలి నక్కడానికిన్ ? 14

ఉ. చిత్తజుఁ డల్గి తూపు మొన చేసినఁ జేయుఁగ నిమ్ము; పై ధ్వజం
బెత్తిన నెత్త నిమ్ము, వచియించెదఁ గల్గినమాట గట్టిగా;
నత్తరళాయతేక్షణకటాక్ష విలాస రస ప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గండుమీలకున్. 15

మెఱుఁగు = మెఱుఁగుబంగారపు. మట్టున్ = విషమున. నిచ్చలపు రూపు = స్వభావ సిద్ధమయిన రూపము. నింపు = సమృద్ధిని. నింపు = నిండించును.

14. మిఱుమిట్లు గొల్పుటయుం తళుక్కన మెఱయుటయుం బంగారమున లేనివై సుభద్రయందును మెఱపునందును కలవిశేషములు. జో = సామ్యము. కడానికిన్ = మేల్మి బంగారమునకు. సుభద్ర దేహము మేల్మిబంగారము నతిశయించి మెఱపువలె ప్రకాశించుచున్నది అని భా.

15. చిత్తజుఁడు = మన్మథుఁడు. అల్గి - అల్గుట ఉత్తరార్థమున చెప్పఁబోవు మాటను - అనఁగా సుభద్రాకటాక్షములు అతని బాణధ్వజము లగు పద్మమత్స్యములకన్న అత్యంతోత్కృష్టము అని చెప్పినందులకు. తూపు = బాణమును. (తామరను) మొనచేసినన్ = గుఱిపెట్టినను. ధ్వజం బెత్తుట = యుద్ధమునకు తరలుట - మత్స్యధ్వజమును ఎత్తుటయుం - మన్మథుఁడు పద్మబాణమును మీనకేతనమును గలవాఁడని ప్రసిద్ధము. అత్త...ణ=చంచలములును విశాలములును అగునకన్నులుగల యా సుభద్రయొక్క - కటా...ముల్ = క్రేఁగంటిచూపులయొక్క శృంగారరసమను జలప్రవాహములు, కుత్తు ...కున్=పద్మములకు కంఠప్రమాణమై యూపిరి సలుపనీయనివి అని అర్థము-తామరల కెంతయుదకమైనను కంఠమువఱకే యుండును గనుక కంఠప్రమాణ మనిభావము.— తల ...కున్=గండుఁజేఁపలకు ప్రాణహరణముచేయునవి అని అర్థము-చేఁపలు నీటిలోమునిఁగి

క. అని తాల్మిఁ బాయు; 'నేవకు
నని యెప్పటివలెనె తిరిగి యరుదేర డొకో?'
యని యాస సేయు; 'వచ్చిన,
నన్నృతోదరి నింక విడువ.' నని తలపోయున్. 16

సీ. విరహాగ్ని కోర్వక విధి దూఱుకొనెడు తాఁ
దపసివేసం బేల దాల్చినాఁడు?
కడలేనిసెకలఁ గందెడు ఘనోదయ వేళఁ
దెలిసియుఁ బా నేల [illegible]చినాఁడొ?
శుకశారికార్భటులకుఁ దల్లడిలెడు తా
నుపవనంబున నేల యుండినాఁడు?
కరగతస్వము వోవు కరణిఁ జింతిలెడు తా
వెలఁది నేటికిఁ బట్టి విడిచినాఁడు?

గీ. నేరములె యెంచెద మటన్న, నేరి కైనఁ
గలవు పరికించి చూడ; నందులకు నేమి?
యంగసాంగత్యపారవశ్యమునఁ గాక,
యొఱఁగి యుండిన నతఁడు చే యేల విడుచు? 17

గీ. ఉనికి శృంగారవన మఁట, యొంటిఁ దగిలె
నఁట; విరహి యఁట, యెంత నేఁడు కిరీటి.

యుండునవి గనుక తలను ముంచివేయున వని భా.—సుభద్ర నేత్రవిలాసము పద్మము లను చేపలను తిరస్కరించుచున్న దనుట.

16. తాల్మి = ధైర్యమును. అనృత ఉదరిన్ = కల్లయయిన కడుపుగలదానిని - మిక్కిలి సన్నపాటినడుము కలదాని ననుట.

17. విధిన్ = దైవమును దూఱు = నిందించు. తాన్ = అర్జునుఁడు. తపసి = యతి. కందెడు = తపించెడు. ఘన ఉదయ వేళన్ = తొలకరిమబ్బులు తలసూపు కాలమున (ఇతరకాలములకన్న మేఘోదయకాలము ఎక్కువ విరహోద్దీపకము). కరగతస్వము = చేత నున్న లబ్ధి. అంగ...మునన్ = (సుభద్ర యొక్క) అవయవస్పర్శవలని మైమఱపుచేతఁ గాని యెడల. చే = సుభద్ర చేతిని.

నసమశరుఁ డింకఁ? దనవైరి యగులలాట
లోచనునిఁ గెల్చు నని దయఁ గాచెఁ గాక. 18

సుభద్ర వలవంతం గూరుట.

క. ఇటు లాతఁ డుండఁగా, న
క్కుటిలాలక యంత నచటఁ గుసుమశరార్తిన్
బొటిలి పడి, పాన్పుపై న
ట్టిటు వడి, దనలోనఁ దాన యేకాంతమునన్,— 19

క. ఏఁ గోరినచెలువుఁడే నను
దాఁ గావలె నంచు వచ్చి దగ్గఱె వేఁడం,
గౌఁగిలి యీ కిటు వచ్చితి,
నోఁ గా దని పెనఁగి; యెంత యవివేకనొ యయో! 20

ఉ. దిగ్గున లేచి నన్నతఁ డతిప్రమదంబునఁ జందమామతా
నిగ్గుటరంగుమీఁదికయి నెమ్మిఁ గరాబ్జము వట్టి యీడ్చినన్,
బిగ్గఁ గవుంగిలించి సుఖ నీరధిఁ దేలఁగ నీక, నా కయో!
సిగ్గను వేఁప వెంటఁబడఁ జెల్లు నొకో ప్రతిబంధ మయ్యెడన్! 21

క. తొల్లిటివలె నేవకుఁ బోఁ
జెల్లునె; మావారు పెండ్లి చేసెద రిదిగో

18. అర్జునుఁడు శృంగారవనము దుండుట ఒంటిగాఁ డగుట విరహముపాలై యుండుట - ఇవి అర్జునునికి ప్రతికూలములు, మదనుని కనుకూలములు. అసమశరుఁడు = బేసి యలుగులవాఁ డగు మదనుఁడు. లలాట లోచనునిన్ = శివుని. అర్జునుఁడు మాయా కిరాతుని శివుని ఓర్చిన కథను ఇట ననుసంధింపవలయును.

19. కుసుమశర ఆర్తిన్ = మదన వ్యథచేత.

21. దిగ్గునన్ = గుబాలున. అతిప్రమదంబునన్ = మిక్కిలి సంతోషము చేతను. చంద...కయు=చంద్రకాంత మణినిర్మిత మైన కాంతిగల వేదికమీఁదికి. నెమ్మిన్= మక్కువచేత. సుఖ నీరధిన్ = సుఖ మను సముద్రములో (సముద్రమునంతటి సుఖములో ననుట). ప్రతిబంధము = ప్రతిబంధకర్మము.

22. ఎల్లి = రేపటిదినమే. పైకొన్నన్ = అంగీకరించినయెడల. ఎల్లిదము =

నెల్లిదము కంచుఁ బలికితి ?
నెల్లిద మగుఁ గాదె తిరిగి యేఁ బైకొన్నన్ ? 22

సీ. ననుఁ దా వలచి వడ్డ నలఁకువల్ దీఱఁగఁ
 గై సేయ నెన్నఁడు గలుగునొక్కొ ?
వెనఁగి చే విడిపించుకొనిన నేరమి వోవఁ
 గెలన నెన్నఁడు నిల్వఁ గలుగునొక్కొ ?
ప్రియ మెఱుంగక యడ్డపెట్టిన దుడుకు వోఁ
 గల్యాణ మెన్నఁడు గలుగునొక్కొ ?
మోహతాపము దీఱ మోవిచక్కెరపాన
 కమున నెన్నఁడు దేల్పఁ గలుగునొక్కొ !
గీ. యొంటి శృంగారవనములో నునిచి వచ్చి
 నట్టినెంజిలి యుల్లఁ బో నాస్యపాల
తిలకుఁ జేర్పంగ నెన్నఁడు గలుగునొక్కొ
 యాము గవిసిన కుచకుంభ సీమయందు ? 23

క. అని యెంచరానికోర్కులు
మనమునఁ దలపోయు, భావమగ్నతచేతం
గను మూయుఁ, గలసినటు కల
గని సంతస మందుఁ, దెలిసి కళవళ మందున్. 24

సీ. ఉదయాద్రి యెరగలి నొరసి మీఁద వెలుంగు
 జలజారి వేఁడివెన్నెలలు గాయ,

చులకన (అవమానము).

23. నలఁకువల్ = శ్రమలు. కైసేయుట = అలంకరించుట. కెలనన్ = చెంతను. అడ్డపెట్టిన = ఆటంకము చేసిన - దుడుకు = దౌష్ట్యము, కల్యాణము = వివాహము.

24. భావ...తన్ = భావమతనియందు మునిఁగియుండుటచేత. కలసినటు = ఇరువురు ఏకమైనట్లు. కళవళము అందున్ = విచారపడును.

25. (౧) ఎరగలిన్ ఒరసి = కార్చిచ్చుతోఁ గలిసి. జలజారి = చంద్రుఁడు.

హరుకంటిసెగ కోర్చి యాజిఁ దేఱినమారుఁ
డలరుఁ జిచ్చులవాఁడి ములుకు లేయఁ,
బాముకోరలకోఁడ సాము చేసినగాడ్పు
విసపువిత్తై సోఁకి వెతలు సూపఁ,
గ్రౌంచాచలముపోటుగంటి మాఱినరాజ
హంసముల్ పడి హాళాహాళు లీసేయ,
గీ. వేగునంతకు వలవంత వేఁగు నంత
నంతిపురమునఁ బ్రమద వనాంతరమునఁ
గృష్ణ కృష్ణా యటంచు నా కీరవాణి,
రామ రామా యటంచు నా రాజసుతుఁడు. 25

(అ) హరు=రుద్రునియొక్క. ఆజి తేఱినమారుఁడు = గడిదేఱినమన్మథుఁడు. అలరు... యఁ = పువ్వులనెడు అగ్నిమయములయిన పదునుగలబాణములను వేయుచుండఁగా. (ర) క్రౌంచ అచలము పోటుగంటిన్ = క్రౌంచ పర్వతపు గాయముగుండ. హాళాహాళులు = దొమ్మి. [ఎరగలి, సెగ, కోఱలు, గంటియు హింసాకరములు. ఒకరిని బాధించుటకై తాము అత్యంతబాధ నొందిన చంద్ర మదన మలయానిల రాజహంసములు క్రూరత వహించి వ్యథ పెట్టఁగా నని భా. కొండలయందు దావాగ్ని యుండుట, ముక్కంటికంటి మంటచే మదనుఁ డీల్గుట, శరదృతువున హంసలు మానససరోవరమునుండి క్రౌంచరంధ్రముగుండ దాఁటి వచ్చుట, పాము గాలిని మేయుటయు నిట ననుసంధేయములు.]

అంతన్ = అంతటను, వేగునంతకున్ = తెల్లవాఱువఱకును,—ఆకీరవాణి = చిలుకపలుకులుగలదైన సుభద్ర, అంతిపురమునన్, *కృష్ణకృష్ణా=శ్రీకృష్ణ శ్రీకృష్ణా (అర్జునుఁడా అర్జునుఁడా అని శ్లేష), అటంచున్ = అని స్మరించుచు, వేఁగున్=పరితపించును; ఆరాజసుతుఁడున్, ప్రమదవనాంతరమునన్ = కేళీవనియందు, † రామ రామా = శ్రీరామా శ్రీరామా (ఓరమణీ ఓరమణీ అని శ్లేష), అటంచున్,—వేఁగున్; ఇరువురును హరిస్మరణవ్యాజమున నొండొరులం దలఁపోయుచుండి రనుట. [తతః ప్రవిశతి రాజా విదూషకశ్చ అనువిధంబున భిన్నవాక్యములనుగా గ్రహించి 'వేఁగున్' అను నేకవచన ప్రయోగమును నిర్వహింపవలయును.]

---

* 'అర్జునః ఫల్గునః పార్థః కిరీటీ శ్వేతవాహనః ।
బీభత్సో విజయః కృష్ణః సవ్యసాచీ ధనఞ్జయః'.

† 'సున్దరీ రమణీ రామా.' అమరః.

క. చెలులు ప్రసంగవశంబున
నలరెం గడు విజయభవన మనిన న్నవలా
దెలియ వినున్, గలయఁ గనున్,
బలుమఱు బాగౌఁ గిరీటిపచ్చ లటన్నన్. 26

క. మనమున నున్నది మొగమునఁ
గనిపించుం గాన, గట్టిగా మదిలో న
ర్జునభావ మూనికి, నప్పు డ
ర్జునభావము మొగమునందె సుదతికి నిల్చెన్. 27

వదినెలు సుభద్రను గుట్టెఱిఁగి మేలము లాడుట.

సీ. 'పులకించె మే నేమి తలఁచుకొంటివె?' యంచు
మేలంబు పచరించె మిత్రవింద,
'యిన్నాళ్లవలె మన సిప్పు మాటాడవే,
యెందు దృష్టి?' యని కాళింది తెగడెఁ,
'జెలి పెండ్లికత సెప్పఁ జెవి యొగ్గి వినవేమి?'
కలదులే యని గేలి సలిపె భద్ర,
'వలపువాసన మించెఁ గలికి నీ మొగ;' మంచు,
ద్రస్తరి నెఱపె సుదంత కొంత,
గీ. జాంబవతి నవ్వె, లక్షణ సరస మాడె,
నే లగడు చేసెదరు ముద్దరాలి ననుచుఁ
బలికె రుక్మిణి, సత్య క న్గిలిపె, నపుడు
చిన్నిమఱఁదలి మోహంపుఁజిన్నె లెఱిఁగి. 28

26. విజయ భవనము = విజయముతోఁ గూడుకొనిన గృహము. నవలా = సుభద్ర. కిరీటి పచ్చలు = మరకత మణులు.— విజయనామమును కిరీటినామమును అర్జునునకుఁ గలవు గనుక ఆ పేర్లు వినఁబడినంతనె భ్రమ చెంది వినుట జూచుట అని అర్థము.

27. అర్జునభావము = (1) అర్జునధ్యానము (2) తెల్లఁదనము. సుదతికిన్ = (శోభనదంతములు గలదానికి) సుభద్రకు. — విరహపాండిమ మొగమునం దోఁచె నని భా.

28. మేలంబు పచరించెన్ = పరిహాసము చేసెను. తెగడెన్ = ఆక్షేపించెను.

క. "అంగన, యిశ్శాళ్లను ముని
చెంగటికిం బోటిపాటి సేవలు గావిం
పంగాఁ బోదువు; నేఁ డటు
తొంగియుఁ జూడ వతఁ డేమి పోఁడిమి సేసెన్? 29

ఉ. అక్కల, చూడ వేటి కల యచ్చికబుచ్చిక సేయునంచలం?
జెక్కిలి గొట్టె దేమిటికిఁ జేరఁగ వచ్చినముద్దుఁజిల్కలన్?
ముక్కు మొగంబుఁ జూడ కటు ముట్టక బొమ్మనె దేల బోట్లనో
చక్కెరబొమ్మ, నీవెగటు జాడఁగఁ జూపిన కారణ మెయ్యదొక్కొ. 30

ఉ. ఎవ్వనిఁ జూచి మేలుపడితే మురవింపవు లేవు? నెయ్యపుం
బెవ్వఁడు వచ్చెఁ? జెప్పఁగదవే మఱలోఁ గల దాని. నిన్ను నేఁ
డెవ్వనిచెల్వ నీయెదుట నెన్నఁబడెన్ వినతాంగి? నేవ కా
కెవ్వరు నీకుఁ బ్రాణపద? మేటికి దాఁచెదవే తలోదరీ? 31

ఉ. బాలసమీరణంబు పయిపాటున నించుక సోఁకినన్ గడుం
దూలుచు నుండుఁ గౌ; వల వినోదపు సుద్దుల ముద్దుఁజిల్క పై
వ్రాలినఁ గందుఁ గేలు; పువుఁబోటివి నీ సుకుమారి; నీ దేహలిం
దాళునొకో వియోగశిఖ బాటై నెదలోఁ దరికొనఁ దలోదరి!" 32

వలపు వాసన=పరిమళసంబంధము (పురుషుని మోహించిన భావము అని గూఢభావము.) త్రస్తరి = పరిహాసము. కన్ గిలిపెన్ = కన్ను గీఁటెను.

30. అల...లన్ = మిక్కిలి మాలిమి చేయుచుండెడి యా హంసములను. బోట్లన్ = చెలులను.

31. మేలుపడితే = మోహించితివే. వినత అంగి = (స్తనభారముచే ఇంచుక) వంగిన మేనుగలదానా. ప్రాణపదము = ప్రాణస్థానము - ప్రాణమువంటి ప్రియసఖి యనుట. తలోదరీ = అరచేతివలె పలుచనైన కడుపుగలదానా.

32 బాలసమీరణంబు = పిల్ల తెమ్మెర. పయిపాటునన్ = పైపైని. ఇంచుక = కొంచెముగా - దేహముపైనేగాని ఎదలోనికిం గాదనుట. కౌను = నడుము. వినోదపు సుద్దుల=వింతమాటలు నేర్చిన. వియోగ శిఖ=విరహ మను చిచ్చు. ఎదన్, ఎదలోన్, దరికొనన్ = ప్రజ్వరిల్లుచుండఁగా. ఇది...నొకో = ఈదేహ మేరీతిని ఓర్చునో.

క. అని వారికి వా రందఱు
మనమునఁ దోఁచినటు లాడు మచ్చికమాటల్
విని సిగ్గున నయ్యెలజ
వ్వని యూరకయున్న; నపుడు వారలలోనన్, 33

ఉ. "లెంకఁగ నేలుకోఁగలదు లే మగనిం దరితీపు చేసి, మీ
నాంకునిపాద మాన; మన మాదట వేఁడిన మాఱు పల్కఁగాఁ
గొంకెడు నింకను మీ రిపుడు గోలని చూడకురమ్మ; నేర్పుఁ బో
చంకఁ బిడ్డ లూడిపడ సారసలోచన మాట లాడఁగన్. 34

గీ. క్రాఁగి యున్నది మిగుల నంగంబు సూడఁ,
గలవరించుచున్నది' కలదొ యేమొ
సోఁకు? దల్లపన్నాల్యసికే చూపవలయు
భామ," యని పల్కె నా సత్యభామ నగుచు. 35

క. 'ఈలీల నుండి, మన మిటు
మేలము లాడంగ నేమి మిడిమేలమొ?' యం
చాలో సత్య సుభద్ర హి
తాళుల కిసుమంత యరహాస్యము దెలిసెన్. 36

34. సారసలోచన = పద్మములవంటి నేత్రములుగల యాసుభద్ర. తరితీపు = ఉపేక్ష (అపేక్ష యొందె). లెంకఁగన్ = దాసునిఁగా. మీనాంకుని = మన్మథుని. ఆన=తోడు. ఆదటన్ = ప్రేమతో. కొంకెడున్ = జంకుచున్నది. గోల అని చూడకు రమ్మ = తెలియని దని తలంపకుము.

35. కలదో యేమొ సోఁకుడు = దయ్య మేమైన సోఁకినదేమో (అర్జునుని స్పర్శ యేమైన తగిలిన దేమో అని భా.) భామను = ఈసుందరిని.

36. ఈలీలన్=ఈరీతిగా - ఇట్లు అశ్రద్ధగా అనియు - (ఈలన్ ఈలన్ = ఈలీలన్=ఒక్కొక్క సిగ్గునందును - అనఁగా సుభద్ర సిగ్గుపడినందుల కెల్ల - అనియు), మేలము లాడంగన్ = మేళము గట్టి నటన సేయుచున్న యెడల - కోడిగము లాడుచుండిన యెడల అనియు, ఏమి మిడిమేలమొ = ఏమి యుపద్రవము సంభవించునో అనఁగా అంత్యావస్థ సంభవించునేమో,...,ఆలోన్ = అసమయమున. సత్య = సత్యభామ. సుభద్ర=సుభద్రయొక్క - హిత ఆళులకున్ = ఆప్తసఖులకు, ఇసుమంత = కొంచెము, అరహాస్యము = సుభద్రార్జునుల గూఢచర్యను,...

## శిశిరోపచారములు.

క. గుసగుసలఁ బోయి, వలపుల
కసమస లని తెలిసి రసికకిసలయపాణుల్*
బిస కిసల కుసుమ విసరము
వెస మసలక తెచ్చి, శిశిర విధి లాలస లై, 37

శా. పన్నీటన్ జలకంబు లార్చి, చలువల్ పైఁ గట్టఁగా నిచ్చి, మే
నన్ నిండారఁగఁ జందనం బలఁది, విన్నాణంబుగాఁ గప్పురా
నన్ నామం బిడి, క్రొమ్ముడిన్ విరులదండల్ నించి, హారావళుల్
చన్నుంగ్రేవులఁ దార్చి, రవ్వాడు చెలుల్ చంద్రాస్యకున్ నేర్పునన్. 38

సీ. బోటి మధువ్రతంబులకు దండము వెట్టి
మకరంద మధరబింబమునఁ జిల్కఁ;
చెలి గంధవహున కంజలి చేసి నెత్తావి
పూవ్రేఁకత్తు లురోజముల నమర్చె;

37. రసిక...ణుల్ = సరసురాండ్రును చిగురువంటి చేతులుగలవారును అయిన యాచెలికత్తెలు. గుస...యి = ఒకరితో నొకరు రహస్యము లాడుకొని, వలపుల...లు = ఇది మోహమువలని వికారములు, ..., బిస...ము = తామరతూండ్లయొక్కయుం చిగురుటాకులయొక్కయుం పుష్పములయొక్కయు సమూహమును, వెసన్ = త్వరగా. మసలక = విలంబముచేయక, ..., శిశిర...లై = శైత్యోపచారములు చేయుటయం దాసక్తి కలవారై.

38 శైత్యోపచారవివరము:—జలకంబులు ఆర్చి = స్నానము చేయించి. విన్నాణంబుగాన్ = నేర్పుగా. క్రొమ్ముడిన్ = కీలుగంటునందు. హార ఆవళుల్ = ముత్యాల పేరుల పేటలను. క్రేవులన్ = శిఖరములయందు [పా - క్రేవలన్ = ప్రక్కలందు.] తార్చిరి = కదియించిరి.

39. (౧) బోటి = ఒకానొక చెలికత్తె. మధువ్రతంబులకున్ = తేఁటిపిండులకు (తుమ్మెదలకు) మకరందము = పూఁదేనెను. అధరబింబమునన్ = (సుభద్రయొక్క) దొండపండువంటి పెదవియందు. (౨) గంధవహునకున్ = వలపుమోసరికి (మలయవాయువునకు).

---

* 'కప్పురం । పున్నామం బిడి, క్రొమ్ముడిన్ విరిసరంబుల్ నించి' అనుపాఠంబున 'కప్పురంపున్నామం' అనుచో పరుషసరళములకు ముందు విహితమయిన సుగాగమము స్థిరమునకు ముందు పెట్టఁబడియున్నది.

సాళి బిసాహారపాళికిఁ బ్రణమిల్లి
నవమృణాలములు బాహువులఁ గూర్చి;
నకి కెందలిరుదిండులకు వందన మొనర్చి
చిగురుటాకులు పాదయుగళిఁ జేర్చి;
గీ. సరగ నిటు లందఱును మీ ప్రసాద మనుచుఁ,
బంచసాయకదేవతాబలము నెల్ల
వేఁడికొని, తగునట్లు గావించి రప్పుడు
చంచలాక్షికి శిశిరోపచారవిధులు. 39
గీ. కలయఁ బన్నీరు చిలికి, శ్రీగంధ మలఁది,
విరులు పైఁ దార్చి, నవు డొప్పెఁ దరుణి, మేటి
మగని నరు గెల్వ వలరాచ మూసటీఁడు
పూజ సేసిన యగ్గజరాజ మనఁగ. 40
ఉ. అంగనగుబ్బచన్గవఁగు టందపు మేలిపసిండికుండలం
బొంగఁ దోడంగెఁ జొబ్బిలఁగఁ బూసినగంధము తాపవహ్ని, 'సం

ఉరోజములకా = స్తనములందు. (౩) అళి=మటియొక చెలి. బిస ఆహార పాళికిన్ = తామరతూండ్లు బోనముగాఁగలహంసల గుంపునకు. నవ మృణాళములు = క్రొత్త (అప్పుడే కోసిన లేఁత) తామరతూండ్లను. (౪) కెందలిరుదిండులకున్ = ఎఱ్ఱనిచిగుళ్లను దినుకోకిలలకు, పాద యుగళిన్=అడుగు దోయియందు.

సరగన్=వడిగా. మీ ప్రసాదము అనుచున్=(ఆమకరందాదికము మధుప్రతాదులయొక్క) (భక్తుల కియ్యఁబడు) భుక్తశేషము అని పలుకుచు - (మీయొక్క ప్రసాదమును అనఁగా అనుగ్రహముచు మా చెలిపై వెలిపి దాని ప్రాణములను గైకొనక కావుఁడు అనుచు - అనియు). పంచ...మున్ = (అయిదు బాణములవాఁడయిన) మదనదేవుని యొక్క పరివారమును. తగునట్లు = ఉపచారవస్తువులకును ఉపచరితావయవములకును సామ్యము శోభిల్లు నట్లుగా.

40. కలయన్=ఒడలనంతటను. అలఁది=(కుచాదులకు) పూసి. మేటిమగనిన్=గొప్పశూరుని. వలరాచ మూసటీఁడు=మన్మథుఁ డను వీరుఁడు.—గజపూజయందును ఒడలెల్లం దడియ పన్నీరు చల్లి కుంభస్థలాదులకు గంధము పూసి పూమాలలను వైతురు.

41. అంగన=సుభద్రయొక్క. చన్=చన్నులనెడి. కుండలన్=కుండలయందు. జొబ్బిలఁగన్=చిక్కనిపదనుగా. తాపవహ్నిన్=మదనతాపమనెడునిప్పుచేత. సంబంగి

పంగి కటారి వీరునకుఁ బాలును బియ్యము లేని పొంగలో
పొంగలి!' యంచు నయ్యలరుఁబోఁడులు సారెకు గేలి సేయఁగన్. 41

(పంచచామరము.)

మెఱుంగుఁబోఁడి కిన్క చల్వమేర మీఱఁ జేసినం,
గుఱుంగటన్ నిలంగ రాక కూర్మి వెచ్చ హెచ్చఁగాఁ,
దుఱుంగలించుచింతతోడ దూఱి పల్కు రంత వే
మఱున్ మరున్ మరున్మృగాంక మత్తకోకిలాదులన్.— 42

మదనోపాలంభము.

క. సిరివింటివాఁడవు గదా,
శరణాగతులైనపాంథజనులను రక్షిం
తురుగా, కిటుల నుపేక్షిం
తురె, పైకము గూడఁబెట్టఁ దొడఁగుచు, మదనా! 43

క. అలరువిలుకాఁడ; వప్పూతము
చిలికెడునెల యేల! సామిచేఁ గాదె విరో

కటారి వీరునకున్ = మన్మథునికి (ప్రతిచెందియూ ప్రభావము నగపఱచువాఁడు వీరుఁడని లోకవాదము.) పాలు...చున్-అట్టిపొంగలి యని యాగందపుఁబోంగును పలికిరని భా.

42. మెఱుంగుఁబోఁడికిన్ = మెఱపుఁదీఁగవంటి శరీరముగల సుభద్రకు. మేర మీఱన్ = అతి విస్తారముగా. కుఱుంగటన్ = ఆమెసమీపమున. నిలంగరాక = నిలువ శక్యముగాని యట్లుగా. కూర్మి వెచ్చ = వలపు వేఁడి. తుఱుంగలించు = ఉత్కటమగు చున్న. దూఱి = నిందించి. వేమఱున్ = పలుమాఱు. మరున్ = మన్మథుని. మరుత్ = మలయమారుతుని - మృగాంక = చంద్రుని - మత్తకోకిలాదులన్ = మదించిన కోయిల మొదలగువానిని (ఆదిశబ్దముచే భృంగ శుక శారికాదులను గ్రహింప వలయును).

43. సిరివి ఇంటివాఁడవు = సంపద్విజృంభణకల యింటివాఁడవు - సిరి వింటివాఁడవు = పూవిలుగలవాఁడవు అని భా. శరణ...లను = నీ యింటికివచ్చిన మార్గస్థులను (అతిథులను)-శరణుఁజొచ్చిన విరహుల నని భా. రక్షింతురుగాక = (అతిథ్య మొసంగి) పోషింతురుగాని - ప్రాణదానము సేయుదురుగాని అనియు. పైకము = ధనమును - పికసమూహము ననియు.

44. అలరు విలుకాఁడవు = ఒప్పుచున్న విలువిద్యగలవాఁడవు - పూవిల్లు గల

గుల నేఁచఁగ? విం డ్లమ్ములుఁ
గలవారికిఁ దోడు చల్లకడవలవారే? 44

ఉ. చక్కనివారిలో మిగులఁ జక్కనివాఁడవు గాన, నీ కెనా
చక్కనివారిఁ జంద్రుని వసంతునిఁ బోల్చుకొంటి; నంద మౌఁ,
జక్కెరవింటిరాజ యొకసక్కెము దే మని కూర్చుకొంటి న
మ్మక్క! యరూపకం బయిన యా యెలతెమ్మెర గాలిబూతమున్! 45

గీ. రమకు నట్టింటిపగవాఁడు కమలవైరి;
కంసుఁ బోలిన యుగ్రశేఖరుఁడు వాఁడు;
మేనమా మని చూడకు, మాను చెలిమి;
యకట పైవచ్చు టెఱుఁగవే హరికుమార ? 46

వాఁడవు అనియు. అమృతము చిలికెడు = అమృతమును చల్లుచుండెడు - పెరుఁగును ద్రచ్చుచుండెడి అనియు. నెల=చంద్రుఁడు. సామిచేన్=దేవరవారి చేత. వియోగులన్ ఏఁచఁగన్=విరహులను బాధించుటకు. విండ్లు...వారికిన్=ధనుర్బాణములు చేత నున్న వారికి. తోడు=సాయము. చల్ల కడవల వారే = మజ్జిగ కడవలు పట్టుకొని వచ్చెడి వారా—చంద్రుఁడు అమృతము చిలుకుటచే మజ్జిగ కడవవాఁడుగా చెప్పఁబడినాఁడు.

45. నీకెన బో = నీకు సమానమైనట్టి. అందము బోఁ = అపని సరిగానే యున్నది. ఎకసక్కెము = హాస్యాస్పదముగా - పరిహాస్యముగా అనియు. అమ్మక్క = ఆశ్చర్యము. అరూపకంబు=రూపము లేని-కురూపముగలది అనియు. ఎల...మున్=లేఁతవాయు వను గాలిబూచి పిశాచమును - లేఁతదియు మందమును పంచభూతములలో నొకటియు నగు గాలిని అనియు.

46. కమలవైరి=పద్మశత్రువైన చంద్రుఁడు, రమకున్=లక్ష్మీదేవికి, నట్టింటిపగవాఁడు = నడియింటనున్న శత్రువు - లక్ష్మికి ఇల్లు అగు కమలమునకు శత్రు వని భా. కంసు...డు = కంసునివలెనే అతికఠినాత్ముఁడు - ఉగ్రుఁ డనఁగా శివునికి శిరోభూషణమని భా. హరికుమార=కృష్ణపుత్త్రుఁడ వైన మన్మథా. పైన్ వచ్చుట=నీకు అపాయము చేయఁ గడంగు నని—ఆకాశమున పైగా పోవుచుండు నని భా.—లక్ష్మికి మదనుఁడు పుత్త్రుఁడు, చంద్రుఁడు అన్న; కంసుఁడు మేనల్లుఁ డగు శ్రీకృష్ణునికి హాని సేయఁ గడంగినవాఁడు:—కంసునివలె చంద్రుఁడును ఉగ్రశేఖరుఁడును నీకు మేనమామయుం కాన వానివలన నీకు అపాయము తప్ప దని భా.

## మలయానిలోపాలంభము.

క. తరుణిమయి తావియాసుఁ
బురికొల్పెదు నిన్ను గంధపుంగొండ యిటుల్,
పురికొల్పెనె తానుం దా
మరకోలఁకుల రమయు మలయమరుదంకురమా? 47

క. తెమ్మెర నీ కెం తెమ్మెర!
కమ్మనివిలుకాని దొరవు కమ్మని, నెలఁ బై
రమ్మని, యళి పిక శుక నిక
రమ్మని గా నిలిపి, ముందరగ వచ్చితివా? 48

(పంచచామరము.)

జోహారు మీకుఁ జల్లగాఁకఁ జూడుఁ డోసమీర కం
జహారులార మంటమారి శంబరారిఁ గూడి యీ

47. మలయ మరుత్ అంకురమా = ఓ గంధపుఁగొండ గాలిమొలకా, గంధపుంగొండ, తరుణి...సుఁక — ఎలజవ్వని యగు మాచెలిమేని పరిమళము తనకు లేదని మా చెలిపై మాత్సర్యము పూనినదై, నిన్ను, పురికొల్పెదుక్ = మాచెలిమీఁదికి ప్రేరణచేయుచున్నది సరిసే,...రమయుక్ = లక్ష్మియు, పురికొల్పెనె = (చెలిమేని నెత్తావి తనకు లేదని ఆమెపై మాత్సర్యము వహించి నిన్ను ఆమెమీఁదికి) ప్రేరించినదా యేమి. గంధపుమ్రాఁకుల తావిచేత మాత్రమె గాక పద్మసరస్సౌరభముచేతఁ గూడను ఏల మాచెలినేఁ చెదవు అనియు, చందనపద్మముల తావికన్న సుభద్రమేని తావి యుత్కృష్టమనియు భా.

48. ఎంత ఎమ్మెర = ఎంత రొయ్యారమురా, కమ్మనివిలుకానిక్ = మన్మథుని, దొరవు కమ్ము అని = నీవు ప్రభువుగా నుండునట్లు వేఁడుకొని, నెలక్...ని = చంద్రుని పైపెట్టు గా రమ్మని (ఆకాశమార్గమున నేతేరు మని యనియు), ... నికరమ్ము = సమూహమును, అని గా నిల్పి = అనుపుగా అనఁగా వెనుకతోడుగా నుంచుకొని.

49. జోహారు = నమస్కారము. ఓస...లార = ఓ మలయానిలుఁడా ఓ చంద్రుఁడా. మంటమారి - కోప( = మంట) స్వభావుఁడైన-(శివుని కంటిమంటలకు ఓర్చిన అనియుం). శంబరారిక్ = మన్మథుని (నీటికి శత్రువయిన యగ్నిని - అనఁగా - అగ్నివలె ఏర్చువానిని అనియుం). చకోర లోచనక్ = వెన్నెలపులుఁగులవంటి కన్నులుగల యీ సుభద్రను. గొహారు = శోభ. రేఁచినక్ = రేఁపినయెడల. భుజంగహారు = పాఁప పేరులవాని (శివుని) యొక్క.—శివుఁడు సమీరచంద్రులను తన పాముల చేత కబళించి

గోహరు సేయ నేల యీచకోరలోచనల్ భుజం
గహారుపాద మాన మీకుఁ గాక యింక రేఁచినన్. 49

చంద్రోపాలంభము.

క. వల పెక్కడ లేదా? యీ
యలికుంతలతలనె వేగెనా? యేఁచ కికన్
జలికాలఁ ద్రోచి విడువుము,
చెలి మిక్కిలి మనసు పేద, శీతలపాదా. 50

చ. శివుఁ డిటు రమ్మటంచు దయ చేసినచోఁ దలకెక్కి, తుగ్రవై
భవమునఁ జూచుచో నడుగు వట్టితి, వే మనవచ్చు నీగుణం?
బవు నవు, నందినన్ సిగయు నందకయున్నను గాళ్లు పట్టుకోం
దువు హరిణాంక; వేలకోలఁదుల్ గద నీనడకల్ దలంపఁగన్. 51

మదనుని నుదుటికంటితో మాపి చెలిని కాదు నని భా. పాపమయిన రాహువు చంద్రశత్రువుగాన చంద్రునికి పామువలన భీతి యనియు, పాములకు గాలి యాహార మనియు, ననుసంధింపవలయును.

50. వలపు = మోహము. ఎక్కడన్ = లోకములో నెవరికిని, లేదా, ఈ...నా = ఈ సుభద్ర తలపైనే ప్రాప్తమాడిచినదా - ఈమె కొక్కతెకే కలిగినదా, ఏఁచక ఇఁకన్, చలి...ము = అనఁగా లోకమందు పోలేరమ్మ మారమ్మ మొదలగు శక్తులను గూర్చి 'మాపిల్లవాండ్రను చలికాలఁ దన్నిపో తల్లీ' అనఁగా 'చల్లని కాలితో కడగా ద్రోసి పో అమ్మా' అని ప్రార్థించుట మర్యాద గనుక-ఆప్రకారము చేయుము మని పలికి రని అర్థము. నీ చల్లని కిరణములచే స్పృశించి పొమ్మని భా.—శీతల పాదా = చల్లని యడుగులు (కిరణము లనియు) కల చంద్రుఁడా, మనసు పేద = దీనురాలు - నీ జన్మస్థాన మగుట మనస్సు చెడు ననియు హృదయము - 'చన్ద్రమా మనసో జాతః' అనుశ్రుతి ననుసంధించుకొనవలయును.

51. తల కెక్కితి=నెత్తి కెక్కితివి - అనఁగా గర్వించి అమర్యాద చేసితివి - శివుఁడు చంద్రశేఖరుఁ డని భా. ఉగ్ర...చోన్ = తీక్ష్ణ భావముచే చూచిన సమయమందు-అడుగు పట్టితివి = అడుగంటి పోయినాఁడవు-అనఁగా అప్రసిద్ధుఁడ వయి పోయి

* 'ఏఁచ కికన్...గాలి'-అనుటకు పా—'అవలికిన్ । జలికాల'-ఈ పాఠమునకు-వలపు(=నెత్తావి) ఇఁక నెందలికో గలదు - నెత్తావి యీసున ఈమె నేఁచుచున్న దక్షిణపుఁ జల్లగాలిని నీపాదములతో (అవలికిన్=) చెలి దిక్కునుండి వేఱుదిక్కునకు ద్రోసి పొమ్ము అని యధికార్థము.

గీ. కలశవారాశిఁ బుట్టుట, గప్పెనయుట,
శైలచాపశిరోధివాసంబుఁ గనుట,
యెవ్వరికి నంట రాకుంట, యెఱిఁగి, కాల
కూట మన నేమి నినుఁ జంద్ర, నేఁటనుండి? 52

గీ. భువనజాతార్తికరమూర్తి వవుట కడలి,
కడలి గరళంబు నిన్ను నొక్కటిగ నెంచి,
త్రాగు తలఁ బోసికొ మ్మని వేగ హరున;
కిచ్చె నీరుచి యుంకి నెంచ నేల చంద్ర? 53

ఉ. చక్కరవింటిరాజు నగచాపునితో నెదిరించి పడ్డనాఁ,
డెక్కడ నుంటి వీవు? మధు వెక్కడ నుండెను? మందమారుతం
బెక్కడ నుండె? సిగ్గుపడ రే? మిము డాతఁ డదృష్టరేఖచే
రక్కొని క్రమ్మఱం బ్రతికి రాఁగ వజీర్ణయినారుగా శశీ! 54

లిపి-వీరభద్రావతారమున తన్నినప్పుడు పాదముఁ బట్టుకొంటి వని భా. అబ్ధి...కాళ్ల-లక్ష్యవాచ్యార్థముల రెంటి నరయువలయును. వేల కోలఁదుల్ = సహస్రసంఖ్యలుగలవి-(వేల=)సమయమునకు తగినట్టివి (ఉచ్చనీచభేదము లేని వనుట)- పాటుం బోటు ననియుం.

52. కలశవారాశిన్ = క్షీరసముద్రములో. కప్పు ఎనయుట=నల్లఁపుం జెందుట. శైలచాప = గట్టువిల్తునియొక్క (శివునియొక్క-) శిరః = కొదలయందు - అధివాసంబున్ కనుట=ఉనికిం బొందుట అని చంద్రపరము-శిరోధిన్ = కుత్తుకయందు అని కాలకూటపరము. అంటరాకుంట- దూరముచేత నని చం. ప.- దహించుటచేత నని కా. ప. అనన్ ఏమి = అన్నం ద ప్పేమి కలదు.—అట్లు బాధించువాఁడ వని తా.

53. భువన జాత=లోకముల సమూహమునకు (కమలములకు అని భా.) ఆర్తి కర మూర్తివి = పీడ సేయు స్వరూపముకలవాఁడవు. అడలి = భయపడి. కడలి = సముద్రము (కర్తృపదము). గరళంబున్ = కాలకూటమును. ఒక్కటిగన్ = సమానముగా. నీరుచిన్=నీ కాంతిని - (చవిని అనియుం). శివుఁడు కాలకూటమును త్రాగి చంద్రుని శిరమున వహించె నని చమత్కారము.

54. నగచాపునితోన్ = గట్టువిల్తునితో-అతిపటిష్ఠసాధనుఁ డని యభిప్రాయము. పడ్డనాఁడు=భస్మమై కూలినదినమున. మధువు=వసంతుఁడు. సిగ్గుపడరేమి - సమయము వచ్చినప్పుడు ప్రభువును విడిచి పాఱిపోయితి మను సిగ్గు లేక యున్నారేమి. రక్కొని= కోలుకొన్నవాఁడై. వజీర్లు = ఎంతయు నాప్తమంత్రులు —మీరు నీతిలేని వా రనుట.

## కో కి లా ద్యు పా ల ం భ ము.

క. మాకలకంఠియు నీవును
నేకగ్రీవముగ నుందు రిద్దఱు నెలఁతల్; నయో!
కోకిల, యిపు డే లలఁచెదు?
నీ కగునే యిగురుఁబోడి నెత్తురు ద్రావన్? 55

క. కొమ్మపయిఁ బక్షపాతము
నెమ్మెయి నెఱపుదు; వి దేల యేఁచెద వకటా!
కమ్మగ నవాతుచక్కెర
క్రమ్మఁగ మాటాడుఁ తవర కలకంఠవరా? 56

ఉ. కల్లరిత్రాఁచు నిప్పుకలు గైకొను కేకి చకోర పాళికిం
జెల్లినఁ జెల్లుఁ గాక, సరసీజ బిసంబు లిగుళ్లు మేసి భా
సిల్లెడు మీ కయో! విషము చిల్కఁగ వేఁడిమి గుల్కఁ బల్కఁగాఁ
జెల్లునె? యో మరాళ పిక శేఖరులార, వచింపుఁ డింపుగన్. 57

55 మా కల కంఠియున్ = అవ్యక్తమధురమైన కంఠనాదముగల మా సుభద్ర యును(సుభద్రయుం నీవును ఇరువురును కలకంఠులే యని స్వారస్యము). ఏకగ్రీవముగన్ = ఒక్కమాటగా - అత్యంతసఖ్యముగా ననుట - ఏకవిధమయిన స్వరము గలవారై అని భా. అలఁచెదు = శ్రమపెట్టెదవు. ఇగురు...ద్రావన్ = చిగురువంటి మృదుదేహముగల (యత్యంతప్రియ) సఖియొక్క రక్తమును పానముచేయుట - చిగుళ్లయొక్క (పోఁడి=) మార్దవ మను నెత్తురును పానము చేయుట అని భా.

56. కొమ్మపయిన్ = సుభద్రమీఁదను. పక్షపాతమున్ = అభిమానమును, ఎమ్మెయిన్ = ఎల్లవిధములచేతను, నెఱపుదువు=ప్రకటించుచుందువు - వృక్షశాఖపైని ఱెక్కలచే (పోయి) వ్రాలుదువు అని భా. కమ్మగన్ = హాయిగా, నవా...వర= నవాయతు అను కోస్తాలో చేసిన మిక్కిలి తెల్లనిగడ్డపంచదార గ్రమ్మునట్లుగా (అత్యంత మధురముగా ననుట),...,తవర=పోరడా, కలకంఠ వరా = శ్రేష్ఠమైన కోకిలా.

57. కల్లరిత్రాఁచున్ = కుత్సితమైన త్రాఁచుఁబామును. నిప్పుకలు = చంద్రకిర ణములనెడు నిప్పుకణములను, గైకొను = భక్షించెడు - కేకి...కిన్ = నెమళ్లయొక్కయు చకోరములయొక్కయుం సమూహమునకు,...,సరసీజ బిసంబులు = తామరలను తూండ్లను, ఇగుళ్లు = చిగురుటాకులను, ..., ఓ మరాళ...లార=శ్రేష్ఠములగు హంస కోకిల

క. రాచిలుకా, కోమలి దెసఁ
జూచితె! శ్రుతికటువు లనెడు, శుకనామము నీ
కేచాడ్పునఁ దగు. వల దిఁక
మాచెలిఁ గెరలించితేని మాటలు వచ్చున్. 58

క. మదను గుణం బని చాలఁగ
మది నమ్మితి; నిట్లు మొరయ మరియాదగునే!
యదియును గాక మదాళులు
గద తుమ్మెదలార, వెగటు గా నాడెదరే!— 59

వ. అని బహుమానాకార నికార మమకార చమత్కారంబులు గానంబడ
నీప్రకారంబున, 60

క. శరదబ్జముఖుల మాటికి,
శరదబ్జముఖుల్ తలంకఁ, జాల్నిలుఁ డంచుం,
దరుణీమణి వేసరి, యా
స్తరణ సుమాదులను జూపి, తాపము చేతన్,— 61

లార,...,చిల్కన్=చిందునట్లును, కుల్కన్=మీఱునట్లును, పల్కన్ = భాషించుట (కూయుట అని భా.)—ఇట తిండికిని తినువానికిని యథాక్రమమును కనవలయును.

58. రా చిలుకా=రాజ కీరమా - లేక - రమ్య కీరమా. శ్రుతి కటువులు = పలుకులు చెవికి చేదుగానున్నవి (వేదవిరుద్ధములు అనియు), అనెడున్ = అని మా కోమలి చెప్పుచున్నది. శుక నామము=వేదానుగుణముగా పలుకునట్టి శుకయోగియొక్క నామధేయము. పిచాడ్పునన్ తగున్=ఏవిధమునను ఒప్పదు (శ్రుతి కటు అను శబ్దముల శు - క - అను ప్రథమాక్షరములకూడిక చే నయిన శుక నామము నీకు ఎల్లవిధములను చెల్లును అనియు). కెరలించి తేని=రేఁపినయెడల, మాటలు వచ్చున్=నింద పొందుదువు-మాటలు చేర్పఁ గల వని భా.

59. మత్ అనుగుణంబు=నాకనుకూలమైనది - మదనుగుణంబు=మన్మథుని నారి అని భా. మొరయన్=ధ్వనిచేయుట. మత్ అళులు = (మీరు) నా సఖులు - మద అళులు=మదించిన తుమ్మెదలు అనియు. ఆడెదరే=పలుకుదురా (క్రీడించెదరా అనియు.)

60. బహూ...ములన్ = బహుమానము దిరస్కారము ప్రియము గమ్మత్తును.

61. శరదబ్జముఖులన్ = శరచ్చంద్రుఁడు మొదలగువారిని. తరుణీమణి=సుభద్ర.

సీ. "ఈ క్రొవ్విరులు గ్రోలు నెలతుమ్మెదలు చెక్కు
చెమరింప కున్న వా చిగురుఁబోఁడి?
ఈ కెంజిగురు మెక్కు కోకిలానీకముల్
వసివాడ కున్న వా వనజగంధి?
ఈ నిండు వెన్నెల లాను చకోరముల్
కసుగంద కున్న వా కంబుకంఠి?
ఈ తూండ్లు భుజియించు జాతియంచలు సొట
సొటలు వో కున్న వా శోభనాంగి!
గీ. తెలిసి రారమ్మ కలదు సందియము చాల;
నులికిపడ కవి లెస్స లై యుండెనేని
వజ్రకాయములే యౌను వాని కెల్ల;
నపుడు విరహాలయవిధికి నవధి లేదు. 62

క. చలిగాలిగర్వ మడఁపం
గలిగెం జిలువ, లని యుండఁగా, వానిపయిం
గలిగె శిఖావళము! లరెరో!
చెలి, తప్పునె వాగనుసఖము శిఖ యనువార్తల్! 63

(త ర ల.)

అగము లెక్కుచు మిన్ను ముట్టు చహంకరించుబలంబుతో
మృగమదంబు నడంగఁ జేయుచు మేనికప్పు సెలంగఁగాఁ

ఆస్తరణ కుసుమ ఆదులన్ = పడక (పఱిచిన) పువ్వులు లోనగువానిని.

62. క్రొవ్విరులు=క్రొత్తపువ్వులను చెక్కు చెమరింపక=ఎంతమాత్రము ఐడలక. కోకిల అనీకముల్=కోకిలల సమూహములు. వనజగంధి = సఖీ (పద్మ పరిమళమువంటి పరిమళముకలదానా). వసివాడక=శోషింపక. ఆను = త్రాగెడు. కంబుకంఠి=శంఖము వంటి కంఠముగలదానా. కసుగందక = కమలిపోక. జాతి అంచలు = శ్రేష్ఠములైన హంసలు. సొటసొటలు వోక = స్రుక్కక. అవిధికిన్ = బాధకు.

63. చిలువలు=పాములు-(పాములు వాయువును భక్షించును). శిఖావళములు=నెమళ్లు - (నెమళ్లు పాములను తినును). శిఖ = నెమలి - అగ్ని యని భా.

పగలు మీఱఁగఁ బాంథకోటుల బాధపెట్టుచు నుండు నీ
తొగతగుల్ వెడవింటిబోయకుఁ దోడు వచ్చినవాఁడ పో. 64

క. మకరందరసముఁ జిల్కెడు
చికిలి లకోరీలు చెఱకు సింగిణివిల్లుం
బ్రకటించియు, నిది యేమో!
మకరాంకుఁడు చేఁదువగలు మానఁడు చెలియా." 65

చ. చిడిముడిపాటుతోఁ, జెఱకుసింగిణిఁ బూని, మధుప్రియత్వ మే
ర్పడుగతి, లావు లున్న హరిపైని జివ్వకున నెక్కి, యుక్కునన్,
వెడలెడుచందుఁ జూచి, తను నేఁ డదిగో వధ సూచరించుఁ బెం
పడర లతాంగి; పచ్చితురకాఁగద యమ్మనసుండు చూడఁగన్!"—66

64. ఈ పద్యములో చంద్రునకును బోయవానికిని అభేదాధ్యవసాయము. అగములు=చెట్లులను (చంద్రపరమున) కొండలను (వ్యాధపరమున). మిన్నుముట్టుచున్=మింటికెగయుచు (చం)-మిక్కిలియుత్సహించుచు (వ్యా). బలంబుతోన్=శుకపికాది మన్మథసేనతో (చం) - కిరాతసైన్యముతో (వ్యా). మృగమదంబున్=కస్తూరిని (చం) - లేళ్లపొగరును (వ్యా). కప్పు=మచ్చ (చం) - నలుపు (వ్యా) - మృగ...గాన్=కస్తూరి కన్న మచ్చ నలుపుగా నున్నదని (చం). పగలు మీఱఁగన్ = పగటివేళ యతిక్రమించిన యనంతరము (చం) - ద్వేషము హెచ్చఁగఁగా (వ్యా. బోయపగ అని లోకప్రసిద్ధి). పాంథకోటులన్ = వియోగి సమూహమును (చం) - బాటసారుల సంఘములను. తొగతగుల్ = కలువ చెలి యయిన చంద్రుఁడు వెడవింటి బోయకున్=వట్టిచెఱకు విల్లు గాఁగల మన్మథుఁ డనుబోయకు తోడు...పో=ఈడుపోయినవాఁడే-అనఁగా బోయవాని వంటివాఁడే సుమా - మన్మథునికి సహకారి యనియుం భా.

65. మకరంద...రీలు=తేనె లొలుకుచున్న వాఁడి (పూ) బాణములను. చెఱకు సింగిణి విల్లున్ = చెఱకుతోఁ జేసిన శార్ఙ్గ ధనుస్సును. చేఁదు వగలు=చేఁదుగలిగించు చేఁతలను-బాణములను చేఁది ప్రయోగించునట్టి వైఖరులను అని భా.—తియ్యని సాధనములతో చేఁదు చేయుట ఆశ్చర్య మని తాత్పర్యము.

66. ఈపద్యమందు మన్మథునకును తురకకును అభేదాధ్యవసాయము.—చిడిముడిపాటుతోన్ = కోపముతోడి వడితో. చెఱకుసింగిణిన్ = చెఱకువింటిని - చెఱకువలె ప్రియమైన వింటిని అని. తు. మధుప్రియత్వము = వసంతునియం దిష్టభావము - మద్యము ఇష్టముగాఁ గలిగియుండుట అని తు. లావులు ఉన్నహరిపైన్ = ఱెక్కలు

గీ. అనినఁ; 'బవనుండు మనకు లోనైనవాఁడు,
తోయజారాతి మనుజులత్రోవ రాఁడు,
కాముతూపులు వెండ్రుకఁ గట్టఁబడును,
జాను యేటికి నూరక జలదరింప!' 67

గీ. అనుచు నూఱడఁ బల్కి, తత్ప్రాణసఖులు
దేవకీదేవి కీమాట దెల్ప కున్నఁ
గా దనుచుఁ, జేరి చెలి యున్న గాద దెలిపి
రంత. యట మున్న తెలిసి మురాంతకుండు— 68

సుభద్రా వివాహ ఘట్టము.

ఉ. తల్లిని దండ్రి నాత్మజులఁ దమ్ముని రమ్మని, యేకతంబునం,
దల్లకిరీటి యున్న తెఱఁ గల్ల సుభద్రకు నైనమోహముల్,
దెల్లము సేసి 'ముల్ మనమదిం గలయట్లనె యయ్యె' నంచు రం
జిల్లి, "హలాయుధుం డెఱుఁగఁ జేయఁగ రాదుగదా వివాహముల్;

గలదైన చిలుకమీఁద-బిరుదు తురాయియీఁకలు గల (దాఁటులుగల అనియేని) గుఱ్ఱము మీఁద నని తు. ఉక్కునన్=పరాక్రమముచేత. నెడలెడు...చి=(తనకుతోడుగా) బయలువెడలుచున్న చంద్రునిఁజూచి - ఉదయించుచున్న నెలబాడుపున అని తు. తమిన్= రాత్రియందు - కోరకతో నని తు. ఇది...చుమీ = చూడు చంపుచున్నాఁడు - గోవధ చేయుచున్నాఁ డని తు. లతాంగి = ఓచెలియా. పచ్చితురక = దయాసత్యశౌచములు లేని తుఱకవాఁడు—తురకలు చంద్రోపాసకులు గోహంతలును.*

67. లోనైనవాఁడు = లోఁబడియున్నవాఁడు - ప్రాణభూతుఁడై మన శరీరమున నున్నవాఁ డని భా. తోయ...డు = చంద్రుఁడు మనుష్యులజోలికి వచ్చువాఁడు కాఁడు అని-మనుష్యులు నడుమదారిని నడుచువాఁడు కాఁ డని భా. వెండ్రు...ను = అతిసులభముగా నివారింప శక్యము-పుష్పులను తలవెండ్రుకలందు కట్టుకొందు రని భా. చాన = ఓ కోమలీ. జలదరింపన్ = భయపడుట.

68. దేవకీదేవి సుభద్రతల్లి. గాద = కష్టవృత్తాంతమును. మురాంతకుండు = శ్రీకృష్ణుఁడు.

69. ఆత్మజులన్ = తనకుమారులను. తమ్మునిన్ = సాత్యకిని. అల్లన్ = క్రమక్రమముగా. కల = అనుకొన్న.

*గోవధము సేయు తురకల । దైవంబవు నీవు మొదలఁ, దక్కక పాంథ
స్త్రీవధము సేయ రోయుదె । నీవర్తన మేమి సెప్ప నీరజవైరీ. మనుచరిత్ర.

క. తనశిష్యుం డని దుర్యో
ధనునకు నీ వలచి సమ్మతింపఁడ, టటు గా
వున నిందుకుఁ బశుపతిపూ
జన మని యిపు డో కఁడు ̤గద ప్రసక్తిం బయ్యెన్. 70

చ. ఇరువదినాళ్లు రేపు మొద లిందుధరోత్సవలీల లచ్చటన్
జరిగెడు, నేఁటి కెన్మిదవ నాఁటికిఁ బెండ్లిముహూర్త, మవ్విధూ
వరులకుఁ దెల్పి, చల్పుఁడు వివాహవిధుల్, హలి గాన కుండఁ; దీ
వరమున లగ్న వేళ కటు వత్తు." నటంచు నమర్చి దేవకిన్, 71

శివునికి జాతర.

క. అంతటఁ బశుపతిపూజకు। నంతటఁ జాటంగఁ బనిచి, హరి యరిగెఁ, బ్రలం
బాంతను వసుదేవుని ము।న్నంతర్ద్వీపమున కేఁగుమని. యావెనుకన్,

క. యదు వృష్ణి భోజకులజాలు। గదలి రపు డనేక బాలికా మణిభూషా
మృదులపరిధాన పరిమళ। విదిత మహైశ్వర్యధుర్యవిభవోన్నతు లై.

ఉ. ఈగతి నంతరీపమున కెల్లజనంబులతోడ నేఁగి, యం
దాగమవేద్యశీలికి నతామరపాలికి నిందుమాలికిన్
ద్యాగము భోగమున్ జెలుల యాటలు పాటలు నిత్యకృత్య మై
సాఁగఁగఁ జూచుచుండి రలశౌరియు సీరియు సంభ్రమంబునన్. 74

సుభద్రా వివాహము.

గీ. అంత నిచ్చట ద్వారకయందు దేవ
కీ సతీమణి దాను రుక్మిణియుఁ బెండ్లి

70. ఈవలచి = ఇచ్చటకుఁ గోరి. [ఇందుకున్-ఇందునకున్ అనుట సాధువు.] పశుపతి = శివునియొక్క.

71. ఇందుధర = ఈశ్వరునియొక్క. చల్పుఁడు=చేయుఁడు.

72. అంతటన్=ఎల్లయెడలందును. ప్రలంబాంతకున్=బలరామునిని. అంతర్ద్వీపమునకున్=లోపలిదీవికి వెనుకన్=అటుపిమ్మట (రాఁగల పద్యముతో నన్వయము).

73. పరిధాన = వస్త్ర. విదిత = తెలియఁబడిన.

74. అంతరీపమునకున్=దీవికి. సీరి=బలరాముఁడు. ఆగమ...కిన్=శైవాగమములచేఁ దెలియఁదగిన స్వభావముగలిగినట్టియుం - నతామరపాలికిన్ = నమస్కరించుచున్న దేవసమూహము గలిగినట్టియు - ఇందుమాలికిన్ = చంద్రశేఖరుఁడైన శివునకు.

పెద్దలై, యర్జును సుభద్రఁ బెండ్లికొడుకుఁ
బెండ్లికూఁతుఁగఁ జేసి నవేడ్కఁ జెలఁగి, 75

ఉ. కట్టిరి మంచిలగ్నమునఁ గంకణముల్ కరపంకజంబులన్,
బెట్టిరి మేనులన్ నలుఁగు మేలిమృగీమదకుంకుమంబులన్,
జుట్టిరి కైశికంబుల విశుద్ధ మనోహర పుష్పమాలికల్,
పట్టిరి పేరటాండ్రు ధవళంబులు పాడుచు నుల్లభంబులన్. 76

శా. ఇన్నాళ్ ప్రోది యొనర్పఁ గేళివనిలో నింపొందు నమ్మాధవీ
పున్నాగంబులఁ బెండ్లి సేయవలెఁ, బూఁబోండ్లార, రారే యటం
చున్ నేర్పుల్ దగ నొండొరుం బిలిచికొంచున్ సత్యభామాది వి
ద్యున్నేత్రారుణు లప్పు డిర్వురకు విందు ల్చేసి రందంబులన్. 77

క. అంతర్వాణి పురోహితుఁ । డంత వివాహోచిత క్రియాకాండం బా
ద్యంతము గావించుటకై । సంతసమునఁ జేయుచున్న సమయమునందున్,

క. సంపంగిఁగానె యంటెన్ । శంపాంగి కిరీటి కొకతె, చనుదోయి పిసా
ళింపం, గిల్జడ కటి నటి । యింపుగ గిటకిటని కొనొకింత చలింపన్. 79

క. కలశస్తని మణికంకణ
కలశస్తనినాద మొలయఁగా నొకతె వడిం

76. కరపంకజంబులన్=కేలుఁదమ్ములందు. కంకణముల్=పెండ్లికంకణములను. కైశికంబులన్ = కేశపాశములకు. ధవళంబులు=మంగళగీతములు. ఉల్లభంబులన్=ఉల్లదలను (బందిటిక్రింది మేలుకట్లను.)

77. ప్రోది యొనర్పన్=పెంపఁగా. అమ్మాధవీపున్నాగంబులన్=బండిగురివెంద తీఁగను పొన్నచెట్టునకును. ఇన్నా...ంబులన్ - ఇంతకాలము ఉపచారము సేయుచుండఁగా ప్రీతిఁజెందిన సుభద్రార్జునులకు అని భా. సత్య...లు = సత్యభామ మొదలుగాఁగల మెఱుపుఁదీఁగలవంటి నేత్రములుగల స్త్రీరత్నములు.

78. అంతర్వాణి = విద్వాంసుఁడైన. కాండంబు = కలాపమును.

79. శంపా అంగి = మెఱుపువంటి శరీరముఁగలయొక స్త్రీ. పిసాళింపన్=పులుకుచుండఁగా. కటిన్=పిఱుఁదుపై. కిటకిటని = కిటకిటమనెడి.

80. బంగారుగిండులవంటి కుచములుగలవి. కలశస్తనినాదము=తియ్యని ప్రశస్త

దలఁ బ్రామి పన్నీఁడి కొప్పెర
జలములు చెలు లంది యొసఁగ జలకం బార్చెన్. 80

(ల య వి భా తి.)

చలువ లొసఁగెన్ సరగఁ జెలువ యపు డొక్కరిత,
వలఁతితన మొప్ప నొకపొలఁతి తడి యొత్తెన్,
గొలఁదిగ జవాది నొకవెలఁది తలఁ బూసె; నొక
జలరుహదళాక్షి నిగ కలరుసరి చుట్టెన్,
దిలక మిడియెన్ నిటల ఫలకమున నొక్కరిత,
తెలినిలువుటద్ద మొకచెలి నిలిపె మ్రోలన్,
గలయ జవరా లొకతె మలయజ మలందె, నొక
లలన విసరెన్ సురటి యలనరున కర్థిన్.

గీ ఒరగ వేసినసిగ వింత యొఱపుఁ జూచి,
బవిరి దిద్దిన చెంపల బాగుఁ జూచి,
వడిగొలిపి యున్న మీసము బెడఁగుఁ జూచి,
యపుడు తమలో సుభద్రనెయ్యంపుఁజెలులు. 81

క "వాసవి త్రిదండివేసము। వేసి గదా మేలు సేసె; వెస జన్నిదమే
వేసికొనవచ్చు, నీసిగ। వేసికొనఁగూడ దొండువేసము లైనన్. 82

క. దండముఁ గాషాయంబును।గుండికయును మాని పెండ్లికొడుకై నాఁడా
ఖండలునిముద్దుఁగొడుకు। ప్రచండరుచి నేఁడు మంచిసన్న్యాసముగా.

ధ్వని. ప్రామి = రుద్ది. కొప్పెరన్ = గిండితో.

81. చలువలు=చలువమడుఁగులు. సరగన్ = త్వరగా. వలఁతితనము = జాణతనము. కొలఁదిగన్=కొంచెముగా. జలరుహ దళ అక్షి=కమల పత్త్ర నేత్ర. అలరుసరి=పూదండను. నిటలఫలకమునన్ = పలకవంటిలలాటమునందు. మలయజము అలందెన్ = గంధము పూసెను. లలన = స్త్రీ. సురటి=వీవన.

82. వాసవి = అర్జునుఁడు. త్రిదండి - విశిష్టాద్వైతమత సిద్ధాంతరీతిని సన్న్యాసి త్రిదండమును దాల్పవలయును, శిఖా యజ్ఞోపవీతము లుంచుకొనవలయును. అద్వైతాది సిద్ధాంతరీతిని శిఖా యజ్ఞోపవీతములు పరిత్యజింపవలయును. జన్నిదమే = జందెమును మాత్రమే.

మ. యతివేషంబున నిన్ని నాళ్లు మన యుద్యానాంతరక్షోణి ను
న్నతఁడా యీతఁ? డ దేటిమాట? కనుఁగోనం బెన్నఁడే నీ తను
ద్యుతి యీ రాజస మీ మొగంబుకళ లీయొయ్యార మీవీక్షణా
మృతలీలాభినయంబు లీ సొగసు లీ మీసాలలో నవ్వులున్. 84

క. ఈమహిమ యెందుఁ గలదే
భూమండలిలోన నితఁడ పో చక్కనివాఁ
డో మగువలార, మును విన
మా మన్మథుఁ నతని మేనమామన్ మధునిన్ ? 85

క. ఈరాజు సేవ చేసిన
వారిదిగద భాగ్య; మీభువనమోహనశ్రీం
గారునితోఁ గూడంగలఁ
నారీమణి దే సుమీ జనన మూహింపన్. 86

గీ మంచిమగఁడు వలయు నంచుఁ గోరుచు నుండ,
మంచిమగఁడు గల్గె మఘవసుతుఁడు,
మనసుభద్ర సుకృత మహిమ యే మన వచ్చు!
మనసు భద్ర మయ్యె మనకు నెల్ల." 87

83. కాషాయంబు = కావిశాటి. కుండిక = కమండలువు. ప్రచండ రుచిన్ = ప్రకాశమానమైన తేజస్సుతో. నేఁడు...గా = ఈ దినమున చేసినదే మంచిసన్న్యాసము గదా - అనఁగా - ఇట్లు సన్న్యసితమును సన్న్యసించుటయే మంచి సన్న్యాసము.

84. ఉద్యాన అంతర క్షోణిన్ = ఉద్యానవన మందలి భూమియందు. కనుఁగోము = కనుంగొనము. తనుద్యుతి = దేహకాంతి.

85 మగువలార=ఇంతులారా. మధునిన్ = వసంతుని. .వారి కింత సౌందర్యము లే దని భా.

86. భువన = లోక. జననము = పుట్టువు.

87. మగఁడు=భర్త - పతుఁడును. మఘవ సుతుఁడు = ఇంద్ర పుత్త్రుఁడు. సుకృత = పుణ్య. భద్రము = నిమ్మళము.

గీ. అని నుతింప నలంకృతుఁ డగుచు గొంతి
కూర్మికొడుకుండ; బంగారు కుండ యైన
కన్యకారత్నమున కాప్రకారముననె
శిరసు మజ్జన మొనరించి చిగురుఁబోఁడ్లు, 88

ఉ. భాసురుఁ గప్పు దేఱు తెలిపారెడు నిద్దపు సోగవెండ్రుకల్
వేడుఱు దువ్వి, భారమున వెన్కకు జాఱఁగఁ గొప్పు వెట్టి, నో
హో! మఱి వేయి వెట్టిసటు లొప్పె. నదే మన వచ్చు? నౌఁగదా,
తామరసాక్షి కెందుఁ దలిదండ్రులు వెట్టినసొమ్ము పెన్నెఱుల్. 89

క. స్వకపోల కల్పిత మనో
జ్ఞకళా గతి కెట్టు లౌను సరి ఛాయా చో
రక * రుచి సందర్భం బని,
ముకురము నగుకరణి నవ్వుమోము చెలంగన్, 90

ఉ. అద్దముఁ జూచి, చంద్రముఖి యందముగాఁ దిలకంబు కస్తురిన్
దిద్ది, యనేకరత్నమయ దివ్యవిభూషలు దాల్చి, యయ్యెడన్

88. గొంతి = కుంతీదేవియొక్క.

89. నిద్దపు=మెఱయుచుండు. పెన్నెఱుల్=నిడుదతలవెండ్రుకలను.

90. స్వ...కిన్=తనయొక్క చెక్కిళ్లచేత కల్పింపఁబడిన మనోహరమైన లావణ్యముయొక్క సరణిగలదైన (తనకు) అని ముఖపరము - స్వబుద్ధిచే రచింపఁబడిన (శబ్దార్థములచే)సుందరమైన శోభయొక్క సరణిగలదైన ప్రబంధమునకు అని సుకవిపరము. ఛాయా...ంబు = (ముఖ) కాంతిని (ప్రతిబింబమును నని యును) దొంగిలించుదానియొక్క (అద్దముయొక్క యనుట) కాంతులయొక్క మొత్తము అని ముకురపరము - అద్దమునకు కాంతి సుభద్ర మొగమునుండి దొంగిలించుకొన్నదే గాని స్వకీయము గాదనుట=పరకవనప్రకారములను దొంగిలించుకొను మెఱుఁగుల కూర్పు అని కుకవిపరము. ముకురమున్=అద్దమును.

91. కస్తురిన్=కస్తూరితో. దివ్య=శ్రేష్ఠములైన. ముక్కాలిపీఁటన్=మూఁడు

* రససందర్భంబు అని పఠించుచో శృంగారాదిరసములకూర్పు అని కవనపరము గను పాదరసపుఁబూఁత గలది యని ముకురపరముగాను అర్థములు. రుచిపాఠము పూర్వకాలపుఁ గంచుటద్దములకును రసపాఠము ఇప్పటి గాజుటద్దములకును అన్వయించును.

ముద్దులు గుల్కు కుందనపు ముక్కాలిపీఁట వసించెఁ దమ్మిపూ
*ముద్దియగద్దియం బొలుచు ముద్దియ యొద్ది యనన్ శుభోన్నతిన్. 91

చ. తనయుని పెండ్లి కేఁగవలె ధాత్రికి; దిక్కులవారి నెల్లఁ దో
డ్కొని చను దెమ్ము నీ; వని కడుం గుఱి సేసి సురాధినాథుఁ డ
బ్బనపతి కంపినట్టి శుభవార్తల బంగరుకమ్మచుట్టనా,
దినకర మండలం బపర దిగ్గిరి కూటముఁ జేరె నయ్యెడన్. 92

క. నందకుమారానుజ యను
తం దన నందనుఁడు గట్టె దైవతకుతి వే
డ్కం దెచ్చు తాళిబొట్టనఁ,
జందురుఁ డరుణరుచిఁ బ్రాగ్దిశన్ గన నయ్యెన్. 93

సీ. కులదేవతను దెచ్చి నిలిపిరి మాణిక్య
చకచకల్ గల పెండ్లి చవికె దండ;
నైరేని గొని వచ్చి రైదువల్ పాటలు
పాడుచు శుభవేళ వేడు కలరఁ;
బులు గడిగిన ముత్తెముల బాసికంబులు
సరవిఁ గట్టిరి నేర్పు సంఘటిల్లఁ;

కాళ్లపీఁటమీఁద. తమ్మి...యన్ = తామరపూవునందలి దిమ్మెయను సింహాసనముపైని - బొలు...నన్ = ప్రకాశించుచుండు లక్ష్మీదేవికి సమాన యనునట్లు.

92. గుఱి = నిర్ణయము. వనపతికిన్ = జలాధిపతియైన వరుణునకు. కమ్మ = జాబుయొక్క. నాన్ = అనునట్లు. అపర దిక్ గిరి కూటమున్ = అస్తాచల శిఖరమును.

93. నంద కుమార అనుజ యనుతన్ = నందుని పుత్త్రుఁడైన కృష్ణునకు చెల్లెలైన సుభద్రయొక్క కంఠమందు. అరుణ రుచిన్ = ఎఱ్ఱని కాంతితో.

94. (౧) దండన్ = చెంతను. (౨) ఐరేనిన్ = అయిదు రంగులు వేసిన కుండలను—అరివేణికుండలనివాడుక. (3) పులు కడిగిన— (పులిమజ్జిగయందు బియ్యమును పెట్టి కడిగిన ముత్యములు మాలిన్యము పోయి ప్రకాశించుట ప్రసిద్ధము) - అట్లు కడుగఁబడిన.

---

* సం. ముద్రికా=ప్రా. ముద్దిఅ=ప్రా. స. ముద్దియ = (గింజలపరుసలు ముద్రవలె నుండును గాన) దిమ్మె యను అర్థమునం బ్రయోగము.) ఒండె,—తమ్మిపూముద్దియ=లక్ష్మి ...ముద్దియ=ముద్రికయొక్క=రీతియొక్క-ఒద్ది=దీటు-అని గ్రహింపవచ్చును.

దళంబ్రాల కేర్చి ముక్తాసుణుల్ నించిరి
పసిఁడిపళ్లెముల సంభ్రమము మీఱఁ;
గీ. పణవ శంఖ ఢమామికా పటహ కాహ,
ళారవంబులు నెఱపిరి బోరు కలఁగ;
సకలవినియోగముల జనుల్ సకలె గాఁగ,
నంతిపురమున నుత్సవం బయ్యె నపుడు. 94
గీ. తడవు సేసె, ముహూర్తంబు దగ్గఱించె,
నేమొకో యన్న రాఁ డని యెదురు సూడఁ;
దసదు గారాపుఁజెలి చెలి మున నెఱింగి,
మాటలోపల వచ్చె నమ్మాధవుండు. 95
క. ఒక రొకరి నెఱుఁగ కుండఁగ,
నొకరి వెనుక నొకరు వచ్చి రొక నెపమున సా
నకదుందుభి సారణ సా
త్యకులును బ్రద్యుమ్న సాంబు లక్రూరాదుల్. 96
క. హరి వచ్చునంతలో సా
హరియుం జనుదెంచెఁ దనయుఁ డాత్మఁ దలంపన్
సుర లచ్చరలు మహర్షీ
శ్వరులు నరుంధతియు గురుఁడు శచియును దానున్. 97
ఉ. చక్కరవింటిరాజు నొసక్కెము లాడఁగఁ జాలునెక్కుడుం
జక్కఁదనంబు గల్గు నెఱ సాహసపుం గొమరుండు మ్రొక్కఁగా,

బాసికంబులు=వధూవరులకు నొసటకట్టంబడు పదకముతోడి పేరులు. సరవిన్=చక్కఁగా.

పణవ...బులు=పంబలు శంఖములు డమాయీలు భేరులు. (కాహాల=) తుతా రాలు అనువానియొక్క (ఆరవంబులు=) ధ్వనులు.

96. వచ్చిరి - మూక్కంటిజాతరనుండి. ఆనకదుందుభి = వసుదేవుఁడు.

97. హరియున్ = ఇంద్రుండును.

98. ఎక్కుడు = అధికమయిన. నెఱ = నెరా = నిండు. అక్కునన్ = వక్షంబున. మే = దేహమును. లోన్ = వ్ర్పద మునుగా. నెక్కొను = నాటుకొన్న.

నక్కనఁ జేర్చి మే నిమిరి యాదల మూర్కొని చొక్కుచుండె లో
నెక్కొను వేడ్క నిక్కుచెవి నిఃని నెక్కుకజీరుఁ డయ్యెడన్. 98

మ. సుముహూర్తం బిదె లెం డటంచు సురుఁడచ్చోఁ దెల్ప; దేవేంద్రుఁడుం
దమదేశంబుననుండి తెచ్చిన సువర్ణక్షౌమ కోటీర ము
ఖ్య మణీభూషలతోడ శౌరిని సింగారించి, మందార దా
మము కంఠంబునఁ జేర్చి పెండ్లికొడుకుం బ్రాగ్దంతి నెక్కించినన్; 99

వ. అయ్యవసరంబున. 100

సీ. ఉపరిభాగ నిరంత రోన్నమిత ము లైన
ముత్యాలగొడుగుల మొత్త మలర,
నుభయపార్శ్వ ముహుర్ముహు శ్చాలితము లైన
వింజామరల కలా పుంజ మమరఁ,
గళ్యాణ వైభవ కర్ణేజపము లైన
తూర్యనాదముల చాతుర్య మొసరఁ,
బృథుల ప్రదక్షిణార్చి శ్శ్రేదురము లైన
దివ్వటీల సమష్టి నివ్వటిల్ల,

గీ. నపుడు ప్రద్యుమ్నుఁడు జయంతుఁ డవల నివలఁ,
బసిఁడిబెత్తంబులను బరాబరులు సేయ,

నిక్కు...రుఁడు=ఉచ్చైశ్శ్రవ మను గుఱ్ఱమునెక్కు దొర (ఇంద్రుఁడు).

99. సురుఁడు=బృహస్పతి. సువర్ణ...ఖ్య=బంగారపు నీరు వేసిన పట్టువస్త్రము లును కిరీటము లోనుగాఁగల. మందార దామము = పారిజాతపుష్పముల దండను. ప్రాగ్దంతిన్ = పూర్వదిగ్గజమైన యైరావతముపై.

101. (౧) ఉపరి...ములు=ఊర్ధ్వభాగమందు క్రిక్కిఱియుండునట్లుగా ఎత్తిపట్టఁబడినవి. (౨) చాలితములు=వీవఁబడినవి. వింజామరల = వీచోపులయొక్క కలాపుంజము=కాంతి సమూహము. (౩) కల్యాణ...లు = వివాహోత్సవమునకు సూచకములు. తూర్య=వాద్యములయొక్క. (౪) పృథు...లము = విస్తారమైనట్టియు సవ్యముగాఁ దిరుగుచున్నట్టియు జ్వాలలచే దట్టమైనవి. సమష్టి = మొత్తము. నివ్వటిల్లన్ = ప్రకాశించుచుండఁగా. హరిపురందరులు = కృష్ణుఁడును ఇంద్రుఁడును.—నిరంతరము

నడచి వచ్చిరి హరిపురందరులు మ్రోలఁ
సంభ్రమంబున మందహాసంబు దొలఁక. 101

చ. అనిమిషభావ మీసమయమందు ఫలించె నటంచుఁ, గోరికల్
వెనుకొనఁ బైన పైన పడి వే తటకాపడి, యుర్వశీ విలా
సిని మొదలైనయచ్చరలు చెంతలఁ జేరి, సహస్రదృక్ తనూ
జుని యెడ లెల్లఁ గన్నులుగఁ జూచిరి మానసముల్ గరంగఁగన్. 102

ఉ. దేవకియింటనుండి యి టుదీర్ణతఁ బెండిలికూఁతు రున్న భో
జావని జాని జా నిజ గృహాంగణసీమకు నేఁగి, యొంతయున్
ఠీవి ఘటిల్ల, సాత్యకి వడిం గయిలా గొసఁగం, గిరీటి యై
రావతమున్ దిగెన్ ద్విజ పురంధ్రులు ముత్తెపుసేసఁ జల్లఁగన్. 103

గావున నుత్తము లనుట, వీచుటయందు వెల్లజల్లులు చంద్రకళాకారముగా కంటికిం దోఁచును గాన కలాపుంజ మనుట, నాదములు గావున కర్ణేజపము లనుటయుం, సొంపుగా నున్నది ప్రదక్షిణజ్వాలలు శుభప్రదములు.

102. అనిమిష భావము = రెప్పపాటు లే కుండుట. వే తటకాపడి = వేగముగా ఆశ్చర్యపడి. వెనుకొనన్ = ముందఱికి తఱుమఁగా. సహస్ర దృక్ తనూజుని = వేయికన్నులు గల యింద్రునిపుత్త్రుఁ డైన యర్జునుని యొక్క. కన్నులు కాన్ = కంటి (ప్రతి) బింబములు సంక్రమించునట్లు - అతఁడును తండ్రి పోలికను సహస్రాక్షుఁడుగా నగపడునట్లు అని ధ్వని. [* నొడలెల్ల అని పఠించిన - తమ దేహమంతయుం గన్నులుగాఁ జేసికొని - అనఁగా కన్నులను అత్యంతము తెఱచుకొన్నవారలై - ద్వినేత్ర తనూజునిం గాంచుటకు ద్వినేత్రి చాలును, సహస్రనేత్ర తనూజుం గాంచుటకు సహస్రనేత్రి వలయును కావున తాము సహస్రాక్షు లయి అని ధ్వనిత మగునట్టుగా - గ్రహింపవలయును కన్నులు = నేత్రములు - మానసములు కరఁగి వెలిం బ్రవహించుటకైన తూములు అని స్వారస్యము.]

103. ఉదీర్ణతన్ = పెంపు మీఱ. భోజ అవనిజాని జా = భోజ రాజు కూఁతురగు రుక్మిణీదేవియొక్క - నిజ అంగణ సీమకున్ = స్వకీయమైన యింటి ముందఱి ప్రదేశమునకు. కయిలాగు = కయిదండ. ద్విజ పురంధ్రులు = బాపన ముత్తైదువలు, ముత్తెపు = ముత్యాల. సేస = శేషాక్షతలు.

---

* తా రాఘవం దృష్టిభి రాపిబన్త్యో నార్యో న జగ్ము ర్విషయాన్తరాణి ;
తథా హి శేషేన్ద్రియవృత్తి రాసాం సర్వాత్మనా చక్షు రివ ప్రవిష్టా. రఘు,

గీ. నరవరోత్తముఁ డటు శుభోత్తరము గాఁగఁ,
గుడికడము మున్నుగా నిడ, గడప దాఁటి,
యారతు లొసంగ, దీపన లావహిల్ల,
మోదమున నేఁగెఁ గల్యాణ వేదికడకు. 104

శా. శ్రీ రంజిల్లఁ బసిండిపెండ్లిచవికెం జేరంగ నవ్వేళఁ గ
న్యారత్నంబును దోడి తెచ్చిరి జనానందంబుగాఁ బాడుచున్
పేరంటాండ్రురు, మంత్రపఠనశక్తిన్ గర్గుఁడున్ దేవతా
పౌరోహిత్యధురంధరుండును శుభ మొప్పన్ మ్రోల నేతేరఁగన్. 105

క. 'మెత్తుము గదె మన మెపుశఁ, ది
లోత్తమ చక్కఁదనమ; మీతలోదరి యెదుటన్
మెత్తవడె దాని చెలువ;' వనీ,
యత్తఱి గుసగుసలఁ బోయి రచ్చర లెల్లన్. 106

గీ. వేయుఁ గన్నులు వలయుఁ బో వీరిఁ జూడ,
నని కవుల్ దంపతులచెల్వు వినుతి చేయఁ
గాదు, పదివేల కన్నులు గావలె నని,
చూచుచుండె సహస్రవిలోచనుండు. 107

చ. కలరొకొ యెవ్వరైన నవుఁ గా దని యడ్డము వల్కువార లీ
యిలఁ? మఱిఁ దా నెఱుంగనటు లెంతటిమాయలకాఁడు! కన్యకా
తిలకము దారవోయ వసుదేవునిఁ గట్టడ సేసి, వేయి క
న్నులు గలవేలుపుం బలెఁ గనుంగొనుచుండె మురారి చెంగటన్. 108

క. మధుకరవేణులు కొందఱు
మధురోక్తులు వెలయఁ దొర యమర్చిరి సరగన్;

105. మంత్రపఠనశక్తిన్=వేదమును పఠించుచు. గర్గుఁడున్=గర్గమహామునియును. దేవగురుండున్ = బృహస్పతియును. మ్రోలన్=ఎదుట. ఏతేరఁగాన్=రాఁగా.

106. తిలోత్తమ యనునది ఒకానొక యచ్చర. మెత్త...వు = ఆ మెచకక్కుఁదనము కొఱగాకపోయె నని అర్థము- శ్రేష్ఠమైన మవ్వపుమువ్వ పరువము చెడిపోయె నని భా.

108. కట్టడచేసి = నిర్ణయించి. వేయి...లె = ఇంద్రునివలెనే.

మధుమథనజనకుఁ డంతట
మధుపర్కం బొసఁగె నృప కుమారాగ్రణికిన్. 109

గీ. దేవకి యొసంగఁగా వసుదేవుఁ డపుడు
చంద్రకాంతపు గిండి గొజ్జంగనీటఁ
బైఁడిపళ్లెములోఁ బదాబ్జములు గడిగి
తనదు మేనల్లునకుఁ గన్య ధారవోసె. 110

ఉ. సూరెలఁ జేరి యష్టమహిషుల్ దగువారుఁ బొసంగ, నావలం
గోరిక నిక్కినిక్కి కనుఁగొంచు సుపర్వు లెసంగ, వాద్యముల్
బోరు కలంగ, నంగములు పొంగ, వధూవరులం గడాని బం
గారపు మెట్టుఁబ్రాల పుటికల్ గదియించిరి కొంద ఱైదువల్. 111

క. వడిఁ దెఱవల్ దెరవంపం,
బడఁతుక నగుమొగము గానఁబడియెం, గాంతల్
తడఁబడఁగ, శరన్మేఘముఁ
బెడఁబాసి వెలుంగు చంద్రబింబము వోలెన్. 112

క. అమృత మొలుకునధరంబునఁ,
గుముద చకోరముల నేఁకొనుశుభదృష్టిన్,

109. మధుకర వేణులు = తుమ్మెదలవంటి జడలుగలవారు. ఉక్తులు = మాటలు. మధు మథన జనకుఁడు=కృష్ణునితండ్రి యగు వసుదేవుఁడు. మధు పర్కంబు = పెరుఁగు తేనె పంచదార మొదలైనవి కలిపి పెండ్లికుమారునకు కన్యాదానము చేయుమునుపు ఇచ్చు మిశ్రమును.

110. గొజ్జంగినీటన్ = పన్నీటిచేత.

111. సూరెలన్ = పార్శ్వములయందు. అష్టమహిషుల్ = ఎనమండ్రుభార్యలును. సుపర్వులు = దేవతలు. మెట్టుఁబ్రాలపుటికల్ = తలంబ్రాలబుట్టలను.

112. కాంతల్ తడఁబడఁగన్ = తెర వంచిన యాస్త్రీలే భ్రమ చెందునట్లుగా.

113. కుముద=తెల్లగలువలను. తెలిచి=వెల్లడిపఱిచి. రాజు అనవలెనే=చంద్రుఁడని వేఱే చెప్పవలయునా.—అనఁగా - అమృతము చిందుట మొదలయిన చంద్రధర్మములు ముఖమునం దుండుటచేత ముఖమును చంద్రుఁడని వేఱే చెప్ప నక్కఱలే దనుట.

గమలములకళలు వైగొను
రమణీమణి ముఖముఁ దెఱచి రా జనవలయున్. 113

చ. పొలయలుకందు వేఁడుకొను పొందిక దెల్పెడులీల సిగ్గు దో
ట్రిలిన ముఖాబ్జ మెత్తి, మెడక్రిందికి హస్తయుగంబు సాఁచి, వే
నలి దెమలించి, సౌఖ్యకలనస్థితి గట్టిగఁ బట్టి కట్టె న
వ్వాలఁదుకకంఠసీమఁ గురువీరుఁడు మంగళసూత్ర మయ్యెడన్. 114

చ. తమతమవార లొండొరులదండఁ గరంబుల ముత్తియంపుఁ బ
ళ్లెము లిడి చేయి మించఁగవలెం జుమి నీ కని యుచ్చరింపఁగా,
నమితముగా సుభద్రపయి నర్జునుఁ డర్జునుపై సుభద్రయున్
దమిఁ దలఁబ్రాలు వోసి రెలనవ్వును సిగ్గును లోఁ దొలంకఁగన్. 115

గీ. అగ్నిసాక్షిగఁ బెండ్లాడినట్టి ప్రియు వ
ధూటియును దాను బంగారు పీఁట మీఁద
నుచితగతి వెలయంగఁ గూర్చుండి పాక
శాసని చెలంగె దీవించి సేస లిడఁగ. 116

గీ. మృగమదము చెంతఁ గుంకుమరేఖ వోలె,
నీలమణిపొంత నుదిరిపొన్రేకు వోలె,
మేఘముకుఱంగటను దీఁగమెఱుపు వోలె,
నర్జునునిచెంగట సుభద్ర యలరె నపుడు. 117

చ. కలుగుఁ గలావిశేషము జగంబునఁ బెండ్లి యటన్న నెట్టివా
రల; కటువంటిపట్ల, నెఱప్రాయము రూప మొయార మూని వే
ర్కలిగినరాచకూఁతు రఁట, రాకొమరుం డఁట, యేమి చోద్యమో
పొలపు మిటారి సిగ్గరులు చూపఱచూడ్కికి విందు సేయుటల్? 118

తెఱచి రా జనఁగా, చదరంగములో నెదుటిరాజునకు శేత యగు కాయ ఎదుర్కొను నట్లుగ ఆకాయకు అడ్డముగా నున్న కాయను అవలికి నడపుట.

114. పొలయలుకందున్ = ప్రణయకలహమందు. వేనన్ = వేణిలోని. తెమలించి = అవలికి త్రోసి.

118. కళావిశేషము = నూతనలావణ్యము - పెండ్లికళ యనుట. అసాలపురి...

క. అంతటఁ బౌలోమీ మఘ
వంతులకుం బెండ్లికొడుకు వందన మిడఁ, ద
త్ప్రాంతమునఁ బెండ్లికూఁతురు
గొంతతడు దలవంచి మ్రొక్కఁ గొంకుచు నున్నన్, 119

శా. 'ఎంచంగాఁ దగు నత్తమామలను దా నిల్వేల్పులంగా మనః
ప్రాంచద్భక్తిని సాధ్వి' యందు; రది మీ పట్లన్ నిజం బయ్యె నేఁ;
డంచుం జేరి శచీపురందరుల శ్లాఘాదంబుగాఁ బల్క, మ్రొ
క్కించెన్ దేవకి యప్పు డర్ధహిమరుగ్బింబాలికన్ బాలికన్. 120

మ. ప్రణయం బొప్పఁగఁ గృష్ణునిం గని, సుపర్వస్వామి 'యీ సర్వల
క్షణముల్ గల్గినకన్య మంచివరునిం గాఁ జూచి యీ నేర్పు నై
పుణి మీకే తగు;' నంచుఁ బల్కఁ 'బరమాప్తుల్ మీరు రాఁగా విజృం
భణవృత్తిన్ నెఱవేఱెఁ బెండ్లి.' యని యప్పద్మాక్షుఁడుం బల్కఁగన్;

సీ. వియ్యంపుమర్యాద వేగుజామున శచీ
జాని బువ్వాన భోజనము సేసి,
గుమగుమ వాసించు కుంకుమ కస్తూరి
యమరవల్లభుని హస్తమున కిచ్చి,

సింగారపు విలాసము గలిగిన సిగ్గుతోఁగూడిన యా సుభద్రార్జునులు.

119. పౌలోమీ...తుల్ = శచీ పురందరులకు. కొంకుచున్ = సిగ్గుచే సంకోచించుచు.

120. సాధ్వి = పతివ్రత - తాను - మనః ప్రాంచత్ భక్తిన్ = మనస్సునందలి యోగ్యమైనభక్తిచేత...ఇల్వేల్పులం గాన్ = గృహదేవతలతో సమానముగా, ఎంచంగాఁదగున్. అది = ఈమాట. మీపట్లన్ నిజం బయ్యెన్ — మీరు వేల్పులే గావున అని భా.

121. ప్రణయంబు = ప్రేమ. ఈ నేర్పు నైపుణి = ఇచ్చుటకు ఎఱుంగునట్టి చతురత. విజృంభణవృత్తిన్ = అత్యంతవైభవముగా.

122. వియ్యంపుమర్యాదన్ = వియ్యాలవారి వడవడిక చొప్పున. శచీజాని = ఇంద్రు నియొక్క. చేసి - కర్త మురారి. గీతాంతమున. వాసించు = పరిమళించుచున్న. గమబూర = పచ్చకర్పూరము. కల్కిన = పొద్దుగాఁగూర్చిన. సేసాని దోయిటన్ =

గంబూర గుల్కిన తాంబూల మింద్రుఁ డం
దుకొనఁ దో సేసాని దోయిట నిడి,
పీతాంబరములు విప్పి యనేకముల్ వజ్రి
చేతిసంజ్ఞ జయంతు చేతి కొసఁగి
గీ. కేలఁ గేల్పట్టి కొన్ని వాకిళ్లు గడచి
రాఁగ, 'విచ్చేసి యుండుఁడు రావల' దని
బలిమి బలభేది యెదురుగ నిలిచి మ్రొక్క,
వేడుక మురారి గేల్ మోడ్చి వీడుకొలిపె. 122

క. అంతకు మును పే హరి య। త్యంతకుతూహలముతోడఁ దగుమేరల న
య్యంతఃపురి భోజసుతా। కాంతను బౌలోమి నను పఁ గట్టడ సేసెన్.

గీ. రుక్మిణీదేవి తమ యత్త మ్రోల శచికిఁ,
బసిఁడిగిన్నియఁ గస్తూరి యొసఁగ, సామె
చేఁ దిగిచి దేవకీదేవి మీఁద జిలికి,
వదినెగా రని యొకకొంత వావి నెఱపె. 124

ఉ. పీయపురాల వైతి గద వే యిపుడ; త్తవు తొంటివావి; నో
తోయజనేత్రుఁ గాంచినవధూమణి, నీసుతఁ బెండ్లియాడఁగా
న్యాయము నా కుమారునకు; నర్మిలి హత్తఁగ నత్తవావిచే
న్యాయువు గల్గువాఁ డవు నటం్రదు; శుభం బగు దీన నెంతయున్. 125

కుమారస్వామి దోసిటిలో. సంజ్ఞన్ = సంజ్ఞచేత. జయంతుఁడు = ఇంద్రునికుమారుఁడు - విచ్చేసియుండుఁడు = నిలువుఁడు. బలభేది = ఇంద్రుఁడు. వీడుకొలిపెన్ = అంపకము పెట్టెను.

123. తగు మేరలన్ = తగిన మర్యాదలతో. భోజసుతాకాంతన్ = రుక్మిణీదేవిని.

124. వదినెగారు - తనకొమరుఁ డయిన యర్జునునికి అత్తగా రయినది గావున వదినెగా రని వావి.

125. తోయజనేత్రున్ = విష్ణుమూర్తిని (శ్రీకృష్ణుని) అత్తవు - తనమఱఁదికి తల్లిగావున అత్తవావి-ఇంద్రుని తమ్మునికి (ఉపేంద్రునికి అనఁగా శ్రీకృష్ణునికి) చెల్లెలు గాన. సుభద్ర ఇంద్రపుత్త్రుఁ డగునర్జునునికి మేనత్తవావి. న్యాయము = న్యాయ్యము. (అంతము=లాభము అనియు). నర్మిలి హత్తఁగన్ = అపేక్ష కూడునట్లు [అర్మిలి =

గీ. అని సరసలీల నుడుగర లంది, యపుడు
పారిజాతంబుకతన మురా బరిచయంబు
చాలఁ గల్గుటఁ బ్రియముతో సత్యభామ
తనకు మ్రొక్కిన, నింద్రాణి నెనరుతోడ, 126

ఉ. 'చెల్లెల, లెస్సలా? పెరటి చెట్టుగ నాటినపారిజాత ము
త్ఫుల్ల నవీన సూనములతో విలసిల్లుచు నున్నదా? సదా
యుల్లము దానిమీఁదటనె యుండును నా; కది ప్రాపుఁ బ్రోవుఁ బు
ట్టిల్లును జొచ్చినిల్లు నయి వృద్ధి యొసంగెడు నీకు నెంతయున్. 127

క. *అని యుచితోక్తుల వారల । మనముల రంజిల్లఁ జేసి మన్ననతో న
య్యనిమిషలోకాధీశ్వరు । ననుఁగుం బట్టంపు దేవి యరిగిన యంతన్,

సుభద్రార్జునుల పయనము.

గీ. 'ఏల యాలస్య మింక నింకుఁ? బ్రోలు సొచ్చి,
నాగవలి సేయుదురుగాక! వేగ గదలి
పొండు దంపతు,'లని ధను ష్కాండ రథ హ
యంబుల నొసంగి, నరుఁ బయనంబు సేసి, 129

ఉ. చంద్రకి పింఛ లాంఛనుఁడు చంద్రిక లీనెడు నవ్వుమోముతో
నింద్రజు రాక ధర్మజున కేర్పడఁగా శుభలేఖ వ్రాసి, వే

అపేక్ష యనియు.]

126. ఉడుగరలు = కట్నములు. ఇంద్రాణి = శచీదేవి. నెనరుతోడన్ = ప్రేమతో.

127. నీకు - ప్రాపున్ = ప్రాపకమును - ప్రోవున్ = రక్షకమును - పుట్టిల్లున్ = కన్నవారియిల్లును - చొచ్చినిల్లున్ = అత్తవారియిల్లును - అయి (అనఁగా అన్నిసౌఖ్యములను తానే యొసంగుచు).

129. కాండ = బాణ. ప్రోలు = మీపట్టణము.

180. చంద్రకి...డు = నెమలిపింఛము చిహ్నముగాఁగలకృష్ణుఁడు. చంద్రికలు = వెన్నెలలు. ఇంద్రజు = అర్జునుయొక్క. వే = శీఘ్రముగా. చంద్రిక = పత్త్రికమీఁద

* 'అని పలికి పోయినవెన్బెద । మని యందఱతోడఁ జెప్పి యంపించుక య'— అని పూర్వార్ధమునకు పా.

చెంద్రిక పెట్టి, యందుపయిం జెంద్రికవన్నియ సాలు సుట్టి, ని
స్తంద్రతఁ దానె ముద్ర యిడి, చారులచేఁ బనిచెన్ రయంబునన్. 130

క. ఈరీతి నన్ని యమరిచి, । యారాతిరె యేఁగి శౌరి యడఁకువ మండెన్
సీరికడ, దేవకియుఁ దన। గారాపుఁగుమారి నంపఁగా రమ్మనుడున్.

గీ. అత్తవారింట సకలభాగ్యంబు లున్న,
మగనిమీఁదటఁ దన కెంత మక్కు వున్న,
నాఁడుఁబుట్టువు పుట్టింటి కాసపడును,
గావున సుభద్ర యొకతీరుగాఁగ నుండె. 132

గీ. తల్లిదండ్రులు గారానఁ దన్నుఁ బెనుప,
వదినె లన్నలు గడు గౌరవంబు నెఱప,
నల్ల యూరంతబలగంబునందు నుండి,
యొకతె యెడఁబాసి పోవ నెట్లోర్చు మనసు! 133

క అట్టుల దొంగలి ఱెప్పలఁ
దొట్టెడుబాష్పములతోడఁ దొట్రిలు ముద్దుం
బట్టిఁ గని, కడుపు చుమ్మలు
చుట్టగఁ దది మట్టుపఱచి శుభ మొనరంగన్. 134

సీ. "వింతఁకే యేమి? మేనత్త గొంతిదేవి;
శౌరి వేడియుఁ బెండ్లాడినారు మీర
లొండొరుల; నీవిభుండు లోకోత్తరుండు;
దొరకెను సుభద్ర మంచికాఁపురము నీకు. 135

క. ఈలోనఁ జూడ వచ్చెద;। మేలే చింతిల్లె?" దనుచు నెంతయుఁ బ్రేమం
గేలం గ్రొమ్ముడి దువ్వుచు,। బాలం దీవించి తల్లి పనుపన్ వేగన్. 136

ఉందు దుద్దును. చెంద్రిక = చంద్రకావి. నిస్తంద్రతన్ = జాగ్రత్తగా.

134. దొంగలి=దట్టమయిన. తొట్టెడు = నిండుచున్న. చుమ్మలు చుట్టఁగన్= త్రిప్పు పడుచుండఁగా.

136. గ్రొమ్ముడి దువ్వుచున్ = సిగముడి నిమురుచు.

మ. సకియల్ గొందఱు వెంట వచ్చి మణిభూషల్ చక్కఁగాఁ దీర్చి చెం
ద్రికపూవన్నియ జిల్గుఁజేల కటి నెంతే గట్టిగాఁ జుట్టి, పెం
డ్లికుమారుండు కరాగ్ర మూఁత యొసఁగన్ వ్రీడావతిం దేరినాఁ
దికి నెక్కించిరి మందహాస కలనా దేదీప్యమానాస్యలై. 137

గీ. అటులఁ దేరెక్కు దంపతు లరుగఁ జూచి,
జనులు రతిమన్మథులు వీర లని తలఁచిరి;
హారితురంగము లించువి ల్లలరుతూపు,
లంద యుండఁగ సందియ మంద నేల? 138

యాదవ బలములు అర్జును నడ్డగించుట.

ఉ. పచ్చని పచ్చడంబు దొర పంపిన త్రోవనె పోవు నంతలో
నచ్చటఁ దెల్లవాఱ, 'నితఁ డర్జునుఁ, డీమె సుభద్ర, వీరిఁ బో
నిచ్చిన, మాట వచ్చు బలకృష్ణుల చేత;' నటంచుఁ దారు తా
రెచ్చరి కై పృథుశ్రవసుఁ డేలిక గాఁ గలప్రోలికాపరుల్, 139

క. అలబలను లసంఖ్యములై
అలబలములు సేయుచుండ; నప్పుడు గలఁకన్
కలకంఠీమణి రిపు మద
కల కంఠీరవుని ధవునిఁ గని వికసిత యై, 140

137. చెంద్రిక పూ=కుసుంబాపువ్వు. జిల్గు చేలన్=సన్న చీరను. వ్రీడావతిన్= సిగ్గరిని. మంద...లై=చిఱునవ్వుయొక్క కలిమిచేత వెలుఁగుచున్న మోములుకలవారై.

138. హారి తురంగములు=చిలుక గుఱ్ఱములు అని అర్థము - పచ్చవన్నె గుఱ్ఱము లని భా. ఇంచువిల్లు=చెఱకువిల్లని అర్థము-మనోహరమైన విల్లని భా. అలరుతూపుల= పువ్వుబాణము లని అర్థము-ఒప్పుచున్న బాణము లని భా. అంద=అతేరియందే. [అలరు తూపులు - పూవులుకు లను నర్థమున అలరుఁదూపు లనుట ప్రాయికము.]

139. పచ్చని పచ్చడంబు దొర=పీతాంబరధారి యగు కృష్ణుఁడు. తారు తారు ఎచ్చరిక ఐ = తామే కూడఁ బలికికొని. పృథు...రుల్ = పృథుశ్రవసుఁ డనువాఁడు నాయకుఁడు గాఁగల పురరక్షకులు,

140. అల బలములు=అ దండులు. అలబలములు = కలకలములు. కలఁకన్= మనోవైకల్యము చేత. కల...ణి = స్త్రీరత్నమైన సుభద్ర. రిపు...నిన్ = శత్రువు

(పంచచామరము.)

"హుటాహుటిన్ హలాయుధుం డహో మహోగ్రుఁడై తనం
తటన్ దటాన నిప్పు డీవిధం బెఱింగి వచ్చెనో!
ఘటాఘటీల నెల్లఁ గ్రోవఁ గట్టి పట్టఁ బంచెనో?
యటో యిటో యిటో భటోద్భటార్భటుల్ ఘటిల్లెడున్. 141

గీ. తేరు గడపంగ మాయన్న దిద్దె నన్ను,
నేయ నేరిపె వింట నొక్కింత నాకు;
నా పదినె సత్యభామ *మున్నరక యైన,
నిలిచి మున్ నరకాసురు గెలిచెఁ గాదె?" 142

క. అని రాజకన్య గాపున
మనమునఁ గలధీరతయును మరుతయుఁ దెలుపన్,
విని యట దరహాసంబున
నునుఁజెక్కిలి చికిలిగోట నొక్కుచు వేడ్కన్, 143

క. "నన్నెవ్వనిఁగాఁ జూచితి | కన్నియ! నీ చేయునంత కార్యం బిట నే
మున్నది? చూడుము చెండెద | ఛిన్నాభిన్నములు కాఁగఁ సేనల నైనన్,

లనెడి యేనుఁగులకు సింహ మయిన - భవునిన్ = భర్తను. వికసిత = వికాసము పొందిన (మోముగల)ది.

141. హుటాహుటిన్ = అతివేగముగా, తనంతటన్ = స్వయముగా. తటానన్ = తటాలునన్ = ఆకస్మికముగా. ఘటాఘటీలన్ = సమర్థులను. ఎల్లన్ = అందఱను [పా.—ఏవన్ = రోషముతో]. గ్రోవ...చెనో = మనముపోవుదారి నరికట్టి మనలను పట్టుకొనుటకై పంపించినాఁడో. అటో...టో = ఏతీరుననో కాని. భట ఉద్భట అర్భటుల్ = బంట్లయొక్క ఉత్కటమైన మ్రోఁతలు.

142. నన్నున్ = నాకు. అన్న = కృష్ణమూర్తి. తేరు గడపంగన్ = సారథ్యము చేయుటకు, దిద్దెన్ = నేర్పినాఁడు. ఏయన్ = బాణములు ప్రయోగించుటకు. మున్నరక ఐనన్ = కష్టసమయ మైనప్పుడు - పా. (౧) మున్నరకమైన్ = అధైర్యముతోనే (౨) - మున్నరక యగుచున్ - పెద్దపాలమును అరకలు పెక్కింతితో దున్నునప్పుడు బలిష్ఠములయిన యెద్దుల యరకనే ముందు నడుపుదురు, అట్టియా

క. నీవేడు కేల గా దన?గావలె? నటువలెనె తేరు గడపు." మటంచున్
జే విలునమ్ములఁ గైకొనె।నావిజయుఁడు సమరసన్నహనదోహలుఁడై. 145

ఉ. అంతటితోఁ బృథుశ్రవసుఁ డాదిగఁ గల్గినవీరయోధు ల,
త్యంతకఠోర తోమర శరాసన బాణ కృపాణ పాణులై
పంతము లాడుచుం బదరి పైఁ బడఁ జూచుబలంబు లెల్లఁ దా
మంతట నంతట న్నిలిపి, యడ్డముగం జని యాధనంజయున్. 146

ఉ. 'స్యందనమున్ దురంగములు శౌరివె పో; బలరాము చెప్పెలీ
యిందునిభాస్య; యీామె నెట కెత్తుక పోయెదు రాకుమార? యే
మందురు యాదవుల్ వినిన? వా! యిటువంటివె రాచవారితోఁ
బొందులు? గానకుండఁ గొనిపోఁ దగవా మిముబోటివారికిన్?' 147

క. అనుటయు, 'నేమిా కనినం
గన కుండిన? నానఁ బూనఁగలరా మీారల్?
మనవలసిన, నీమాటలఁ
బని లేదు; చనుం;' డటంచుఁ బైఁ బడి రాఁగన్, 148

యరకవలె ముందు కూనయుంట మున్నరక యగుట; కావున శ్రీకృష్ణులవారి పురోభాగ మున తాను కెలకొన్నదై యని యర్థము. నిలి-చి=జంకక, మున్=పూర్వము,—రెండు విధములను తోడ్పడెదను అని భా.

145. సమర...డై=యుద్ధ సన్నాహమందు ఉత్సాహముఁ గలవాఁడై.

146. పృథు...స=పృథుశ్రవసుఁడు మొదలుగా. వీరయోధులు=పరాక్రమవంతులగు సరదార్లు. తోమర...లు = బరిసెలు ధనుస్సులు అమ్ములు కత్తులును హస్తములందుఁ గలవి (బలంబులకు విశేషణము - నపుంసకలింగము). పదరి = త్వరపడి. పైఁ బడఁ జూచు=అర్జునుని మీఁదికి పడవచ్చుచున్న. బలంబు లెల్లన్ = సేనల నన్నిటిని. అడ్డముగన్ = అర్జునుని పోనీక అతని మార్గమున కడ్డముగా.

147. స్యందనమున్ = రథమును. స్యంద...భాస్య—నీచేతను కృష్ణుఁ డొప్పినను బలరాముఁడొప్పఁ డని భా. పొందులు = స్నేహములు. తగవా = న్యాయమా.

148. ఏమిా...మీారల్=మీారుచూచిన నేమి ప్రయోజనము చూడకుండిన నేమి హాని - మీా రేమైనను అడ్డుటకుఁ గాని పోరుటకుఁ గాని సమర్థులా [నేన్=నేను - మీాకున్=మీామీాఁదికి - అనిన్ = పోరిలో-అంగనకున్ = సుభద్రకై - ఉండినన్ =

యుద్ధము.

గీ. రాకు రాకు మనెడి రట్టడితనములు,
పోకు పోకు మనెడి పొగరువగలు,
పొడువు పొడువు మనెడి బెడిదంపుబీరముల్,
విడువు విడువు మనెడి వీఁక లెసఁగ. 149

మ. ముందర వెక్కు నీకరణి ముంచుకొనన్, జలియింప, కిం పొన
ర్పం దరళాక్షి దేరు గడపం, గడకంటను పాఱ జూచి, విం
టం దొడి యేయుటల్ బయ లొనర్పక, యెంతటినేరు పౌర! పౌ
రందరి యందఱిన్ శరపరంపర వెంపర లాడె. నయ్యెడన్, 150

సీ. కొండలవలెనున్న కొమ్ముఁగత్తుల భద్ర
దంతావళముల మొత్తములు బలసి,
యంబుధితెరలచందంబునఁ దుటుము లై
భాసిల్లు కంఖాణ బలము లొదవి,
విరివి యై మేఘముల్ వెరిఁగి వచ్చిన యోక
ఘనపతాకల శతాంగములు హత్తి,

ఉండఁగా - ఆమీరలు - నానఁ ఖానఁగలరు = అపజయమువలనిసిగ్గును చెందెదరు - అనియు.] మనవలసినన్ = బ్రతుకవలసిన పక్షమున. పైఁబడి = సేనమీఁదికి తేరునడపుకొని.

149. రట్టడితనములు = గడుసుఁదనములు. వగలు = చేష్టలు. బెడిదంపు బీరముల్ = కఠిన శౌర్యములు. విడువు = సుభద్రను వదలు. వీఁకలు = పరాక్రమములు.

150. ముంచుకొనన్ = దండు చుట్టుకొనఁగా. ఏపు ఎలర్పన్ = ఉత్సాహ మతిశయించునట్లుగా. తొడి ఏయుటల్ = బాణమును సంధించుటయుం విడుచుటయు. బయలు ఒనర్పక = ఏర్పడనీయక. పౌరందరి = ఇంద్రపుత్త్రుఁ డగు నర్జునుఁడు. శర పరంపరన్ = ఎడతెగని బాణములచే. వెంపరలాడెన్ = నొంచెను. ['అందఱన్' అను టకు మాఱుగా అనుప్రాసాభిరుచిచేత 'అందఱిన్' అని అగ్రాంథికవ్యవహారోచితముగా కవి ప్రయోగించినాఁడు.]

151. (౧) కొమ్ము కత్తుల = కొమ్ములకు కత్తులు గట్టిన. భద్ర దంతావళముల = భద్రజాతి గజవిశేషములయొక్క. బలసి = కమ్ముకొనియు. (౨) అంబుధి...౦బునన్ = సముద్ర తరంగముల వలె. తుటుములై = తండోపతండములై. కంఖాణ బలములు =

వెదురుపొదల్ పేర్చువిధమునఁ గనిపించు
గడలుపోఁజాలు సమగ్రముగఁ గూడి,
గీ. యుక్కుపొడి రాల రోషంబు పిక్కటిల్ల,
నొకరొకరి కేవవెట్టు నత్యుగ్రసింహ
రవములు సెలంగ, సైనికప్రభులు దార
సిలి రుదార శిలీముఖార్చులు నటింప. 151

ఉ. ఎత్తినయాయుధంబు లవి యెన్నియొ యన్నిఁటి నన్ని తూపులన్
దుత్తునియల్గఁ జేయు, మఱి తోడనె పూనఁగఁ జేతు లాడ నీఁ;
డత్తఱిని రథాశ్వముల యండకు రా విడఁ డంపతున్క యే
నత్తఱి నాతఁ; డే మనఁగ నా శరలాఘవసావధానతల్! 152

మ. 'రకపుం జెయ్వులఁ దా వినోదముగ సారథ్యంబుఁ గావించు క
న్యకపైఁ బెట్టినచూపె కాని, యిటు సేనం జూచుటా లేదు; సా
యకపంక్తుల్ నడుచున్ సహస్రములుగా! నయ్యారె! వివ్వచ్చుచే
తిఁ గన్నుల్ గల' వంచు నెంచి రపు డెంతే వీరయోధాగ్రణుల్. 153

గుఱ్ఱపుఁబౌఁజులు. ఒదవి=కలిగియుం. (3) జోకన్ = రీతిగా, ఘన... త్తి = గొప్ప జెండాలుగల తేరులు తాఁకియు. (४) వెదురు పొదల్ పేర్చు=వెదురు పొదలు పెరిఁగి వచ్చెడు. గడల = ఈఁటెల (వారి) యొక్క.

ఉక్కు=శౌర్యము - పొడి రాలన్ = అతిశయింపఁగా (ఆయుధముల యన్యోన్య సంఘట్టనచేత ఉక్కురేణువులు రాలు చుండఁగా - అని యొండె). ఒకరొకరికిన్ = అందఱకును. రవములు = నాదములు. ఉదార = పటువులయిన - శిలీముఖ=బాణముల యొక్క - అర్చులు = ధగధగలు. తారసిలిరి = నరునిమీఁదికి కలియఁబడిరి.

152. ఎత్తిన=తనమీఁదికి పగతు రెత్తిన. తుత్తునియల్ గన్=చిన్నచిన్న తునకలుగా. తోడనె పూనఁగన్ = వెంటనే వేఱాయుధములను ఎత్తుటకు. అండకున్ = సమీపమునకు. అంప=బాణం యొక్క. రా విడఁడు=రా నీఁడు. ఆ త్తఱిన్ = అసమయమందు. ఏమన... తల్ = బాణప్రయోగమందలి యా వేగమును ఆ నిబ్బరమును అనిర్వాచ్యములు.

153. రకపుం జెయ్వులన్=సారథ్యసంబంధమయిన నానా పౌఢక్రియలచేత. చూచుటా = చూచుటయన్ననో. సాయక = బాణ. వివ్వచ్చు = అర్జునునియొక్క.

ఉ. 'శూరకులంబు సర్వ మొక జోకగ వచ్చి యెదిర్చె నేని, నే
నీ రమణీశిరోమణి గ్రహింపక పో, నని, గట్టిగా నహం
కారము మీఱఁ గంకణము గట్టుక యుండెను నిప్డు దర్జునుం;
డౌర! రణంబు పెండ్లికొడు!' కంచు నుతించిరి వీరపుంగవుల్. 154

ఉ. అమ్మెయి వాజి వారణ భటావళిఁ గప్పినతూపు లేమనం!
దిమ్మలుగాఁ, దటాకముల నిండుశరమ్ములఁ, బుష్పవాటులం
గ్రమ్ము శిలీముఖమ్ముల, ధగద్ధగితోన్నత సౌధ గోపు రా
గ్రమ్ములయందు వ్రాలెడు ఖగమ్ముల, నెన్నిన నెన్న శక్యమే? 155

క. అలుఁగుల పోకడలును మై
యలయికలును మీఁదుమిక్కిలై కడు లోనై,
బలములుఁ దమతమ బాహా
బలములు నటఁ బనికి రాక భయవిహ్వలులై, 156

వి జ య ము.

గీ. ఒక్క మొగము గాఁగ నుఱికిరి సైనికుల్,
దిక్కు మొగము గాఁగఁ జిక్కు భటులు

154. శూర కులంబు=యాదవకులము (శూరుఁ డను నాతఁడు యాదవుల పూర్వులలోఁ బ్రసిద్ధుఁడు). జోక = మొత్తము. కంకణము కట్టుక = దీక్ష చేసి.

155. వాజి వారణ భట ఆవలిన్=గుఱ్ఱములయు ఏనుఁగులయు భటులయు సమూహమును. దిమ్మలుగాన్=(ఇన్ని బాణము అని కాకపోయినను)ఇన్ని రాసు లని యేని-ఎన్న శక్యమే అని యన్వయము. శరమ్ములన్ = నీళ్లను (నీటిబొట్టులను)-బాణములను అనియు. పుష్పవాటులన్=పూఁదోఁటలయందు. శిలీముఖమ్ములన్ = తుమ్మెదలను - బాణములను అనియు. సౌధ గోపుర అగ్రమ్ములయందున్=మేడలయొక్కయు గోపురములయొక్కయు పైభాగములయందు. ఖగమ్ములన్=పక్షులను - బాణములను అనియు.

156. అలయికలున్ = ఆయాసములును లోనై=లోఁబడినవారై (సైనికులకు విశేషణము. భయ విహ్వలులు = భీతిచే పరవశులైనవారు.

157. సైనికుల్=సేనానాయకులు. ఒక్క మొగముగాఁగన్=ఒకటే పూనికతో పా.......గాక - ఒక త్రోవగాక. దిక్కు మొగము గాఁగన్ = ఏదిక్కున కలనైన అదిక్కు త్రోవగా - (దీనికి - తెల్లఁబోయిన మొగములు గలవారలై - అని యర్థము చెప్పి

మ్రొక్కి రీటియులు దటుక్కునఁ బడ వైచి;
యక్కిరీటి యెదుట సాఁగఁ గలరె! 157

వ. (1) ఇత్తెఱంగున జయాంగనాసంగమంబునం బొసంగియుఁ జెక్కు చెమర్పక, యక్కురువీరుండు సారథ్యనిపుణత్వంబునకు మెచ్చి యచ్చిగురుబోఁడి నవారితప్రేమాతిశయంబునం గౌఁగిలించి, 'యొక్కించుక రేక మోవని నాయురస్థలంబున నీ కుచ కుంకుమరేఖ లంటించి మీవారికి సూడు దీర్చితి;' వని నవ్వుచు,

మార్గము.

వ. (2) నవ్వలం గొంతదవ్వరుగుచు, నటఁ బ్రచ్ఛన్నవేషంబునం దన రాక కెదురు సూచుచున్న విశారదప్రముఖాప్తపరివారంబుల గారవించి, మురారి ప్రేరిత దాశార్హ నివేదితార్హ మార్గంబున మహారణ్యంబులును గిరివరేణ్యంబులును నదీనదంబులును జనపదంబులుం గడచి, స్వదేశంబుఁ గాంచి, యుల్లాసంబున నందంద విశ్రమించుచుఁ జనంజనం, (3) జారులవలనం దెలిసి యగ్రజానుశాసనంబున నానాసేనాసమన్వితులై మాద్రీసుతు లెదుర్కొని యుపాయనానతులు సమర్పింప, నుపగూహన బహూకృతు లొసర్చి,

'చిక్కు'టకు విశేషణముగా నన్వయించుటయుం గలదు). చిక్కు = వెనుకఁబడినట్టి. మ్రొక్కిరి=ప్రణామపూర్వకముగా అర్జునుని శరణుఁజొచ్చిరి.

158. (1) జయ అంగనా సంగమంబునన్ = జయ స్త్రీ పొందుచేత. చెక్కు చెమర్పక = నిరాయాసముగా. ఒక్కించుక రేక మోవని = కొంచెమైనను ఆయుధపు గీటు వహింపని - ఉరః స్థలంబునన్ = నావక్షంబున - నీ...చి = నీకుచములయందలి కుంకుమరసంపు గీఱల నంటునట్లు చేసి (గాయములు కలిగినట్లు తోఁపఁజేసి అని భా.) సూడు = పగను. (2) ప్రచ్ఛన్న వేషంబులన్ = మాఱు వేషములతో. మురారి...నన్=కృష్ణునిచే పంపఁబడిన (యొక) యాదవునిచే చూపింపఁబడిన మంచి మార్గమున. నదీ = తూర్పుగా పాఱెడియేళ్లను - నదంబులున్ = పశ్చిమముగా బాఱునేళ్లను. జనపదంబులున్=గ్రామములను. (3) ఉపాయన ఆనతులు = కానుకలను నమస్కారములను. ఉపగూహన బహూకృతులు = ఆలింగనము లనెడి బహుమానములను.

## ఇంద్రప్రస్థపుర ప్రవేశము.

(4) దశ దిశా దుస్సహ నిస్సాణ ప్రముఖ నిస్వనంబులు బోరు కలంగ, నలంకృత నిస్తుల స్తంబేర మారూఢుం డై గగనోల్లేఖి తోరణ ధ్వజోల్లోచ ప్రాంచత్సిచయ ప్రచయ ప్రచలత్ ప్రచలాకి చిత్రచ్ఛవి వ్యాప్త హేమచ్ఛవి ఫలగుళుచ్ఛ విరాజద్రాజరంభా స్తంభ విజృంభిత ప్రతిమందిరంబును, (5) విలోకితృ బిబ్బోకవతీ వ్యాకోచ లోచన ప్రాచుర్య విభ్రాజమాన తనూభవోత్సవ దిదృక్షా గృహీతానేక విగ్రహ సహస్రాంబక విడంబి భర్మ్యహర్మ్య నికురుంబంబును, (6) నీరాజన లాజాక్షత కుసుమ నిచయ వ్యాకీర్ణ కలశ గ్రహమాళు

(4) నిస్సా...ములు = భేరి మొదలగువాని ధ్వనులు. నిస్తుల = సాటిలేని - స్తంబేరమ = ఏనుఁగును - ఆరూఢుండు = ఎక్కినవాఁడు. గగన = ఆకాశమును - ఉల్లేఖి = ఒరయుచున్న - తోరణ = ద్వారములందును - ధ్వజ = టెక్కెములందును - ఉల్లోచ = మేలుకట్టులయందును - ప్రాంచత్ = మిక్కిలియొప్పుచున్న - సిచయ ప్రచయ = వస్త్రముల సమూహములయొక్క - ప్రచలత్ = ఎగురుచున్న - ప్రచలాకి = నెమళ్ల (కాంతివంటి) - చిత్ర చ్ఛవి = పలువన్నెల కాంతిచే - వ్యాప్త = కప్పఁబడిన - అచ్ఛ = స్వచ్ఛమైనట్టి - హేమ చ్ఛవి = బంగారపు కాంతివంటి కాంతి గలిగినట్టి - ఫల గుళుచ్ఛ = పండ్ల గొలలతోఁ గూడుకొన్నవై - విరాజత్ = ప్రకాశించుచున్న - రాజ రంభా స్తంభ = కొమ్మ నరఁటి స్తంభములచేత - విజృంభిత = హావణింపఁబడినవైన - ప్రతి మందిరంబును = సకల గృహములు గలదియు. (5) విలోకితృ = చూచుచున్న - బిబ్బోకవతీ = విలాసవతులయొక్క - వ్యాకోచ = వికాసముగలిగిన - లోచన = నేత్రములయొక్క - ప్రాచుర్య = బాహుళ్యముచేత - విభ్రాజమాన = మిక్కిలి ప్రకాశించుచున్న - తనూభవ = కుమారుఁడైన యర్జునునియొక్క - ఉత్సవ = వైభవమును - దిదృక్షా = చూడఁగోరికచేత - గృహీత = స్వీకరింపఁబడిన - అనేకవిగ్రహ = బహుమూర్తులుగల - సహస్రాంబక = దేవేంద్రుని - విడంబి = అనుకరించుచున్నట్టి - భర్మ్య హర్మ్య = బంగారు మేడలయొక్క - నికురుంబంబును = సమూహము గలదియు - (అనఁగా - మేడలు తమయం దుండి చూచు స్త్రీలనేత్ర సముదాయముచే ఎట్లున్న దనఁగా, కుమారుని యుత్సవముఁ జూచుటకు ఒక శరీరమును వేయికన్నులును చాలక యనేక శరీరములు గల్పించుకొని వచ్చి పెక్కువేల కన్నులతో చూచుచున్న దేవేంద్రులో యనున ట్లుండె నని తా). (6) నీరాజన =

మహీలేఖ మహిళా భూయిష్ఠ ద్రాఘిష్ఠ వేదికాంతరంబును నగునింద్ర ప్రస్థపురంబును సకలజనరంజన కుశల విశాలకటాక్ష కృపాకరసా వేశంబునఁ బ్రవేశించి, (7) మున్ను సుభద్ర మహార్త్ణంబున సుభద్రా భద్రేభయానం జతురంతయానంబున శుద్ధాంతంబున కనిపి, ధౌమ్యాదుల కభివందనంబు గావించి, యాశీర్వాదంబులు గైకొని, నిజాగమనసంతోషరసోన్మేష భూషిత సుప్రసన్నాననబిసప్రసూనుం డును రత్నసింహాసనాసీనుండును నగుధర్మసూనునకు సాష్టాంగం బెరఁగి, భీమసేనునకు నమస్కరించి, యంతఃపురికిం జని కుంతీదేవికి వందనం బాచరించి, ద్రుపదనందన సుపచరించి, యిష్టాలాపంబుల సుఖం బుండె. 158

ద్వారకలో బలరామాదులు సభ చేయుట.

ఉ. అంతట ద్వారకాపురమునందు సభాపరిపాలుఁ డర్జునో
దంతము యాదవుల్ దెలియు నట్లు హజారమునందు భేరి య
త్యంత రుషా కషాయిత హృదంతరుఁడై చఱపించె; మించె ది
గ్దంతి ఘటా శ్రవఃపుట భిదాచణ భీషణ భూరి భాంకృతుల్. 159

హారతులు - లాజ = పేలాలు - అక్షత = అక్షతలు - కుసుమ = పుష్పములు - కిసలయ = (మామిడి) చిగుళ్లు - వీరిచేత - వ్యాకీర్ణ = వ్యాపింపఁబడిన - కలశ=పూర్ణ కుంభములను - గ్రహయాళు = చేతులలో పట్టుకొనియున్న - మహీలేఖ మహిళా = బ్రాహ్మణ స్త్రీలచేత - భూయిష్ఠ = క్రిక్కిఱిసిన - ద్రాఘిష్ఠ వేదికా అంతరంబును = అతివిశాలములయిన యరఁగులరొక్క మధ్యభాగములు గలదియు (7) సుభద్ర=శుభ ప్రదమైన. సుభద్రా భద్ర ఇభయానక = భద్రగజము నడకవంటి నడకగలదైన సుభ ద్రను. చతురంత యానంబునక = అందలములో, శుద్ధాంతంబునకు = రాణివా సములోనికి. ధౌమ్య ఆదులకుక = ధౌమ్యాచార్యులు మొదలగువారలకు. ఉన్మేష = పొంగుచేత-సుప్రసన్న=మిక్కిలి యనుగ్రహము గలిగినట్టి-ఆనన బిసప్రసూనుండును= కమలమువంటి ముఖముగలవాఁడును. ఎరఁగి = మ్రొక్కి.

159. ఉదంతము = వృత్తాంతమును. హజారమునందుక = మొగసాలయందు. రుషా కషాయిత హృత్ అంతరుఁడు = రోషముచేత కలఁతపెట్టఁబడిన మనః ప్రదేశము

క. ఆనాదము విని హలి మొద
లైనయదూద్వహులు పురికి నరుదెంచి, సభా
సీను లయి, నరుని కపట వి
ధానము మఱి మఱియు నడిగి, తప్తాశయులై, 160

గీ. "యతి ననుచు వేషభాషల నటమటించి,
పొంచి తఱివేచి కన్నియఁ గొంచు నరిగె,
దొరఁకుసన్యాసి యనుమాట తిరము గాఁగ
నర్జునుం డద్దిరా! యెంత దుర్జనుండు! 161

శా. ఏతన్మాత్రమె కార్యభార్య మని పైయెత్తెన్నకే నేఁడు ని
ర్భీతిన్ బాలికఁ గొంచుఁ బోవ నుచితంబే? కండగర్వంబు! దు
ర్నీతుల్ యాదవవీరసింహములతో నేనా? బలారా! బలా
రాతి ప్రోద్భవుఁ డెంత సేసె! నిది తీరా వీరరాణ్మౌళికిన్? 162

ఉ. వంచనసేసి యిట్లు చెలువం గొనిపోవఁ, బ్రలంబవైరి సై
రించునె? దుర్మదాధిప వరేణ్యులభూములు దున్ని ధూళి గా
వించఁడె? పిండిపిండిగఁ బ్రవీర విరోధి కిరీటరత్నముల్
దంచఁడె? ఘోర సీర ముసలంబుల వ్యర్థములే ధరించుటల్?" 163

గలవాఁడు. చఱపించెన్=వాయింపించెను. దిగ్దంతి...ఘటా=దిగ్గజముల సమూహము యొక్క - శ్రవఃపుట=కర్ణపుటములను - భిదా చణ=భేదించుటకు పేరొందిన - భీషణ=భయంకరమైనట్టి - భూరి=అధికమైనట్టి - భాంకృతుల్=భాంకారధ్వనులు.

160. యదు ఉద్వహులు=యాదవ శ్రేష్ఠులు. తప్త ఆశయులు=ఆగ్రహించిన హృదయముగలవారు.

161. వేషభాషలన్=వేషముచేతను మాటలచేతను. అటమటించి=భ్రమింపఁజేసి. దొరఁకు సన్యాసి=దొరకినదానిని దొంగిలించుకొని పోవుటకై సన్యాసివలె నటించువాఁడు (దొంగ యనుట). అద్దిరా=ఆశ్చర్యము. తిరము=నిశ్చయము.

162. ఏతన్మాత్రమె=ఈ పాటియే. పైయెత్తు ఎన్నకే=పై చెయ్వు ఆలోచింపకయే. బలారా=బలా రే. బల అరాతి ప్రోద్భవుఁడు=ఇంద్రజుఁడు (అర్జునుఁడు). వీర రాట్ మౌళికిన్=మహా వీరశ్రేష్ఠునికి.

163. ఘోర సీర ముసలంబులు=భయంకరమయిన నాఁగలియు రోఁకలియును.

క. అని కాళిందీ భేదనుఁ। డనువాక్య మొకింత విన్న యంతనె, మేఘ
ధ్వనిఁ గెరలెడు మదకేసరు।లన, యోధాగ్రేసరులు మహా మత్సరులై,

ఉ. 'యాదవవార్ధి వెల్లివిరియన్ మఱి యాఁగెడు పాటివీరుఁ డి
మ్మేదిని నెవ్వఁ? డిందులకు మీరలు గావలె! నేమె చాలమే?
పోదుమె? కట్టి తెత్తుమె? ఋభు ప్రభు నందనుఁ డెంత? వాని తం
డ్రే దురమం దెదిర్చినను, రేకు మడంతుము మాట లేటికిన్!' 165

గీ. అని, యుదగ్ర హాలగ్ర హాభ్యగ్రుఁ డైన
యన్న మాటలు సభవార లన్న మాట
లేమి చెవి గామియును, దాల్మి యోమి, భక్త
జన కుశల కామి యలయదుస్వామి కనియె. 166

క. "యదురాజ కుల శిరోమణి,
యెదురా మీ కొకరుఁ? డుచిత మెఱిఁగియుఁ బరు లెం
చ దురాపకోప మూనుట
చదురా! తెగరానిచోట సైరణ తగదే? 167

[కావించఁడె - దంచఁడె - పత్వము కావలయును.]

164. కాళిందీభేదనుఁడు = బలరాముఁడు. మేఘధ్వనిన్ = ఉఱుముచేత. కెరలెడు = ఉద్రేకించునట్టి. మద కేసరులు = మదించిన సింహములు.

165. యాదవ వార్ధి వెల్లివిరియన్ = యాదవ బలమను సముద్రము పఱద పెట్టినప్పుడు. మేదినిన్ = భూమిలో. నేమె = మేమే. ఋభు...నఁడు = ఇంద్రపుత్త్రుఁడు. తండ్రే - (తుసంధి). దురమందున్ = యుద్ధములో. రేకు మడంతుము = శరీర మంతయు గుడ్డను మడఁచినట్లు మడఁచి వైతుము.

166. ఉదగ్ర = తీక్ష్ణమైన - హాల = నాఁగటియొక్క - గ్రహ = గ్రహణమందు - అభ్యగ్రుఁడు = జాగ్రత్తగలవాఁడైన. దాల్మి ఓమి = సహనము వహించి. భక్త జన కుశల కామి = భక్తులకు క్షేమమునే కోరుచుండు శ్రీకృష్ణుఁడు. యదుస్వామికిన్ = యాదవ ప్రభువగు బలరామునితో.

167. యదు...మణి = సంబోధన. ఉచితము = యుక్తమును. పరు లెంచన్ = అన్యులు నిందించునట్లుగా. దురా...రా = వహింపఁదగని కోపమును వహించుట చాతుర్యమా. తెగ...దే = తెంపుచేయుటకు వలను లేనిచోట సహనము మంచిది గాదా,

క. ద్రోణాచార్యుల శిష్యుఁడు। బాణాసన నిపుణుఁ డరినృపాలక మకుటీ
శాణాగ్ర తేజితోగ్రకృపాణాంచద్భుజుఁ డతండు ప్రభుమాత్రుండే! 168

ఉ. ఆపురమర్దనుం డయిన నాతని నడ్డము దాఁకి నిల్వఁగా
నోపఁడు; మత్స్యయంత్రము మహోద్ధతి నేసి స్వయంవరంబునన్
ద్రౌపదిఁ గైకొనన్ జెనకు రాజకుమారుల పాటెఱుంగమే?
మూఁపులు మూఁ డగున్ రిపుచమూపులఁ గన్నపు డక్కిరీటికిన్. 169

ఉ. మాలిమి లేదు గాన, ననుమానము నామదిఁ దోఁచె, నప్పుడే
బాలిక సేవ సేయఁ బనుపన్ వల దంటిసి గాదె! దాని కే
మీలువు గల్గు మేనమఱఁ దింతయు యాతఁడు; నైన దైనదే;
లోలత నింత నాగవలిలోపల నిమ్మర మేల పల్కఁగన్. 170

ఉ. క్రీడి సమాను లెంచఁ గలరే యిల ఱేఁడులలోనఁ? దూలఁబో
నాడఁడు వైరి నైన; విడనాడఁడు నెయ్యము కోపగించియుం;
జూడఁగలట్టివాఁడు; సరసుండు; సుభద్రకు హర్షవార్ధి నో
లాడఁగ నింతకంటె నను వైనవరుం డిఁక నెవ్వఁ డివ్వలన్? 171

ఉ. నమ్మినవారు పాండునృప నందను, లందఱిలోనఁ బెద్దఁగా
మిమ్మె గణించు ధర్మజుఁడు, మీ రటుకున్ విజయంబు సేయ వే

168. బాణ = అమ్ములయొక్క - అసన = ప్రయోగమందు - నిపుణుఁడు. అరి నృపాలక = శత్రు రాజులయొక్క - మకుటీ శాణ = కిరీటము లనెడు సానలయొక్క - అగ్ర = చివరలచేత - తేజిత = పదనుపెట్టఁబడిన - ఉగ్ర = భయంకరమైన - కృపాణ = కత్తి చేత - అంచత్ = ఒప్పుచున్న - భుజుఁడు = భుజముగలవాఁడు.

169. ఆ పుర మర్దనుండు = త్రిపుర సంహారకుఁడైన యా రుద్రుఁడు. కైకొనన్ = పరిగ్రహింపఁగా. చెనకు = అతనిని తాఁకినట్టి. రిపు చమూపులన్ = శత్రుసేనా నాయకులను. మూఁపులు మూఁడగున్ = భుజములు రెంటికి మూఁడయినట్లు ఉబ్బును-శత్రువుల సంహరించుటకు మహోత్సాహము పెరుఁగు ననుట.

170. మాలిమి = పరిచయము. ఈలువు = అభిమానము. లోలతన్ = చాపల్యము చేత. నాగ...రము-పెండ్లియంతయుం స్నేహమర్యాదలతో నెఱవేఱినపిమ్మట నాగవలిలో జగడము గల్గినచో వైమనస్యమాత్రమే గాని పెండ్లికి భంగము లేదు.

గ న్మెదు రేఁగుదెంచి కడుఁ గన్నులఁ గప్పుకొనుం, బదుం" డనం;
దమ్మునిమాట యన్న జవదాఁటనియన్న ససంభ్రమంబుగన్, 172

బలరామాదులు ఇంద్రప్రస్థమునకు అరుగుట.

మ. గజ కంఖాణ శతాంగ పత్తి బలవర్గంబు ల్సమగ్రంబు లై
భజియింపం, బితృపుత్రపౌత్ర సుహృదాప్తశ్రేణి గూడం, బ్రియా
నుజుఁడుం దాను సమస్త వస్తు ధన సందోహంబుతో వచ్చె స
ర్వజనానందకరంబుగాఁగ నటు లింద్రప్రస్థముం జేరఁగాన్. 173

ఉ. అంతకుమున్నె, కృష్ణుఁడు హలాయుధుఁ దోడ్కొని వచ్చుచున్న వృ
త్తాంత మెఱింగి, తీవి మెఱయున్ నగరిం గయిసేయఁ బంచి, య
త్యంతవినీతి ధర్మజుఁడు దమ్ములఁ దా నెదు రేఁగి, రేవతీ
కాంతునకుం బ్రణామములఁ గాన్కలుఁ జేసి యథాక్రమంబునన్;

మ. చెలువం దెచ్చుచు నుండి యీసున శునాసీరాత్మజుం డమ్మహా
బలనుం జేరఁగఁ బోరు మేదురదురాపక్రోధముం బాసి లో
నలరం, గౌఁగిటఁ జేర్చె, శంభుజ భుజాహంకార రేఖా నిర
ర్గళమార్గప్రబలున్ బ్రలంబహు బహూకారంబుగాఁ బల్కుచున్,

ఉ. భావ యటంచు వావి నడుపన్; భయభక్తుల మ్రొక్కవచ్చు న
ద్దేవకిపట్టి ధర్మజుఁ డతిత్వరితంబుగ గ్రుచ్చి యెత్తి, త

172. అన్నన్ = అనినయెడల. జవ దాఁటని యన్న = ఇంచుకయేనియు నతిక్రమింపని జ్యేష్ఠభ్రాత.

173. శతాంగ = తేరులయుం - పత్తి = కాలురులయుం. సుహృత్ = మిత్ర.

175. ఈసునన్ = కోపముచే. మేదుర = దట్టమయిన. లోన్ అలరన్ = మనస్సులో సంతోషించునట్లుగా. పోరు = పోరిన హేతువుచేతఁ గలిగినట్టి. శంభుజ = కుమారస్వామియొక్క - భుజ అహంకారరేఖా = బాహు పరాక్రమ విలాసమందలి - నిరర్గళ = నిరాతంకమైన - మార్గ = వైఖరిచేత - ప్రబలున్ = మిక్కిలి అధికుఁడైనట్టి - ప్రలంబహున్ = ప్రలంబాసుర హంత యగు బలరాముని, బహూకారంబుగాన్ = బహుమానపూర్వకముగా. కౌఁగిటఁ జేర్చెన్ = ధర్మరాజు ఆలింగనము చేసికొనెను.

176. దేవకి పట్టిన్ = శ్రీ కృష్ణుని. తద్భావము = ఆ కృష్ణ భావన. తార్చిన

ద్భావ మెదం గుదుర్పడఁగఁ దార్చినభంగిఁ గవుంగిలించి, 'మా
కీవ గదయ్య సర్వశుభ హేతువు నిచ్చలు' నంచు నెంచుచున్, 176

గీ. కెడల బలరామకృష్ణులు నడుమఁ దాను,
భద్రదంతావళము నెక్కి పాండవేయ
ముఖ్యుఁ డతిరాజసంబున మువ్వేలుంగు
పోలిక, బోసంగ వచ్చెను బ్రోలి కపుడు. 177

ఉ. అంతిపురంబులో నరిగి, యన్నకు వందన మాచరించు నా
కుంతికి మ్రొక్కి, భక్తిఁ దమకుం బ్రణమిల్లిన ద్రౌపదీసతిన్
స్వాంతము రంజిలం బలికి శ్యామ హరిత్ పరిధాను లొప్పి రం
తంతకు నిష్టబాంధవ సమాగమ సౌఖ్యమునన్ జెలంగుచున్. 178

క. ద్వార వెట్టిన హారు వెట్టిదా!
యరు దాహో! విడుదు లున్న హావణిక లులుపా
పరిధవము! నింద్రభోగమె
ద్వారకెం దమ కననివారు తుది లే రొకరున్. 179

క. వీయమువారికి నిట్లు ద
వీయముగా నుండి వచ్చు విపులశ్రమముల్
దీయ, ముదం బొనరిచి, కడుఁ
దీయము కనిపింపఁగా యుధిష్ఠిరుఁ డనియెన్. 180

భంగిన్ = చేర్చిన విధముగా. ఎంచుచున్ = పొగడుచు.

178. కెడలన్=పార్శ్వములందు. భద్ర దంతావళమున్=భద్రజాతి గజముపై- మువ్వేలుంగు=బ్రహ్మ విష్ణు మహేశ్వరులయొక్క - బ్రహ్మ పసుపువన్నెవాఁడు-విష్ణుఁడు నీలవర్ణమువాఁడు-శివుఁడు శ్వేతవర్ణమువాఁడు-తాను కృష్ణుఁడును బలరాముఁడును (వరుసగా) అట్టివారే. పోలికిన్ = నగరమునకు.

178. అన్నకున్=అన్నయైన వసుదేవునకు. స్వాంతము=హృదయము. శ్యామ హరిత్ పరిధానులు=నీల పీతాంబరులు - రామ కృష్ణ లనుట.

179. హారువు=కట్టడ. హావణికలు = సింగారములు. ఉలుపా పరిధవమున్ = కానికల విభవమును. అరుదు = అపూర్వము.

180. దవీయముగాన్=కడుదూరమునుండి. విపుల=మిక్కుటమైన. తీయన్ =

క. "చనవున బలిమిం గన్నియఁ
గొని వచ్చి వివాహ మాటకు స్వతంత్రులఁగా
నొనరించినార మము; ని
ట్లనుకూలత గల్గు బంధు లవనిం గలరే! 181

గీ. ఆదినారాయణుండ వీ మురాసురారి;
యురగకులభూషణుండ వీ; వరసి చూడ,
నిట్టి మీబాంధవము గల్గ నెట్టితపము
సేసినార మొకో మేము నీరపాణి" 182

ఇంద్రప్రస్థమున వైవాహికోత్సవము.

చ. అని ప్రియభాషణంబుల మనోబ్జము రంజిలఁజేయ; సంభ్రమం
బున హాలి 'సర్వసన్నహనముం దగ ని ట్లెదురేఁగి పెండ్లి సే
సిన దొర యెందు లేఁ' డనఁగఁ జెల్లెలి ముద్దుమఱందిఁ గోరికల్
పెనగొనఁ బెండ్లికూఁతుఁగను బెండ్లికుమారుఁగఁ జేసి వేడుకన్, 183

సీ. సకలవాద్యములు బోరు కలంగ నెడ మీఁక
నలుఁగులు నులుపాలు నడుచు చుండ,
నిఖిల బాంధవ రాజ నికరంబు మేలైన
యుడుగరల్ గొని వచ్చి పొడ గనంగ,
నాశ్రిత విద్వత్కవిశ్రేణులు యథేష్ట
సంభావనలఁ జాల సంభ్రమింప,

లీయునట్లుగా. లీయము = ప్రియము.

181. స్వ...మము౯ = స్వతంత్రులనుగా మమ్ము మీరే చేసినారు.

182. ఉరగ (=నాగ) కుల భూషణుండవు - శేషుఁడ వనుట.

183. మనః అబ్జము = హృదయ కమలము. చేయ౯ - కర్త యుధిష్ఠిరుఁడు. తగ౯ = ఒప్పిదముగా నుండఁగా. ఇట్లు = ఈ హాలివలె. ఎదురు ఏఁగి = తనయింటికి పెండ్లికుమారుఁడు వచ్చుటకు బదులుగా తానే అతనియింటికి పోయి. పెనగొన౯ = రెట్టించునట్లుగా.

184. బోరుకలంగ౯ = బోరున మ్రోయఁగా. నలుఁగులు౯ = నలుఁగుఁ బిండ్లును. ఉలుపాలు౯=భోజన వస్తువులును. ఉడుగరల్ = కట్నములను. పొడ గనం

విందులఁ గర్పూర వీటి కాంబర వసం
తముల నెల్లజనంబు తనివి నొందఁ,
గీ. ప్రియము వినయంబు దాల్మి యోపికయుఁ గల్గి,
'యచ్యుతాగ్రజ భీమసేనాగ్రజన్ము
లెంతటి మహాత్ము' లని జగం బెన్నఁ, జేసి
రుచితగతి నొప్ప వైవాహికోత్సవంబు. 184

ఉ. అంతట నైదునాళ్లకు మహామహిమం దగి, దంపతుల్ గృహా
భ్యంతర దేవ తార్య నతులై తన కర్మిలి మ్రొక్క, రుక్మిణీ
కాంతుఁడు వల్కె లేనగవు గ్రమ్మఁగ 'మీ రిటు లెల్ల కాలమున్
మింతురుగాక శోభనము మీఁదనె శోభనమై ముదంబుగన్.' 185

క. అని దీవించిన, లోలో
ననె ముసిముసి నవ్వు లొలయ నమ్రాననులై
తనరిరి వా రామాటకుఁ
బునరభివాదనము చేయు పోల్కి జనింపన్. 186

చ. తొలఁకెడు ప్రేమ బంధుగులతో మణిపాత్రికలందు నప్పు డు
జ్జ్వల దమృతాన్నముల్ కొలము సామికి నప్పనగాఁగఁ బండు వె
న్నెల బయలన్ భుజించి, నెఱి నీ కొసఁగన్ సగపాలు గంబురా
గులికిన కమ్మవీడె మొకకోయిలి యీఁ గొని, క్రీడి వేడుకన్; 187

గన్ = దర్శనము చేయఁగా. సంభావనలన్ = సత్కారములచేత. కర్పూ...లన్ = కర్పూర తాంబూలములచేతను వస్త్రములచేతను కుంకుమపూ వసంతములచేతను.

185. గృహా...నతులు = ఇంటిలోపల నున్న దేవతలకును పెద్దలకును నమస్కరించినవారు. శోభ...మై — పెండ్లి ద్వారకలో నొకసారియు ఇంద్రప్రస్థములో నొకసారియుం జరిగిన దని భావగర్భిత మయిన హెచ్చరిక.

186. నమ్ర ఆననులు = వాంచిన ముఖములుగలవారు. పునర్ అభివాదనము = వెండియు నమస్కారము.

187. ఉత్ జ్వలత్ = ప్రకాశమానమైన - అమృతాన్నముల్ = పరమాన్నము చిత్రాన్నము మొదలయిన యన్నవిశేషములు. కొలముసామికిన్ = చంద్రునికి. అప్పన =

ఉ. చందురుఱాతి బాగడపు జంటబవంతి వెడందయంకణం
పుం దగు లూని పార్శ్వములఁ బొల్పగు పల్వగకెంపుటంచుఁ డా
కుం దెలి గుండు కంబములఁ గ్రొంజిగిబోదెల నందగించి పై
సందుల బంచవర్ణమణి జాలకముల్ రహిఁ జూపఁ; లోపలన్, 183

ఉ. బంగరు మేలికంబములఁ బాటిలు వాటపు మధ్యరంగమున్
జెంగట జీవరత్నముల చెక్కడపుంబని మించు సెజ్జయిల్,
ముంగల వజ్రపుంబలుకలోప పొసంగిన నొప్పు చప్పర
మ్ముం, గల భావచిత్ర నవమోహన కేళిగృహాంతరంబునన్; 189

సమర్పణము. సగ...వీడెము=సగము పచ్చకర్పూరము పెట్టిన కమ్మఁదనముగల తాంబూలమును తాంబూలములో స్త్రీలు వేసికొను పచ్చకర్పూరములో సగమే పురుషులు వేసికొందురు. *

188. చందురు ఱాతి బాగడపు = చంద్రకాంత మణుల కట్టడముగల - జంట బవంతి = బవంతిచుట్టును కట్టిన పైబవంతియొక్క - వెడంద యంకణంపుందగులు = విశాలమైన ముంగిలియొక్క సంబంధమును. ఊని=పొంది, పార్శ్వములన్ = ప్రక్కల యందు, పొల్పగు=చక్కనైన-పల్వగ...బవుల=అనేకవిధములైన కెంపులతోఁ జేసిన బవరిటాకులు గలిగిన తెల్లని గుండ్రని స్తంభములయొదలి-క్రొంజిగి బోదెలన్=నూతన కాంతులుగల బోదెలచేత, అందగించి=సొగసుఁగలదై, పై సందులన్=మీఁది సందుల యందు, పంచ...ముల్ = తెలుపు నలుపు ఎఱుపు పసుపు ఆకుపసరు వన్నెయుఁ గల రత్నముల (తోఁ చేయఁబడిన) కిటికీలు, రహిన్ చూపన్=అందముఁ గనఁబఱచుచుండఁగా, లోపలన్ = ఆలోఁగిటిలోపల.

189. కంబములన్ = స్తంభములతో. పాటిలు=ఒప్పుకొన్న-వాటపు=ఇమ్ముయిన-మధ్యరంగము = లోఁగిలినడుమ చౌకముగా కట్టిన గృహవిశేషము. జీవరత్నముల = సర్పములు బ్రదికియున్నప్పుడే వానిఫణాగ్రములనుండి తెచ్చిన రత్నములయొక్క. సెజ్జయిల్=పడుకటిల్లును. ముంగలన్=దానిముందఱ. వజ్ర...ప్పు=వజ్రమణుల పలకలచేతఁ దీర్చిన చూఱుకట్టెచేత నొప్పుచున్న - చప్పరమ్మున్ = పువ్వుల పందిరియు, భావ...నన్=శృంగారభావముగల చిత్తరువులచేత నూతనమైన మోహాకరమైన క్రీడా గృహంబు లోపల.

* మృగమద సౌరభ విభవ । ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీ గంధ
స్థగి తేతర పరిమళ మై।ముగుచపొలుపు దెలుపు నొక్కమాయిత మొలసెన్. మను.

చ. కెలఁకుల వజ్రముల్, నడుమఁ గెంపులు, మూలల ముత్తెముల్, పర
స్థలములఁ బచ్చలుం, బుష్యపుజాతి తగన్, బని హార్ద్వ నందమున్
వెలయఁగ, దేఱి చూడఁ గడు వింతయి కోటికిఁ గోటి యైనను
విలువ యొనర్పరాని యొక నిద్దపు మంచముపై వసింపఁగన్; 190

ఉ. గోవజవాది కస్తురియుఁ, గుంకుమ, గందము, పైఁడిగిన్నెలన్
దావి బుగుల్కొనం గెలనఁ దార్చిరి పంజరకీరశారికల్
'దేవ, పరాకు సామి' యని తెల్పఁగ రత్నపుఁ గీలుబొమ్మలే
కావలెఁ గొంక ఱొందు నుడిగంపు టొయారపు ముద్దుజవ్వనుల్. 191

క. అందలి క్రొందలిరుంబోఁ। డ్లందలి కందళిత శుకముఖాలాపరసం
బందలి నుందలిమంబులు। నందలి పొందళ్ళఁది తెరలు నవలం గలవే!

ఉ. చక్కఁదనంబు లెల్ల నొకచక్కనె దొంతరగాఁగ నిల్చెనో,
యొక్కడఁ జూడఁ జూడ్కి కదియే విడిపట్టగుఁ; జూడఁ జూడఁగా
మిక్కిలి వింత యై మెఱయు; మెచ్చులకున్ నెల వీ దొకింత! య
మ్మక్క! గణింపఁగాఁ దరమె యా పడుకింటి విలాససంపదల్! 193

గీ. ఉండె నరపతి యందు మే నుబ్బుచుండ,
సఖిలసామ్రాజ్య మేలిన యంతవేడ్క;
రమ్య మగునిల్లు మే లైన రాజముఖియుఁ
గలిగె నఁట, యంతకన్న భాగ్యంబు గలదె? 194

190. కెలఁకులన్ = పార్శ్వములందు. పర = ఇతర. పుష్యపుజాతి = లేఁగపొళా. పనిహార్ద్వన్ = పనివానితనమును. చెక్కు = చెక్కఁబడఁగా. కోటికిన్ = కో డొకటికి. కోటి = కోటివరహాలు. నిద్దపు = నునుపుగల.

191. గోవ జవాది = గోవాసీమ జవాదియు. బుగుల్కొనన్ = గుప్పుమనఁగా. కావలెన్ = కాఁపోలు ననిపించునట్టి, ఉడి...నుల్ = చేటికలు, తార్చిరి = కదియించిరి.

192. కందళిత = అంకురించిన. ఆలాప = పలుకులయొక్క. నుం దళిమంబులున్ = సన్నని పానుపులును. పొందు అళ్ఁది = పొందికగల పసుపుపచ్చరంగుగల.

193. చక్కనె = స్థలమందే. చూడ్కికిన్ = దృష్టికి - విడిపట్టు = నివాసస్థానము (దృష్టి అక్కడనే నిలిచిపోవు ననుట). నిలువు = అవకాశము.

194. రాజ ముఖ = చంద్ర వదన.

క. అంతటఁ బ్రౌఢసఖీతతి
కాంతామణిఁ గాంతుకడకుఁ గదియించుటకై
వింతగ మోమునఁ జిఱునగ
వింత గనంబడఁగ ముదిత హృదయాంబుజ లై, 195

సీ. "జడకుచ్చు వైగ సేయు, ముడుపు చేడియ విరుల్,
వేనలి వట్టిన వీడకుండఁ;
జేర్పుక్క సతి యింద, తీర్పుము తిలకంబు,
గస్తూరి చెమటచేఁ గరఁగకుండఁ;
గౌను జంటఱవిక, కుంకుమగంధ మలఁదు, మో
చెలి యెంత యొరసినఁ జిటులకుండ;
మొలనూ లిదిగో బోటి చలువ పొందుగఁ గట్టు,
పయ్యాటలనె నీవి సడలకుండ;
గీ. తరుణి కివి యిచ్చుఁ గద మెచ్చుఁ డప్పు," డనుచు,
నేరుపరు లైనవారిఁ గానేరుపఱుపఁ,
గాంత నవసంగ మార్హశృంగార విభవ
లీల నలరించి రాజవరాలి నపుడు. 196

క. "తడ వేటికి? లే జవ్వని,
విడె మీవలెఁ బతికి; మంచి వేళ సుమీ యి
ప్పుడు; రా, కన్నియ వల్లభు
కడఁ బెనఁగుదు గాక పెనఁగఁగా నిటఁ దగునే? 197

సీ. ప్రియముతో రమ్మని పిలిచినఁ, జేరఁ బో
యెదవు గా దూర కుండెదవు సుమ్ము;

195. తతి = సమూహము. చిఱునగవు + ఇంత.

196. (౧) చేర్చుక్క=పాపటబొట్టు. (తీర్చుము—తీర్పుము అనవలయును). (౩) జంట ఱవికెన్ = జమిలికుట్టు ఱవికను. చిటులకుండన్ = తేఁగి పోకుండునట్లు. (౪) పయ్యాటలనె = చెరలాటలయందే. నీవి = కోఁకముడి.—ఇందలి సంబోధనలు ప్రసాధికలం గూర్చి. నవ సంగమ అర్హ = తొలి కూటమికి తగిన.

చెంతఁ గూర్చుండఁగఁ జేఁ జూపఁ గూరుచుం
    డెదవుగా కూరకుండెదవు సుమ్ము;
విడెము చేతి కొసంగ వినయంబుతోడ నం
    దెదవుగా కూర కుండెదవు సుమ్ము;
మధురోక్తి వినఁగోరి మాటాడ, మాఱు ప
    ల్కెదవుగా కూర కుండెదవు సుమ్ము;
గీ. కాక విభుఁడైనఁ గొంత సిగ్గరితనంబు
    గడలుకొని యున్నఁ గ్రక్కునఁ గడకు రాక,
చక్కఁగ నొకింత సేపటు సమ్ముఖమున
    నిలువుమీ రత్నపాంచాలి చెలువు మీఱి. 198

క. అనవలసి యుంటి! యింతే;
నినుఁ జూచిన నింద్రతనయునికి నింద్రతనూ
జునిఁ జూచిన నీకును మఱి
మన సూరక యున్నె పూర్ణిమా చంద్రముఖీ? 199

సీ. చిలుక నీచేఁ గాక చెలిచేత నుండదే,
    నిమిరి యిప్పుడె మాట నేర్పవలెనె?
యెదుట గొసెన వేయ కిడినారు, దెమ్మని
    వీణ యిప్పుడె మేళవింపవలెనె?
పటము గానుక దెచ్చి పట్టిన, నిప్పుడే
    చిత్తర్వునకు హార్ద్య చెప్పవలెనె?
మంచిమాటలు తోఁచె నంచును బలకలో
    నిప్పుడె కవిత వ్రాయింపవలెనె?
గీ. గంట సెప్పినవారిఁ గ్రేఁగంటఁ గనెదు,
    లెండు పోద మటన్న నటుండు మనెదు,

198. కడలుకొని = అతిశయించి. కడకు = ఇవలికి. రత్నపాంచాలి = రత్నాలు దాపిన (బంగారు) బొమ్మయొక్క.

200. నిమిరి=దువ్వి. గొసెన=పిఱు. కంచియే - దూరమా అనుటకు వాడుక మాట.

వడిగ రావమ్మ, కంచియే పడుకటిల్లు?
కన్నియలఁ గంటి; మీటు లెందుఁ గాన మమ్మ. 200

ఉ. ఎక్కడ నైన వేడుక మెయిన్ శుభవేళలఁ బాసు పెక్కుచో
నొక్కుసుమంత సిగ్గు నడుచుండెడు లేజవరాండ్రు లేరొ? యో
యక్క! యి దేమి? యింత గలదా! మఱి రే పిటువంటివారె పో
దక్కఁ బెనంగు వారలు సదా మగనిన్ బిగి కౌఁగిలింతలన్. 201

క. ఏకతమునఁ జెప్పుదుమో?
కాకందఱు వినెడు నట్లుగాఁ జెప్పుదుమో?
మా కొక్కటి దోఁచినయది,
నీ కెక్కడఁ గోప మగునొ నీరేజముఖీ? 202

ఉ. కేవలభక్తితోఁ బటఁ గేళిసనంబున నీప్రసారెకున్
సేవ లొనర్పుచోఁ గలిగనే కత, యేకత నిండు వచ్చుచోఁ
ద్రోవల నిల్తు రేకత; వధూవరు లిద్దఱు నొక్కటైనచో
సేవగఁ బాయునో మనసు? లెవ్వ రెఱుంగుదురమ్మ జవ్వనీ? 203

ఉ. వేగిరకాఁడు మన్మథుఁడు వెన్కను ముందును జూడఁ, డంతకున్
వేగిరకాఁడు నీవిభుఁడు, వీరిఁ గటాక్షములందె యేలఁ జాల్
వేగిరకత్తె నీ వుచితలీలఁ దలంతువొ వేళఁ గొంతువో?
యీ గరుగంపు సిగ్గు లవు డెక్కడ నుండు సరోజలోచనా? 204

201. దక్కన్ = తమకు వశ మగునట్లు.

202. ఏకతన్ = ఒంటిపాటుచేత, కలిగనే=కలిగినది గదా - కత=మీ యిరువురకును ప్రణయ వృత్తాంతము. నిల్తురు ఏకతన్=ఒంటిగా అనఁగా మీరిద్దఱుమాత్రము బసలు చేయుచుంటిరి.

203. వీరిన్=మదనుని నీమగనిని. కటాక్షములందె=క్రేఁగంటిచూపులచేతనే. చాల్ = చాలునట్టి. ఉచిత లీలన్ = తగిన కృత్యమును (మరుకేళి నసుట). ఉచిత... గొంతువో=లీలనే తలంతువు గాని వేళను తలంపవు-అనఁగా ఎంతవేళ అయినదో తెలియక క్రీడించుచునే యుందువు - అని ప్రశ్నవాక్యాభిప్రాయము. అవుడు=మగనితో నేక మూడినప్పుడు. సరోజలోచనా = కమలాక్షీ.

204. అంగకములు ఉన్న తెఱంగున్=కనికరింపఁదగిన వైవమీయవయవములు

ఉ. కన్నెఱ చేసి చూచిన, మొగ మ్మటు ద్రిప్పినఁ, జే విదిర్చినన్,
గన్నుబొమల్ ముడించినను, గాదన! మందుల కేమి? మున్ను మీ
రున్న తెఱంగు నంగకము లున్న తెఱంగుఁ దలంచి చూచినన్,
గన్నియ మోము సమ్మికలు గావు సుమీ పదిలంతు లేనియున్. 205

గీ. అరయఁ గాకుండె, మంచిదే యందు కేమి;
కొంతసే పిటు నవ్వితి మింతె మేము;
చాలు, నిఁక నైనఁ జా గేల? సరసములనె
ప్రొద్దు పోయెడుఁ బద వమ్మ ముద్దుగుమ్మ." 206

చ. అని, కయిదండ యొక్క మృదుహల్లకపాణి యొసంగ, నొక్క మో
హన నవమౌక్తికోపమ నఖాంకుర పాపటఁ జక్కఁ దువ్వ, శో
భన శకునమ్ము లొక్క కలభాషిణి మున్ దగఁ దెల్ప, మంద గా
మిని యను పెల్ల నప్పు డినుమిక్కిలిగాఁ దనయందు నిల్వఁగన్, 207

ఉ. తాలిమిఁ గ్రుంగఁ ద్రొక్కి, మదిఁ దత్తఱముం దమియున్ భయంబు పే
రాశముగాఁగ, మైఁ జెమట గ్రమ్మఁగఁ, గొంకుచు మెల్ల మెల్లనే
బాలిక యేగుదెంచె విభుపాలికిఁ, బ్రాణసఖుల్ దెమల్పఁగా,
యేలికమ్రోలకున్ మనవి కేఁగెడు నయ్యభిమాని పోలికన్. 208

ఉ. చంచలనేత్ర రాఁ గలుగు సంభ్రమ మే మనవచ్చు? వాసనల్
ముంచుకొనెన్ సమస్తగృహముల్; మిఱుమిట్టులు గొంచు నల్గడల్

పాలి కృశించి యున్న విధమును.

206. హల్లకపాణి = ఎఱ్ఱగలువవంటి హస్తముగల యొక చెలికత్తె. కయిదండ = చేయూఁత. మోహన...ర = మోహాకరమైనట్టియు క్రొత్త ముత్తియములతో సమానమైన మొలకలవంటి గోళ్లుగలది. కల భాషిణి = మధురముగా పలుకునట్టిది. మున్ = ఎదుట - తగన్ = ఒప్పునట్లుగా. హల్లకపాణి - మోహా...ర - కలభాషిణి - మందగామిని—సాభిప్రాయములు.

208. తనూ రుచులు=దేహ కాంతులు. ఇంచుక రాక తొలుతనే = వచ్చియుం రాక మునుపే.

209. మఱుఁగన్ = అగపడకుండుటకు. జాడన్ = విధమును. పలుకులు =

ముంచుకొనెన్ దమూరుచుములు; ముంగిటి కించుక రాక తొల్తనే
ముంచుకొనెన్ నృపాలునకు మోహపుఁ గోర్కులు నెమ్మనమ్మునన్.

గీ. మఱుఁగుఁగోరెడి కన్నియ తెఱఁగుఁ జూచి,
చూడఁ గోరెడి యువరాజు జాడఁ జూచి,
వలఁతు లైనట్టి యాకూర్మి పొలఁతు లపుడు
కూర్చి సమకూర్చి యిరువురఁగూర్చి యనిరి. 210

గీ. "తేర దా నెట్లు గడపెనో తెలియరాదు,
తేర గదలించినట్లు దోతేరవలసెఁ;
గన్నె యిందాఁక నే మెఱుఁగదు సుమయ్య,
తేరుగడ కాఁగ మెల్లన దిద్దుకొనుము. 211

క. పాటలబింబాధర కసి
గాటుల కోప దని పలువగలఁ దెలుపంగా
నేటికి నెఱింగి నడుపుము
మీటిన విచ్చుచనుదోయి మీచేతి దిశన్. 212

గీ. మీర లెఱుఁగంగవలయు శృంగార మెల్ల
యువతితిలకంబుకంటె నో నవమనోజ;
విభుఁడు మది మెచ్చి కర్పూరవీటి యొసఁగ,
ముద్దుమొగ మెత్తరాదె యో మోహనాంగి. 213

ప్రౌఢలు.

210. తోతేర వలసెన్=త్రోసికొని రావలసి వచ్చినది. తేరుగడ కాఁగన్= చక్కఁబడునట్లుగా.

212. పాటల బింబాధర=ఎఱుపు తెలుపు గలసిన వర్ణముగల దొండపండువంటి యధరముగల సుభద్ర. కసి గాటులకున్=కసి కొలఁది గంటుసేయుటకు (అధరమందు దంతక్షతములు సేయుటకు). ఓపదు = తాళదు. పలు వగలన్ = అనేక విధములుగా (దంతముల విధములను అనియుం).

213. వలరాజు కొలువుచవంతటి=మన్మథునకు భృత్యుఁడై కొలువు చేయునట్టి - అతనికన్న సుందరుఁ డైనయుపట-(వియోగమును వలరాజు పంచినయ ఇప్పుడు సంయోగ

క. వలరాజు కొల్చునంతట
చెలువుఁడు నిను గూడఁ గలఁడు, చెప్పెడి దేమీ?
కలఁ డిక నీపాలింటన్
తెలియా, యలచందమామ తేటే యెపుడున్. 214

క. రా వక్క, వక్కలాకులు
గోవక్క, శుభోత్తరముగ గొబ్బున విభుచే
నీ వక్క, నేన నేయుదుఁ,
నీ వక్కఱ గలిగె రమణునిఁ జిత్తముఁ గాఁగన్. 215

గీ. అనుచుఁ గప్పురబాగాలు నాకుమడుపు
లచ్చకోరాక్షి చేతి కందిచ్చి, మిగుల
నంతికమున నేర్చి 'చేపట్టు మయ్య కోర్కు
లాదరంగాఁ జేయ సామి యువతిశయము" 216

క. అని కన్నియ హస్తాబ్జము
దన శ్రీహస్తమునఁ జేర్పఁ దాత్పర్యమునన్

మందు అనుకూలుఁడై సేవించు ననియు భా.) కలఁ...తేటే=మన్మథుఁడు వశుఁ డయి నాఁడు గాన అతనికి చెలికాఁడును మామయు నగు చంద్రుఁడును నీకు అనుకూలుఁ డగును.- నీకుచమునందు చంద్రరేఖలవంటి నఖక్షతములు ఇఁకనుకలుగును లే అని మర్మము.(రలలకు అభేదముగాన 'అల' యనుపదమును నఖక్షతార్థమున 'అర'గా గ్రహింపవలయును.)

215. రావక్క = రావమ్మా. కోవక్క = కొనవమ్మా. శుభో...క్క=శుభాభివృద్ధియగునట్లు శీఘ్రముగా భర్తచేతికి ఈవమ్మా.

216. కప్పురబాగాలన్ = కర్పూరము గలసిన వక్కలును. ఆకుమడుపులు= తమలపాకుల చుట్టలును. అంతికము = సమీపము. సామి = నాయేలినవాఁడా. యువతిశయమునన్ = ఈ చిన్నదానిచేతిని. కోర్కు...యన్=కోరికలు చేకూడునట్లు చేయుటకై. చేపట్టుమయ్య=చేతను పట్టుకోవయ్యా. [అందిచ్చు శబ్దపల్లవము-క్త్వార్థే కౌరసంధి గాదు; పట్టుమయ్య - అయ్యపదమును అను ప్రయుక్తముగా భావింపనందున పట్టవయ్య అని వ్యతిరేకరూపముం బ్రయోగింపలేదు.]

217. తాత్పర్యమునన్ = అక్కఱతో.

గొని యామాటల చతురత
మనమున మెచ్చుకొనుచు నసియించి వేమారుల్. 217

చ. 'కలయఁగ మంచిబగ్గు మిది గట్టిగ నే గడె లెస్స యయ్యె నో
తెలిసెద'నంచు నొర్తుఁ, 'జనుఁ జేర వదే?' యని యొర్తు, 'నెచ్చెలిన్
బిలిచెద' నంచు నొర్తు, నొకపేరిడి వా రటు లేఁగి రందఱ న
చ్చెలియల వెంటనే సఖులు సిగ్గరిగెన్ దరుణీలలామకున్. 218

ఉ. పంచశిలీముఖంబులును బచ్చనివిల్లును బూని యెక్కు సం
ధించుచు, 'నిర్వరం బెనఁచి నెమ్మిఁ గరంచు కడంక చూడుమీ,'
యంచు, గవాక్షసీమ నపుడా యొలతెమ్మెరఁ గూడి, వేడుకన్
బొంచులు సూడఁగాఁ దొడఁగెఁ బో మకరాంకుఁడు గానకుండఁగన్.

గీ. పతియు సతికేలు పట్టినపట్టు విడక,
పెదమఱల వామకరమునఁ బిఱుఁదుఁ జుట్టి,
పట్టి, రా నీడ్చి కూర్చుండఁ బెట్టె నపుడు,
తొడ తొడయుఁ దాఁకఁ దమి సిగ్గుఁ గడకు నూక. 220

సీ. నెఱికొప్పు కొనగోర నిమిరినయంతనే
తళుకు లే ముద్దుఁ జెక్కిలి చెమర్చెఁ;
దళుకు లే ముద్దుఁ జెక్కిలి నొక్కినంతనే
వలి గుబ్బ చనుఁగవ పులకరించెఁ;
వలి గుబ్బ చనుఁగవ నలమినయంతనే
నతనాభి నీవిబంధంబు ప్రిదిలెఁ;

218. అది = అపోయినచెలి. ఒక పేరు ఇడి = ఒకొక్కనెపము పెట్టి. తరుణీలలామకున్ = యువతీ తిలకమునకు.

219. ఎక్కు సంధించుచున్ = నారి యెక్కు పెట్టుచు. పెనఁచి=పెనఁబెట్టి. నెమ్మిన్ = ప్రేమచే. కరంచు = కరఁగఁజేయునట్టి. కడంకన్ = నా ప్రయత్నమును. కానకుండఁగన్ = తా నదృశ్యుఁడై (అనంగుఁడు గాన నదృశ్యుఁ డనియు పొంచు చూచువారు స్వయము కనఁబడరు గావున అట్లే చేసినాఁ డనియు భా.)

220. తమిన్ సిగ్గుఁ గడకు నూకన్ = అత్యంగసంగము చేత వలపు హెచ్చినదనియు సిగ్గు తొలఁగిన దనియు భా.

నతనాభి నీవిబంధము సంతసంతనే
తను వెల్లఁ బరవశత్వము వహించెఁ;
గీ. నవలఁ జెప్పెడి దేమి? యాం సవరసీకుఁడు,
తావి చెంగావి చక్కెర మోవి గ్రోలి,
కుసుమశరు కేళి నే మేమి గుఱుతు లిడెనొ,
బాల యెఱుఁగదు సౌఖ్యాబ్ధిఁ దేలి యపుడు. 221

క. గాఢాలింగన విముఖము,
రూఢాంగ స్వేదభరము, రుంద్ర వ్రీడా
గూఢాపాంగము, నగుచు, న
వోఢా సంగమము వేడ్క కొసఁగెం బతికిన్. 222

సీ. వీఁడు కొప్పున సాము విరిదండ వెలిఁ గ్రమ్మఁ,
గమ్మ కస్తురి బొట్టు చెమ్మగిల్లఁ,
దనువున మేల్పూఁత తావిమాత్రమె చిక్కఁ,
జిక్కచన్గవ సరుల్ చిక్కువడఁగ,
నొసలిపై ముంగురుల్ ముసరి ముద్దు నటింపఁ,
జూ పంతకంతకు సొలపు సూపఁ,
జిన్నారి చెక్కులు చెమటఁ జిత్తడి నొంద,
నందంద యూర్పులు సందడింప,
గీ. నపుడు సమ్మతి పతి వేఁడ, ననఁగి పెనఁగి,
లోను గాకుండియు, మృగీ విలోలనయన

222. గాఢా...ము = బిగువైన కౌఁగిలింత కభిముఖము గానట్టిదియు, రూఢ...ము=వహింపఁబడిన యవయవములందలి చెమటపెంపు గలిగినట్టిదియు, రుంద్ర...ము = దట్టమైన లజ్జచేత ఆక్రమింపఁబడిన క్రేఁగంటి చూపు గలిగినట్టిదియు,...నవ ఊఢా=నూతన వధువుయొక్క.

223. వీఁగు = విరియుచున్న. సాము = సగము. చిక్క=చిక్కని. సొలపు= అలసతను. చిన్నారి = ముద్దుల. చిత్తడిక = ముక్కలి తడి. సందడింపఁగ = అతి

యతని నానందవార్ధి నోలార్చె నార!
కలయికలఁ గల్గుహారువుల కలిమివలన 223

గీ. నొక్కి పలుమొనఁ బలుమొన నొక్క నేర్చె,
నంటి గోరులచేఁ గళ లంట నేర్చె,
జొక్కి బిగికౌఁగిలింతలఁ జొక్క నేర్చె,
జెలువుఁడు నవోఢఁ బ్రౌఢఁగాఁ జేయ నపుడు. 224

సీ. జిలిబిలి వలి సాలి మొలక తెమ్మెరలు గ
మ్మని మేనితావుల ననుసరింప,
నలరుఁదేనియ లాని యలరు తుమ్మెద దిమ్ము
జంటచూపుల వెనువెంటఁ దిరుగఁ,
జిగురాకుమేఁతలఁ బొగ రొందు కోయిలల్
పాటల నీటు వెంబడి మెలంగఁ,
గుల్కుఁబల్కుల ముద్దు గుల్కుచిల్కలు నేర్పు
పలుకుల బెళఁగుల పజ్జ నిలువ,

గీ. సతియుఁ బతియును సారాము తతుల నతుల
రతులఁ బెనఁగిరి చతురత లతిశయిల్లఁ
దొలుతఁ దము నేఁచువారలే కొలిచియుండు
వేడ్క కన్నను మఱివేఱె వేడ్కగలదె? 225

క. నెల మసలె నంతఁ గాంతకు,
నెలకొనె వేవిళ్లు పెల్లు, నిద్దపు మేనన్

కలయికఁగా. లోను గాకుండిరియుం = అంగీకరింపకయే.

225. (౧) జిలిబిలి...లు = చంచలించు చల్లని మెల్లని లేఁత వాయువులు. (౨) అలరు = పూ. ఆనన్ = గ్రోలినంతట. అలరు = ఒప్పారెడు. దిమ్ము = సమూహము. (౩) నీటువెంబడిన్ = సౌష్ఠవము ననుసరించి. (౪) కుల్కుఁ బల్కులన్ = మనోహరమైన మాటలచేత. నేర్పు...పజ్జన్ = తమకు నేర్పఁబడు మాటల చమత్కారముచేతను. తతులన్ = సమూహములయందు. ఏఁచు వారలె = ఆ తెమ్మెరలు లో నగు నవియే.

226. నెల మసలెన్ = ఋతుచిహ్నము తప్పి గర్భ మాయెను. వేవిళ్లు పెల్లు నెం

దలతల మని మెయిపూఁతలఁ
దళతళ దళుకొత్తెఁ గ్రొత్త ధవళిమ దోఁచెన్. 226

సీ. కలదో లేదో యను కౌను గానఁగ దయ్యెఁ,
దెప్పల వలపత గప్పుకొనియెఁ,
గలుకుఁ జన్గుబ్బలు వలఁదలై మెఱుఁ గెక్కె,
నూఁగారు పైఁ గప్పు నూలుకొనియెఁ,
జెక్కుటద్దంబుల నిక్కు నెఁ దెలినిగ్గు,
బడలిక నడుపులఁ గడలుకొనియెఁ,
జిట్టాడు చెమటల చిత్తడి మెయి నిండె,
పాలిక మూర్పులు సందడించె,

గీ. నరుచి గన్పించె, నొక చెల్వ మంకురించెఁ,
దరులు సమమయ్యెఁ జిట్టుముల్ దఱచు మీఱె,
మొలచెఁ గోర్కులు, నెమ్మేన నిలిచె నలఁత,
నెలఁత కేర్పడఁ దొలుచూలు నిలుచునపుడు. 227

అభిమన్యుని జననము.

మ. కలుముల్ గన్నులఁ జిల్కు కల్కి మురునిం గన్నట్టి చందాన, నా
కలశాంభోనిధి వీచి కల్పతరువుం గన్నట్టియందంబునన్,
గలకంఠీ కులరత్న మంత శుభలగ్నంబందు నింపొందఁగాఁ
గులదీపం బగునట్టి పట్టిఁ గనె దిక్కుల్ తెల్విఁ బెంపెక్కఁగన్. 228

కొంచెన్=ఓకిలింత లధికముగా కనిపించెను. నిద్దపు మేనన్=నునుపుగలిగిన శరీరమందు. మెయి పూఁతలన్=చందన చర్చలను. తల తల మని=తలఁగుము తలఁగుము అని (తలుముచు), తళ తళ తళుకు ఒత్తన్=ధాళధళ్యము ప్రకాశించునట్లుగా. క్రొత్త ధవళిమ=నూతన ధావళ్యము - గర్భపాండిమ. తోఁచెన్ = కనఁబడెను.

227. వలఁదలై = పెద్దలై. కప్పు = నలుపు. నూలుకొనియెన్ = కుదురుకొనియెను. చిట్టాడు=వ్యాపించునట్టి. అరుచి=నోటి కేదియు చవిగాకుండుట. తరులు=వళులు. చిట్టుముల్ = ఓకిలింతలు.

228. కలు...ల్కి = సంపదలను కటాక్షములచే వెదజల్లు సుందరి (మహాలక్ష్మి యనుట). కలశా...ధి = పాల కడలి యల. తెల్విన్ = ప్రసన్నచేత.

క. ఋభు విభు సుతునకుఁ దనయుఁడు
ప్రభవించిన సమయమున శుభాలునఁ గురిసెన్
నభమున సుమనో వర్షము,
శుభశుభ నినదములఁ గ్రందుకొనె దుందుభులున్. 229

గీ. అపుడు పార్థుఁడు శుభలేఖ ననుప, ననుప
మానవిభవుండు శౌరి సమాన మాన
వాధినాథులు గొలువఁగా నరుగుదెంచె
నెలమితోడుతఁ బాండవు లెదురుకొనఁగ. 230

క. హలి సాత్యకితోడఁ గుతూ
హలి యై తన సరస రాఁగ, నంగనయును దా
నల బలరిపు సుతు నగరికి
నలబలము చెలంగ నరిగె హరి గదు వేడ్కన్. 231

క. మన్యు వివర్జితుఁ డల శత
మన్యు తనూభవుఁడు లోక మాన్య విపశ్చి
న్మాన్యుల యనుమతి సుతు నభి
మన్యుం డని పేరు వెట్టె మది నంద మొందఁగన్. 232

క. చెల్లెలికిని మఱఁదికి మే
నల్లునకు ననర్ఘ్య మణిమ యాభరణంబుల్

229. ఋభు విభు సుతునకున్ = దేవేంద్ర తనయుఁడైన యర్జునునికి. ప్రభవించిన = పుట్టిన. శుభాలునన్ = తటాలున. నభమునన్ = ఆకాశమునుండి. సుమనో వర్షము=పూవులవాన. శుభ...లున్=దేవ దుందుభులు శుభాలు శుభాలుమని మ్రోసెను.

230. పార్థుఁడు=అర్జునుఁడు. అనుపమాన విభవుండు = సాటిలేని యైశ్వర్యము గలవాఁడు. ఎలమితోడుతన్ = వికాసముతో.

231, తన సరసన్ = తన ప్రక్కను. అలబలము = సందడి.

232. మన్యువివర్జితుఁడు=దైన్య రహితుఁడైన-అల...డు = ఇంద్ర పుత్త్రుఁ డగు నాయర్జునుఁడు. మాన్య=పూజ్యులయిన-విపశ్చిత్ మాన్యుల=విద్వద్వరేణ్యుల యొక్క.

వల్లభయుఁ దాను యదుకుల
వల్లభుఁ డపు డొసఁగె బంధువర్గము మెచ్చన్. 233

గీ. కువలయాక్షులు పెనుచు మక్కువలవలన
నేఁటఁ బెరిఁగెడివాఁ డొక్కఁపూఁటఁ బెరిఁగి,
మెల్ల మెల్లన శైశవ మెల్లఁజాఱి,
నందె యౌవన మారాజ నందనుండు. 234

సీ. మనుమార్గమున భూమి మను మార్గ మంతయు
స్థిరబుద్ధి యగు యుధిష్ఠిరుఁడు దెలుపఁ
బాటవన ద్వైరి పాటన క్రమ మెల్ల
దరవర్జితుఁడు వృకోదరుఁడు దెలుప,
రంగ దుత్తుంగ తురంగాధిరోహ ము
ద్దండబాహుండు నకులుండు దెలుప,
సురభి రక్షణఁ గీర్తి సురభిళ దిక్కుండ
లుం డగుతదనుజన్ముండు దెలుప,
గీ. వివిధకోదండపాండిత్య విలసనంబు
దానె తెలుపంగ, నేర్చిన తనయుఁ డెపుడు
సేవఁ జేయఁగ, సంతత శ్రీ వెలుంగ,
విజయుఁ డలరారె శాశ్వత విజయుఁ డగుచు. 235

---

233. అనర్ఘ = వెలలేని. వల్లభయున్ = భార్యయు (రుక్మిణియు).

235. (౧) మనుమార్గమునన్ = మనువు ప్రవర్తించినరీతిని. మను=జీవించెడు. (౨) పాటవ...మున్=సామర్థ్యముగల శత్రువుల భేదించు విధానము. దరవర్జితుఁడు= భయ రహితుఁడైన. వృకోదరుఁడు=భీముఁడు. (3) రంగ...ము=ఒప్పుచున్న యున్నతమైన గుఱ్ఱపుసవారుచేయుటను. (౪) సురభిరక్షణన్ = గోరక్షణ విద్యను. కీర్తి...డు=ప్రఖ్యాతిచేత పరిమళించుచున్న దిక్కుల సమూహముగలవాఁడు. తదనుజన్ముండు= నకులునితమ్ముఁడైన సహదేవుఁడు.

దానె = అర్జునుఁడే. శాశ్వత విజయుండు = స్థిరమయిన గెలుపు గలవాఁడు.

## ప్రబంధాంతము.

క. శ్రీ రాజిలు రఘునాథో
ర్వీరమణుని పేర వెలయు విజయవిలాసం
బారోగ్య భాగ్య సంప
త్సారస్వత జయము లొసఁగుఁ జదివిన వినినన్. 236

ఉ. క్ష్వేళగళ శైణలాంఛన విజిత్వర శుభ్ర యశో విశాల, ధా
రాళ గళ న్మద ద్విరద రాజి విరాజి సభాంగణా, ఘనా
వేల గరిష్ఠ దానపదవీ పరితోషిత కాళి గౌతమీ
చోళ కవి ద్విజస్తుతవచోలగ, చోలగ మానభంజనా. 237

(భుజంగ ప్రయాతము.)

అరాతి క్షమాభృ ద్భి దాంచ త్కృపాణా
నరాధీశ్వరా కార నాళీకబాణా

237. క్ష్వేళ గళ=విషము కంఠమందుఁగల శివుని-ఏణ లాంఛన=లేడి చిహ్నము గాఁగల చంద్రుని-విజిత్వర=జయించు శీలముగలదైన-శుభ్ర యశో విశాల = స్వచ్ఛమైన కీర్తిచే విరివిగలవాఁడా, ధారాళ గళత్ = తెంపులేకుండ స్రవించుచున్న - మద = దాన ధారకలదైన - ద్విరద=ఏనుఁగులయొక్క - రాజి=వరుసచేత - విరాజి = ప్రకాశించుచున్న - సభా అంగణా = ఆస్థాన మండపముయొక్క ముంగిలి గలవాఁడా, ఘన = మేఘముయొక్క - అవేల = హద్దులేనట్టియు - గరిష్ఠ = శ్రేష్ఠమైనట్టియు- దాన...త=త్యాగ సరణి చేత మిక్కిలిసంతోషపెట్టఁబడిన - కాళి=మంతెన కాళేశ్వర ముతోఁగూడిన - గౌతమీ = గోదావరీతీరము దున్నట్టియు - చోళ=చోళదేశము దున్నట్టియు - కవి ద్విజ = కవీశ్వరులయొక్కయు బ్రాహ్మణులయొక్కయు - స్తుతి వచో లగ = స్తోత్రవాక్యములను పొందినవాఁడా, చోల గ=చోళదేశమును పొందిన రాజుయొక్క - మాన = అభిమానమును - భంజనా = పోఁగొట్టినవాఁడా.

238. అరాతి క్షమా భృత్ భిదా అంచత్ కృపాణా = శత్రు రాజులయొక్క భేదనమందు ప్రకాశించుచున్న ఖడ్గము గలవాఁడా. నరా...ణా = రాజరూపమును వహించిన మన్మథుఁడా. క్షిరా = భూమియందలి - నంద...ణా=ఇంద్రుఁడా. (శేక -

స్థిరానందనా రామసేవాధురీణా
విరాజ చతుష్షష్టి విద్యా ప్రవీణా. 238

గ ద్య ము.

ఇది శ్రీ సూర్య...తృతీయాశ్వాసము.



స్థిరా నందనా = భూమిని ఆనందింపఁజేయువాఁడా - రామ సేవా ధురీణా = రామోపాసనయందు ప్రముఖుఁడ వైనవాఁడా). విరా...ణా = ప్రకాశమానము లయిన యఱువదినాలుగు కళలయందు నేర్పరియైనవాఁడా.

విజయవిలాసము సమాప్తము.



చెన్నపురి : చంద్రికాప్రెస్సున ముద్రితము.—26-1-1948.
Q. H. M. S. 114 B.—1000 Copies.

# వేదము వేంకటరాయశాస్త్రి అండు బ్రదర్సు,

4, మల్లికేశ్వరగుడిసందు, లింగిసెట్టివీథి, జి. టి. మదరాసు.

---

## సంస్కృత గ్రంథములు. (ఆంధ్రలిపి.)

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| మేఘసందేశము, మల్లినాథవ్యాఖ్య - తెనుఁగున ప్రతిపద టీకా తాత్పర్య పదప్రయోజనచర్చ - ఆక్షేపసమాధానములు. సంస్కృత మారంభించువారు ఈ తెనుఁగు సంపూర్ణటీక చేత దీనిని చదివి సులువుగా రసముగ్రహించి సాహిత్యము పొందవచ్చును. (కాలికో) | 2 | 8 |
| రఘువంశము, మల్లినాథవ్యాఖ్య-తెనుఁగు ప్రతిపదటీకాతాత్పర్యములు. ఎల్లవారును స్వయముగా పఠించి సంస్కృతమందు సాహిత్యమలవరుచుకొనుటకు ఉత్తమసాధనము. | 3 | 0 |
| కుమారసంభవము, పైదానివలెనే టీక | 3 | 0 |
| అమరుకావ్యము, శృంగారలక్ష్యము, వేమభూపాల సంస్కృత వ్యాఖ్య సంపూర్ణాంధ్రటీకయు | 1 | 8 |
| పుష్పబాణవిలాసము, సంస్కృతవ్యాఖ్య, తెనుఁగు పూర్ణటీక | 0 | 12 |
| భర్తృహరి శతకత్రయము, త్వరలో వెలువడును. | | |
| హితోపదేశము, మూలము మాత్రము | 1 | 0 |
| పంచతంత్రము ,, | 1 | 8 |
| దశకుమారచరిత్రము ,, | 1 | 0 |
| విక్రమార్కచరిత్రము, వరరుచికృతము, తెనుఁగు టిప్పణము, సులువైనశైలి, సంస్కృతమారంభించువారు చదువవచ్చును | (అచ్చు) | |
| భోజచరిత్రము, సులవైనశైలి, పైదానివలెనే టీక | ,, | |
| బిల్హణచరిత్రము, తెనుఁగు పూర్ణటీక, ఈసరసప్రబంధము విభక్తిజ్ఞానమున్నవారికెల్ల నర్థమగును. | ,, | |
| రసమంజరి, భానుసూరికృతి, తెనుఁగు పూర్ణటీక, శృంగారరస స్వరూపవిస్తరము | 1 | 8 |

ప్రతి 1-కి రూ॥ అ.

| | | |
|---|---|---|
| ప్రియదర్శికానాటిక, శ్రీహర్షకృతి, సంస్కృతటిప్పణము, గద్య పద్యములుగా ఆంధ్రీకరణము సయితము | 1 | 8 |
| శబ్దమంజరి సమాసకుసుమావళీ లిజంతమంజరులు, తెనుఁగున వివరణము సయితము | 0 | 8 |

---

# ఆంధ్ర గ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆముక్తమాల్యద, సంజీవనీవ్యాఖ్య | 12 | 0 |
| శృంగారనైషధము, సర్వంకషావ్యాఖ్య | (అచ్చగుచున్నది) | |
| విజయవిలాసము, టీకాసహితము | 3 | 0 |
| సారంగధర చరిత్రము ,, అచ్చగుచున్నది. | 2 | 8 |
| మడికిసింగన జ్ఞానవాసిష్ఠరామాయణము | 1 | 8 |
| ఆంధ్రబిల్హణీయము, నిర్దోషము, మూలముమాత్రము | 0 | 8 |
| పారిజాతాపహరణము ,, | 0 | 8 |
| సారంగధర చరిత్ర, ద్విపద. కవి విశ్వకర్మ మతస్థుఁడు | 0 | 8 |
| హరిశ్చంద్రద్విపద, గౌరనమంత్రిప్రణీతము | 1 | 0 |
| ప్రతాపరుద్రీయనాటకము, సటిప్పణము | 2 | 0 |
| బొబ్బిలియుద్ధనాటకము | 1 | 4 |
| ఉషానాటకము | 1 | 4 |
| శాకుంతలనాటకము, కాళిదాసీయమునకు తెనుగు | 1 | 0 |
| విక్రమోర్వశీయము ,, | 2 | 0 |
| మాళవికాగ్నిమిత్రనాటకము ,, | 0 | 12 |
| నాగానంద నాటకము | 1 | 0 |
| రత్నావళీనాటిక | 1 | 4 |
| ప్రియదర్శికానాటిక | 0 | 8 |
| ఉత్తరరామచరిత్ర నాటకము, విపులమగు పీఠికతో | 1 | 8 |
| హితోపదేశకథలు, నీతిబోధకములు | 0 | 8 |

భోజ కాళిదాస కథలు, రసభరితములు వెలువడనున్నవి.

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| వేతాళుని యద్భుతకథలు, ప్రజ్ఞ కలిగించునవి | 0 | 12 |
| విక్రమార్కుని యద్భుతకథలు, గుణము కలిగించునవి | 0 | 12 |
| కథాసరిత్సాగరము, అద్భుత నీతి వ్యవహార కథలు 6 భాగ॥ | 12 | 0 |
| దశకుమారచరిత్రము, అత్యద్భుత ప్రజ్ఞాప్రయోగముల కథలు | 1 | 0 |

---

# లక్షణగ్రంథములు.

| | | |
|---|---|---|
| ఆంధ్రసాహిత్యదర్పణము, విశ్వనాథకవిరాజకృత సంస్కృత గ్రంథమునకు సరియైన యాంధ్రానువాదము, మూలము నందలి ఉదాహరణ శ్లోకములతో చేర్చి ముద్రించితిమి. ఇందు నాటకలక్షణము సంపూర్ణముగా కలదు. | 5 | 0 |
| కావ్యాలంకారచూడామణి, వెనుకటివలెగాక ఇందు తొమ్మిది ఉల్లసములును పూర్తిగా ముద్రించినారము. | 1 | 4 |
| అలంకారసారసంగ్రహము, చంద్రాలోకాద్యనేక గ్రంథముల సారాంశము. ఉన్నతపాఠశాలావిద్యార్థుల కుపయోగకరము. టీకావివరణములు గలవు. | 0 | 12 |
| ఛందస్సు, విద్యార్థుల కుపయోగము, సంగ్రహము | 0 | 4 |
| కుమారదేవపండితీయము, ప్రౌఢవ్యాకరణమునకు శ్రీతాళ్లూరి అర్చుగముపిళ్లెగారు రచించిన వ్యాఖ్య | 2 | 8 |
| శ్రీ టి. ఎమ్. శేషగిరిశాస్త్రులవారి ఆంధ్రశబ్దతత్త్వము 2 భాగ॥ | 4 | 0 |
| ,, అర్ధానుస్వార తత్త్వము | 1 | 0 |
| పద్యకథాలహరి Comprehension Test | 0 | 12 |

శారదాకాంచికలు—విమర్శలు—ఉపన్యాసములు జక్కన విక్రమార్క చరిత్ర ముద్రణ విమర్శనము 1 కింకిణి (అచ్చు)

ఆంధ్రప్రసన్నరాఘవ నాటక విమర్శనము 2 కింకిణి ,,

కాళహస్తిమాహాత్మ్య ముద్రణవిమర్శనము 3 కింకిణి ,,

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| గ్రామ్యభాషాప్రయోగనిబంధనము, (పాత్రోచిత భాషను గురించినది) | 4 కింకిణి | 0 | 12 |
| మోచాకుసుమామోదవిచారము | 5 కింకిణి | (అచ్చు) | |
| ఆంధ్రవ్యాకరణ సర్వస్వవిమర్శనము | 6 కింకిణి | ,, | |
| విమర్శవినోదము, సంస్కృతాంధ్రకావ్యనాటకాది విషయకము | | 0 | 12 |
| తిక్కన సోమయాజి విజయము | | 0 | 12 |
| విసంధివివేకము | | 0 | 2 |
| భారతాభారతరూపక మర్యాదలు, (నాట్యకళాచరిత్రము) | | 0 | 6 |
| ఆంధ్రగ్రంథవిమర్శనప్రకారలేశము, తెనుగుపుస్తకముల నెట్లు విమర్శింపవలయుననుటను గూర్చినది | | 0 | 6 |
| గ్రామ్యాదేశనిరసనము, గ్రామ్యగ్రాంథికవాదమును గురించినది ఈ వ్యాసములో శాస్త్రులవారు ఆంధ్రదేశమందలి అన్ని జిల్లాల గ్రామ్యములను వర్ణించి యున్నారు. కడుపుబ్బ నవ్వించు విమర్శ | | 0 | 6 |
| స్త్రీపునర్వివాహగ్రంథము | | 1 | 0 |
| ఆంధ్రహితోపదేశచంపువు, గద్యపద్యాత్మకము | | 1 | 4 |
| ఆంధ్రభాషానర్ఘస్వార్హనియమకతిపయములు(నిఘంటురచనావిధి) | | 0 | 4 |
| వేదము వేంకటరాయశాస్త్రులవారి జీవితచరిత్రసంగ్రహము— 25 ప్రకరణములు. సులువైనశైలి. శాస్త్రులవారి హాస్యము, విమర్శలు, విద్యావినోదములు, సుఖదుఃఖములు, సమకాలిక పండిత విమర్శలు మొదలైన యనేక విశేషములు గలవు. శ్రీ డాక్టరు, సర్, కట్టమంచి రామలింగారెడ్డి గారి 'గురుపూజ' యను నుపన్యాసముతో నలంకృతము | | 1 | 8 |
| A HAND-BOOK of CLASSICAL SAMSKRIT LITERATURE, By Sri U. Venkatakrishna Rao, M. A. for college students. Questions also given. | Rs. | 2 | 0 |
| శ్రీకృష్ణరాయవిజయనాటకము | | 0 | 8 |